

కర్రె సదాశివ్

బి.ఎస్. రాములు గారి జీవితం నల్లేరు మీది బండి వంటిది కాదు. పూలపాన్పులా సుఖకరమైంది కాదు. అతని జీవనవాహిని ఎన్నో ఒడుదొడుకులకు లోనైంది. ఎత్తుపల్లాల కత్తుల వంతెనల్ని దాటింది. అగాధాల లోతుల్ని కొలిచింది. భయంకర కీకారణ్యంలో సంచరించింది. క్రూరమృగాలతో సంభాషించింది. తపోవనాల్లోని పక్షులతో మాట్లాడింది. అక్కడ తన్ను తాను దర్శించుకున్నది. అంతటితో దానికొక నిలకడ వచ్చింది. మహాసాగరమై అవతరించింది.

చిరంజీవి కర్రె సదాశివ్ - రాములు గారి నాలుగు కథా సంపుటాలపై పరిశోధన చేసి కాకతీయ విశ్వవిద్యాలయం నుండి ఎం.ఫిల్ పట్టా పొంది వెలువరిస్తున్న గ్రంథం ఇది. మొక్కుబడిగా చేసిన పరిశోధన కాదిది, పరిశోధకుడిలో తపన కనిపిస్తున్నది. జిజ్ఞాస అంతర్లీనంగా ప్రవహిస్తున్నది. పరిశోధకునికుండవలసిన చిత్తశుద్ధి ఈతనిలో కనిపిస్తున్నది.

**ఆచార్య పేర్వారం జగన్నాథం,**
మాజీ వైస్‌ఛాన్సలర్, తెలుగు విశ్వవిద్యాలయం

తెలంగాణ సాహితీ స్రష్టలలో అరుదైన సృజనకారుడు బి.ఎస్.రాములు. వందేళ్ళ తెలంగాణ జీవితమంతా ఆయన రచనల్లో కన్పిస్తుంది. ఒక శతాబ్ది రాజకీయ, సామాజిక, ఆర్థిక, తాత్విక అంశాలు తెలంగాణ రచయితలలో అరుదుగా కన్పిస్తాయి. బి.ఎస్. రాములు గారి రచనలు అరుదైనవి. అపురూపమైనవి. సమాజం పట్ల బాధ్యత ఉన్న రచయిత కనుక వందేళ్ళ సామాజిక చరిత్రను తన రచనల్లో నిక్షిప్తం చేసి భవిష్యత్ తరాలకు ఆదర్శంగా నిలిచారు.

నా పర్యవేక్షణలో చేసిన ఈ పరిశోధనా వ్యాసంలో రచయిత జీవిత నేపథ్యం, కథల్లోని వస్తువు ఏయే కోణాల్నుండి కథల్ని చూడవచ్చో సమగ్రంగా పరిశీలించడం జరిగింది. ఇందుకోసం పరిశోధకుడు అకుంఠిత దీక్షతో కృషి చేసి రచయిత విశిష్టతలని సాహితీ ప్రపంచానికి వెల్లడిచేశాడు.

**డా॥ బన్న ఐలయ్య, ప్రొఫెసర్ , కాకతీయ యూనివర్శిటీ**

బి.ఎస్.రాములు గారి వ్యక్తిత్వం, సాహిత్యం సామాజిక ఆచరణ త్యాగం బహుముఖీనమైనది. కొన్ని విషయాల్లో కొందరితో బి.యస్.రాములు గారిని తులనాత్మక అధ్యయనం చేసి చెప్పవచ్చు. కాని బహుముఖీన వ్యక్తిత్వాన్ని, సాహిత్య కృషిని, సామాజిక ఆచరణను త్యాగాన్ని, సాహిత్య, ఉద్యమ నిర్మాణం మొదలైన విషయాల్లో పోల్చడానికి పోలిక దొరకడం సులభం కాదు. సైద్ధాంతిక తాత్విక రంగంలో, సామాజిక ఉద్యమ భావజాల రంగంలో బి.యస్. రాములు గారు కొండలను ఢీకొని వాటిని పిండిచేశారు. నాకు నా జీవితం ఎంత ఇష్టమో వీరి కథలంటే అంతే ఇష్టం. ఎందుకంటే నా వాళ్ళ జీవితమే నా చుట్టూతా ఉన్న వాళ్ళ జీవితమే ఈ కథలు కనుక.

కర్రె సదాశివ్, లెక్చరర్, ఎల్.బి. కాలేజి, వరంగల్

బి.ఎస్.రాములు కథలు ఒక పరిశీలన కర్రె సదాశివ్

తెలంగాణ సామాజిక పరిణామాల్ని చిత్రించిన

# బి.ఎస్.రాములు కథలు

ఒక పరిశీలన

(పాలు-స్మృతి-మమతలు మానవ సంబంధాలు - వేపచెట్టు)

**కర్రె సదాశివ్**















b.s. ramulu

జ్ఞానపీఠ అవార్డు గ్రహీత
డా॥ సి.నారాయణరెడ్డి
Ex.MP, M.A., Ph.D., D.Litt.

అధ్యక్షులు, ఆంధ్ర సారస్వత పరిషత్,
తిలక్ రోడ్, హైదరాబాద్ - 500001
ఫోన్ : 040-23548451(R)

23 మార్చి, 2007

## ఆశీస్సులు

మౌలిక సృజన శీలం, సామాజిక తత్వదర్శనం, సునిశిత విమర్శన పాటవం ముప్పేటలుగా అల్లుకున్న సమగ్ర సాహితీ వ్యక్తిత్వం బి.ఎస్.రాములు గారిది. ఆయన జీవన పరిణామ దశలు విస్మయావహంగా వున్నాయి. బీడీ కార్మికుడిగా, ఆర్.ఎస్.ఎస్. కార్యకర్తగా, రహస్య విప్లవోద్యమ యోధుడిగా, మానవ జీవితాల విభిన్న కోణాలను విశ్లేషించిన సామాజిక తత్వవేత్తగా రాములుగారి నిరంతర ప్రస్థానం అధ్యయన పరిశోధనలకు కావలసిన విస్తృతిని సంతరించుకుంది.

రాములుగారు దాదాపు 150 కథలు రూపొందించారు. నాలుగు సంపుటాలుగా వెలువడిన ఆయన కథల్లోని సామాజిక పరిణామాలను సూక్ష్మంగా పరిశీలించి, సువిస్తృతంగా విశ్లేషించి ఈ సిద్ధాంత గ్రంథాన్ని రచించాడు చిరంజీవి కర్రె సదాశివ్. ఇది ఎం.ఫిల్ డిగ్రీ కోసం రాసిందే అయినా పిహెచ్.డి డిగ్రీకి కావలసిన పరిణతిని సంతరించుకుంది. ఎన్నెన్నో పార్శ్వాల నుంచి ఈ కథలను సమీక్షించి వీటిలోని మానవీయ మూల్యాలను గురించి, ఆర్థిక సంబంధాలను గురించి, సమకాలీన, గ్రామీణ వ్యవస్థా స్వరూప స్వభావాలను గురించి చక్కని పరిశోధనా గ్రంథాన్ని రచించిన చిరంజీవి సదాశివ్‌కు నా హార్థికాశీస్సులు.

డా॥ సి.నారాయణరెడ్డి

ఆచార్య పేర్వారం జగన్నాథం
మాజీ వైస్ ఛాన్సలర్, తెలుగు విశ్వవిద్యాలయం

ఫోన్ : 2578392
1-8-120, మిథిలానగర్,
బాలసముద్రం, హనుమకొండ
వరంగల్లు - 506 001

తేది : 27-12-2006

## రామకథ

మిత్రులు శ్రీ బి.ఎస్.రాములు గారి జీవితం నల్లేరు మీది బండి వంటిది కాదు. పూలపాన్పులా సుఖకరమైంది కాదు. సిరిసంపదలతో తులతూగింది అసలే కాదు. అతని జీవనవాహిని ఎన్నో ఒడుదుడుకులకు లోనైంది. ఎత్తు పల్లాల కత్తుల వంతెనల్ని దాటింది. అగాధాల లోతుల్ని కొలిచింది. కొండచరియలతో ఢీకొన్నది. భయంకర కీకారణ్యంలో సంచరించింది. క్రూరమృగాలతో సంభాషించింది. తపోవనాల్లోని పక్షులతో మాట్లాడింది. అక్కడ తన్ను తాను దర్శించుకున్నది. అంతటితో దానికొక నిలకడ వచ్చింది. మహాసాగరమై అవతరించింది.

రాములుగారి స్వగ్రామం కరీంనగర్ జిల్లాలోని జగిత్యాల. అదొకప్పుడు చారిత్రక ప్రదేశం. శాతవాహనుల తొలి రాజధాని నగరం - కోటిలింగాలకిది దగ్గరలో ఉంటుంది. దీనికనతి దూరంలోనే ధర్మపురి పుణ్యక్షేత్రం విలసిల్లుతున్నది. దానికానుకొని పవిత్ర గోదావరీ నది ప్రవహిస్తుంటుంది. సప్తగోదావరి ఈ ప్రాంతంలోనిదేనంటారు. వైదికమతంతో పాటు జైన బౌద్ధమతాలూ ఒకప్పుడు ప్రాచుర్యం పొందిన ప్రాంతం ఇది. ఇటీవలి కాలంలో శ్రామిక జనం ఫ్యూడల్ శక్తుల మీద జరిపిన తిరుగుబాటు "జగిత్యాల జైత్రయాత్ర"గా ప్రసిద్ధిగాంచింది.

రాములుగారి తండ్రి చిన్నవాడే చనిపోతే కూలినాలి చేసుకుంటూ తల్లే సర్వస్వమై ఈయన్ని పెంచి పోషించింది. కడుపునిండా తిన్న రోజు వాళ్ళకదొక పర్వదినమే. వీళ్ళు నేత కుటుంబానికి చెందిన వాళ్ళు. ఆ ప్రాంతంలో నేత కుటుంబాలు అధిక సంఖ్యలో నివసిస్తుంటాయి. వీళ్ల ఆడవాళ్లు బీడీలు చుట్టి బ్రతుకు బండీని లాగుతుంటే, మగ వాళ్ళమో మగ్గాలకు అతుక్కుపోయి చిక్కి శిథిలమవుతుంటారు. నేడు నేతవృత్తి ఆనాదరణకు గురి కాగా అప్పుల పాలవుతున్న నేత కార్మికులెందరో తమ ఆర్థిక సమస్యల్ని ఆత్మహత్యలతో పరిష్కరించుకుంటున్నారు. ఇక్కడి నుంచి ప్రతినిత్యం వందల సంఖ్యలో భీవండీ, దుబాయి వంటి ప్రాంతాలకు వలసలు సాగుతుంటాయి. ఇదీ రాములు గారి జీవితానికున్న నేపథ్య దృశ్యం. అదే ఆయన కలంలో ప్రతిబింబిస్తుంటుంది. గళంలో ప్రతిధ్వనిస్తుంటుంది.

రాములుగారు నవలలు రచించినా కథలు రాసినా ఆయన ఎక్కువగా కథకుడిగానే ప్రసిద్ధిగాంచినాడు. కథా సాహిత్యంలో ఆయనకొక ప్రత్యేక స్థానమున్నది. సామాజిక జీవితంలోని అన్ని కోణాల్ని అన్ని పార్శ్వాల్ని ఆయన స్పృశిస్తాడు. మానవ సమాజంలోని అసమానతల అంచుల దాకా తన దృష్టిని సారిస్తాడు. ఆర్థిక రాజకీయ కారణాల వల్ల

మానవ సంబంధాల్లో వస్తున్న పరిణామాల్ని చక్కగా విశ్లేషిస్తాడు. మనస్తత్వ పరిశీలనతో సజీవ పాత్రల్ని సృష్టిస్తాడు. మనం ఆయన కథల్ని చదువుతుంటే సమాజాన్ని దర్శిస్తున్నట్లుగానే ఉంటుంది. సమాజంలోని విషాద దృశ్యాలెన్నో మన కండ్ల ముందు కదలాడుతాయి. మనిషిలోని అంతస్సంఘర్షణల్ని నిలువుటద్దంలో నిలిపి చూపిస్తాడు. మరో విధంగా చెప్పాలంటే సమాజాన్నంతా తనలో విలీనం చేసుకుంటాడు. అట్లాగే తాను సమాజాన్నంతా వ్యాపిస్తాడు. రాములుగారు ముఖ్యంగా దళిత వాది. సామాజిక న్యాయం జరగాలంటే దళితులకు రావలసిన వాటా వాళ్ళకు తప్పకుండా చెందాలంటాడు. దీన్ని అన్ని రంగాలకూ వర్తింప జేయాలంటాడు. రాజకీయ విద్యారంగాలతో పాటు సాహిత్య సాంస్కృతికకళాది రంగాలన్నింటిలోనూ ఖచ్చితంగా ఈ నిష్పత్తిని పాటించాలంటాడు. అందుకే ఆయన సామాజిక తత్వవేత్తగా గుర్తింపు పొందినాడు.

చిరంజీవి కర్రె సదాశివ్ రాములు గారి నాలుగు కథా సంపుటాలపై పరిశోధన చేసి కాకతీయ విశ్వవిద్యాలయం నుండి ఎం.ఫిల్. పట్టా పొంది వెలువరిస్తున్న గ్రంథం ఇది. ఏదో మొక్కుబడిగా చేసిన పరిశోధన కాదిది. మొహమాటానికి చేసిందీ కాదు. ఉద్యోగార్జనే పరమావధిగా చేపట్టిందీ కాదు. పరిశోధకుడిలో తపన కనిపిస్తున్నది. తాదాత్మ్యమున్నది. జిజ్ఞాస అంతర్లీనంగా ప్రవహిస్తున్నది. పరిశోధకుని కుండవలసిన చిత్తశుద్ధి ఇతనిలో పుష్కలంగా కనిపిస్తున్నది. ఇష్టంలేని రచనలపై పరిశోధన చేయడమంటే సరిపడని వాహనంపై సవారీ చేసినట్లే ఉంటుంది. రాములు గారి కథల్ని సదాశివ్ బాగా అభిమానిస్తాడు. వాటి పట్ల ఆకర్షితుడవుతాడు. వాటి గూర్చి ఆలోచిస్తాడు. వాటి గూర్చి ఆలోచిస్తాడు. వాటిని సహేతుంగా విశ్లేషిస్తాడు. సహృదయంతో విమర్శిస్తాడు.

సదాశివ్ ఈ గ్రంథాన్ని మూడు భాగాలుగా విభజించుకున్నాడు. మొదటి భాగంలో రాములు గారి కుటుంబ జీవితాలతో పాటు ఆయన జీవిత విశేషాల్ని, సాహిత్య వ్యక్తిగా ఎదగడానికి గల నేపథ్యాన్ని వరుసగా పేర్కొంటాడు. రెండవ అధ్యాయంలో నాలుగు కథా సంపుటాలలోని మొత్తం కథల్నీ, వాటిలోని వస్తువునీ పరిచయం చేస్తాడు. కథకుడుగా రాములు పొందిన పరిణామ క్రమాన్ని చూపిస్తాడు. ఇక మూడవ భాగంలో మొత్తం కథలలోని వస్తు వైవిధ్యాన్నీ, వాటి ప్రాముఖ్యాన్ని వివరిస్తాడు. అంతేకాక సమకాలిక సమాజంలోని సంకుల సమరాన్ని రాములు గారు చిత్రించిన విధానాన్నీ, కథా కథన వైఖరినీ తెలుపుతాడు. కథా నిర్మాణంలో రాములు గారు అవలంభించిన శిల్ప సౌందర్యాన్ని చక్కగా వింగడిస్తాడు.

ఈ రకంగా సదాశివ్ ఈ సిద్ధాంత గ్రంథాన్ని రూపొందించి విషయానికి న్యాయం చేకూర్చినాడు. రాములుగారి తాత్విక ధోరణిని సహేతుకంగా విశదీకరించినాడు. ఇదొక ప్రామాణిక పరిశోధనా గ్రంథ మనడంలో సందేహం లేదు. ఈ సందర్భంలో చిరంజీవి కర్రె సదాశివ్‌ను మనసారా అభినందిస్తున్నాను. ఆయన సాహిత్య రంగంలో ఉన్నత శిఖరాలకెదగాలని ఆశీర్వదిస్తున్నాను.

ఈ పరిశోధనకు పర్యవేక్షకుడిగా వ్యవహరించి అభ్యర్థికి దిశానిర్దేశనం చేసిన మిత్రుడు డా॥ బన్న అయిలయ్య గారినీ అభినందిస్తున్నాను.

– పేర్వారం జగన్నాథం



డా॥ బన్న ఐలయ్య, ఎం.ఏ.పి.హెచ్.డీ
అసిస్టెంట్ ప్రొఫెసర్–తెలుగు శాఖ, కాకతీయ యూనివర్సిటీ
2-7-1261/ఎ, రాజగృహం, విజయపాల్ కాలనీ,
హనుమకొండ - 506 370
ఫోన్ : 2456001 (రెసి.)

4-1-2007

# బి.ఎస్. రాములుగారు
# అరుదైన రచయిత - అపురూప సృజన

తెలంగాణ సాహితీ స్రష్టలలో అరుదైన సృజనకారుడు శ్రీ బి.ఎస్.రాములు. వందేళ్ల తెలంగాణ జీవితమంతా ఆయన రచనల్లో కన్పిస్తుంది. ఒక శతాబ్దం రాజకీయ, సామాజిక, ఆర్థిక, తాత్విక అంశాలు తెలంగాణ రచయితలలో, రచనల్లో అరుదుగా కన్పిస్తాయి. బి.ఎస్.రాములుగారి రచనలు అరుదైనవి, అపురూపమైనవిగా భావించవచ్చు. సమాజంపట్ల ఒక బాధ్యత ఉన్న రచయిత కనుకనే వందేళ్ల సామాజిక చరిత్రను తన రచనల్లో నిక్షిప్తంచేసి భవిష్యత్‌తరాలకు ఆదర్శంగా నిలిచాడు ఈ రచయిత.

బి.ఎస్.రాములుగారు 1982లో "బతుకుపోరు" అనే నవల రాసారు. అపూర్వమైన వస్తువును తీసుకుని ఉత్తర తెలంగాణ సామాజిక చరిత్రను నమోదు చేశారు. నిజానికి ఈ నవల వలన బి.ఎస్.రాములు రచయితగా నిలదొక్కుకున్నారు. 1982లోనే ఈయన్ని లూసన్, గోర్కీలతో పోల్చారంటే రాములు సామాజిక వాస్తవికతను ఎంత బలంగా ఆ నవలలో చిత్రించారో అర్థం అవుతుంది.

'బతుకుపోరు' నవల, దాదాపు 150కి పైగా కథలు రాసిన బి.ఎస్.రాములుగారు ఏదో ఒక సిద్ధాంతాన్ని నమ్మి అక్కడ ఆగిపోయిన రచయిత కాదు. స్థిరీకరించుకున్న దృక్పథాన్ని సార్వకాలీనంలో ఇదే నిలుస్తుందని గుడ్డిగా నమ్మిన రచయితా కాదు. భారతదేశానికి ప్రత్యేక గతి తార్కిక భౌతికవాదం ఒకటుండాల్సిన అవసరం ఉందనీ, అనివార్యంగా ఉంటుందని విశ్వసిస్తూ అన్వేషణతో బయలుదేరిన రచయిత ఇతను. మారుతున్న సామాజిక పరిస్థితులు, నిరంతరం విచికిత్సకు లోనవుతున్న సామాజిక సిద్ధాంతాలు, తారుమారవుతున్న విలువలు మొదలైనవాటిని ప్రశ్నిస్తే ఏమవుతుందో, ప్రశ్నించినవాళ్లకు జవాబుచెబితే ఏమవుతుందో అనే సందేహ సందిగ్ధాల టంగుటుయ్యాలలోని రచయిత కాదు. మార్పు ఒక ప్రవాహమని దానిలో అన్నీ కొట్టుకు

పోగలవని విశ్వసించిన రచయిత. అందుకే అతను ప్రవాహాన్ని ఒడ్డు నుండి వీక్షించినవాడు కాదు. ప్రవాహంలోకి దిగి ఒకప్పుడు దానికనుకూలంగా, మరొకప్పుడు వ్యతిరేకముఖంగా పయనించిన రచయిత. కనుకనే ఎలాంటి భేషజాలు లేకుండా తన రచనలను రూపొందించాడు.

ఆర్.ఎస్.ఎస్. నుండి ఆర్.వై.ఎల్. కార్యకర్తగా, రాష్ట్ర ప్రధాన కార్యదర్శిగా, హాస్టల్‌వార్డెన్ నుండి రహస్యజీవితం గడిపేదాకా, ఆ జీవితం నుండి జనజీవనస్రవంతిలో కలిసిన రచయితగా బి.ఎస్.రాములుకు ఒక ప్రత్యేకమైన అమూల్యమైన అనుభవాలు ఉన్నాయి. సమాజాన్ని అనేక కోణాల్లోంచి క్షుణ్ణంగా అధ్యయనం చేసే అవకాశం, పద్ధతి అలవడింది. అట్లాగే భారతీయ రచనల్ని అంతర్జాతీయ సృజనాత్మక రచనల్ని ఉత్తమ చరిత్రల్ని అధ్యయనం చేయడం వల్ల ఆయనలో కమిట్‌మెంట్ అనే చట్రంలోకి ఒదిగిపోయే లక్షణం విస్తరించింది. సామాజిక జీవితంలో అనేక పొరలుంటాయి. ముఖ్యంగా భారతదేశంలాంటి ప్రత్యేక లక్షణాలు కలిగిన సామాజిక జీవితంలో ఇంకా సున్నితమైన పొరలెన్నో ఉంటాయని గమనించాడు గనుకనే రచయితగానే ఆగిపోకుండా తాత్వికుడి స్థాయిలో ఆలోచించి పరిష్కారమార్గాలను చూపించాడు బి.ఎస్.రాములు.

ఈయన రచనల్లో గ్రామీణ భూస్వామ్య వ్యవస్థ, తెలంగాణా రైతాంగ పోరాట పరిణామం, పంచవర్ష ప్రణాళికల ఫలితాలు, గ్రామీణ పట్టణ ప్రజల మధ్య నెలకొన్న పరస్పర సంబంధాలు, వలస బతుకులు, కోల్పోయిన చేతివృత్తులు మారుతున్న జీవనవిలువలు కనబడతాయి. కార్మికులు, వ్యవసాయ కూలీలు వివిధ కులాల సామాజిక పరిణామం స్పష్టంగా రచనల్లో తెలియజేయడం జరిగింది. ఆధునిక విద్య, ఆలోచనల్లో తెచ్చిన మార్పు, కులాంతర వివాహాలు, పెళ్లి సంబంధాల్లో వచ్చిన మార్పు మొదలైన వాటితో పాటు ఎమర్జెన్సీ, నక్సలైట్లు, విప్లవం అనే పరిణామంలో మానవ సంబంధాల చరిత్ర ఎట్లా ఉందో చిత్రించాడు ఈ రచయిత. బి.ఎస్.రాములుగారి రచనల్లో ప్రధానంగా ఈ కింది పరిణామాలు స్పష్టంగా చిత్రించబడ్డాయి.

**బి.ఎస్. రాములు కథలు - వివిధ పార్శ్వాలు**

1. దశాబ్దాల సామాజిక చరిత్ర, 2. 20వ శతాబ్దంలో తెలంగాణ ప్రపంచ జీవితం - సామాజిక చరిత్ర, 3. గ్రామీణ భూస్వామ్య వ్యవస్థ - సమాజంలో వచ్చిన మార్పులు, 4. తెలంగాణ సాయుధ పోరాటం, 5. పంచవర్ష ప్రణాళికలు - నీటిపారుదల ప్రాజెక్టులు, 6. చారిత్రక భౌతికవాదం దృష్టితో చరిత్రను పరిశీలించడం, 7. వ్యవసాయ - గ్రామీణ ప్రజలు - పట్టణ మధ్య తరగతి ప్రజల జీవితాలు, 8. చేతివృత్తులవాళ్లు - వలసలు, 9. అగ్రకులాల ఎదుగుదల, 10. వ్యవసాయ కూలీల జీవితం - పరిణామాలు, 11. దళితుల జీవన పరిణామాలు, 12. ఆధునిక విద్య - దళితుల పరిణామాలు. 13. సోవియట్ రష్యా పతనం - తర్వాతి పరిణామాలు, 14. గ్లోబలైజేషన్ పరిణామాలు, 15. వలసలు. 16. తెలంగాణ చరిత్ర పరిణామాలు,



17. విప్లవోద్యమాలు - పరిణామాలు, 18. నక్సలైట్ ఉద్యమ పరిణామాలు. 19. కులాతీత వివాహాలు, 20. పెళ్లి సంబంధాలు - వాటిలో వచ్చిన మార్పులు.

గ్రామాలను రూపొందించడంలో దళిత, గిరిజనుల పాత్ర, ఎట్లా ఉంటుందో ఆ గ్రామంలోకి దోపిడీదారులు ప్రవేశించి గ్రామానికి మూలకర్తలైనవారే దోపిడీదారుల వలన గ్రామం వదిలి ఎట్లా వెళ్తారో ఆయన కథల్లో చూస్తాము (దక్షయజ్ఞం). పంచవర్ష ప్రణాళికల్లో నీటిపారుదల ప్రాజెక్టులు వచ్చి ఏ వర్గాన్ని బాగుచేశాయో స్మృతి, వారసత్వం కథల్లో బి.ఎస్.రాములుగారు చక్కగా చిత్రించారు. ఈ పథకాలు ఎస్సీ, ఎస్టీ, బీసీ వర్గాలకు ఏమాత్రం పనికిరాకపోగా గ్రామీణ అగ్రకులాలకు విద్య, ఉద్యోగ అవకాశాలను అందించాయని స్పష్టంచేస్తాడు. చారిత్రక భౌతికవాద దృక్పథంలో స్మృతి, వారసత్వం కథలు ఆయన మిగిలిన రచయితల కంటే భిన్నంగా చూపిస్తాయి. సోవియట్ రష్యా పతనంతో అమెరికా ఏకధృవ రాజ్యంగా ప్రపంచ పోలీసు పాత్రని నిర్వహిస్తున్న తీరును రాములు చక్కగా చిత్రించాడు. అమెరికా ఆర్థిక సామ్రాజ్యవాదం ప్రపంచంలో విస్తరిస్తున్న తీరు వర్ధమానదేశాలకు ఎంత ప్రమాదకరమో వారసత్వం కథలో ధ్వనిపూర్వకంగా రాములు తెలుపుతారు. గ్లోబలైజేషన్‌లో తాత్కాలిక ప్రయోజనమే ఉంది. రాబోవు కాలంలో ఈ దేశ సంస్కృతిని నాశనంచేసి మానవసంబంధాలను విచ్ఛిన్నం చేయగలదనే వాస్తవాన్ని వారసత్వం కథలో రచయిత చూపించాడు.

పారిశ్రామిక అభివృద్ధి, ఆధునిక విద్య వల్ల వందలాది సంవత్సరాలుగా చేసుకుంటున్న కులవృత్తులు ఎట్లా దెబ్బతిన్నాయో 'వరుసలు', 'పంజరం', 'మార్పు' కథల్లో రచయిత చిత్రీకరించారు. కులవ్యవస్థ విచ్ఛిన్నతిని సహించలేనివారు 'ఎనుకటికాలమే బాగుంది' అనడాన్ని రచయిత అపహాస్యం చేశాడు. కులాంతర వివాహాలు, కుల నిర్మూలన చేయగలవని అంబేద్కర్ నమ్మిన మార్గాన్నే రచయిత విశ్వసించాడు. కనుక కులాంతర వివాహాలను సమర్థిస్తూ కథలు రాయడం జరిగింది.

మార్పు అనివార్యం అని తెలిసీ ఆహ్వానించలేని అభివృద్ధి నిరోధకులకు సమాధానంగా ఆయన కథల్లోని కులాంతర వివాహాలే ఎదురు నిలుస్తాయి. మారుతున్న విద్యావ్యవస్థలో విద్య, ఆర్థిక అంతస్తు కింది కులాల్లో పెరిగినా అగ్ర వర్ణాల (మానసిక స్థితి) మైండ్‌సెట్ మారలేదని చెబుతాడు. వేపచెట్టు మొదలైన కథల్లో ప్రపంచీకరణ నేపథ్యంలో తెలంగాణ సామాజిక చిత్రపటాన్ని కట్టించారు. కామన్వెల్త్ కథను ఇందుకు ఉదాహరణగా చెప్పుకోవచ్చు. భర్త లేకుండా నానా అగచాట్లుపడి పిల్లలను చదివించి విదేశాలను పంపించాక తనను అసహ్యించుకున్న బంధువులే సంబంధ బాంధవ్యాలు పెంచుకోవాలని తహతహ లాడడం గ్లోబలైజేషన్ తీసుకొచ్చిన మార్పుని రచయిత చిత్రించాడు. అట్లాగే షోలాపూర్, బీవండి, సూరత్, ఔరంగాబాద్, అహ్మదాబాద్ మొదలైన ప్రాంతాల్లోకి వలసవెళ్లిన తెలంగాణ వాళ్లు పటిష్టమైన ఆర్థిక ఎదుగుదలను 'పంజరం' కథలో రచయిత చిత్రించాడు. వలస వలన ఇలాంటి లాభాలు జరిగినా గ్రామీణ మానవసంబంధాల్ని తెంచుకోవడం ఒక విషాదంగా రచయిత భావించినట్లు కన్పిస్తుంది.

'సదువు' కథలో ప్రాణత్యాగంతో కూడిన విప్లవాలు ఎవరిని ఉద్ధరించడానికని, అవి కేవలం అగ్ర కులాల ఆధిపత్యానికే పనికొచ్చాయి తప్ప బడుగు బలహీన వర్గాలకు ఏమాత్రం మేలు చేయలేదని రచయిత తెలిపారు. విప్లవోద్యమంలో ఆయుధం పట్టి పోరాడే వారంతా బడుగు బలహీన దళిత వర్గాలే. పోరాటంలో ప్రాణాలు పోయేవీ వారివే. రాజ్యాంగం ద్వారా అంబేద్కర్ కల్పించిన రిజర్వేషన్ల వల్ల చదువు, ఉద్యోగాలు పొందాల్సిన కింది కులాలు సాయుధ మార్గంలో వెళ్లి ఎంతో నష్టపోతున్నాయని రచయిత తన కథల్లో ప్రతిపాదించాడు. అందుకే ఒకచోట ....."పోరాటంలో మేం చనిపోతే మాపై పాటలు రాసి పాడుతూ అగ్రకులాలు కీర్తిని సంపాదిస్తా"యనే వాస్తవాన్ని వ్యంగ్యంగా తెలియజేశారు.

ఈయన కథల్లో రైతులు సామాన్యులు, విద్యార్థులు, నక్సలైట్లు, కులవృత్తుల వాళ్లు, ఉపాధ్యాయులు, ఉద్యమకారులు ఆంధ్ర తెలంగాణ ఉద్యమ ప్రస్తావన మొదలైన పాత్రలు కన్పిస్తాయి. అంటే పేద, మధ్యతరగతి జీవితమే ఈయన కథల్లో దర్శనమిస్తుంది.

"బి.ఎస్.రాములు కథలు 'మమతలు – మానవ సంబంధాలు' 'వేపచెట్టు" అనే అంశంపై నా పర్యవేక్షణలో కర్రె సదాశివ్ పరిశోధన చేసి ఎమ్.ఫిల్ పట్టా పొందాడు. మూడు అధ్యాయాలు కలిగిన ఈ పరిశోధనా వ్యాసంలో రచయిత జీవిత నేపథ్యం, కథల్లోని వస్తువు ఏ యే కోణాల్నుండి కథల్ని చూడవచ్చో సమగ్రంగా పరిశీలించడం జరిగింది. ఇందుకోసం పరిశోధకుడు అకుంఠిత దీక్షతో కృషి చేసి రచయిత విశిష్టతని సాహితీ ప్రపంచానికి వెల్లడి చేశాడు. ఇందుకు పరిశోధనకుడు కర్రె సదాశివ్‌ను మనస్ఫూర్తిగా అభినందిస్తున్నాను.

– డా॥ బన్న ఐలయ్య



# నా గురించి

**– కర్రె సదాశివ్**

నేను కరీంనగర్ జిల్లా ఎల్కతుర్తి మండలంలోని గోపాల్‌పూర్ అనే చిన్న గ్రామంలో జన్మించాను. మేము ఇద్దరం అన్నదమ్ములం. ఒక చెల్లె. నేను ఇంటికి పెద్ద కొడుకును. మా నాన్న శ్రీ కర్రెరాజయ్య, అమ్మ శ్రీమతి లక్ష్మి వ్యవసాయ కూలీలు. రెండెకరాల భూమి, గూన యిల్లు మా ఆస్తి. నన్ను బాగా చదివించాలని ఇంటికాడ ఉంటే వ్యవసాయ పనులకు తీసుకెళ్తారని అమ్మమ్మ గారి ఊరైన బోర్నపల్లికి తీసుకుపోయి బడిలో చేర్చారు.

స్కూలులో చేర్పించినప్పుడు నా పేరు సదానందం అని ఉంటే శ్రీమతి దుర్గాబాయి టీచర్ సదాశివ్ అని మార్చింది. హుజూరాబాద్, వరంగల్, కరీంనగర్ జిల్లా ప్రాంతాలలో సదానందం, సమ్మయ్య అన్న పేర్లు బాగా కనపడతాయి. సమ్మయ్య అనే పేరు సమ్మక్క సారమ్మలకు సంబంధించినది. కాగా సదానందంఅనే పేరు అచలతత్వ వ్యాప్తికి ప్రాచుర్యానికి సంబంధించినది అని అంటారు.

నేను 08-09-1976గా నా పుట్టిన తేదీ పాఠశాలలో రికార్డయింది. అయితే ఉగాది తర్వాత వచ్చే తొలి ఏకాదశి పండుగ నాడు పుట్టానని అమ్మ, అమ్మమ్మ చెబుతుంటారు. నేను చిన్నప్పుడు ఊళ్ళోస్కూల్లో చదువుకుంటున్నపుడు, ఆడుకుంటున్నపుడు అనేక మంది బాల్యస్నేహితులు ఉండేవారు.అందులో అన్ని కులాల వాళ్ళు ఉండేవారు. నేనుదళితుల పట్ల చూపే కుల వివక్షను పెద్దగా ఎదుర్కోలేదు. ఇక్కడి సామాజిక ఉద్యమాలు తెచ్చిన అనేక మార్పులలో ఇది ఒకటి. నేను పదవ తరగతి 1992-93 మార్చిలో పాసయ్యాను.

నేను కరీంనగర్ జిల్లా భీమదేవరపల్లి మం॥ వంగర గ్రామంలోని ప్రభుత్వ సాంఘిక సంక్షేమ వసతి గృహంలో 6వ తరగతిలో చేరాను. మాజీ ప్రధానమంత్రి బహుభాషకోవిదుడు, రాజనీతిజ్ఞుడు అయిన పి.వి.నరసింహారావుగారి స్వగ్రామంగా వంగర సుప్రసిద్ధం. అయితే వారి స్ఫూర్తితో సాహిత్యాభిలాష కలిగేంత సన్నిహితంగా వారికి వంగరతో సంబంధాలు లేవు. ఉన్నత శిఖరాలకు ఎదిగి స్థానిక స్ఫూర్తినివ్వడానికి అందుబాటులో లేడు. 8వ తరగతి వరకు వంగరలో చదివి 9వ తరగతి ఎల్కతుర్తి మండలం గోపాల్‌పూర్ స్పెషల్ హాస్టల్‌లో చేరాను. గోపాల్‌పూర్ గ్రామం మాజీ ఎమ్మెల్యే,

సుప్రసిద్ధ సోషలిస్టు శ్రీ దుగ్గిరాల వెంకట్రావు స్వగ్రామం. నా స్వగ్రామం కూడా గోపాల్‌పూరే.

గోపాల్‌పూర్‌లో 9, 10 తరగతులు చదివాను. ఎస్ఎస్‌సి ప్రథమ శ్రేణిలో ఉత్తీర్ణులైనాను. అప్పటి హాస్టల్ వార్డెన్ మంచికట్ల మనోహర్‌గారు వార్డెన్‌గా కాకుండా ఒక అన్నలా, స్నేహితునిలా అందరితో చనువుగా ఉండేవాడు. తద్వారా వారి వ్యక్తిత్వ ప్రభావం విద్యార్థులపై కూడా పడింది. ఆయన నాకు వార్డెన్‌గా కాకుండా జీవితమంటే ఏమిటో చదువు యొక్క విలువ ఏమిటో, ఎలా ఎదగాలో ఎందుకు ఎదగాలో ఇచ్చిన స్ఫూర్తి నా జీవితాన్ని మలుపు తిప్పింది. హుజూరాబాద్‌లో బి.పి.సి. ఇంటర్‌లో చేరాను.

హుజూరాబాద్‌కు గోపాల్‌పూర్ 12 కిలోమీటర్ల దూరం. హుజూరాబాద్‌ను ఆనుకొని ఉన్న బోర్నపల్లిలో అమ్మమ్మ గారైన శ్రీమతి పిట్ట లింగమ్మ పిట్ట రాజయ్య గారి ఇంట్లో ఉండి చదువుకున్నాను. 1వ తరగతి నుండి 5వ తరగతి కూడా బోర్నపల్లిలోని అమ్మమ్మ గారింట్లో ఉండి చదువుకున్నాను.

సరస్వతీ శిశుమందిర్‌లో ప్రధానోపాధ్యాయులుగా పనిచేసిన శ్రీ గరిడే ఆగయ్య సహచర్యంలో ఆ స్కూల్‌లో నాలుగేళ్ళు ఉపాధ్యాయుడిగా పని చేశాను. గరిడే ఆగయ్య గారి ప్రోద్బలంతో తిరిగి ఉన్నత విద్యపై ఆసక్తి పెరిగింది.

కాకతీయ విశ్వవిద్యాలయం నా జీవితాన్ని ఒక కొత్త మలుపు తిప్పింది. కాకతీయ విశ్వవిద్యాలయంలో చదువుతో పాటు పొందిన సంస్కారం, సంస్కృతి అధ్యాపకుల, తోటి విద్యార్థుల సహచర్యం గొప్పది. బౌద్ధ ఆరామంలో, గురుకుల విద్యాలయాల్లో శతాబ్దాల క్రితం ఎలా ప్రశాంత వాతావరణంలో చదువుకున్నారో కాకతీయ యూనివర్సిటీలో ఉన్నప్పుడు నా ఊహకు అందింది. నిజంగా యూనివర్సిటీ క్యాంపస్ విద్యార్థి జీవితంలోనే ఒక మధురమైన మరపురాని ఘట్టం. ఎన్ని చర్చలో, ఎన్ని సిద్ధాంతాలో, ఎన్ని కార్యక్రమాలో... ఎన్ని వైవిధ్య పూరితమైన వ్యక్తిత్వాలో, ఎన్ని స్వభావాలో వాటన్నిటినీ పరిశీలించే వయస్సు... ప్రశాంత వాతావరణం యూనివర్సిటీలో లభించింది. నన్ను ఒక చక్కని విద్యార్థిగా తీర్చిదిద్దింది కాకతీయ యూనివర్సిటీ.

ఆచార్యులు అనుమాండ్ల భూమయ్య, డా॥ బన్న అయిలయ్య గార్లు ఎంతో స్ఫూర్తిని, ప్రేరణను కలిగించారు. ప్రాచీన పద్యంపై మమకారం కలగడానికి భూమయ్యసార్ రాగయుక్తంగా పాడే పద్యాలు ప్రేరణ. జాషువా, శ్రీశ్రీల గూర్చి అయిలయ్యసార్ చెప్పే పాఠాలు నన్ను ఉత్తేజపరిచాయి. వారి స్ఫూర్తితో ఎం.ఏ. విద్యార్థిగా ఉన్నప్పుడు కవితలు రాయడం ప్రారంభించాను. తెలుగు సాహిత్యంపై మక్కువ పెరిగింది. వాళ్ళు పాఠాలు చెప్పిన తీరు, వారి వ్యక్తిత్వం తెలుగు సాహిత్యంపట్ల ఆసక్తిని పెంచాయి. ఏం.ఏ. ప్రథమ శ్రేణిలో 2000-2002లో ఉత్తీర్ణుడినైనాను.

ఏం.ఏ. పాసయిన తరువాత తెలుగు పండిత శిక్షణలో చేరాను. ఏం.ఫిల్‌లో చేరిన తరువాత తెలుగు పండిత శిక్షణ కోర్సులో సీటు వచ్చింది. తొందరగా ఉద్యోగం



దొరుకుతుందనే ఆశతో చేరాను. రెంటిలో ఏదో ఒకటి సాధ్యమని పెద్దలు చెప్పడంతో నేను ఎం.ఫిల్‌పైనే మొగ్గు చూపి తెలుగు పండిత్ శిక్షణ మధ్యలోనే వదిలేశాను.

నేను ఎం.ఫిల్ ఎంట్రెన్స్ పాసయ్యాక దేనిపై రీసెర్చ్ చేయాలో చర్చకు వచ్చింది. ఆచార్యులు, మిత్రులు సహ విద్యార్థులు మా ఊరి నుండి ఎదిగి ఉద్యమాల్లో తిరిగి అనేక అనుభవాలు సంపాదించిన నాయకులు అనేక సూచనలు చేశారు. కొందరు ప్రక్రియల వారీగా ప్రాంతాల వారీగా కాలాల వారీగా పరిశోధనలు చేస్తున్నారు. నేను తెలంగాణ సాహిత్యం ముఖ్యంగా కరీంనగర్ సాహితీ వేత్తల సాహిత్యం మీద పరిశోధన చేయాలని అనేక రచనలను చదివాను. అలా బి.ఎస్.రాములు, సాహు, కాలువమల్లయ్య, జూకంటి జగన్నాథం, డా॥సి.నారాయణరెడ్డి మొ॥ వారి సాహిత్యాన్ని ప్రాథమిక పరిచయం కోసం సేకరించాను. అందరితో చర్చించాను.

మా ఊళ్ళో బి.యస్.రాములు గారు ఎందరికో సుపరిచితుడు. హుజూరాబాద్, హుస్నాబాద్, భీమదేవరపల్లి, ఎల్కతుర్తి, జమ్మికుంట ప్రాంతాల్లో వారికి ఎంతోమంది మిత్రులు, శిష్యులు వున్నారు. 1978-1980లలో బి.ఎస్.రాములు గారు హుజూరాబాద్‌లో హాస్టల్ వార్డెన్‌గా పని చేస్తూ ఆనాటి ఉద్యమాల నిర్మాణంలో ప్రధానపాత్ర పోషించారు. హాస్టల్ విద్యార్థులను సామాజిక చైతన్యంతో తీర్చిదిద్దారు. హుజూరాబాద్ నుండి బదిలీ అయిపోయిన తరువాత కూడా గత 25 ఏళ్ళుగా సన్నిహిత సంబంధం కొనసాగిస్తున్నారు. ఈ ప్రాంతంలో వీరికి వందల వేల మంది అభిమానులు వున్నారు. ఒక ఉద్యమకారుడిగా, నాయకుడిగా, రచయితగా బి.ఎస్.రాములుగారు చేసిన కృషి గొప్పది. అందువల్ల మన ప్రాంతంవాడిగా, మన ప్రాంతాన్ని ఇతోధికంగా ప్రభావితం చేసిన బి.ఎస్.రాములు గారి రచనలపై ఎం.ఫిల్. చేస్తే బాగుంటుందని అన్నారు. మా ఊరి మద్దెల రాజయ్య మరింత వివరంగా చెప్పి బి.ఎస్.రాములు గారి వ్యక్తిత్వాన్ని వివరించారు. ఇలా బి.ఎస్.రాములు గారు చేసిన సామాజిక కృషి వారిపై పరిశోధన చేయడానికి కారణమైంది. ఆ కృషితో ఎదిగిన యువతరం కారణమైంది.

యూనివర్సిటీలో పర్యవేక్షకులు డా॥ బన్న అయిలయ్య గారు చాలా మంచి సారు. ఒక గొప్ప రచయితను ఎన్నుకున్నావని మరింత ప్రోత్సహించారు. బన్న అయిలయ్యగారికి బి.యస్.రాములు గారి రచనలతో, సామాజిక కృషితో అప్పటికే పరిచయం. ఇలా ఇద్దరి అభిరుచి ఆసక్తి ఒక్కటిగా కలిసిపోయాయి. అలా రూపొందినదే ఈ పరిశోధన.

ప్రస్తుతం నేను వరంగల్‌లోని లాల్‌బహుదూర్ కళాశాలలో 2003 నుండి లెక్చరర్‌గా పని చేస్తున్నాను. ఎం.ఫిల్ చేస్తున్నప్పుడే పార్ట్‌టైంగా పీరియడ్‌కు యింత అని గౌరవవేతనం యిచ్చారు. ఎం.ఫిల్ అయిన తరువాత కూడా కొనసాగుతున్నాను. గౌరవం అపారం. ఆదాయం అంతంతమాత్రమే. ఏడాదిలో ఏడునెలలు యిస్తారు. ఇలా అర్ధ నిరుద్యోగిగా కొనసాగుతున్నాను. కాలేజీలో ఇచ్చే దానికన్నా ఎంతో ఎక్కువ ఆదాయం, అవకాశాలు వచ్చినప్పటికి డిగ్రీ కాలేజీలో ఉండే సామాజిక గౌరవం, విద్యార్థులతో, సహ అధ్యాపకులతో పెనవేసుకున్న ఆప్యాయత ఇక్కడే ఉండేట్టు చేసింది. ఎప్పటికైనా

పూర్తిస్థాయి లెక్చరర్‌గా తీసుకుంటారనే ఒక ఆశ.

ఎన్నో దశలు గడిచివచ్చిన నా జీవితానుభవాలే ఎన్నో కథలు నవలలుగా రావాలని బి.యస్.రాములుగారు నా మీద ప్రేమతో అంటుంటారు. అనేక కష్టాల ఎగుడుదిగుడులను తట్టుకొని ఒక పరిశోధకుడిగా సాహిత్య పరిశోధనలో చేస్తున్న మొదటి సంతకమిది.

తొలి ప్రయత్నాన్ని పెద్ద మనసుతో స్వీకరించి సాహితీలోకం నన్ను ఆశీర్వదించాలని కోరుతున్నాను. లోపాలు ఏవైనా ఉంటే ఇది నా తొలి ప్రయత్నమని మన్నించి సూచనలను నాకు రాయవలసిందిగా, ఏమైనా నలుగురికి చెప్పాల్సిన మంచి ఉంటే, సమీక్షలలో, సాహిత్య పరిశోధనలో, సాహితీ చర్చలో పాఠకులకు చెప్పాల్సిందిగా కోరుతున్నాను.

నేను బి.యస్.రాములు కథలను పరిశీలించే క్రమంలో బి.యస్. రాములు గారిని ఒకటి, రెండు సార్లు కలిశాను. సార్ అనేక విషయాలను చెప్పుకొచ్చారు. నా వయస్సు స్వీకరించే జ్ఞానపాత్ర చిన్నది. నేను పట్టుకోగలిగిన మేరకే ఇందులో రాయగలిగాను. మొత్తానికి ఎం.ఫిల్ పూర్తిచేశాను.

ఎం.ఫిల్. పూర్తి చేసే దాక ఎప్పుడు వస్తుందా? అని ఎదురు చూపే తప్ప మరో ధ్యాసే లేదు. ప్యాసయితే చాలు అని విద్యార్థికి ఎలా ఉంటుందో అలా చేసిన పరిశోధన యిది. ఎందుకంటే ఎం.ఫిల్ అనేది లెక్చరర్ ఉద్యోగానికి అవసరం. కాని నాలో ఇంకా అసంతృప్తి మిగిలిపోయింది. తెలంగాణ సామాజిక చరిత్రలో సాహితీ చరిత్రలో, సాహిత్య ఉద్యమాల్లో ప్రధాన భూమిక పోషించిన బి.ఎస్.రాములు గారి సాహిత్యం సామాజిక కృషి గురించి మరింత విస్తృత పరిశోధన అవసరమని తెలుసుకున్నాను. అది తెల్సుకోవడానికి ఈ ఎం.ఫిల్. పరిశోధన తొలి అడుగు. మరింత విస్తృత పరిశోధన నేనే చేయాలని వుంది. పాఠకులు ఈ పరిశోధన గ్రంథం చదివిన తరువాత బి.యస్.రాములు గారి జీవితాన్ని, రచనల్ని సామాజిక పరిణామంలో అవి నిర్వహించిన పాత్రను ఇంకా తెలుసుకోవల్సిన అవసరం ఉంది అని అనిపిస్తే నా లక్ష్యం నెరవేరినట్టే.

బి.యస్.రాములుగారి కథల విషయానికొస్తే ఆ కథలకు నా జీవితానికి మధ్య సంబంధముంది. 'పాలు', 'సదువు' కథలు చదివిన తరువాత, నా జీవితమే ఇందులో రాశారా అనిపించింది. నేను పుట్టి పెరిగిన హుజూరాబాద్ భీమదేవరపల్లి, ప్రాంతాన్ని ఈ కథల్లో కళ్ళముందు కదలాడాయి. నేను పుట్టి పెరిగిన పరిసరాలు నేను చూసిన జీవితాలు సాహిత్య వస్తువులలో చూసుకోవడం ఒక అనిర్వచనీయ ఆనందం ఇచ్చింది. ఈ సాహిత్యం చదివిన తరువాత నేను చుట్టూతా వున్న ప్రజలను, సమాజాన్ని తిరిగి కొత్తగా కొత్త చూపుతో పరిశీలించడం ప్రారంభమైంది.

కళ్ళెదుట ఉన్న ప్రజలు, గ్రామాలు సాహిత్య వస్తువుగా సాహిత్యంగా ఎలా రూపాంతరం చెందుతుందో నేను ఈ కథల ద్వారా తెలుసుకోగలిగాను. అందువల్ల ఈ కథలంటే ఎంతో ఇష్టం. నా జీవితం ఎంత ఇష్టమో ఈ కథలంటే నాకు అంత ఇష్టం. ఎందుకంటే నా వాళ్ళ జీవితమే నా చుట్టూతా ఉన్న వాళ్ళ జీవితమే ఈ కథలు కనుక. ●



# విషయ సూచిక

## మూడవ అధ్యాయం

బి.ఎస్.రాములు కథలు - వివిధ కోణాలు - విశ్లేషణ





## నా మాట

బి.ఎస్. రాములుగారు సామాజిక తత్త్వవేత్తగా సుపరిచితులు. కథా రచయితగా, వ్యాసకర్తగా వీరు వ్రాసిన కథలు, సిద్ధాంత వ్యాసాలు, సాహిత్య వ్యాసాలు తెలుగునాట వివిధ ఉద్యమాలకు, పోరాటాలకు కొత్త భావజాలాన్ని అందిస్తున్నాయి.

బి.ఎస్.రాములు గారు తన కథల్లో పల్లెలోని ఆత్మీయ మానవ సంబంధాలను చిత్రిస్తూ, అవి క్రమంగా కనుమరుగువుతున్న తీరును పట్టణాలలో గ్లోబలైజేషన్, లిబరలైజేషన్, కన్స్యూమరిజం, ప్రైవేటైజేషన్ ప్రభావాల మూలంగా మమతల మైదానాలను సిమెంట్ కట్టడాలు వెక్కిరిస్తున్న తీరును చిత్రించారు.

బి.ఎస్. రాములు గారి కథలతో పాటు వివిధ రచయితలు వ్రాసిన అనేక వ్యాసాలు, సమీక్షలు పత్రికల్లో అచ్చయినవి సేకరించాను. ఇటీవల ప్రచురితమైన కథలు కూడా అధ్యయనం చేశాను. అలాగే పలు సందర్భాలలో బి.ఎస్. రాములు గురించి ప్రముఖ రచయితలు వెలిబుచ్చిన అభిప్రాయాలను సేకరించి అధ్యయనం చేసాను. సామాజిక సూక్ష్మాంశాల పట్ల అవగాహన కోసం రచయితను పలుమార్లు కలిసాను. పరిశోధనా వ్యాసం వ్రాసేముందు రచయితను కలిసి ఇంటర్వ్యూ చేశాను. ఈ విధంగా అన్ని అంశాల పట్ల నా ఆలోచన మేరకు పరిశోధన వ్యాసం వ్రాయడానికి ఉపక్రమించాను. ఈ దృష్ట్యా నా పరిశోధనా వ్యాసాన్ని మూడు అధ్యాయాలుగా విభజించాను.

**మొదటి అధ్యాయం :** ఈ అధ్యాయంలో రచయిత జీవిత చరిత్రలో భాగంగా జననం, బాల్యం - విద్యాభ్యాసం, కుటుంబ నేపథ్యం, వాటి ప్రభావాలను తెలియజేశాను. వ్యక్తులు, సాహిత్యం, సమాజం, సాహిత్యంలో ప్రేరణ కలిగించిన విధానాలు తెలియజేసాను. సాహిత్య రచనా వికాస క్రమాన్ని తెలుపుతూ బి.ఎస్. రాములు రచనలను వరుస క్రమంలో కూర్చాను. వివిధ సాహితీ సంస్థలు ఇచ్చిన పురస్కారాలను, బిరుదులను తెలియజేశాను.

**రెండవ అధ్యాయం :** ఈ అధ్యాయంలో 'పాలు', 'స్మృతి', మమతలు మానవ సంబంధాలు', 'ప్రపంచీకరణ నేపథ్యంలో వేపచెట్టు' కథా సంపుటాలలోని కథల్లో ముఖ్యాంశాలను తెలుపుతూ కథల ప్రత్యేకతను వివరిస్తూ, ఇతివృత్త పరిచయం చేశాను.

**మూడవ అధ్యాయం :** ఈ అధ్యాయంలో 41 కథలను వివిధ కోణాలలో పరిశోధించి వ్రాసాను. సామాజిక జీవితంలో, గ్రామీణ, పట్టణ జీవితంలో, మధ్య తరగతి జీవితంలో , ప్రజల మనోభావాలు, బాధలు, పరిష్కారాలు, ఉద్యమాలు, పోరాటాలు, రాజ్యహింస, పతనమవుతున్న మానవతా విలువలు, చేతివృత్తులు కోల్పోతున్న తీరు, వలస జీవితాల ఆర్తనాదాలు, పెరుగుతున్న వస్తు వినిమయ సంస్కృతి ప్రభావాలను వివిధ కోణాలలో 10 అంశాలుగా చేసి వ్రాసాను. బి.ఎస్. రాములు కథల్లోని కథనం, కథా శిల్పాన్ని కూడా అంతర్లీనంగా చెప్పే ప్రయత్నం చేశాను.

# బి.ఎస్. రాములు గారి జీవిత పరిచయం

బి. ఎస్ రాములు పూర్తి పేరు బేతి శ్రీరాములు. ఆధునిక సామాజిక తత్వవేత్తగా ప్రఖ్యాత రచయితగా తన రచనల ద్వారా సుప్రసిద్ధులు. వీరి కథలు తెలంగాణ ప్రజల జీవన సరళిని, సామాజికాంశాలను, చరిత్రను నిక్షిప్తం చేస్తున్న కాలనాళికలు. వీరి కథలు, నవలలు వ్యాసాలు వందేళ్ళ సామాజిక జీవితాన్ని మనకు సాహిత్య రూపంలో అందిస్తున్నాయి. భారతీయ చారిత్రక భౌతికవాద సిద్ధాంత వేత్తగా పలు రచనలు చేశారు.

బి.ఎస్. రాములు 1964లో రచనలు ప్రారంభించి, 1968 నుండి కథలు రాయడం ప్రారంభించారు. 1978 నుండి సీరియస్‌గా కథలలో సామాజిక చరిత్రను రికార్డు చేస్తున్నారు. 1982లో వెలువడిన "బతుకుపోరు" నవల బి.ఎస్. రాములుగారికి సాహిత్యంలో ప్రత్యేక గుర్తింపును తెచ్చిపెట్టింది. వీరిని రష్యా, చైనాలకు చెందిన సుప్రసిద్ధ రచయితలను మ్యాగ్జిమ్ గోర్కీ, లూసన్‌లతో పోల్చారు. "బతుకుపోరు" నవల బీడీ కార్మికుల జీవితాల గురించి వచ్చిన మొదటి నవల.

బి.ఎస్. రాములు జీవితం చుట్టూ తెలంగాణ ప్రాంతంలోని వివిధ ఉద్యమాల భూమిక ఉంది. వీరు 1967 నుండి 1972 వరకు ఆర్. ఎస్.ఎస్. ముఖ్య శిక్షక్‌గా పని చేశారు. 1973 మే నెల 17వ తేదీన శ్యామలతో పెళ్ళి జరిగింది. 1974లో తోడల్లుడుగా పరిచయమైన వామపక్షభావాలు గల కల్లూరి నారాయణ పీపుల్స్‌వార్ పార్టీకి జన్మనిచ్చిన జగిత్యాల జైత్రయాత్ర ఉద్యమ నిర్మాతగా ఎదిగాడు. అతని ప్రభావం రచయితపై పడింది. 1975లో హాస్టల్ వార్డెన్ ఉద్యోగంలో చేరాడు. అలా ఉద్యోగం చేస్తూ అవినీతి అధికారుల్ని వ్యతిరేకిస్తూ వార్డెన్స్ యూనియన్‌ను ఆర్గనైజ్ చేశాడు.

1977 నుంచి విప్లవ, దళిత, అంబేద్కర్, పౌరహక్కుల సంఘాల నిర్మాణంలో క్రియాశీలక భూమికను నిర్వహించారు. మార్క్సిజాన్ని, మానవతావాదాన్ని, అంబేద్కరిజాన్ని అధ్యయనం చేశారు. విరసం కన్వీనర్‌గా, కార్యవర్గ సభ్యులుగా పనిచేశారు. అలిశెట్టి ప్రభాకర్ వంటి చాలామంది రచయితలను విరసంలోకి తెచ్చారు.

1983లో పౌర హక్కుల సంఘం కరీంనగర్ జిల్లా కార్యదర్శిగా పనిచేశారు. 1984-88ల మధ్య పీపుల్స్ వార్ పార్టీకి చెందిన రాడికల్ యువజన సంఘం



(ఆర్.వై.ఎల్) రాష్ట్ర ప్రధాన కార్యదర్శిగా పని చేశారు. హాస్టల్ వార్డెన్ ఉద్యోగాన్ని వదిలి 1985-90ల మధ్య కాలంలో గద్దర్, వరవరరావు, సంజీవ్ తదితరులతో కలిసి అజ్ఞాతంలో ఉంటూ "అఖిల భారత ప్రజాసమాచార సాంస్కృతిక పర్యటన"లో 12 రాష్ట్రాలు పర్యటించారు. 2-4-1990న మంథనిలో జరిగిన కరీంనగర్ జిల్లా ఆర్.వై.ఎల్. మహాసభల్లో బహిరంగ జీవితంలోకి వచ్చారు. 1990 నుండి రాష్ట్రమంతా పర్యటించారు.

బి.ఎస్.రాములుగారు ప్రస్తుతం దళితవాద, స్త్రీవాద, విప్లవవాద, బౌద్ధ, మానవీయ వాదాలను సమన్వయిస్తూ తాత్విక, సాంస్కృతిక రంగాల్లో కృషి చేస్తున్నారు. 1992 లో బీసీ, ఎస్సీ, ఎస్టీల వేదికగా ఏర్పడిన "ఆంధ్రప్రదేశ్ దళిత రచయితల కళాకారుల, మేధావుల ఐక్య వేదిక" వ్యవస్థాపక అధ్యక్షులు, ప్రస్తుతం దానికి గౌరవాధ్యక్షులు.

బి.ఎస్. రాములు సామాజిక తత్వవేత్తగా ఉద్యమ కారుడిగా ప్రజల్లో జీవిస్తూ, నవలంత జీవితాన్ని కథల్లో చిత్రించిన సంక్షిప్తత వీరి కథల విశిష్టత. అలా చాలా కథలు నవలంత జీవితాన్ని సమాజ చరిత్రను మనకు అందిస్తున్నాయి. వీరి కథలను గురించి ప్రముఖులైన సాహితీ వేత్తలు డా॥ సి. నారాయణ రెడ్డి, చలసాని ప్రసాదరావు, డా॥ కేతు విశ్వనాథరెడ్డి, మధురాంతకం రాజారాం, రాచపాలెం చంద్రశేఖర రెడ్డి, ఆచార్య జయధీర్ తిరుమలరావు, డా॥ పి.వి. రమణ, చందు సుబ్బారావు, సదానంద-శారద, కాలువ మల్లయ్య, డా॥ ఎస్వీ సత్యనారాయణ, డా॥ అంబటి సురేంద్రరాజు, కాసుల ప్రతాపరెడ్డి, శ్రీ విరించి, డా॥ బోయ జంగయ్య, పెద్దిబొట్ల సుబ్బరామయ్య, కోడూరి శ్రీరామమూర్తి, కె. రామ్మోహనరాజు మొదలైన వారు విశ్లేషించారు. ఈనాడు, ఉదయం, వార్త, ఆంధ్రజ్యోతి, ఆంధ్రభూమి, ప్రజాశక్తి, ఇండియా టుడే, నేటినిజం, ప్రజాతంత్ర, ఆంధ్రప్రభ మొదలైన దిన, వార పత్రికలు వీరి కథలని బహుముఖాలుగా సమీక్షించాయి.

డా॥ కేతు విశ్వనాథరెడ్డిగారు "బి.ఎస్. రాములు ఒక అరుదైన కథకుడు, ఆలోచనాపరుడు, భావుకుడైన సృజనాత్మక రచయిత. ఆలోచనాపరుడిగా, భారతీయ చరిత్ర, తెలుగు చరిత్ర, తెలంగాణ ప్రాంతీయ చరిత్ర వీటిలో ఉండే సమాన లక్షణాల్ని, ప్రత్యేకతల్ని పట్టించు కుంటాడు. కులం, వర్గం, ప్రాంతం అభివృద్ధి, అపక్రమం, ప్రేమలు, చదువులు స్త్రీ-పురుష వివక్ష, ఉద్యమాలు, వాదాలు, సమస్యలు అన్నింటిని తరచి తరచి చూస్తారు. సామాజిక, సాంస్కృతిక చరిత్ర మూలాల్లోకి వెళతాడు. అవి వ్యక్తుల మీద వేసే బరువు గురించి, కలుగజేసే ఒత్తిడి గురించి మథన పడతాడు. జీవన విధానాల్లో ప్రమాణాల్లో దార్శనికతలో వచ్చిన మార్పుల్ని గమనిస్తాడు. మనిషిలోని చరిత్ర హోరును కథలో అవిష్కరిస్తాడు" అని అంటారు.

జయధీర్ తిరుమలరావుగారు 'పాలు' కథల సంపుటి గురించి చెప్తూ..... "ప్రపంచ వ్యాప్తంగా చూస్తే సాహిత్యంలో సామాజికతను, మహత్తరంగా ప్రతి ఫలించిన వారే

మహా రచయితలయ్యారు. తెలుగు సాహిత్య చరిత్ర విషయానికి వస్తే అలా ప్రజా జీవితాన్ని సాహిత్యంలో సామాజికతగా, విశిష్టమైన రీతిలో ముందుకు తెచ్చిన కొద్దిమందిలో బి.ఎస్.రాములు ఒకరు" అని అన్నారు.

బి.ఎస్. రాములు జీవితం ఇచ్చిన అనుభవాలతో పాటు సామాజిక ఉద్యమాల్లో పనిచేయడం, అధ్యయనంతో పాటు అఖిల భారత పర్యటన వల్ల సంపాదించిన లోకజ్ఞానం వీరికి ఎంతో ఉపయోగపడ్డాయి. ఆయా ఉద్యమాలలోని అగ్రకుల బూర్జువా నాయకత్వాలు తమ స్వార్థాలకు మార్క్సిజం, నక్సలిజం ముసుగులు తొడిగి దేశీయ నిర్దిష్టతను, తాత్వికతను, కులసమస్యను గుర్తించ నిరాకరించారు. ఐతే వీరు మాత్రం తన ప్రయత్నం మానుకోలేదు. ఒక ఉద్యమంలా ప్రారంభమైన వీరి ఉపన్యాస, వ్యాస పరంపరతో రాష్ట్రంలోని సామాజిక, సాంస్కృతిక సంస్థలు, రాజకీయ పార్టీలు, ఉద్యమాలు తమను తాము సంస్కరించుకుంటున్నాయి. కులసమస్యను పట్టించుకున్నాయి. అలా బి.యస్.రాములుగారు ఉద్యమాలకు భావజాల మార్గదర్శకులయ్యారు. స్వయంగా తానే ముందుండి నడుస్తున్నారు.

**జననం :**

జగిత్యాల వేల ఏళ్ళ సంస్కృతికి, చరిత్రకు నిలయం. అనేక ఉద్యమాలకు ఊపిరిలూదిన ఒక చారిత్రాత్మక ప్రదేశం. కరీంనగర్ జిల్లాలోని జగిత్యాలలో క్రీ.శ.॥ 1949 ఆగష్టు 23 తేదీన పేద పద్మశాలి కుటుంబంలో బేతి లక్ష్మీరాజు, మిట్టపెల్లి నారాయణ గార్లకు రెండో సంతానంగా బి.ఎస్. రాములు జన్మించారు. అసలు పుట్టినది దీపావళి పండుగ రోజున, పాఠశాల రికార్డులో ఆగష్టు 23గా నమోదయింది.

**కుటుంబ నేపథ్యం :**

బి.ఎస్. రాములు తండ్రి మిట్టపెల్లి నారాయణ స్వంత ఊరు కోరుట్ల. నారాయణ తల్లిదండ్రులు అల్లి పురంలో ఉండేవారు. అపుడు ఆ ప్రాంతంలో భయంకరమైన ప్లేగు వ్యాధి ప్రబలడంతో పిల్లల్ని తీసుకొని నారాయణ తండ్రి మిట్టపెల్లి బాలరాజు కోరుట్లకు వలస వెళ్లాడు.

మిట్టపెల్లి నారాయణకు ఇద్దరు అన్నలు. పెద్దవాడు అల్లిపురం రాజాలు, ఈయన మిట్టపెల్లి రాజయ్య అచలతత్వ రాజయోగిగా సుప్రసిద్ధులు. అచల గురువుగా ఎదిగిన వీరికి, మూడు రాష్ట్రాల్లో అనేక మంది శిష్యులున్నారు. వీరి బోధనలు, గీతాలు సంపుటాలుగా వచ్చాయి. నడిపివాడు లక్ష్మీరాజం. చేనేత శిల్పి, బొంబాయి మిల్లు కార్మికుడు. ఇతనికి ఇద్దరు మగపిల్లలు, ఇద్దరు ఆడపిల్లలు, వారి పెద్దకూతురు గౌడ కులస్థున్ని 50 యేళ్ళ క్రితమే కులాంతర వివాహం చేసుకుంది.

బేతి రాజయ్య తన మేనల్లుడైన మిట్టపెల్లి నారాయణను పెంపకం తీసుకున్నాడు. పెంచుకున్న వేళా విశేషం ఏమో ఎనిమిదేళ్ళ నుండి పిల్లలు కలగని బేతిరాజయ్య,



రాజవ్వలకు బేతి రాములు, లక్ష్మీరాజు, రామలక్ష్మీలు, ఒక కొడుకు ఇద్దరు కూతుళ్ళు జన్మించారు. ఈడు తక్కువైనా నారాయణకు లక్ష్మీరాజునిచ్చి వివాహం చేశాడు రాజయ్య.

బి.ఎస్ రాములు తండ్రి నారాయణ కొంతకాలం జగిత్యాలలో ఇంటి వద్ద బట్టలు నేశాడు. కుటుంబం గడువక కూడుపెట్టని కుల వృత్తిని వదిలి బొంబాయికి మిల్లు కార్మికుడిగా వెళ్ళాడు. బొంబాయి నుండి నారాయణ ఏడాదికి రెండు మూడు సార్లు జగిత్యాలకు వచ్చి వెళ్ళేవాడు. కొద్ది రోజులు భార్యతో సహా బొంబాయిలో కాపురం పెట్టాడు. అక్కడ కష్టమై లక్ష్మీరాజు కొద్ది కాలానికి తిరిగి జగిత్యాలకు వచ్చేసింది. 1949లో పద్మశాలీలు జగిత్యాలలో "చేనేత సహకార సంఘం"ను స్థాపించారు. దీని నిర్మాణంలో మిట్టపెల్లి నారాయణ కూడా చురుకుగా పాల్గొన్నాడు. పద్మశాలీలు ఈ సంఘాన్ని గుడికన్నా, బడికన్నా పవిత్రంగా చూసుకున్నారు.

'మిట్టపెల్లి నారాయణగారు బొంబాయి మిల్లు కార్మికుడిగా ఉన్నప్పుడు దసరాకు కొద్ది రోజుల ముందు 1955లో బీజకుట్టు అనే హెర్నియా వ్యాధికి విరేచనాలు తోడై చనిపోయాడు. అప్పటికి పెద్దకొడుకు రాజనర్సుకు తొమ్మిదేళ్ళు. బి.యస్. రాములుకు ఆరేళ్ళు, చిన్నవాడు గోపాలుకు మూడేళ్ళు - 'పాలు కూడ మరవలేదు'. కుటుంబాన్ని పోషించే తండ్రి పోవడంతో బి.యస్. రాములు తల్లి లక్ష్మీరాజు వ్యవసాయ కూలీ పనులకెళ్ళి కుటుంబాన్ని పోషించింది. పని చేయించుకునే రైతులు పనిచెయ్యాలని ఎద్దును పొడిచినట్లు సూటి పోటి మాటలు, తిట్లు తిట్టేవారు. నీచపు చూపులు చూసేవారు. అభిమానవతి అయిన లక్ష్మీరాజు వాటిని భరించలేక తాను బొంబాయిలో నేర్చుకున్న బీడీలు చేసి తన పిల్లల్ని పోషించింది.

బతకడం కష్టమై పెద్దకొడుకు రాజనర్సును, బి.యస్. రాములును గోపాల్‌తో సహ కొన్ని రోజులు కోరుట్లలో కాపురం పెట్టి బీడీలు చేసింది. జగిత్యాలలో అప్పటి వరకు బీడీలు చుట్టే బ్రాంచిలేదు. తన లాంటి నలుగురు కలిసి జగిత్యాలలోనే బ్రాంచి కావాలని యజమానులతో పోరాడి ఒక శాఖను ఏర్పాటు చేయించుకున్నారు. అప్పటి నుండి లక్ష్మీరాజమ్మ బీడి కార్మికురాలిగా స్థిరపడింది. భర్తలేని స్త్రీగా అనేక అవహేళనలు, ఈసడింపులకు గురై లైంగిక వేధింపులను తట్టుకొని, పిల్లలను చదివించి విద్యావంతులను చేయడానికి అహోరాత్రులు కష్టపడి పిల్లలకు వెలుగు నిచ్చే దీపం అయింది.

ఈ పరిస్థితులను అన్నింటిని "తల్లిసాలు పిల్లడు" గా చూస్తూ సమాజ జీవన స్థితిగతులను అనుభవాలతో రంగరించి కష్టాలను కన్నీళ్ళను కాచి వడబోసిన సరికొత్త జీవితాన్ని బి.యస్. రాములు సృష్టించుకున్నారు.

**బాల్యం-విద్యాభ్యాసం-ఆటపాటల తీరుతెన్నులు :**

జగిత్యాల పట్టణం 130 గ్రామాలకు కేంద్రం. అనేక ఉద్యమాలకు నిలయం. వైదిక సంస్కృతికి వ్యతిరేకంగా జైన, బౌద్ధ, వీరశైవ ఉద్యమాల వారసత్వ సంపద

కలిగిన జగిత్యాలలో పుట్టి ఆ పల్లెలను తిరిగారు బి.యస్. రాములు.

బి.ఎస్. రాములు బాల్యం, విద్యాభ్యాసం జగిత్యాలలోనే గడిచింది. జగిత్యాల సమీపంలోని గోదావరి తీరంలో కోటి లింగాల రాజధానిగా సాగిన శాతావాహనుల పరిపాలన కాలంలో బౌద్ధ సంస్కృతి వికాసం జరిగింది. అలాగే వివిధ ఉద్యమాలకు స్ఫూర్తినిచ్చిన జగిత్యాల దేశంలోనే ఒక గుర్తింపు కలిగి వుంది. ఇలాంటి చారిత్రక ప్రదేశంలో బి.యస్. రాములు బాల్యం, విద్యాభ్యాసం సాగింది. 'అక్షరభ్యాసం అ,ఆ ల నుండి బాలశిక్ష, రెండవ తరగతి వరకు అయ్యోరు పంతులు వద్దనే చదివాడు'.

అప్పుడు ఆట-పాటల పట్ల ఆసక్తి ఎక్కువ. పేదరికంలో కూడా ఆనందంగా ఆటలాడుకునేవాడు. అది పేదరికం అని కూడా తెలియదు. ఆ ఆటల్లో ఆడమగ తేడా, కులాల హెచ్చు తగ్గులు తల్లి దండ్రుల హోదాలు అడ్డు రాలేదు. ఎంతో హాయిగా ఆడుకునేవారు. కోతి కొమ్మచ్చి, వీపు వెనక దస్తీ వేసి పరుగులు తీయడం, నిలుచుంటే పరుగెత్తి ముట్టుకోవడం, ముట్టుకొనే లోపు గభాలున కూర్చోవడం (దస్తీఆట) (వంగుడు దునుకుడు) వీపు మించి దూకడం - డ్రామా డైలాగులు కొట్టడం మొదలైన ఆటలు ఆడేవారు. "వాడలోని పదిమంది పిల్లలు విభిన్నస్థాయి, విభిన్న కులాల నుండి వచ్చిన ఆడ, మగ పిల్లలు పదిమంది ఒకే చోట చేరి ఆడుకోవడం తొలి సామాజిక జీవితానికి నాంది అయింది" అని రచయిత తన బాల్యం గురించి గుర్తుచేసుకున్నారు.

బి.ఎస్.రాములు జగిత్యాలలోని నేడు న్యూ హైసూల్ అని పిలువబడే ఆనాటి మర్కజీ బడిలో 1957 జూన్ వర్షాకాలంలో మూడవ తరగతిలో చేరి అక్కడే ఐదవ తరగతి వరకు చదివారు. అప్పటికి ఆయన వయస్సు ఎనిమిదేండ్లు. ఆ వయస్సులో ఆట-పాటల నుండి సమాజం, సంస్కృతి, సాంప్రదాయాలను ఆసక్తిగా గమనించడం నేర్చుకున్నారు.

అప్పుడు "మర్కజీ బడిలో కొందరు సహ విద్యార్థులు: కూన పులి,ఎ.ఎల్. కాంతం, మ్యానపురి రాజనర్సయ్య, భీమనాతి ప్రభాకర్ (ధర్మపురి), గాజుల సత్తయ్య, కొక్కుల మారుతి, ఇబ్రహీం, సి.హెచ్. రాజన్న, అలిశెట్టి రాజ మౌళి, వుటూరి ఉమాపతి, వుటూరి బుచ్చి రాజం, అలిశెట్టి గోపాల్ కిషన్, జయప్రకాశ్, ఆర్. గంగాధర్, కప్పల దామోదర్, గంగా శంకర్, మేర (దస్తగిరి) పెంటయ్య, దూదేకుల ఇమాం, అనుమల్ల సత్యనారాయణ (సీనియర్), గాజంగి అర్జున్ వీరితో పాటు వాడకట్టు బాల్య స్నేహితులు- నలువాల హన్మాండ్లు, బండి రాధాకిషన్, ఎనుగంటి బాలగంగాధర్, సంబారి పెద్దలింగన్న, సాంబారి చిన్న లింగన్న, కస్తూరి కిష్టబాయి, కస్తూరి విజయ, రత్న, దాసరి నారాయణ (కండక్టర్), గుండేటి రాజమల్లయ్య, ఉప్పులంచ శంకర్, గుర్రం నరహరి" మొదలైన వారితో బాల్యం, స్నేహం హాయిగా గడిచింది.

ఆకాలంలో ఏటా జగిత్యాలకు సర్కస్, సురభినాటక కంపెనీలు వచ్చి రెండు నెలల వరకు ప్రదర్శనలు నిర్వహించేవారు. బి.యస్. రాములు సర్కస్ ప్రదర్శనశాలకు



వెళ్ళేవాడు. మొదటిసారిగా వివిధ రకాల జంతువులను ఆ సర్కస్‌లో చూశాడు. సురభి నాటక కంపెనీవారు రోజు ప్రదర్శలిచ్చేవారు. జగిత్యాల అంగడి బజారులో "సాధన శూరులు" ప్రదర్శనలు ఇచ్చేవారు. వీరు గొప్ప కళాకారులు. వీరి ప్రదర్శనలో చూపే కొన్ని అంశాలు ఆశ్చర్యానికి గురిచేసేవి. వీరు పద్మశాలీలను బిక్ష అడిగి జీవిస్తారని, అదొక సాంప్రదాయమని బి.యస్. రాములుకు వాళ్ళ అమ్మ చెప్పింది." బడి నుండి రాగానే బి.యస్. రాములు వీటిని చూడడానికి వెళ్ళేవాడు.

బి.ఎస్. రాములు ఐదవ తరగతిలో ఉండగా అమ్మ, తాత అప్పుడప్పుడు ఇచ్చే పైసలను జమచేసి 90 పైసలతో "చేనేత సహకార సంఘం" షాపులో ఒక టవల్ కొన్నాడు. అలా సొంతంగా నా పైసలతో టవల్ కొన్నప్పుడు కలిగిన థ్రిల్ ఆ విశ్వాసం మాటల్లో చెప్పలేనిది. ప్రపంచాన్ని జయించినంత ఆనందం" కలిగిందని అంటాడు.

"ఆ తర్వాత జమ చేసిన పైసల్తో రూపాయి పావలా పెట్టి కోడి పెట్టను కొన్నాను.. అది పెరిగి గుడ్లు పెట్టి పిల్లలయ్యాక ఆ పిల్లలు గుడ్లు పెట్టే వయసుకెదిగాక తెల్ల విరోచనాల రోగంతో తల్లి కోడితో సహా అన్ని చనిపోయాయి. అప్పుడు ఆ బాధలో చాల రోజులుండి పోయాను. నేను బడినుండి వచ్చేసరికి కోడిపిల్లలు పరుగెత్తుకొచ్చి నా చుట్టూ చేరేవి, కాళ్ళళ్ళో దూరేవి. ఎంతో ప్రేమగా పెంచిన కోళ్ళు ఒక్కొక్కటిగా చచ్చిపోతుంటే ఎంత ఏడ్చానో" అని చిన్ననాడు జరిగిన ఆ విషాదాన్ని బి.యస్. రాములు గుర్తుచేసుకున్నారు.

ఐదవ తరగతి పూర్తి చేసిన బి.యస్. రాములు ఆ తర్వాత ఆరవ తరగతికి జగిత్యాలలోని మల్టీ పర్పస్ హైస్కూల్‌లో చేరాడు. ఆనాటి ఈ హైస్కూల్ ప్రధానోపాధ్యాయులు ప్రముఖ విద్యావేత్త ముద్దు రామకృష్ణయ్య. వీరి ఆధ్వర్యంలో 12వ తరగతి వరకు చదువు కొనసాగింది. విద్యార్థి దశలో సమాజం పట్ల, సాహిత్యం పట్ల అభిలాష పెరిగింది. ఆ స్కూల్లో తెలుగు పండిట్లైన భాస్కర రెడ్డి, కమలాకర్‌రావు గార్ల ప్రోత్సాహంతో 1963-64 తొమ్మిదవ తరగతి విద్యార్థిగా తొలిసారిగా పద్యాలు వ్రాసారు.

పదవ తరగతిలో సాహిత్యం మీద అభిమానం పెరిగి యువ, భారతి, చందమామ, కృష్ణాపత్రిక, ఆంధ్రపత్రిక, ఆంధ్రప్రభ, వీక్లీ, ప్రజామత మొ॥ పత్రికల్తో పాటు, కాశీమజీలీ యాత్రలు, సహస్ర శిరచ్ఛేద అపూర్వ చింతామణి, వేయిపడగలు, చెలియకట్ట, ఏకవీర, సముద్రపుదిబ్బ, నౌకయానం వంటి రచనలే కాక, శరత్‌చంద్ర నవలలు, చలం నవలలు కూడా చదివేశాడు. జగిత్యాలలోని గ్రంథాలయంలో ఇలా ఎన్నో గ్రంథాలు చదివారు. చందమామ పత్రికలోని కథలు చదివి తాను కూడా గేయ కథలు వ్రాసి పంపితే ఒక్కటి కూడా అచ్చుకాలేదు. ఎంతో నిరాశ చెందారు. కాని చందమామ ఫోటో కాప్షన్ పోటీకి రెగ్యులర్‌గా రాస్తే ఒకటి రెండు అచ్చయ్యాయి.

పదవతరగతిలో ప్రత్యేక అంశంగా ఆప్షనల్స్‌ను ఎంపిక చేసుకోవడం ఉండేది. అపుడు బి.యస్. రాములు యం.పి.సి. తీసుకున్నారు. కాని, ఫిజిక్స్ కెమిస్ట్రీ, ల్యాబ్ డిపాజిట్ క్రింద

రూ॥15/- ఇవ్వలేక పోవడం వల్ల కామర్స్ ఆప్షనల్‌గా మార్చుకోవాల్సి వచ్చింది.

ప్రముఖ విద్యావేత్త శ్రీ ముద్దు రామకృష్ణయ్య హైస్కూల్ ప్రధానాచార్యులుగా ఉన్నప్పుడు బి.యస్. రాములుకు స్కూలు జీవితం సాగడం ఒక గొప్ప అవకాశం. బి.యస్.రాములు 1963-64లో తొమ్మిదవ తరగతి విద్యార్థిగా ఉన్నప్పుడు తొలిసారిగా పద్యాలు రాశాడు. అవి పాఠశాల ప్రత్యేక సంచిక స్రవంతితో పాటు ఇతర పత్రికల్లో కూడా అచ్చయినవి.

పదవతరగతి విద్యార్థిగా పాఠశాలలో జరిగే పోటీలలో బి.యస్ రాములు పాల్గొని ఎన్నో బహుమతులు గెల్చుకునేవాడు. బి.యస్. రాములు గురించి హైస్కూల్‌లోని చిననాటి మిత్రుడు 1967 (12వతరగతి) వరకు ఒకే బ్యాచ్‌లో తనతో చదివిన పీపుల్స్ వార్ కేంద్ర కమిటీ కార్యదర్శి ముప్పాల లక్ష్మణరావు అలియాస్ గణపతి మాటల్లో... "నీకు స్కూళ్ళో ఉపన్యాసాల పోటీల్లో, వ్యాసరచన పోటీల్లో బహుమతులు వస్తుంటే నిన్నొక హీరోగా మనసులో ఆరాధించేవాణ్ణి" అన్నాడంటే చిన్ననాడే యితరులపై వేసిన ప్రభావం స్పష్టమవుతున్నది.

**జైతెలంగాణ ఉద్యమం బి.ఎస్.రాములుగారి వ్యక్తిగత జీవితంలో వేసిన ప్రభావం**

1967 మార్చిలో 12 వ తరగతి ప్రథమ శ్రేణిలో ఉత్తీర్ణుడు కావడంతో తన మార్కులను బట్టి తప్పకుండా ఉద్యోగం వస్తుంది అని భావించారు. ఆ కాలంలో 53 శాతం మార్కులు వున్న వారికి కూడా పోస్టాఫీసు వుద్యోగాలు వచ్చాయి. అందుకని దానిపై ఆశ పెట్టుకొని ఇతర ప్రయత్నాలు చేయకుండా పోస్టాఫీసులో క్లర్కు ఉద్యోగానికి దరఖాస్తు చేసుకున్నాడు. అది వచ్చేదాకా బీడీ కంపెనీలో పని చేస్తూనే ఆర్.ఎస్.ఎస్. ముఖ్య శిక్షక్‌గా పని చేస్తూ కొంతకాలం గడిపాడు. అలా మూడేళ్ళు ఎదురుచూశాడు. కాని అప్పుడే "జై తెలంగాణ బ్యాచీ"వల్ల 53% మార్కులతో వచ్చిన పోస్టాఫీసు ఉద్యోగాలు 83% మార్కులకు ఎగబాకాయి. 64% మార్కులు వచ్చిన బి.యస్. రాములుకు ఏమి చేయాలో తోచలేదు" అలా రెండు సంవత్సరాలు ఎదురు చూపులతో గడిచి పోయినతరువాత తన జూనియర్స్‌తో డిగ్రీ చేయడం ఇష్టం లేకపోయింది.

**నిరుద్యోగ సమస్య జై తెలంగాణ ఉద్యమానికి మూలం**

అప్పుడు టీచర్ ఉద్యోగాలకు 96 రూపాయలు మాత్రమే జీతం ఉండేది. పోస్టాఫీస్ క్లర్క్‌కు 240 రూపాయలు జీతం వుండేది. అందుకని టీచర్ ట్రయినింగ్ జగిత్యాలలో ఉన్నప్పటికీ చదవలేదు. చివరికి 1970లో జగిత్యాల నుంచి టీచర్ ట్రయినింగ్ ఎత్తివేశారు. దాంతో బి.యస్. రాములు 1970 లో స్నేహితుడు, బంధువు అయిన భీమనాతి ప్రభాకర్ సహాయంతో ధర్మపురిలో సాయంకాలపు సంస్కృతాంధ్ర ప్రాచ్య కాలేజిలో విద్యార్థిగా చేరాడు.

ఇలా సామాజిక పరిణామాల వల్ల బి.ఎస్.రాములు అర్థనిరుద్యోగిగా, నిరుద్యోగిగా ఎనిమిది సంవత్సరాలు గడపవలసి వచ్చింది. దాంతో వారిలో వచ్చిన మార్పులు అనేకం.



చిన్నప్పుడు బొద్దుగా, ముద్దుగా వుండే బి.ఎస్.రాములు పూర్తిగా అచ్చం నిరుద్యోగి ఆకారంలోకి మారిపోయారు. స్వభావంలో కూడా నిరుద్యోగిలో వుండే ఆవేశం, అసహనం, సమాజం పట్ల ఒక రకమైన అసంతృప్తి పెరుగుతూ పోయిందని చెప్పవచ్చు. ఈ నిరుద్యోగమే వారిని సమాజం పట్ల ఆలోచింప చేసి ఈ అసంతృప్తి, ఈ నిరుద్యోగం వ్యక్తిగతమైంది కాదని మొత్తం సమాజానికి సంబంధించినదని అర్థం చేసుకున్నారు. అందుకే ఈ సమాజాన్ని సమూలంగా మార్చడానికి నిర్ణయించుకున్నారు. ఇలా బి.ఎస్.రాములు గారితో పాటు లక్షలాది మంది విద్యార్థులు నిరుద్యోగులుగా వుండడం వల్ల ప్రత్యేక తెలంగాణ ఉద్యమం ఆవిర్భవించింది. అలాగే ఇలాంటి వారి ద్వారానే నక్సలైట్ల ఉద్యమం రూపుదిద్దుకుంది. ఎదిగింది. అందుకు బి.ఎస్.రాములు గారి జీవితమే ఒక ఉదాహరణ. ఆర్.ఎస్.ఎస్. నుండి ప్రారంభమైన బి.ఎస్.రాములు గారి జీవితం విప్లవ కారుడిగా మారడంలో సమాజంలోని నిరుద్యోగం పాత్ర, సామాజిక పరిణామాల పాత్ర ప్రధానమైనది.

**బాల్యం - ప్రభావాలు :**

ప్రతి వ్యక్తిని సామాజిక పరిణామాలు ప్రభావితం చేస్తాయి. కొన్ని సంఘటనలు మరింత ప్రభావితం చేస్తాయి. బి.యస్. రాములును రెండు మూడు సంఘటనలు ఎంతో ప్రభావితం చేసాయి. బి.ఎస్.రాములు గారిని పై సామాజిక పరిణామాలతో పాటు చిన్ననాటి బాల్యం, తను పెరిగిన సమాజం, అందులోని వ్యక్తులు వివిధ దశల్లో ప్రభావితం చేశారు.

బి.ఎస్.రాములు బాల్య జీవితం పేదరికంలోనూ ఆనందంగానే గడిచింది. "పేదరికం మానసికమైందనుకొంటాను. నీవు పేదవు అని చూసే ఆనాదరణతోనే పేదరికం పేరిట మానసికంగా అణిచివేయటం మొదలవుతుందనుకుంటాను" అంటారు.

బి.ఎస్. రాములు ఆటపాటలకు పేదరికం అడ్డురాలేదు. ఆట పాటలే తొలిబడిగా, వాడకట్టు స్నేహితులతో ఆడిన ఆటలే మొట్టమొదటి సామాజిక జీవితానికి పునాది వేశాయంటాడు. చిన్ననాటి నుండి ప్రకృతి అంటే ఎనలేని ఇష్టం. పాఠశాల సెలవు దినాల్లో స్నేహితులతో కల్సి జగిత్యాలకు తూర్పుదిక్కున గల మోతె చెరువులో ఈత కొట్టి ఎంతగానో మధురానుభూతిని పొందేవాడు. వర్షంలో తడుస్తూ కూడా కాగితం పడవలు చేసి కాలువలో వాటిని వేయడం- వాన నీటిలో ఆటలు ఆడుతూ సరదాగా గడిపేవారు.

ఆట-పాటల్లో తెలియకుండానే పదిమందితో కలిగే సహజీవనం ఎటువంటిదో తెలుసుకున్నారు. అలా తొలి సామాజిక మధురానుభవాలను పొందారు. "ఆడ-మగ, కుల-మతాలు, హెచ్చు-తగ్గులు ఏవీవారి బాల్యస్నేహాలకు అడ్డురాలేదు. తల్లిదండ్రుల హోదాలు స్నేహాలు అడ్డగించలేదు. బళ్ళో చెక్క పలకలపై అక్షరాలు నేర్చుకుంటే - ఆటపాటల్లో సోషలిజాన్ని నేర్చుకున్నాం"[16] అని అంటారు. ప్రకృతిని ఆరాధించడం-

అందరితో కలిసి ఆడుకోవడం వల్ల సమానత్వం గురించిన భావాలు సహజంగా అబ్బాయి.

బి.ఎస్.రాములు చిన్ననాటి నుండి తండ్రిలేని పిల్లాడుగా పెరిగాడు. ఆకలిని మరిపించడానికి తన తల్లి లక్ష్మీరాజు కథలనే ఆహారంగా అందించేది. లక్ష్మీరాజు పిల్లలకు కథలు చెబుతూ ఉంటే "ఊ" కొడుతూ నిద్రపోయేవారు. ఈ విధంగా చిన్ననాటి నుండి ఈ కథలు ఎంతగానో ప్రభావితం చేశాయి.

**సాహిత్య-ప్రేరణ:**

బి.యస్. రాములు సాహితీ వేత్తగా ఎదగడానికి సమాజం, వ్యక్తులు, సాహిత్య అధ్యయనం ఎంతగానో తోడ్పడింది. బి.యస్ రాములు చిన్నతనం నుండి కథలు రాయాలనే కోరిక ఏర్పడటానికి ప్రధాన ప్రేరణ వారి అమ్మ బేతి లక్ష్మీరాజు. ఆ తల్లి పేదరికంలో తండ్రి లేని పిల్లలకు అనేక కథలు చెప్పేది. ఆకలితో ఏడ్చే పిల్లలకు నిద్రపోయేదాకా కల్పనలెన్నో చేర్చి చిలవలు పలువలుగా చెబుతుండేది. విన్న వాటినే బి.యస్. రాములు ఉన్నది ఉన్నట్లుగా లేదా మరిన్ని కల్పనలతో స్నేహితులతో చెబుతుండేవాడు. అలా కథలంటే ఆసక్తి ఏర్పడి, పదేళ్ళనాటికే శ్రవ్య కథా రచయితగా రూపుదిద్దుకున్నారు.

బి.యస్. రాములు మేనమామ బేతి రాములు వారి కుటుంబంలో కాస్త చదువుకున్నవాడు. అతనికి పురాణాలు, రామాయణంపై మంచి అవగాహన ఉండేది. తన మేనమామ సేకరించిన అనేక సాహిత్య గ్రంథాలను ఆయన ఏర్పరుచుకున్న గ్రంథాలయంలో భద్రపరుచుకున్నాడు. బి.యస్.రాములు ఆ గ్రంథాల పఠనం సాగిస్తుండేవాడు. అలా సాహిత్య శాస్త్రాలపై, తత్వ శాస్త్రాలపై అవగాహన ఏర్పడానికి, సాహిత్యంలో ప్రవేశానికి సులభతరం చేశాయి.

బి.యస్. రాములు తత్వవేత్తగా ఎదగాడానికి వీరి పెద్దనాన్న మిట్టపెల్లి రాజయ్య (రాజయోగి) (1900-1987) కూడా ప్రధాన ప్రేరణ. అచలతత్వ గురువుగా మూడు రాష్ట్రాలలో తత్త్వ బోధనలు చేస్తూ వేలాది మంది శిష్యులను కలిగి ఉండే వారు. ఇతని బోధనలు మూడు సంపుటాలుగా వచ్చాయి.

చందమామ పత్రికలో వచ్చిన 'భారవి' కథ బి.యస్. రాములును విశేషంగా ఆకట్టుకుంది. బస్టాండులో మూటలు మోసి సంపాదించిన డబ్బులు, బంధువులు ఇంటికి వచ్చి పోతూ ఇచ్చే చిల్లర డబ్బులు. తాత ఇచ్చిన బహుమతి పైసలు కలుపుకొని ఆ చందమామ పత్రికను కొన్నాడు.

"నాకు గుర్తున్న మేరకు చందమామ పత్రికలో వచ్చిన మహాకవి భారవి గురించిన కథ నా జీవితంలో లిపి సాహిత్యం వేసిన మొట్టమొదటి బలమైన ముద్ర"[18]అని బి.యస్. రాములు అభిప్రాయపడ్డారు. తొమ్మిదో తరగతి ఆంగ్ల పాఠ్య పుస్తకంలో చదివిన "కేసంబియాంక" కథతోపాటు తండ్రి లేని బి.యస్. రాములును చిన్ననాడు మేనమామ పెట్టిన మానసిక చిత్ర హింస వల్ల ధ్రువుని తన సవతి తల్లి పెట్టే మానసిక చిత్ర హింసలు ఒకే విధంగా ఉండడం వల్ల ఆ కథ బాగా ఆకర్షించాయి. "భక్తితో ఈశ్వరున్ని గెలుచుకున్న మార్కండేయుని కథ గొప్ప ఇన్స్పిరేషన్"[19] అని అంటారు.



స్కూల్లోని పాఠ్య పుస్తకాల్లో షెల్లీ, కీట్సు, బైరన్, జాన్ మిల్టన్, వర్డ్స్‌వర్త్, షేక్స్పియర్, బెర్నార్డ్‌షా వంటి రచయితలు పరిచయమయ్యారు. హిందీ పాఠ్యాంశాల ద్వారా ప్రేంచంద్, శరత్ మొదలైన రచయితల గురించి తెలుసుకొని ఆరాధించారు. అలా పాఠశాల పాఠ్యాంశాల ద్వారా చిన్ననాటి నుండే ప్రేరణ పొందిన బి.యస్. రాములు ఆట-పాటలతో స్నేహితులతో సాహిత్యాంశాల గూర్చి చర్చించేవారు. అలా మిత్రుల మధ్య ఏర్పడ్డ పోటీతో స్థానిక జగిత్యాల గ్రంథాలయంలో వందల పుస్తకాలు చదివారు. చలం, విశ్వనాథ, ఠాగూర్ వంటి రచయితలు, కాశీ మజిలీ కథలు, బాలల సాహిత్యం మొ॥ కనబడిందల్లా చదివేవారు.

ఆ విధంగా 1962-63 లో తొమ్మిదో తరగతి చదువుతున్నప్పుడు మొదటి పద్యరచన చేశారు. చందమామ, బాలమిత్ర లాంటి పత్రికల్లో ఉత్పలవంటి గేయ కథలు చూసి అనేక గేయాలు వ్రాసారు. వాటిని వివిధ పత్రికలకు పంపితే మళ్ళీ తిరిగి వచ్చేవి. చాలా నిరాశకు లోనయ్యారు.

"ఆంధ్రభూమి దిన పత్రిక సామాజిక సమస్యలపై రెగ్యులర్‌గా లేఖలు వ్రాసేవారు. అచ్చేయ్యేవి. అలా పత్రికారంగానికి రచనలు మళ్ళడం ప్రారంభమైంది. అయితే పాఠశాల మ్యాగజైన్‌లో నా తొలి పద్యాలు అచ్చుయ్యాయి"[20] తొమ్మిది పదవ తరగతి చదివే రోజుల్లో బి.యస్.రాములు వెంబడి ఒక సాహితి బృందం ఉండేది. ఒక విధంగా చెప్పాలంటే బి.యస్. రాములు ఎక్కడ ఉంటే అక్కడ మంచి సాహితీ వాతావరణం సృష్టించేవాడు. అందరుకలిసి సాహితి చర్చలు జరిపేవారు. ఇప్పటికీ అంతే. అలా ఎదిగే అవకాశమున్న అనేక మంది మిత్రులు రచయితలుగా ఎదగడానికి "జీవితం, పరిసరాలు ఆ అవకాశం ఇవ్వలేదు. ఆ కాలంలో జగిత్యాల కళాశాలలో లెక్చరర్‌గా పనిచేసిన కోవెల సంపత్ కుమారాచార్య లాంటి రచయితలు బ్రాహ్మలు తప్ప శూద్రులు కూడా రచనలు చేస్తారా! అని వివిధ పద్ధతుల్లో ఈసడించి వారిలోని రచయితని చంపేశారు"[21] అని అంటారు.

బి.యస్. రాములు కథ బాలమిత్ర 1968 జనవరి సంచికలో రచయిత ఫోటోతో సహా అచ్చైంది. బి.యస్.రాములు అందులోని బొమ్మలను చూచి ఎంతగానో సంతోషపడ్డారు.

బి.ఎస్.రాములు 1975 వరకు కవిత్వంపై కృషి చేశారు. నన్నయ, పోతన, శ్రీశ్రీ మొదలుకొని దిగంబర కవుల వరకు వచ్చిన అందరి రచనలను కొని చదివారు. యువభారతి వారి ప్రచురణల్నీ, ఎమ్మెస్కో వారి నవలల్ని ఎన్నో అమ్మాడు. సాహిత్య సమావేశాలు కవి సమ్మేళనాలు నిర్వహించేవారు. తెలుగు పాటలో, కవిత్వంలో ఉండే

గేయ రాగాలు పాడలేక, పాడేవాళ్ళు లేక బి.యస్. రాములు కవిత్వం రాయడం మానుకున్నారు.

అలా "డా॥ సి. నారాయణ రెడ్డి గేయకవిత్వం, దాశరథి కవితాపుష్పకం, గాలిబు గీతాలు వేసిన గొప్ప ప్రభావం నేను కవిగా ఎదగడానికి లేదా అచ్చు కావడానికి పనికి రాలేదు" పద్య గేయ కవిత్వం స్థానంలో అప్పుడే వచన కవిత్వం ప్రబలంగా వీస్తోంది. భారతి, స్రవంతి, సృజనలాంటి పత్రికల్లో అర్థంకానివే కవిత్వంగా చలామణీ అవుతుండేవి. ఆ అస్పష్ట వాతవరణంలో కొన్ని రోజులు కవిత్వం రాయడం మానుకున్నాడు.

**సామాజికం :**

చిన్ననాటి నుండి సాహిత్యం మీద పెంచుకున్న అభిరుచి తారస్థాయికి చేరుకున్నది. 1970లో జగిత్యాల నుండి ధర్మపురికి మకాం మార్చి డి.ఓ.ఎల్ (డిప్లొమా ఇన్ ఓరియంటల్ లాంగ్వేజెస్) బి.ఓ.ఎల్ (బ్యాచిలర్ ఆఫ్ ఓరియంటల్ లాంగ్వేజి) చదవడం కోసం సాయం కాలపు సంస్కృత, ప్రాచ్య తెలుగు కాలేజిలో చేరారు.

1970-75 కాలం నాటి సామాజిక సమస్యలమీద ఎన్నో రచనలు చేశారు. బి.యస్. రాములు స్నేహితుడు భీమనాతి ప్రభాకర్ మేనమామ దాసరి శ్రీరాములు సైకిల్ టెక్సి, బీడీ కంపెనీ నడిపేవాడు. వారి బీడీల కంపెనీలో బి.యస్ రాములు పనిచేసేవాడు. కొంతకాలం ఒక హోటల్, బ్రాందిషాపు, కిళ్ళీ కొట్టును కూడా నడిపాడు. పాన్ షాప్ దగ్గరకు వచ్చే వేశ్య బాలికల దయనీయ స్థితిని చూచి బి.యస్. రాములు చలించి పోయేవారు.

ధర్మపురి వైదిక సంస్కృతికి ప్రతిబింబమైన గ్రామం. 400 పైగా బ్రాహ్మణ కుటుంబాలు ఉన్నాయి. చాలా బ్రాహ్మణ కుటుంబాలకు భూములు, ఇనాంలు ఉండడం వల్ల బ్రాహ్మణీయ సంస్కృతిని, భూస్వామ్య సంస్కృతిని విశేషంగా పరిశీలించే అవకాశం బి.యస్. రాములుకు దొరికింది.

ధర్మపురి తొలుత బౌద్ధక్షేత్రం. బావరి అనే సుప్రసిద్ధ బౌద్ధభిక్షువు ధర్మపురికి చెందిన వాడే. గోదావరి నదీ తీరాన ఉండడం వల్ల, నరసింహ స్వామి దేవాలయం ఉండడం వల్ల తీర్థ రాజంగా, క్షేత్ర రాజంగా ధర్మపురి ప్రాధాన్యత పెరిగింది. ఈ పుణ్య క్షేత్రాన్ని దర్శించడానికి అనేకమంది పెద్దలు వచ్చేవారు. కవితా గోష్ఠులను ఏర్పాటుచేసి బి.యస్. రాములు అభిమానుల్ని జమచేసేవారు. సాయంకాలపు సంస్కృత ప్రాచ్య తెలుగు కళాశాలలో లెక్చరర్గా చేరిన జయధీర్ తిరుమల రావు, ముత్యాల విశ్వనాథం యింట్లో కిరాయికి ఉండేవారు. మంచి వక్త అయిన బి.యస్. రాములు ఎక్కడ ఉన్నా ఒక మంచి సాహితీచర్చ జరిగేది. అనేక విషయాల మీద చర్చించేవారు. ఇలా ధర్మపురిలో పద్య కవిత్వం నుండి వచన కవిత్వానికి బి.యస్. రాములు పెట్టిన సాహితీ గోష్ఠులు వాహికగా పని చేశాయి.



మరొక వైపు బీడీ కంపెనీలో పనిచేస్తూ, పేపర్ ఎజెంట్గా దిన పత్రికల్ని పల్లెపల్లెకు పోస్టల్ డిపార్టుమెంటు రన్నర్స్ ద్వారా పంపుతూ పైసలు వసూలుకు తిరుగుతూ ఉండేవారు. అలా పల్లెల్లోకి వెళ్ళినపుడు వారి గ్రామీణ, భూస్వామ్య సామాజిక, జీవితం అవగాహనకు ధర్మపురి చుట్టూ గల పల్లె పర్యటనలు పనికివచ్చాయి. కమలాపూర్, దమ్మన్న పేట, తిమ్మాపూర్, రాయపట్నం, మద్దునూర్, దొంతాపూర్, రాజారం, నక్కలపేట, తుమ్మెనాల, బీర్పూర్, తుంగూర్, దోనూరు, నేరేళ్ళ, వెల్గొండ మొ॥ పల్లెలను తిరిగారు.

1970 వరకు దొరల గురించి తెలియని బి.యస్. రాములు న్యూస్ పేపర్ ఏజెంట్గా పల్లెల్లో దొరలకు దిన పత్రికలను చదవడం అలవాటు చేశారు. ఆ కాలంలో దినపత్రిక తెప్పించుకోవడం కారులాగా ఒక స్టేటస్ సింబల్. అప్పుడు నెలకు 4 రూపాయలు చందా వుండేది. దినపత్రిక 12 పైసలు వుండేది. అలా వారి ఇళ్ళల్లోకి. చొచ్చుకు వెళ్ళడం ద్వారా, స్నేహం ద్వారా వారి ఆచార వ్యవహారాలు పరిశీలించే అవకాశం దొరికింది. "ధర్మపురిలో ఉన్నంత కాలం బి.యస్.రాములు ఆకారం వేరు. అతనిలో రగిలే సాహిత్య పరమైన హృదయ సౌందర్యం తత్త్వం వేరు" అని వారి మిత్రుడు భీమనాతి ప్రభాకర్ అన్నారు,

జ్ఞాన సంపద సాధించాలని అతని ఆశ. జగిత్యాలలో ఉన్నప్పుడు మూడు సంవత్సరాలు ఆరెస్సెస్ ముఖ్య శిక్షక్గా పని చేసిన అనుభవంతో ధర్మపురిలో కూడా ఆరెస్సెస్ కార్యకర్తగా కొద్దికాలం పని చేశాడు.

## బి.ఎస్.రాములు గారి రచనా వికాసం :

బి.యస్.రాములు సాహిత్య రచన వికాస క్రమంలో వ్యక్తులు, సమాజం, సాహిత్య ధోరణులతో పాటు జీవితం ఇచ్చిన అనుభవం, ఆ అనుభవం నుండి ఆలోచనా వికాసంతో పాటు జ్ఞానాభివృద్ధి పెంపొందించుకున్నాడు.

బి.ఎస్.రాములు 1964లో రచనలు ప్రారంభించి 1968నుండి కథలు రాయడం ప్రారంభించారు. కథలో జీవితం ప్రాథమికంగా ఉండాలని నమ్మే బి.యస్.రాములుకు మాగ్జింగోర్కి "నా బాల్యం"లాంటి కథలను రాయాలనే కోరిక ఉండేది. వాస్తవిక కథల్ని చుట్టూ వున్న మిత్రులతో పాటు సృజన సాహితి మిత్రులు కూడా బాగున్నాయని చెప్పినప్పటికీ అచ్చువేయ నిరాకరించారు. ఎందుకంటే దున్నేవాడిదే భూమి గురించి, విప్లవం గురించి రాస్తే తప్ప అవి విప్లవ కథలు కావనే వాతావరణం ఏర్పడింది. అలా బి.యస్.రాములు వ్రాసిన మొదటి కథా సంపుటి "పాలు కథలు" అచ్చువేయ నిరాకరిస్తే తానే స్వయంగా 1981లో అచ్చువేయ పూనుకున్నాడు. కాని కొన్ని కారణాల వల్ల "పాలుకథలు" పక్కన బెట్టి బి.యస్. రాములు 1982లో అల్లంరాజయ్య "భూమి" కథల సంపుటిని అచ్చువేశారు.

భూమి గురించి, రైతుల గురించి, విప్లవ కారుల గురించిన రాసిందే విప్లవ కథ

అని ప్రచారం చేస్తూ వ్యక్తిత్వ చిత్రణ లేకుండా కథలు రాసే ప్రయత్నంలో అసలైన కథకుడు పోయాడు. వ్యక్తులు, వ్యక్తిత్వం, స్వభావ చిత్రణ, మానవ సంబంధాలు లేకుండా గుంపు గురించి వ్రాయడం వల్ల ఎంతో నష్టం జరిగిందని బి.యస్.రాములు భావించారు.

1978 నుండి బి.యస్.రాములు సీరియస్‌గా సామాజిక చరిత్రను కథల్లో రికార్డు చేస్తూనే ఉన్నాడు. 1978లో వార్డెన్‌గా ఉద్యోగరీత్యా హుజూరాబాద్ బదిలీ అయిన తరువాత పోచంపాడు కెనాల్ పనుల కోసం వచ్చిన పాలమూరు లేబర్ కష్టాలను స్వయంగా చూసి "తిరుగుబాటు" కథ రాశాడు. ఆ కథలో సాంకేతిక పదాలు, వ్యవస్థ తీరు, తెన్నులన్ని వివరించాడు.

ఈ విధంగా కథలు వ్రాస్తున్న బి.యస్.రాములుకుతెలుగు సాహిత్యంలో గుర్తింపు తెచ్చినది "బ్రతుకుపోరు" నవల. ఇది 1982లో వెలువడింది. బీడీ కార్మికుల బతుకు పోరును చూసి, అనుభవించి రాసిన నవల ఇది. "నా జీవితం, అమ్మ జీవితం నన్ను కథా రచయితగా నిలబెట్టాయి. అలా మా జీవితాన్ని ప్రాథమికం చేసిన 'బతుకుపోరు' నవల నన్ను తెలుగు సాహిత్యంలో నిలబెట్టింది" అన్నారు. కార్మికవర్గ స్త్రీలగురించి తెలుగులో వచ్చిన మొదటి నవల "బతుకుపోరు".

"బతుకుపోరు" తరువాత "దొంగలు" అనే నవల "మంటలు" అనే వార పత్రికలో సీరియల్‌గా వచ్చింది. బి.యస్. రాములు చాటింపు, చిత్రిక, వరంగల్‌వాణి, ఆంధ్రజ్యోతి వంటి పత్రికలకేమో జీవితం ఉన్న కథలను పంపేవారు. సృజన, నూతన, అరుణతార పత్రికలకేమో విప్లవాంశ కథలు పంపేవాడు. విప్లవోద్యమంలో ఉంటూ వ్రాసిన 'పాలు' 'దొంగ గొడ్డుకు లోటారం' 'ఊబి' 'మమకారం' 'అడవిలో వెన్నెల' 'ప్రయాణం' 'సహజాతాలు' 'తేనేటీగలు' వంటి కథలు ఎంతోమంది పాఠకుల అభిమానాన్ని చూరగొన్నాయి.

1990 విప్లవోద్యమం నుండి బహిరంగ జీవితంలోకి వచ్చిన తర్వాత "1991లో వెలువరించిన 'గతితర్క తత్వదర్శన భూమిక' అనే తాత్విక గ్రంథం తెలుగునాట భావజాల చర్చ తీరును పూర్తిగా మార్చివేసింది. ఇది మూడు ముద్రణలు పొందింది. ప్రపంచ భావజాల ఉద్యమరంగంలో ఈ గ్రంథం ఒక మైలురాయి". ఈ గ్రంథం బీసీ, ఎస్సీ, ఎస్టీల వేదికైన దళిత రచయితల కళాకారుల మేధావుల ఐక్యవేదిక నిర్మాణానికి తాత్విక పునాది వేసింది. ఆ క్రమంలో వీరు 'గతి తర్కం-మార్క్సిజం-అంబేద్కరిజం', 'అంబేద్కరిజం-సోషలిజం', 'ప్రేమంటే ఏమిటి?' 'భౌతిక ప్రాపంచిక దృక్పథం', 'జ్ఞానం పుట్టుక' అనే గ్రంథాలు 'పాలు-మలిముద్రణ' 'స్మృతి' 'మమతలు మానవ సంబంధాలు' 'వేపచెట్టు' కథా సంపుటాలు వెలువరించారు.

**భారతీయ చారిత్రక భౌతికవాద సిద్ధాంతవేత్తగా బి.ఎస్.రాములు**

బి.ఎస్.రాములు గారు తాత్వికరంగంలో భారతీయ చారిత్రక భౌతికవాద సిద్ధాంత వేత్తగా సుప్రసిద్ధులు. భారతీయ చారిత్రక భౌతిక వాదాన్ని ప్రత్యేకంగా నిర్మించుకోవాలని



పురాతన చరిత్ర గల ప్రతిదేశం తన చరిత్ర పరిణామాలను అనుసరించి సొంతంగా ఒక చారిత్రక భౌతిక వాదాన్ని నిర్మించుకోవడం అవసరమని గట్టిగా విశ్వసించారు. భారతీయ చారిత్రక భౌతిక వాదాన్ని నిర్మిస్తూ అనేక రచనలు చేశారు. భారతీయ చరిత్రను ఎలా అధ్యయనం చేయాలో అనేక కొత్త కోణాలతో మన ముందుంచారు. భారతీయ చారిత్రిక భౌతిక వాదాన్ని సంక్షిప్తంగా ఇలా పేర్కొన్నారు.

"భారతీయ చారిత్రక భౌతికవాదంలో భాగంగా భారతదేశ వ్యవస్థ పరిణామాలను ఇలా క్రోడీకరించవచ్చు. 1. ఆహార సేకరణ దశ 2. మాతృస్వామ్య వ్యవస్థ 3. పశుపోషణ, వ్యవసాయం, ఇతర ఉత్పత్తులు 4. పితృస్వామ్య వ్యవస్థ 5. గిరిజన గణ తెగల వ్యవస్థ, వర్ణ, కులవ్యవస్థ 6. రాజరిక వ్యవస్థ 7. గ్రామీణ కులవ్యవస్థ, ఉత్పత్తి విధానం 8. గుడి గోపురాల బ్రాహ్మణ భూస్వామ్య వ్యవస్థ 9. శూద్రుల పారిశ్రామిక ఉత్పత్తి వ్యవస్థ 10. విదేశీ దాడులు 11. ఆర్యులు, ముస్లిములు, క్రైస్తవులు, యూరోపియన్లు దాడులు, వలసలు, ఆధిపత్యం, సమాజంలో మార్పులు 12. పారిశ్రామిక పెట్టుబడిదారీ వ్యవస్థ 13. ప్రజాస్వామ్య వ్యవస్థ 14 భారత రాజ్యాంగం-రిజర్వేషన్లు, ఓటు హక్కు 15. కులాల, వర్గాల సమీకరణలు, ప్రాంతీయ పార్టీల, జాతీయ పార్టీల సమీకరణలు, వాటి ఎన్నికల ప్రణాళికలు - బహుళ పార్టీ వ్యవస్థలో సోషలిజంలోకి పరివర్తన చెందే క్రమం." (సాహిత్య చరిత్రను కొత్త చూపుతో తిరగ రాయాలి - పేజి 27)

బి.యస్.రాములు స్వార్థం లేని రచయిత. తానే గొప్ప రచయితగా ఉండాలని, తనను మించి మరొకరు ఎదగకూడదని రచయితలకు, కళాకారులకు కొంత ఇగో ఉంటుంది. కాని బి.యస్.రాములు ఎంతో మంది యువరచయితలను ప్రోత్సహిస్తూ వారు ఎదగడానికి కృషి చేస్తున్నారు. వారి కోసం కథల వర్క్‌షాపు నిర్వహిస్తున్నారు. కథకుల కోసం కథల బడి "కథాసాహిత్య అలంకార శాస్త్రం" వెలువరించారు. సమీక్షలు ఎలా ఉండాలో చెప్పడానికి సమీక్షకుల కోసం "కన్యాశుల్కం"ను ఇపుడు ఎలా చూడాలి? అనే పుస్తకంను వెలువరించారు.

బి.యస్.రాములు తల్లి బేతిలక్ష్మీరాజు స్మృత్యర్థం "విశాలసాహితి - బి.యస్.రాములు కథాపురస్కారం"ను స్థాపించారు. ప్రతి సంవత్సరం మంచి కథకులకు ఈ అవార్డును బహుకరిస్తున్నారు. ఇప్పటికి 27 మంది కథకులకు ఈ అవార్డును ప్రధానం చేశారు. ఇలా ఒక అపూర్వ సాంప్రదాయాన్ని బి.యస్.రాములు కొనసాగిస్తున్నారు. అవార్డు పొందిన రచయితలతో పాటు వారి సతీమణిని కూడా ఈ సందర్భంగా సత్కరించడం విశేషం. బి.యస్.రాములు 2003 సంవత్సరం నుండి జీవితాన్ని రచనలకు, సాహిత్య, సామాజిక ఉద్యమాలకు పూర్తిగా అంకితం చేశారు.

**బి.ఎస్.రాములు గారి సాహిత్యం :**

బి.యస్.రాములు రచనా క్రమంలో వెలువడిన కథ - నవల - తత్వశాస్త్రం - సామాజిక శాస్త్రాలు - సాహిత్య సిద్ధాంతాలు - అలంకార శాస్త్రాలు, గ్రంథాల వరుస

క్రమం ఇలా ఉంది.

| | | |
|---|---|---|
| 1. | బతుకుపోరు | 1982 |
| 2. | పాలు | 1991 |
| 3. | గతితర్క తత్వదర్శన భూమిక | 1991 |
| 4. | గతితర్కం-అంబేద్కరిజం-మార్క్సిజం | 1993 |
| 5. | అంబేద్కరిజం - సోషలిజం | 1994 |
| 6. | ప్రేమ అంటే ఏమిటి? | 1996 |
| 7. | స్మృతి కథల సంపుటి | 1997 |
| 8. | జ్ఞానం పుట్టుక | 1998 |
| 9. | భౌతికవాద ప్రాపంచిక దృక్పథం | 1998 |
| 10. | కథల బడి - కథా సాహిత్య అలంకార శాస్త్రం | 1998 |
| 11. | మమతలు మానవ సంబంధాలు | 2000 |
| 12. | వేపచెట్టు తెలంగాణ కథలు | 2003 |
| 13. | సమగ్ర సామాజిక కథ, 50 ఏళ్ళ తెలుగు కథ తీరుతెన్నులు | 2003 |
| 14. | బహుజనతత్వం (బి.సి., ఎస్సీ, ఎస్టీ సిద్ధాంతాలు-కార్యాచరణ) | 2004 |
| 15. | బీసీలు ఏం చేయాలి? | 2004 |
| 16. | బీసీ, ఎస్సీ, ఎస్టీ విద్యార్థి యువజనులారా! | 2004 |
| 17. | తేనెటీగలు - కథల సంపుటి | 2004 |
| 18. | తెలంగాణ తల్లి ఎరుక | 2005 |
| 19. | కన్యాశుల్కంను ఇప్పుడు ఎలా చూడాలి? | 1993 |
| 20. | భారతీయ సమాజం-నేటి రాజకీయ సామాజిక పరిణామాలు | 2004 |
| 21. | సాహిత్య చరిత్రను కొత్త చూపుతో తిరగరాయాలి | 2004 |
| 22. | వ్యక్తిత్వ వికాసం -సామాజిక నాయకత్వం | 2006 |
| 23. | జీవితం అంటే ఏమిటి? | 2006 |
| 24. | తెలంగాణ రాష్ట్ర చరిత్ర | 2006 |
| 25. | తెలంగాణ రాష్ట్రం - నడుస్తున్న చరిత్ర | 2006 |
| 26. | తెలంగాణ రాష్ట్ర ఉద్యమం - భవిష్యత్ కార్యక్రమాలు | 2006 |
| 27. | తెలంగాణ జైత్ర యాత్ర | 2007 |
| 28. | అదిగదిగో తెలంగాణ - ఎంతో దూరంలో లేదు | 2007 |
| 29. | తెలంగాణ రాష్ట్రాన్ని పునర్నిర్మించండి మీ పూరిని మీరే అధ్యయనం చేయండి | 2007 |

ఇలా 150 కథలు, 6 నవలలు, 160 సిద్ధాంత వ్యాసాలు, 150 సాహిత్య వ్యాసాలు, 120కు పైగా పీఠికలు వ్రాసారు. బి.యస్. రాములు వ్రాసిన'పాలు' 'బడి' సహజాతాలు' మొదటి భాగం కథలను ఆంధ్ర విశ్వవిద్యాలయం ఎం.ఏ., తెలుగు విద్యార్థులకు పాఠ్య గ్రంథంగా నిర్ణయించారు. కాకతీయ విశ్వవిద్యాలయంలో "పాలు"



కథ ఎం.ఏ., తెలుగు విద్యార్థులకు పాఠ్యాంశంగా నిర్ణయించారు.

**అందుకున్న పురస్కారాల్లో కొన్ని**

బి.యస్. రాములు సామాజిక తత్వవేత్తగా, కథా రచయితగా, నవలా రచయితగా ప్రముఖ సాహితీ సంస్థలు వివిధ పురస్కారాలను అందజేశాయి.

1. కొడవటిగంటి కుటుంబరావు స్మారక విప్లవ కథకు ఇచ్చే పురస్కారం - ఆదివాసుల జీవితాన్ని - పోరాటాన్ని చిత్రించిన "అడవిలో వెన్నెల" కథకు 1984 అక్టోబరు 28న తెనాలిలో కాళీపట్నం రామారావు, రావిశాస్త్రి, కొడవటిగంటి వరూధినిల నేతృత్వంలో పురస్కారం అందజేశారు.

2. ప్రతియేటా ఇచ్చే డా॥దాశరథి రంగాచార్య పురస్కారం బీడీ కార్మికుల జీవితాలను చిత్రించిన 'బతుకుపోరు' నవలకు 1992లో ఇచ్చారు.

3. మాజీ మంత్రి, స్వాతంత్ర్య సమరయోధుడు, బీ.సీ. ఉద్యమకారుడు, కొండా లక్ష్మణ్ బాపూజీ ఫౌండేషన్ పురస్కారం 1992లో బి.యస్.రాములు చేసిన 'సాహిత్య విశిష్ట కృషికి'గాను అందజేశారు.

4. వరంగల్ జిల్లా 'పాలకుర్తి సోమన కళాపీఠం' వారు "పాల్కురికి సోమన" పురస్కారంతో సత్కరించారు.

5. ప్రముఖ హేతువాది త్రిపురనేని రామస్వామి చౌదరి పేరిట గల తెలుగు విశ్వవిద్యాలయం ధర్మనిధి పురస్కారం యిచ్చి బి.యస్.రాములును 'హేతువాది'గా 1995లో సన్మానించారు.

6. ప్రతియేటా తెలుగు విశ్వవిద్యాలయం ఉత్తమ కథా సంపుటికి అందజేసే పురస్కారం 2002లో బి.యస్.రాములు 'మమతలు మానవ సంబంధాలు' కథ సంపుటికి అందజేశారు.

7. షోలాపూర్ - సిరిసిల్ల పద్మపీఠం వారు బి.యస్.రాములును "పద్మాంజలి అవార్డు"తో సత్కరించారు. ఇవే కాక మరెన్నో పురస్కారాలు అందుకున్నారు.

8. దళిత సాహిత్య అకాడమీ, ఢిల్లీ వారు మహాత్మా జ్యోతిరావ్ పూలే ఫెలోషిప్‌తో 2001లో గౌరవించారు.

9. హర్యానాలోని పానిపట్‌లో ప్రేమ్‌చంద్ సమకాలీకులు జయప్రకాశ్ నారాయణ్ సహచరుడైన బిహార్ కథకుడు రామవృక్ష బేనిపురి శతజయంతి పురస్కారాన్ని 2003లో అందుకున్నారు.

ఇక వీరు వ్రాసిన 'పాలు' 'స్మృతి' 'మమతలు మానవ సంబంధాలు' 'ప్రపంచీకరణ నేపథ్యంలో వేపచెట్టు' కథా సంపుటాలను పరిశీలిద్దాం.

# 'పాలు' కథల సంపుటి

బి.ఎస్.రాములు "పాలు" కథలు జూన్-1991లో వెలువరించిన తొలి ముద్రణను యం.ఫిల్ సిద్ధాంతం పరిశోధన కోసం తీసుకోవడం జరిగింది. ఇంగులో 'పాలు', 'బడి', 'సహజాతాలు' అనే మూడు కథలున్నాయి. 25 కథలు రాసినప్పటికీ మూడు కథలతోనే ఈ పుస్తకం వెలువరించడంలో ఒక ప్రత్యేకత వున్నది. ఈ మూడు కథలు కలిసి ఒకే సమాజం యొక్క ఒకే జీవితం యొక్క పరిణామాన్ని తెలుపడమే ఆ ప్రత్యేకత.

**పేదల కష్టం పెద్దల పాలవుతున్న తీరును చిత్రించిన 'పాలు' కథ :**

పాలు కథ నిజానికి బతుకుపోరు కన్నా రెండేళ్ళముందు 1980లో రాయబడింది. కానీ 1985 జనవరి ఆంధ్రజ్యోతి వీక్లీలో వచ్చింది. 'బడి' కథ ఉపాధ్యాయ మాసపత్రికలో 'వాణ్ణి సరే బడినేం చేద్దామంటారు' పేరుతో 1986లో ప్రచురించబడింది. 1985లో సహజాతాలు కథ 'సమీక్ష' అనే ఒక పత్రికలో వచ్చింది. కొత్తగూడెం బుక్‌ట్రస్ట్‌వారు ఈ కథల పుస్తకాన్ని అచ్చువేశారు.

'పాలు' కథలో భూస్వామి పారిశ్రామికవేత్త కూడా. శాకాహారి. అందరు భూస్వాముల్లాగా ప్రజలను హింసించడు. అందరినీ గౌరవిస్తాడు. అయినప్పటికీ అతని ఆధిపత్యం, దోపిడీ ఎలా కొనసాగుతుందో పేద ప్రజలు ఎలా దోపిడీకి గురవుతున్నారో ఈ కథ తెలుపుతుంది.

ఈ కథలో ఎల్లవ్వ ఆ ఊరి పంతులు ఇంట్లో పని చేస్తుంది. ఊళ్ళో 'దొర'ని పంతులు అని పిలుస్తారు. పంతులు ఇంట్లో బర్రెలకు మేత వేయడం కొట్టంను శుభ్రం చేయడం, 'పాలు' పిండడం వంటి పనులతో ఈ కథ ప్రారంభం అవుతుంది.

ఒకరోజు ముసురు పడుతుంటే ఎల్లవ్వ, ఆమె కొడుకు గంగపోచంల మధ్య సంభాషణ నడుస్తుంది. ఎల్లవ్వ గంగపోచంను చదువుకు పొమ్మంటుంది. నేను పోనని చెప్తాడు. ఎల్లవ్వ కొడుకుతో "సదువుకుంటే మంచి నౌకరి దొరుకుతదిర!" బుజ్జగించింది. పచ్చిబాలెంతని విడిచి అక్కడెక్కడో ఉన్న భర్త నౌకరి తలుచుకుంటూ.

"నాకేమద్దు నౌకరి"
"మరేం జేత్తవురా"



"తమ్ముణ్నెత్తుకుంట, తమ్ముణ్నాడిత్త, నువ్వు పొద్దందాక తెల్లందాక పంతులింట్ల పనిజేత్తే తమ్ముణ్నెవలాడిత్తరే మరి?"[1] అంటూ గంగపోచం నాన్న తీరుగా కార్కనాల పనిజేసి బతుకుతనని తల్లికి భరోసా ఇస్తాడు.

'ఏదో మాట వరసకు బడికి పొమ్మన్నది గని వాడు బడికిపోతే తనకు యింట్ల పని యెల్తదా అసలు? ఆప్యాయంగా వాత్సల్యంగా, ప్రేమగా అలా జరిగితే మంచి గుండునని ఆశగా అనుకుని అన్నది గని తను అనుకున్నట్టు సాగుద్దా సంసారం'

ఒక్క కొడుకును సాదలేని బీదతనం.

ఇంత భారమైన బతుకెందుకో?"[2] అని మనసులో అనుకుంటుంది ఎల్లవ్వ.

మళ్ళీ గంగపోచం తల్లితో పంతులు కొడుకు పాలు తాగి మంచిగ చదువుకున్నట్టు. నాకు గిలాసెడు పాలు వొయ్యి నేను బడికి పోయి మంచిగ చదువుకుంటాను, అంటాడు. మనం వాళ్ల ఇంట్లో, పని చేసే పని వాళ్ళమని పాలు కావాలని అడగవద్దని చెబుతుంది.

"ఎందుకే? పంతులు బర్లకు మొత్తం నువ్వే సగపెట్టవడితివి. ఆల్ల జాగలున్నందుకు అన్ని అల్లకేనాయే! మరి మన జాగల కట్టేసుకుంటె మనకు సగం పాలు రాద!"[3] అని ఎల్లవ్వను ప్రశ్నిస్తాడు. ఇందులో పని దోపిడీకి, శ్రామిక భాగస్వామ్యానికి దగ్గర పోలికలు కనబడతాయి. గంగపోచం మాటల్లో సహజ సామాజిక న్యాయం కనబడుతుంది.

పంతులింట్లో పని చేస్తూ ఆవు పాలు పిండడానికి ఎల్లవ్వ దొడ్డిలోకి వెళ్తుంది. కన్నీరు కారుతున్న ఆవును చూచి చలించిపోతుంది. రెండు రోజుల క్రితం చనిపోయిన దూడ గుర్తుకు వస్తుంది. ఆ ఊరుకు రాజుగా వెలిగిపోతున్న పంతులు పట్నంలో ఫ్యాక్టరీలు నడుపుతూ ఇండ్లు కట్టి, కిరాయికి ఇచ్చి ఊళ్ళో నుండి ఫోను ద్వారా పనులు నెరుపుతుంటాడు. ఎల్లవ్వ పంతులింట్లో పని చేస్తున్నప్పటికీ లేగదూడ చనిపోయినట్లుగా మూడు రోజులుగా జ్వరంతో మూలుగుతున్న తన చిన్న కొడుకూ చనిపోతాడేమోనని అతన్ని బతికించుకోవాలనే ఆలోచన ఆమెలో కలుగుతుంది. ఈ కథ శాఖాహారం తినే పంతులు శ్రమ దోపిడి ఏ విధంగా చేస్తున్నాడో, దోపిడి కాకుండా ఉండడానికి ఏం చేయాలో తెలుపుతుంది.

ఈ కథ గురించి ముందుమాట వ్రాస్తూ ప్రముఖ రచయిత ఆచార్య జయధీర్ తిరుమలరావు "సౌమ్యంగా కన్పించే సంస్కృతిలో కూడా రక్తసిక్తమైన ఫ్యూడల్, దోపిడీ స్వభావం ఎలా కొనసాగుతూ ఉంటుందో వెలికి తీసి సమర్ధవంతంగా చిత్రించిన కథ"[4] అని పేర్కొన్నారు.

**సమస్యల్ని చాకచక్యంగా ఎలా పరిష్కరించుకోవచ్చో చెప్పిన కథ 'బడి' :**

'బడి' కథ విప్లవోద్యమాల్లో భాగంగా సాగిన విద్యార్థి ఉద్యమాలను తెలిపే కథ. ఉద్యమించే విద్యార్థుల పట్ల కొందరు ఉపాధ్యాయులు వ్యతిరేకంగాను, మరికొందరు

ఉపాధ్యాయులు అనుకూలంగాను ఎలా వుంటారో ఆ సామాజిక పరిణామాలను చిత్రించింది. ఈ కథలోని పోచయ్యకు ఇల్లు కన్నా బడి పదిలం. ఇంట్లో ఏమి వుండదు. ఐనా బడి బాగుపడాలని కోరుకుంటాడు.

బడి కథలో హెడ్మాస్టర్ వీరయ్య గారికి విద్యార్థుల ప్రయోజనం కన్న స్వప్రయోజనాలే ముఖ్యం. పిల్లల శ్రేయస్సును వదలి పై అధికారుల మన్ననలు పొందడానికి తాపత్రయ పడతాడు. ఆ బడిలో శంకరయ్య సారు లాంటి మంచి సార్లు కూడా ఉంటారు. హెడ్మాస్టర్ వీరయ్య ప్రతి విషయాన్ని స్టాఫ్ మీటింగులో చర్చకు పెట్టడంలో దిట్ట. శంకరయ్య సారు మాటల్లో "ప్రతీ దానికి స్టాఫ్ మీటింగులూ, పేరెంటు కమిటీ మీటింగులూ, చర్చలూ, సంతకాలు, తీర్మానాలు, ఫైళ్ళు వీటిని మెయిన్‌టైన్ చేయడంలో మాత్రం దిట్ట. వీరి మినిట్స్‌బుక్ చూస్తేనా! ఇప్పటికే ఈ బడి, పిల్లలూ అన్ని హంగుల్తో సర్వాంగ శోభితంగా అలరారుతున్నట్టే కనిపిస్తుంది. కాని ఎక్కడ వేసిన గొంగడి అక్కడే"[5] అంటూ విద్యా వ్యవస్థ పని తీరును రచయిత తెలియపరుస్తాడు.

"బడి"లో సదుపాయాల గురించి ప్రశ్నించిన విద్యార్థులకు టి.సి.లు ఇచ్చి పంపేదాకా నిద్రపోడు. అలాంటి హెడ్మాస్టరుకు పోచయ్య అనే విద్యార్థి "ఆకస్మిక తనిఖీ"కి వచ్చిన జిల్లా పరిషత్ ఛైర్మన్‌ను ప్రశ్నించి వారి ద్వారానే తన డిమాండ్లను ఒప్పించుకొని, సాధిస్తాడు. బాలికలకు మూత్రశాల లేదు. దాన్ని స్త్రీలను గౌరవించే దేశం మనదని విద్యార్థులనుద్దేశించి జడ్‌పి ఛైర్మన్ క్లాస్ రూంలో మాట్లాడుతుంటే, ఆ తరగతి విద్యార్థి అయిన పోచయ్య అందుకే మా చెల్లెండ్లకు మూత్రశాలలు కట్టించాలని కోరుతాడు. ఛైర్మన్ మూడు రోజుల్లో మూత్రశాలలు పూర్తి చేయమని పిల్లల సమక్షంలో వీరయ్య సారును ఆదేశిస్తాడు. పోచయ్య తను కావలసింది సాధించుకుంటాడు. పోచయ్యను హెడ్మాస్టరు వీరయ్య ఏమి చేయలేకపోయాడు.

ఈ కథలో ఆనాటి విద్యావ్యవస్థలోని కర్కశత్వాన్ని ఎదిరించి ప్రశ్నించే విద్యార్థులకు టి.సిలిచ్చి పంపే విధానాన్ని, విద్యావ్యవస్థలోని సమస్యల్ని పరిష్కరించే ప్రయత్నం పోచయ్య పాత్ర ద్వారా రచయిత తెలిపాడు.

**అన్యాయాలను వ్యతిరేకిస్తూ ఉద్యమించడం**
**మనిషి సహజ స్వభావమని చెప్పిన కథ 'సహజాతాలు' :**

సామాజిక జీవితంలో జరిగిన సంఘటనలను కూర్చి వ్రాసిన కథే "సహజాతాలు". ఉత్తమ పురుషలో సాగే కథ ఇది. ఈ కథ విప్లవ ఉద్యమాల కాలంలోని సామాజిక పరిణామాలను రికార్డ్ చేసింది. విప్లవ విద్యార్థుల ద్వారా ఉపాధ్యాయులు, లెక్చరర్లు కూడా ప్రభావితమైన క్రమాన్ని ఈ కథ తెలుపుతుంది.

బాబు, శ్రీనులు అత్తగారి ఊళ్ళో అతను అప్పర్ ప్రైమరీ స్కూల్‌కు హెడ్మాస్టర్‌గా పని చేస్తున్నప్పుడు, పరిచయమవుతారు. అతని భార్యకు బాబూ, శ్రీను వాళ్ళ అక్కలు



బాల్య స్నేహితులు కావడంతో ఇంటికి రాకపోకలు సాగించేవాళ్ళు. ఆ ఊళ్ళో రైతు కూలి సంఘాల పేరుతో ప్రతివాడు రాజకీయం చేయడం. ఈ రాజకీయంతో వేగలేక సమితి నుండి స్కూల్ అసిస్టెంట్‌గా జెడ్.పి.కి బదిలీ చేయించుకున్నాడు.

బాబూ, శ్రీనులు సెవెంత్ పాసై సర్టిఫికెట్లు తీసుకుని తల్లిదండ్రులతో వస్తే స్కూల్లో ఎస్సీ హాస్టల్లో చేర్పించాడు. చదువు ఆగిపోవాల్సిన వారు చదువును కొనసాగించే వీలు కలిగింది. భార్య వీళ్ళిద్దరిని బలవంతంగా అతనిపై రుద్దుతుంది.

తెలుగుదేశం ప్రభుత్వం ఏర్పడి ఏడాది పూర్తయిం తరువాత ఊరూరా పోలీసు క్యాంపులు వెలిశాయి. మిలిటెంట్ యువకుల కోసం పోలీసులు గాలిస్తున్న రోజులవి. కరీంనగర్‌లో డిగ్రీ చేస్తూ బాబూ, శ్రీనులు లాకప్ హత్యలకు నిరసనగా అర్ధరాత్రి వాల్ పోస్టర్లు వేస్తున్న సమయంలో అకస్మాత్తుగా పోలీసులు వచ్చి మీదపడ్డారు. బాబు పోలీసులకు చిక్కిపోయాడు. శ్రీను తప్పించుకు పారిపోయాడు.

కరీంనగర్‌లో అరెస్టయిన బాబును మూడు పోలీస్‌స్టేషన్లు తిప్పారు. మొదట హుజూరాబాద్ పోలీస్‌స్టేషన్, తరువాత జమ్మికుంట స్టేషన్‌లో పడేశారు. అక్కడ అనేక చిత్రహింసలు పెట్టి చంద్రన్న దళం ఆచూకి చెప్పమని బాబును తీసుకుని డి.ఎస్పీతో సహా నాలుగు పోలీసు బృందాలు అర్ధరాత్రి బయలుదేరి కొండల్లో పది కిలోమీటర్లు నడిపిస్తారు. బాబు పోలీసుల ద్వారా తను అనుభవించిన హింసకు ప్రతీకారంగా ఆ ప్రాంతాల్లోని కొండలు, గుట్టలు తిప్పుతాడు. కాని ఆ ప్రాంతాల్లో ఎటువంటి దళం ఉండదు. తాను అనుభవించిన హింస కంటే వారిని ఎక్కువ గురి చేస్తాడు. మళ్ళీ లాకప్‌లో పెట్టి చిత్రహింసలకు గురి చేస్తారు. అరెస్టయి పది రోజులైనా బంధువులకు, అతనికి తెలిసి కూడా ఏమి చేయలేని నిస్సహాయత.

మరో పదిరోజులు లాకప్‌లో ఉంచి ఒక హత్య, ఒక దొంగతనం కేసు పెట్టి కరీంనగర్ సబ్‌జైల్‌కు పంపిస్తారు. వారి గురువు కొన్ని రోజులకు వారిని కలవడానికి జైలుకు వెళతాడు. బాబు శరీరంపై చిత్రహింసల తాలూకు దెబ్బలు కొద్దిగా మానిపోయినాయి. జైల్లో "పలకరింపుగా వాడికళ్లలోకి వాత్సల్యంగా చూశాను ఎంత ఆశ్చర్యం! ఆ కళ్లల్లో ఎక్కడా దీనత్వం లేదు. అవి ఎంత స్వచ్ఛంగా నిర్మలంగా వున్నాయనీ! వాడి కళ్ళల్లో కొత్తగా ఏదో మెరుపు తళుక్కుమంటోంది. చాలా ఉత్సాహంగా వున్నాడు వాడు" అంటూ లాకప్‌లోకి వెళ్ళి చిత్రహింసలకు గురై సానదేరిన యోధుడిలా అయ్యాడని గురువు అనుకుంటాడు.

తర్వాత కరీంనగర్ నుండి వరంగల్, వరంగల్ నుండి రాజమండ్రి, వైజాగ్ జైలుకు తిప్పి చివరకు రాజమండ్రి జైల్లో ఉంచారు. జైల్ నుండి ఉత్తరాలు వ్రాస్తున్నాడు. అలా ఒకరోజు ఒక ఉత్తరం వచ్చింది. ఆ ఉత్తరాన్ని ఒకటికి పదిసార్లు చదివి భార్యకు వినిపిస్తాడు. ఆ జాబులో బాబు "జైల్లో ఖైదీలకు కనీస సౌకర్యాలు ఇవ్వాలనీ, మాన్యువల్‌ను అమలు చెయ్యాలనీ జైల్లో సమ్మె చేశారట. మరో ఇద్దరితో పాటు బాబు పది రోజులుగా నిరాహార దీక్షలో ఉన్నడట. వార్డెన్లు, గార్డులు లాఠీఛార్జీ చేశారట. వాడు బాబు మరో

అతనూ స్పృహ తప్పిపడి పోతే హాస్పిటల్‌లో చేర్పించారట. ఇంటెన్సివ్ కేర్‌లో వుంచారట"[9] అనుకుంటూ కుటుంబమంతా ఏడుస్తుంది. ఈ సంఘటన ఆదర్శాలకు ప్రేమలకు జీవితాలకు మధ్య సంఘర్షణను లెక్చరర్ తెలుపుతాడు. బాబూ, శ్రీనూలు నిత్య నిర్బంధాలను ఎదుర్కొంటూ జీవితాన్ని వ్యక్తిత్వాన్ని ఆదర్శంగా మలుచుకున్నారు.

ఈ మూడు కథల్లో "గడసరితనమల్లా ఎక్కడుందంటే మొదటి కథలో గంగపోషం, రెండో కథలో పోచయ్య, మూడో కథలో బాబు-వీళ్ళు, పైచూపులకు మాత్రమే వేర్వేరుగా కనిపిస్తారు. పేర్ల మాత్రమే వేరుగానీ, వస్తుతహా ఈ మూగ్గురూ ఒక్కరే! ఈ ముగ్గురూ కూడా 'ఈ వ్యవస్థ ఇలా ఎందుకుంది? అని ప్రశ్నించిన వాళ్ళే. ఈ ప్రశ్న ఈ మూడు కథల్లోనూ అంతస్సూత్రంలా వ్యాపించి, దూరం నుంచి దగ్గరికి వచ్చిన కొద్దీ బిగ్గరగా వినిపించే శంఖారావంలా ధ్వనిస్తుంది. ఈ వ్యవస్థ ఇలా ఎందుకుంది అని ప్రశ్నించడంతో ఊరుకోక వీళ్ళు ముగ్గురూ తమ తమ పరిధిలో దాన్ని మార్చడానికి కూడా ప్రయత్నించి వుండడం గమనార్హం. వీళ్ళ కథ ఆఖరయ్యేదిగా తోచడం లేదు. ఎప్పటికి కొనసాగేదిలా తోస్తుంది" అని పేర్కొన్నారు సుప్రసిద్ధ రచయిత మధురాంతకం రాజారాం గారు.

వీరి కథలు చారిత్రక భౌతికవాదం వెలుగులో సామాజిక చరిత్రను విశ్లేషించి అందిస్తాయి. సామాజిక పరిణామాలు, జీవితం అందుకు ప్రాతిపదికగా వుంటాయి. వీరి అన్ని కథల్లోనూ అంతస్సూత్రం ఇదే. వెనకటి కాలం కన్నా నేటి కాలమే బాగుంది, రేపటి కాలం ఇంకా బాగుంటుంది అని చెప్పడమే చారిత్రక పరిణామం. వీటిని జీవితం పునాదిగా విశ్లేషించడమే వీరి కథల్లోని బలం. అందుకే వీరి కథలకు చారిత్రక ప్రాధాన్యత ఏర్పడింది. వీరి కథలు వర్తమాన సామాజిక చలన సూత్రాలను తెలుపుతాయి. సామాజిక చలనం ఎలా వుందో తెలుసుకొని సూత్రీకరించి చెప్పడమే సామాజిక చలన సూత్రాలు. అందుకు బి.ఎస్.రాములు జీవితాన్ని ప్రాథమికం చేసుకొని కథా ప్రక్రియను అందుకు వాహికగా మలుచుకున్నారు. అందువలన వీరి కథలు రూపంలో కథలు. సారంలో సామాజిక చలన సూత్రాలను విప్పి చెప్పే చారిత్రక భౌతికవాదం. అది ఎలా సాగుతుందో స్మృతి కథల సంపుటిలో విపులంగా పరిశీలిద్దాం.



## 'స్మృతి' కథల సంపుటి

'స్మృతి' కథల సంపుటిలో 15 కథలున్నాయి. విప్లవ కథల తరువాత ఈ కథలను రాశారు. విప్లవ కథల పుస్తకాన్ని అచ్చువేయలేదు. తన అభిప్రాయాలు మారినందువల్ల ఆ కథలను అచ్చు వేయడానికి నిరాకరించారు. స్మృతి కథల్లో తన మారిన అవగాహనను అనుసరించి సమాజాన్ని ఒక సమగ్రతలో చిత్రించారు. ఈ సమాజం కుల సమాజమని, వర్గ సమాజమని, అశేష ప్రజానీకం పల్లెల్లో జీవిస్తున్నారని వారి బ్రతుకులు కొడిగట్టి పోతున్నాయని అందుకు ఎన్నో ఉద్యమాల ద్వారా జీవితాలను గెలుచుకోవడానికి ముందుకు కదిలారని అయితే వారికి అనుభవంలోకి వచ్చింది తక్కువ. నిర్బంధాలు, కష్టాలు ఎక్కువ. పారిపోయిన భూస్వాములకు ప్రయోజనాలు ఎక్కువ కలిగాయి. విప్లవోద్యమంలో కలిగిన అనుభవాలు పేద వారిని మరిన్ని కష్టాల పాలు చేశాయి.

పేదవాళ్ళు అభివృద్ధిని అందుకోడానికి ఆధునిక విద్య తప్పనిసరి అని ఈ కథలు ప్రతిపాదిస్తాయి. అయితే తాను విప్లవ కారుడిగా ఉన్న కాలంలో ఇది అశాస్త్రీయ విద్యా విధానం అని విద్యార్థి, యువజన ఉద్యమాల్లో ప్రచారం చేయబడింది. విద్యని పేద విద్యార్థులు అందుకోకుండా చేశారు. విప్లవంలోకి నడిచారు. అయితే ఇదే విద్యను అందుకొని కోట్లాది ప్రజలు మధ్య తరగతిగా ఎదిగారు. కుల వృత్తులు ధ్వంసం అయిపోయాయి. గిట్టుబాటు కాకుండా పోయాయి. పెట్టుబడి లేదు. ఉన్నదల్లా చదువు కోగలిగే అవకాశం ఒక్కటే. తద్వారానే జీవితం గెలుచుకోవడం సాధ్యం. కానీ విప్లవోద్యమం ఇది అశాస్త్రీయ విద్యా విధానమని నూరి పోసింది. ఈ అవగాహన నుండి బయట పడ్డ రచయిత దీనికి పూర్తి వ్యతిరేకంగా ఇది అశాస్త్రీయ విద్యా విధానం అనే వారిని చెప్పుతో కొట్టండి. ముందు అలా చెప్పే వారు వారి సర్టిఫికెట్‌లను చింపేయండి. వారు వుద్యోగాలకు రాజీనామా చేయాలి. వాళ్ళ పిల్లలను చదువులు మాన్పించాలి. ఆ తరువాత వారి అగ్రకులాలను ఇది అశాస్త్రీయ విద్యా విధానం కనుక చదువుకోవద్దని చెప్పి బిసి, ఎస్సీ, ఎస్టీ విద్యార్థులకు పోటీ రాకుండా చూడాలని ఒక వందేళ్ళు బిసి, ఎస్సీ,ఎస్టీలు ఈ విద్య నేర్చుకున్నాక ఇది అశాస్త్రీయ విద్యా విధానం అవుతుందో కాదో తేల్చుకుంటారని రాష్ట్ర వ్యాప్తంగా వందలాది ప్రసంగాలు చేశారు. దాంతో విప్లవ విద్యార్థి సంఘాలు ఇది అశాస్త్రీయ విద్యా విధానం అని గోడల మీద

రాయడం ఆగిపోయింది. బి.ఎస్.రాములు దళిత రచయితల కళాకారుల, మేధావుల ఐక్యవేదిక రాష్ట్ర అధ్యక్షులుగా, వ్యవస్థాపకులుగా రాష్ట్ర మంతటా ఇలా బహుజన దృక్పథంతో సుడిగాలిలా పర్యటిస్తూ పిడుగులు కురిపించారు. ఆ తరువాత బహుజనులు బహుజన దృక్పథంతో కథలు ఎలా రాయాలో కూడా ఒక నమూనా ముందుంచాలని ఈ స్మృతి కథలను రాయడం జరిగింది. అందుకే అంతకు ముందు రాసిన విప్లవ కథలను అచ్చు వేయడానికి నిరాకరించారు. 'పాలు' కథల సంపుటిపై ఆంధ్ర విశ్వవిద్యాలయంలో ఎం.ఫిల్ చేయడానికి అనేకులు ముందుకొచ్చినప్పటికీ ఈ కారణంతోనే నిరాకరించారు. అందువల్ల స్మృతి కథలకు రాష్ట్రంలోని సామాజిక ఉద్యమాలకు, సైద్ధాంతిక భావజాల చర్చకు మధ్య సంబంధం వుంది. అరసం, విరసం మొదలైన రచయితల దృక్పథానికి భిన్నంగా జీవితాన్ని, సామాజిక పరిణామాలను ఎలా చిత్రించాలో ఈ కథల ద్వారా బి.ఎస్.రాములు స్పష్టం చేశారు. అందువల్ల ఈ కథల సంపుటిపై సమీక్షలలో కొందరు సమీక్షకులు విషం కక్కారు. ఈ కథల సంపుటిని కాల్చి వేయాలని చూశారు. కానీ బిసి, ఎస్సీ, ఎస్టీ సమాజం, సామాజిక ఉద్యమాలు ఈ కథల సంపుటిని తెలుగు సాహిత్యంలో మైలురాయిగా, మహోన్నతమైనవిగా స్వీకరించాయి. ఒక మంచి ముందు మాటతో అరసం నాయకులైన సుప్రసిద్ధ రచయిత కేతు విశ్వనాథ రెడ్డి గొప్ప నైతిక మద్దతును అందించారు. అలాగే బోయ జంగయ్య, కాలువ మల్లయ్య, సదానంద శారద మొదలైన సుప్రసిద్ధ రచయితలు ఈ కథల సంపుటి ప్రాధాన్యతను విశ్లేషించారు. అలా ఈ కథల సంపుటి సామాజిక ఉద్యమాల పరిణామ చరిత్రకు ఒక సజీవ సాక్ష్యం. 1987 నుండి రాసిన కథలు ఇందులో వున్నాయి. ఈ కథల సంపుటి 1997లో వెలువడింది.

ఈ 'స్మృతి' కథల సంపుటిలో కథలను మూడుగా వర్గీకరించారు.

1. సదువు కథలు
2. బహుజన ప్రేమ కథలు
3. ప్రేమ కథలు

**సదువు కథలు :**

సదువు కథ విభాగంలో బి.యస్.రాములు జీవితానుభవంలో సంస్కార హేతువులే నిజమైన చదువు అని చిత్రీకరించారు. ఆధునిక విద్య వల్ల పేద కులాలు, వర్గాలు ఎదిగిన పరిణామాలను విద్య అందుకోలేకపోతే జరిగే పరిణామాలను చిత్రించారు. ఆధునిక విద్య లేకుండా ఆధునిక జీవితం అందుకోవడం అసాధ్యమని ఈ కథలు అనేక కోణాల్లో స్పష్టం చేస్తాయి. జీవితానికి విద్యకు గల సంబంధాన్ని మన ముందుంచుతాయి. విద్య వల్ల వుద్యోగం, వుద్యోగం వల్ల అట్టడుగు వర్గాలు మధ్య తరగతిగా మారిన తీరు, మధ్య తరగతిగా మారిన తరువాత కూడా కులం కారణంగా ఎదురయ్యే ప్రత్యేక సమస్యలు ఈ సదువు కథల్లో కనబడతాయి.



"1977నుండి తెలుగునాట సామాజిక జీవితంలో వస్తున్న పరిణామాలు – చదువు, ఆర్థిక అసమానతలు, గ్రామీణ నేపథ్యం, అట్టడుగు వర్గాల, అణగారిన కులాల ఆశలు, అవి రూపాంతరం చెందుతున్న తీరుతెన్నులు, రిజర్వేషన్లు ఉన్నప్పటికీ అభివృద్ధిని అందుకోలేని అవరోధాలు, భావజాల రంగంలో వస్తున్న పరిణామాలు మొదలైనవి చిత్రించిన కథలను ఒక క్రమంలో ఇందులో చేర్చడం జరిగింది." అని 'పాలు' కథల సంపుటి రెండవ ముద్రణలో సంపాదకులు పేర్కొన్నారు.

**వెనుకటి కాలం కన్నా ఈ కాలమే మంచిదని స్పష్టం చేసిన 'స్మృతి' కథ**

ఈ కథ కొన్ని పత్రికల్లో 'ఎనుకట ఏముండె' అనే పేరుతో పునర్ముద్రించబడింది. వెనుకటి కాలం కన్నా నేటి కాలమే మంచిదని కథ స్పష్టం చేస్తుంది. వెనుకటి కాలం ఎడ్డి కాలమని కూర్చుని తిన్నవాళ్ళకే అది మంచి కాలమని పని చేసుకొనే వాళ్ళకే ఈ కాలమే మంచిదని ఈ కథ ప్రతిపాదిస్తుంది. దీనినే చారిత్రక భౌతికవాదం అంటారు.

కథా ప్రారంభంలో "వెనుకటి ప్రేమలు యిపుడు లేవు. వెనుకటి కాలం మళ్ళీ రాదు. ఆ ప్రేమలే వేరు. ఇప్పుడు భయం లేదు. భక్తి లేదు. అంతా ఆజాద్ అయిపోయింది. ఎక్కడ జూడు స్వార్థం. ఈ అవినీతి పోవాలంటే మిలటరీ గవర్నమెంటు రావాలె. మొన్న కరెంటు మోటరు కాలిపోయింది. ఇంకో ట్రాన్స్‌ఫారం వెయ్యమంటే ఒక్కొక్కడు...."[1] అంటూ రైతు ఘోష వినిపించిన అంజయ్యకు ఇప్పటి ప్రేమలు ఎలా ఉంటాయో మిలట్రీ గవర్నమెంట్ ఎంత క్రూరమైనదో అతనే అర్థం చేసుకునేట్టుగా అనుభవాలు ఎదురైన తీరును ఈ కథ చిత్రిస్తుంది.

హైస్కూలు టీచరైన మల్లేశం, తల్లి కొక్కుల దుబ్బక్క, చిన్నల్లుడు కస్తూరి రాజేశం, మనుమరాలు స్వప్నతో కొండగట్టు తాళ్ళల్లో ఇలా అంటుంది. "ఎనుకట మనిండ్లల్ల ఏం ఉండేది బిడ్డ ? పడుగుసరి చేసుటానికి కాసిన గంజి అంబలి తాగి బతికిన ఎడ్డికాలం. మానాయిన్న చెప్తుంటే యిన్న. ఎనుకట అన్నం దొరకక రేగడి మట్టి తిన్నరట మంచిగ బతుకుడంటె మక్క గుట్క (సంకటి) నే పరమానందం. ఎనుకటి కాలం గుర్తు చేయకు బిడ్డా... పటేండ్లు, పట్వారీలు, దొరలు ఎంత గోస పోసుకున్నరో నీకేం ఎరుకరా... వాల్లకు కోరిన తీరుగ బట్టలన్ని సొంతంగా నూలు కొనుక్కచ్చి నేసి యియ్యాలె... పైసలు అడుగవశమా... పబ్బతివట్టి (రెండు చేతుల్తో దండం పెట్టి) వంగివంగి నిలబడాలె... నోటితోటి అడిగేది లేదు.... అడుగుతే కతమేనాయె... ముప్పయి రూపాయల బాకీకి మూడేండ్లు ముడ్డిసుట్టు దిప్పుకుందురు..."[2] అంటూ ఆనాటి కాలంలో దొరల పెత్తనాన్ని, కులవృత్తులు చేసి జీవించేవారి బతుకుల్ని తెలుపుతుంది.

నక్సలైటు ఉద్యమం వచ్చిన తరువాత విప్లవోద్యమం ప్రజలకు ఇచ్చిన విశ్వాసాన్ని ఈ కథలో దుబ్బక్క వివరిస్తుంది. పీడిత కులాల్లోని అవగాహన, మారుతున్న వ్యవస్థతో పాటు మారిన ఆలోచన సరళికి, పరిణామ క్రమానికి దుబ్బక్క మాటలు నిదర్శనాలుగా ఉంటాయి.

"ఈ కథలో సామాజిక సంబంధాల్లో భాగంగా మానవ పరిణామాల్ని తెలంగాణా గ్రామీణ చిత్రణని చిత్రిస్తూ మొదటి నుండి పీడితులుగా మగ్గిన బహుజనులు గతాన్ని ప్రేమించలేరని బాధల కుంపటి లాంటి గతాన్ని ప్రేమించనంత మాత్రాన కోల్పోయేదేమి లేదని, దొరలకు అగ్రకులాలకు వెనుకటి కాలం, ప్రజలకు నేటి కాలం బాగుందని స్పష్టం చేస్తుంది."

**ఎన్ని మారినా కులతత్వం మారలేదని చూపిన కథ 'బందీ'**

మానవ మనస్తత్వపు లోతుల్లోంచి ఒక సంక్లిష్టమైన సామాజిక సమస్యను 'బందీ' కథ మనకు తెలుపుతుంది. స్త్రీ పురుషులిద్దరూ ప్రేమించుకోడం సహజం. పెళ్ళి చేసుకోవాలను కోవడం కూడా సహజం. అందుకు కుల మతాలు అడ్డుకాకూడదు. ఈ దేశంలో కులమతాలు ప్రేమ పెళ్ళిళ్ళకు ప్రధాన అడ్డంకిగా ఎలా మారాయో 'బందీ' కథ మరోసారి కొత్త కోణంలో స్పష్టం చేస్తుంది.

ప్రేమ పెళ్ళిళ్ళు మీటింగ్ పెళ్ళిళ్ళుగా జరగడంలో గొప్ప ఏమీ లేదని సమాజం వాటి ద్వారా మారదని తల్లిదండ్రులే పిల్లలు మెచ్చిన సంబంధాలను కులాతీతంగా, మతాతీతంగా తమ చేతుల మీదుగా సాంప్రదాయ పద్ధతిలో పెళ్ళి చేయడం ద్వారానే కులాతీత, మతాతీత పెళ్ళిళ్ళు వేగవంతమవుతాయని అందరూ నిర్భయంగా ప్రేమించుకుని పెళ్ళి చేసుకుంటారని ఈ కథ ప్రతిపాదిస్తుంది. అలా సాంప్రదాయ బద్ధంగా కాళ్ళు కడిగి కన్యాదానం చేయాలని ఒక రెడ్డి కుటుంబాన్ని, ఒక దళిత కుటుంబం సమాన హోదాలో వియ్యంకులుగా స్వీకరించాలని ఈ కథలోని పాత్ర కోరితే జరిగిన పర్యవసానాలను చూడవచ్చు. కులం వదులుకోవడానికి, కులం హోదా వదులుకోవడానికి ఎంత పేదలకైనా, ఎంత అయిష్టతో ఈ కథ తెలుపుతుంది.

"నేను ఆర్డివో కాక ముందటి మాట" అన్న మాటతో ఈ కథ ప్రారంభమౌతుంది. ఉన్నత చదువు చదివి టీచర్ ఉద్యోగం చేస్తున్నప్పటికీ కులం కారణంగా ఒక టీచర్‌కి ఎదురైన అగౌరవం, పరాభవం తెల్పుతుంది. "నాకు ఆ ఊళ్ళో ఇల్లు దొరకడం కష్టం అయింది. కొన్నాళ్ళు, పొరుగూరి టీచర్ ఇంట్లో కాపురం పెట్టాను. ఊళ్ళో నాకు అద్దెకు ఇవ్వడం అనేది పెద్ద సమస్య అయిపోయింది. అందరూ సంస్కారవంతంగానే కనపడుతారు. ఒక్క గది కిరాయికిమ్మన్నా లేదంటారు. నాకులం కారణంగానే నాకు ఇల్లు కిరాయికివ్వడం లేదని స్పష్టంగా తెల్సిపోతూనే ఉంది"

"వారి పిల్లలకు నేను చదువు నేర్పాలి. బాగా చెప్తానని ప్రశంసిస్తారు. వారికి నేనంటే ఎంతో గౌరవం, కాదనను. ఆ గౌరవం దేనికి పనికొచ్చింది. నాకొక ఇల్లు కిరాయికివ్వలేక పోయాక!"[3] అంటూ ఒక దళితుడు ఉన్నత స్థితిలో కూడా కుల వివక్ష కారణంగా మానసిక వేదనకు గురవుతాడు. దాంతో మరో ఊరికి బదిలీ చేయించు కున్నాడు. తనతో స్నేహంగా ఉన్న రేణుక కూడా ఏమి సాయం చేయలేకపోయింది.

రేణుక రెడ్డి కులానికి చెందిన అమ్మాయి. కథానాయకుడితో స్నేహం పెళ్ళి



ప్రతిపాదన వరకు వచ్చింది. రెడ్డి కులానికి చెందిన అమ్మాయిని పెళ్ళాడితే తన సామాజిక స్థాయి పెరుగుతుందని కథానాయకుని ఆలోచన. కట్నం లేకుండా రేణుకకు భర్త దొరుకుతాడు. ఇరు కుటుంబాలకు ఆమోద యోగ్యంగా సంప్రదాయం ప్రకారం పెళ్ళి జరగాలంటాడు. రేణుక తల్లిదండ్రులు ఏ గుడిలోనో, యిద్దరు పెళ్ళి చేసుకొని వస్తే యిద్దరి నెత్తిమీద "అక్షింతలు చల్లి" ఉదారత చూపిస్తామంటారు. ఈ దిక్కుమాలిన పెళ్ళికి కథానాయకుడు ఒప్పుకోలేదు.

చివరకు ఎమ్మెల్యే, ఆర్డీవోలను ముఖ్య అతిథులుగా ఆహ్వానించి వారి సమక్షంలో స్టేజి మ్యారేజి చేయాలనుకుంటారు స్నేహితులు. "అసలు మనుషుల్ని మార్చలేక ఈ వలాయన వాదులెందుకో! సమాజం మారినా కుటుంబం మారడానికి సిద్ధం కావడంలేదేమిటి? మారుతున్న ఈ సమాజాన్ని మారకుండా కుటుంబం అనేది తన బందీగా మార్చేస్తుందా?"[4] అంటూ కులాన్ని పక్కన పెట్టి కులమతాలు లేవని ఉపన్యాసాలు దంచే వారిని చూస్తే రోత కలుగుతుంది. ఒక దశలో రేణుక కథానాయకుడితో లేచిపోవడానికి సిద్ధపడుతుంది. అతడు నిరాకరిస్తాడు. నీ వల్ల మొత్తం నీ రెడ్డి కులానికి ఏదో ద్రోహం చేసినట్లు నేను శత్రువును కావడం నాకిష్టం లేదని అంటాడు.

రెండేళ్ళ తరువాత కథానాయకుడు సర్వీస్ కమిషన్ నెగ్గి రెవిన్యూ డివిజనల్ ఆఫీసర్ (ఆర్.డి.ఓ.)గా ఎంపికయ్యాడు. కట్నం లేకుండా ఆర్డీవో మొగుడు దొరుకుతాడు. కాబట్టి రేణుక తల్లిదండ్రులు ఒప్పుకుంటారని భావిస్తాడు. కాని వారు సంస్కరణ వివాహం జరిపిస్తామని రాయబారం పంపిస్తారు. యిలాంటి పెళ్ళి కూడా అతనికి ఇష్టం లేదు.

కొంతకాలానికి కథానాయకుడికి విసుగెత్తి తన కులంలోని విద్యాధికురాలు మల్లికను పెళ్ళి చేసుకుంటాడు. అయినా రేణుక కథానాయకుడి ఇంటికి వస్తూ ఉంటుంది. ఇలా కథ నడుస్తూ ఉంటే 'రేణుక' అనే అమ్మాయని ఆర్డీవోగారు ఉంచుకున్నారని ప్రచారం అవుతుంది. దీన్ని భరించలేక 'రేణుక' తండ్రి ఆత్మహత్య చేసుకొంటాడు. ఇంత జరిగాక అయినా రేణుక బతుకును సరిదిద్దుమని సన్నిహితులు హెచ్చరిస్తారు. ఇలా వేళ్ళూనుకు పోయిన కుల వ్యవస్థను, కుటుంబ వ్యవస్థను, అలాగే విద్య ద్వారా దళితులు ఎదిగిన తీరును 'బందీ' కథ తెలుపుతుంది.

**సంపద, ఆధిక్యత, అధికారం ఎన్ని రూపాల్లో వుంటుందో వివరించే 'రియల్ ఎస్టేట్'**

"సోవియట్ రష్యాలో సోషలిస్టు పంథాను వదిలివేశాక, ఆ దేశం పదమూడు దేశాలుగా విడిపోయాక అమెరికా కేంద్రంగా ప్రపంచ రాజకీయాలు, సంస్కృతి, జీవన విధానాలు, ఆలోచనలు మారుతూ వస్తున్నాయి. సోషలిస్టు కుటుంబం, సోషలిస్టు సమాజం తాలూకు ఆదర్శాలు ప్రాచుర్యంలో, లేకుండా పోయాయి. తిరిగి కొత్తగా మానవీయ దృష్టితో సోషలిస్టు దృష్టిని అలవరచుకోవలసి ఉంది. ఈ ఆదర్శ దృష్టితో 'రియల్ ఎస్టేట్' కథ వచ్చింది.

'రియల్ ఎస్టేట్' కథలో పాతికేళ్ళ సోషలిస్టు ఆచరణతో, పరోపకారంతో వ్యక్తిగా కుటుంబంగా చుట్టూ వున్న సమాజంలో భాగస్వామిగా జీవించినప్పటికీ సమాజం మారకపోగా కొత్త అనుభవాలు ఎలా వచ్చాయో, కుల సమస్య ఎలా అందరినీ పట్టి పీడిస్తున్నదో తిరిగి కొత్తగా తెలుసుకొనే క్రమం మొదలైంది. ఆదర్శ సోషలిస్టు కుటుంబ నమూనాను ఈ కథలో చిత్రించడం చూడవచ్చు. అందుకే తమ్ముడు అటెండరు అయినప్పటికీ అన్నదమ్ములు వేరు పడిపోయినప్పటికీ తమ్ముడి కూతురిని చదివించి పెద్ద చేసి పెళ్ళి కూడా చేసి సొంత కూతురుగా భావించి ఇంట్లో, హృదయంలో స్థానం ఇవ్వడం అనే క్రమాలు సాధ్యమయ్యాయి. రిజర్వేషన్ల ద్వారా పైకొచ్చేవాళ్ళు తమ రక్త సంబంధీకులకు చేయూతనందించడం కనీస కర్తవ్యం. ఈ దృష్టి ఈ కథలో అంతర్లీనంగా సాగుతుంది. మార్క్సిజం నుండి ప్రారంభమైన జీవితం జీవిత సత్యాలను అనుసరించి అంబేద్కరిజాన్ని చేరుకోవడం ఒక సహజ పరిణామం. దీన్ని కథలో భాగంగా చూడవచ్చు.

ఇలా ఈ కథలన్నిటిలో పూసల్లో దారంలో విప్లవ వాదం నుండి స్త్రీవాదం మీదుగా దళిత బహుజనవాదం ఎలా సమాజ క్రమంలో విస్తరిస్తూ వస్తున్నదో గమనించవచ్చు. అందువల్ల దళిత జీవితాల ఆధునిక అభివృద్ధి పరిణామాలు, కోణాలు అన్నిటినీ ఒక కథాసంపుటంగా తెస్తున్న తెలుగు సాహిత్యంలోని మొట్టమొదటి సంపుటి ఇది." (పాలు-ఇతర కథలు రెండవ ముద్రణకు సంపాదకుల ముందుమాట)

స్వాతంత్ర్యానంతరం తొలితరం విద్యావంతుల్లో మల్లయ్య ఒకరు. కుల వృత్తులను వదిలి ఉన్నత విద్యతో ఉద్యోగం సంపాదించుకున్నాడు. చదువు, ఉద్యోగం, సంస్కారం చూసి ఎల్లమ్మను భార్యగా చేసుకొన్నాడు. సొంత ఊరిలో ఆస్థులు ఉంటే ప్రతిష్ఠ పెరుగుతుందని రెండెకరాల పొలం కొన్నాడు. తన ముగ్గురు తమ్ములను ఎదిగించాడు. చెల్లెలును చదివించాడు.

పేద వ్యవసాయ కులంలో పుట్టి కష్టపడి చదివి పై కొచ్చిన వ్యక్తి మల్లయ్య. ఆయన పట్టుదలతో ఎకనామిక్స్ లెక్చరర్ స్థాయికి ఎదిగాడు. భార్య ప్రభుత్వ ఉపాధ్యాయురాలు. మావోను అభిమానించే మల్లయ్య చైనాలో మావో ప్రవేశ పెట్టిన "పని-చదువు" షిఫ్టు పద్ధతి దారిద్ర్యానికి, అసమానతలకు పరిష్కారం అంటాడు.

మల్లయ్య - ఎల్లమ్మలు ఉద్యోగరీత్యా పట్టణాలకు మకాం మార్చారు. కిరాయి ఇంట్లో యజమానులు పెట్టే నస భరించలేక సొంత ఇల్లు కట్టుకోవాలనుకుంటారు. అలా కట్టుకున్న ఇల్లే మల్లయ్య ఇపుడు ఉంటున్నది. ఎన్నో అభిరుచులను కలబోసి ఆ కాలనీలో ఇల్లు కట్టుకున్నాడు. ఇల్లు చుట్టూ పూల మొక్కలతో ఇల్లు నందనవనంలా చేసాడు. మల్లయ్య తన పక్కప్లాటు తానే కొనవలసిన ప్లాటు మిత్రుడు రవీందర్‌కు ఇప్పించాడు. రవీందర్ ఇలా ప్లాటు కొని రేటు పెరగగానే అమ్మేస్తాడని మల్లయ్యకు తెలిసింది. దీన్ని 'రియల్ ఎస్టేట్' వ్యాపారమని, మానవ సంబంధాల్ని వ్యాపారంగా మార్చుకోవడం, కులం, మతం వర్గం, హోదాలను బట్టి రేట్లు నిర్ణయిస్తారని తెలుసుకుంటాడు.



"ప్రపంచంలో పలు విధాలైన 'రియల్ ఎస్టేట్' వ్యాపారాలు సాగుతున్నాయి. విద్య-విజ్ఞాన సంబంధి ఒకటైతే, ఆర్థిక సంబంధి మరొకటి. అధికార సంబంధి మరొకటి. మీడియా - పత్రికలు రేడియో, టి.వి. వగైరా సంబంధి వేరొకటి, క్రీడా, సినిమా సంబంధి మరొకటి. కళా సాహిత్యాల సంబంధి ఇంకొకటి."[5] అంటూ ఎన్నో రకాల "రియల్ ఎస్టేట్" వ్యాపారాలు సాగుతున్నాయని చెబుతాడు.

అదే కాలనీలో ఉంటున్న సివిల్ కాంట్రాక్టరైన అచ్యుతరావు మల్లయ్య సహాయంతో ఎదిగినవాడు. మల్లయ్య కొడుకు సందీప్ అచ్యుతరావు కూతురు సంధ్యలు మంచి జోడి అని అందరు అనుకుంటారు. వీరిరువురి మనసులో కూడా ఉంటుంది. అచ్యుతరావుకు అప్పులు ఎక్కువ అవుతాయి. దాని ప్రభావం వీరిపై పడుతుంది. అప్పుల పాలై కులం తక్కువ వాడికిచ్చి చేశారంటారని అనుకొంటాడు. మీ స్నేహానికి లేని కులం మా ప్రేమకు ఎలా ఉంటుందని సంధ్య అంటుంది. "తనది ఫలానా కులం కన్నా పై కులం అనుకోవడం కూడా తాను ఏం చేయకుండా సంపాదించాలనుకునే సోమరి పోతులకు ఒక "రియల్ ఎస్టేట్ వ్యాపారమే"[6] అంటాడు.

కాలనీలో జరిగిన మరో సంఘటన అతని ఆలోచనల్లో మార్పు తెస్తుంది. వర్గ దృక్పథం అసమగ్రమైందని కుల కోణం ఎంతో అవసరమని గుర్తించాల్సి వస్తుంది. తన కూతురు పావని ఇంటర్లో ఉన్నప్పుడు సునీత ఇంటికెళ్ళి చదువుకుని సాయంత్రం తిరిగి వస్తుండగా ఒక బేవార్సుగాడు జడలాగాడు. ఆమె చెప్పుతో కొట్టింది. మల్లయ్య కొడుకులు వాడిపై రేప్ చేసే ప్రయత్నం చేశాడని కేసు నమోదు చేయించారు. దీంతో కులం తక్కువోల్లకు సిగ్గులేదని అవతలి పక్షంవాళ్ళు విమర్శించారు. మల్లయ్య ఆదర్శాలు - విశాల ప్రపంచం సోషలిస్టు సమాజం అన్ని వట్టిమాటలయ్యాయి. మల్లయ్య కాలనీలో ఒంటరివాడయ్యాడు. ఈ కారణంగా ఇల్లు అమ్మి వేరేచోట ఇల్లు కట్టుకోవాలనుకుంటాడు. కాని పాత ఇల్లును అమ్మితే ప్లాటు ధరకు సరిపోవడం లేదని, ఖాళీ ప్లాటుకు ఉండే ధర ఇల్లుకు లేదని తెలుసుకుంటాడు.

ఈ అనుభవాలతో అర్థశాస్త్రంలో కులం నిర్వహించే పాత్రను మరిచిపోయిన తాను జీవిత అనుభవాల ద్వారా జీవితసత్యాలపై కొత్త కోణాలతో ఆలోచించి, తన అనుభవాల ద్వారా తెలుసుకుంటాడు. "అర్థశాస్త్రంలో కులం నిర్వహించే పాత్రను తెలుసుకోలేదు. కనుకనే వర్గ దృక్పథంతో ఎంతో మందిని ఆర్గనైజ్ చేస్తున్న కమ్యూనిస్టులు ప్రజల మధ్య కుల, మతాల అంతరాలు పోగొట్టలేకపోయారు. అగ్రకులాల వారి మధ్య తరగతి సంస్కృతే అందరి సంస్కృతిగా భావించారు. ఇన్నాళ్ళు తాను కోల్పోయిందేమిటో తెల్సుకున్నాక "వర్గ దృక్పథం పేరిట తాను కొనసాగించిన స్నేహం, ప్రేమ సంస్కృతి, మర్యాద త్యాగం, ఉద్యమాల నిర్మాణం అంతా కొత్త రూపంలో కొనసాగుతున్న శ్రామికుల వెట్టిచాకిరియే"[7] అంటూ పాలించే అధికారం శ్రామిక కులాలకు ఎందుకు రాలేకపోయిందో ఈ కథలో తెల్పుతాడు.

## నిజమైన సదువు అంటే ఏమిటో విప్పి చెప్పిన కథ 'సదువు'

"సదువు" కథలో ఎల్లయ్య బూదవ్వల కొడుకు గంగాధరి. ఆ ఊరి స్కూల్ టీచర్ లచ్చయ్యకు గంగాధరి అంటే ఎంతో అభిమానం అందుకే అతని పేరు స్కూల్ రికార్డుల్లో గంగయ్యగా ఉంటే గంగాధరిగా మార్చాడు. గంగాధరికి ఆరోగ్యం బాగుండదు. బడికి అప్పుడప్పుడు పోలేకపోతాడు. పోషకాహారంలేదు. పేదరికం. దాంతో అతనికి చదువు అన్నా, కులవృత్తులన్నా ఇష్టం లేదు. తల్లిదండ్రులు చదువుకోమని ఎంత చెప్పినా గంగాధరి మేకలతో చెట్లు, చేమలు కొండలు తిరుగుతూ ప్రకృతి ఒడిలో ఆనందంగా గడిపేవాడు. చదువుకోవాలని తండ్రి పెట్టిన బాధ భరించలేక పారిపోతాడు.

లచ్చయ్యసారు గంగాధరి గురించి ఆలోచిస్తూ, పాఠ్యపుస్తకాలు అగ్రకుల మధ్యతరగతి వారికి అనువుగా వున్నాయని, పల్లెటూరు దళితులకు అనుకూలంగా లేక వారికేమాత్రం చదువు పట్ల ఆసక్తి లేకుండా చేస్తున్నాయని అనుకుంటాడు. గతంలో తన అన్న నర్సన్న కూడా గంగాధరి లాగే చేసేవాడని గుర్తు చేసుకుంటాడు. తల్లిదండ్రులు "బడికిపో" అని తొడపాశం పెట్టడం, దూలానికి వేలాడదీయడం, తిండి పెట్టకపోవడం లాంటి హింసలు పెట్టినందున అవి భరించలేక ఇంట్లోంచి పారిపోతాడు. ఎక్కడెక్కడో తిరిగి చివరకు ఇంటికొస్తే పెళ్ళి చేస్తారు. కాని కొన్నాళ్ళకు మళ్ళీ భార్యనొదిలి వెళ్తాడు. చివరగా ఎక్కడెక్కడో కనబడ్డాడని పండరీపురం, షిరిడిసాయి ప్రాంతంలో కనబడ్డాడని అనుకుంటారు. ఆ తర్వాత అతని గూర్చి కొంతకాలం మర్చిపోతారు. స్వేచ్ఛను కోరుకునే నర్సన్న జీవితం అలా ముగిసిందని లచ్చయ్యసారు చాలా కాలం గుర్తుచేసుకుంటూ కాలం గడుపుతాడు. "విశ్వకవి రవీంద్రుడు పద్నాలుగేళ్ళదాకా చదువనేది లేకుండా స్వేచ్ఛగా తిరిగాడు. చదువు గురించి ఒత్తిడి లేనందువల్లే ఠాగూరు విశ్వకవి అయ్యాడేమో అందుకే ఆయన స్వేచ్ఛాయుత విద్య కోసం శాంతినికేతన్ స్థాపించాడేమో"[8] అని అభిప్రాయపడ్డాడు.

నర్సన్న గురించి ఆలోచిస్తూ స్కూల్‌కు ఆలస్యమైందని లచ్చయ్య సారు సెలవుచీటి పంపి లక్ష్యరహితంగా చేన్లవైపు నడిచి అక్కడ అందమైన తోటలు, పొలాలు, వివిధ రకాల పూలచెట్లని చూస్తూ కాల్వ గట్టున మేకలు మేపుతున్న గంగాధరిని గమనించాడు. ఈ ప్రకృతి ఏకాంతంలో ఇంత ఆనందం ఉందని, అది గంగాధరి అనుభవించడాన్ని చూస్తాడు. ఈ విషయాన్ని ఓ పెళ్ళిలో బి.ఇడి. కాలేజీ లెక్చరర్ మిత్రుడు లక్ష్మయ్యతో చర్చకు తెస్తాడు. లక్ష్మయ్య "ఉన్నమాట చెప్పాలంటే నేటి పాఠశాల విద్యావ్యవస్థ పిల్లల సృజనాత్మకతకు, స్వేచ్ఛకు వారి ఇష్టాలకు తగు ప్రాధాన్యం ఇవ్వడం లేదు. స్వీయ వ్యక్తీకరణ శక్తిని అణిచివేసి వారిని రిలేకేంద్రాలుగా మారుస్తోంది. వారిని ఒక టేప్ రికార్డరులా, ఒక రేడియో, టివి రిలే కేంద్రంలా మార్చుతున్నాం"[9] అంటూ విద్యావ్యవస్థలోని లోటుపాట్లు తెలుపుతాడు.

లచ్చయ్య సారు మరో ఊరు బదిలి కావడంతో గంగాధరి అతని వెంట వెళ్ళి చాలా పనుల్లో అనుభవం సంపాదిస్తాడు. చివరకు కర్రకోత మిషన్‌లో పనికి కుదుర్తాడు.



ఆ సమయంలో గంగాధరికి అచల తత్వగురువు పూర్ణానందస్వామి (పాతపేరు రాజయ్య)తో పరిచయం ఏర్పడుతుంది. అతన్ని గురువుగా స్వీకరించి భవబంధాలు, మాయ, మొదలైన ఎన్నో ప్రశ్నలు వేసి సందేహాలు నివృత్తి చేసుకొని చివరగా మంచితనమే మిగులుతుందని గ్రహించి గురుబోధను స్వీకరిస్తాడు. అతనివెంట తత్త్వగీతాలు పాడుతూ తిరుగుతాడు. గంగాధరికి ఇంకా అనేక ఆశ్రమాలు, మఠాలు దర్శించాలనే కోరికతో గురువు వద్ద సెలవు తీసుకొని అనేక భాషలను, కబీరు, గురు రవిదాసు దోహాలు నేర్చుకుంటాడు. ఒక ఆశ్రమంలో పరిచయమైన రత్నను ఆరాధించి ఆమె దగ్గర కూడా సెలవు తీసుకొని ఊరూరా పాటలు పాడుతూ తిరుగుతాడు.

ఒకసారి నక్సలైట్లతో, ఒకసారి పోలీసులతో తన్నులు తింటాడు. మరో ఊళ్లో మరోదళం ఎదురై ఆ దళంలోని సుధాకర్ గుర్తు పట్టి ఊరి విషయాన్ని, తల్లిదండ్రుల గురించి గంగాధరికి చెబుతాడు. ఒంటరి జీవితం కన్న పదిమందితో కలిసి ప్రజలతో, ప్రజలకోసం తనలా ఏమైనా చేయిమంటాడు. నీవు చేసే విప్లవం ప్రజల కోసమేనా? అని ప్రశ్నిస్తాడు గంగాధరి. విప్లవమనే నీ కోరికను ప్రజలపై రుద్ది తన కోరికను ప్రజల కోరికగా మార్చి చెబుతున్నారని, మనకంటూ కోరికలు లేనపుడు మాత్రమే ఇతరులకు స్వచ్ఛంగా పనిచేయడం సాధ్యమవుతుందని జీవితంలోంచి వచ్చిన అనుభవాలను తాత్వికతతో గంగాధరి చెబుతాడు. వారితో చర్చిస్తాడు. వారి దగ్గర వీడ్కోలు తీసుకొని తొలిగురువు వెతుకులాటలో పడ్తాడు.

అలా ఊళ్లు తిరుగుతూ గురువు జాడలు వెతుక్కుంటుండగా, శిష్యులు నిర్మించిన ఆశ్రమంలో గురువు పూర్ణానందస్వామి కనిపిస్తాడు. ఆ సమయంలో ప్రశాంత వాతావరణంలో గురువుతో అనేక సందేహాలు వెలిబుచ్చుతాడు. మన మనస్సే అన్నిటికి మూలం అని సంసారం, సన్యాసం భవబంధాల గురించి చాలా విషయాలు గురువు నుంచి తెలుసుకుంటాడు. గంగాధరి రత్నను, తల్లి బూదవ్వను ఆశ్రమంలోనికి తీసుకొస్తాడు. ఆశ్రమం చక్కగా నడుస్తుంది.

ఒకరోజు కార్తీక పౌర్ణమి సందర్భంలో శిష్యులతో గురువు స్వేచ్ఛ, కరుణ, ప్రేమ గురించిన విషయాలు బోధిస్తుంటాడు. శిష్యులు కార్తీక పౌర్ణమి సందేశం ఇవ్వమంటారు. ఒక శిష్యుడు "బ్రహ్మజ్ఞానం పొందిన వారే బ్రాహ్మణులు" అనే మాటేమిటని ప్రశ్నిస్తాడు. "బ్రహ్మజ్ఞానం పొందిన వాళ్ళే శూద్రులు, చిల్లర జాతులు. ఈ ప్రకృతిలో లీనమయ్యే ఏవృత్తి చేయని బ్రాహ్మణజాతికి బ్రహ్మజ్ఞానం, బ్రహ్మానందం లభించడం ఎలా సాధ్యం? వారు ఇది నాది, నాకులం, నాకులం గొప్ప, నాజన్మ గొప్ప అనే భావాన్నే జయించలేక పోయారు. ఈ భేషజాలకు బ్రహ్మజ్ఞానం, బ్రహ్మానందం ఆమడదూరం ఉంటుంది"[10] అంటూ సంపదను సృష్టించే వారే బ్రహ్మజ్ఞానం పొందగలరని గురువు అంటాడు.

గంగాధరి గురువుతో తోటివారి చర్చల కారణంగా ఆసక్తి, అభిరుచి విద్యార్థుల్లో కలిగేలా "సహజ విద్యా విధానం" ద్వారా బోధించేలా ఒక విద్యా పరిశోధనా కేంద్రం నెలకొల్పుతాడు. లచ్చయ్య, యూనివర్సిటీ ప్రొఫెసర్ లక్ష్మయ్యల సహకారంతో ఆశ్రమంలో

విద్యపై వారం రోజుల సెమినార్ నిర్వహిస్తారు. అనేక విషయాలపై చర్చిస్తారు. నలభై ఎకరాల బీడుకొని దాని చుట్టూ కంచెవేసి పనిపాటలు కలిసిన ఆశ్రమ విద్యా విధానంతో విద్యార్థులకు ఆనంద దృక్పథం కలిగేలా చేస్తాడు. చివరి రోజు రాత్రి గంగాధరి అర్ధరాత్రి కన్నుమూస్తాడు. "ప్రపంచానికి వెలుగునివ్వాల్సిన వాడు వెళ్ళిపోయాడని గురువు కన్నీరు పెట్టుకున్నాడు. కొద్ది రోజులకు గురువు కూడా చనిపోతాడు. కొన్ని రోజులు ఆశ్రమ పాఠశాల నడిపించిన రత్న, లక్ష్మయ్య, లచ్చయ్యల సహకారాన్ని కోరుతుంది. కాని వారు తమ ఉద్యోగాలు వదిలివేయడానికి నిరాకరించారు. ఆదర్శాలు వేరు, ఆచరించటం వేరని రత్నకు అర్థమవుతుంది. కొన్నాళ్ళకు ఆశ్రమం పాడుబడి మూతబడిపోయింది.

ఈ కథలో నేటి విద్యావ్యవస్థలోని లోటుపాట్లు, దళితులను, పల్లెటూర్లో చదువుతున్న ఇతర విద్యార్థులను నేటి విద్య ఎంతటి హింసలకు గురి చేస్తుందో స్వేచ్ఛాయుత సహజ విద్యావిధానం ఎంత అవసరమో తెలుపుతుంది. మనిషిలోని స్వార్థం మాయమోసాల ద్వారా సిద్ధాంతాలు, కోరికలు ప్రజలపై ఎలా రుద్దబడుతున్నాయో, తాత్విక స్పర్శనద్ది తెలియజేశాడు రచయిత. కులవృత్తి వదిలి స్వేచ్ఛాయుత జీవనం కోసం తపించిన గంగాధరి బుడ్డగోచి నుండి అచలతత్వ గురువుగా ఎదగడం "సదువు" కథలో గొప్ప ఆదర్శాన్ని తెలుపుతుంది.

**సమాజంలో వస్తున్న మార్పులను విప్పి చెప్పిన కథ 'మార్పు'**

ఆధునిక విద్య అందుకోవడం అందరికీ సాధ్యం కావడం లేదు. మధ్య తరగతిగా ఎదిగిన వాళ్ళకు కూడా వారిపిల్లలను చదివించడం కష్టమైపోతున్నది. విద్యను ప్రైవేటీకరించడం ఇందుకు కారణం. ప్రభుత్వం తన బాధ్యతలు వదిలేసి పేదలను గాలికి విసిరేసింది. వేలకు వేలు పోసి రెసిడెన్షియల్ కాలేజీల్లో చదివించలేని అశక్తత మధ్య తరగతి జీవులది. తమకు అందిన ఈ కాస్త జీవితమైనా తమ పిల్లలకు అందకపోతే ఎలా అని ఉపాధ్యాయులు బాధపడుతున్నారు. దీనికి తోడు ఇది అశాస్త్రీయ విద్యా విధానం అని కొందరు చెబుతుంటే కోపం నసాలానికి ఎక్కుతుంది. ఇది అశాస్త్రీయ విద్యా విధానం అనే వారిని చెప్పుతో కొట్టాలని ఒక తండ్రి వాపోతాడు. ఇలా పోటీ చదువుల పట్ల, కొడుకుల పట్ల తల్లిదండ్రుల ఆవేదనతోపాటు, ఆధునిక విద్యను అందుకోలేకపోతే ఆధునిక అభివృద్ధి అందుకోలేమనే బాధను 'మార్పు' కథ తెలుపుతుంది.

రాములు కొడుకు శేఖర్, ఎంసెట్ చదవడం లేదని బాధతో కొట్టి తను ఎదిగిన తీరును చెబుతాడు. కొడుకుకు ఎం.సెట్ పరీక్షల్లో పాసై చదవాలని ఉండదు. పి.జి. చేయాలని వుంటుంది. సాదా డిగ్రీలకు విలువలేదని కంప్యూటర్ ఇంజనీర్ చదవాలని తల్లిదండ్రుల ఒత్తిడి. తాము ఎంత కష్టపడి పైకొచ్చారో చెబితే కొడుకులు బుద్ధికొస్తారని తల్లిదండ్రుల ఆశ.

అలా ఒకతండ్రి "అప్పుడు ఇన్ని గడియారలెక్కడివి? ఇంటి ముంగటున్న తుమ్మచెట్టు నీడను బట్టి టైమెంతైందో తెల్సుకొని బడికి ఉరికెటోన్ని. నా నీడను కొల్సుకొని టైం





తెల్సుకొనేటోన్ని. తుమ్మచెట్టు కింద పాత తుమ్మ మొద్దు మీద పాత చీర పరుచుకొని చదువుకుంటే అదేఫ్యాను. అదే స్వర్గం అనుకునేవాన్ని"[11] అంటూ ఆనాడు తనకు. ఏ సౌకర్యాలు లేకున్నా పేదరికంను ఎదుర్కొని, సామాజిక అసమానతను దాటి తాను ఎదిగిన తీరును తెలుపుతూ కొడుకు శేఖర్‌కు ఆనాటి సమస్యలు లేవు. ఆధునిక సౌకర్యాలు కల్పిస్తున్నా డబ్బు, మార్గదర్శనం ఉన్నా ఎందుకు చదవలేక పోతున్నాడని బాధపడతాడు. ఎన్నో ఏండ్ల బానిసత్వం నుండి దళితులు ఈ జీవితాన్ని గెలుచుకున్నారని, తన కొడుకుకు రాములు చెబుతాడు.

రాములు తన చిన్ననాటి స్నేహితుడు టీచర్ రాజయ్య దగ్గర తన గోడు వెళ్ళబోసుకుంటాడు. రాజయ్య రాములుతో ఈ చదువులు అశాస్త్రీయమైనవి అని, బలవంతపు చదువులని మెట్ట వేదాంతం చెబుతాడు. దానికి రాములు అగ్రకులాలకు ఉద్యోగం అదనపు సంపాదనగా ఉంటుందని, మనలాంటి వాళ్ళే చదువు ఉద్యోగంతోనే అభివృద్ధిని అందుకోగలమని అభిప్రాయం వ్యక్తం చేస్తాడు. రాజయ్య భార్య లలిత రాములుకు వంత పాడుతుంది. దానికి "లలితా! ఇది అశాస్త్రీయ విద్యా విధానం అనే వాళ్ళను అసలు నమ్మవద్దు. వాళ్ళు దొంగలు, వాళ్ళు బాగా చదువుకొని మిగతావాళ్ళకు ఈ చదువు అక్కరలేదని మెట్టవేదాంతం చెప్తారు. వాళ్ళను చెప్పుతో కొట్టాలె"[12] అంటూ ఆధునిక సైన్స్, టెక్నాలజీ, అభివృద్ధి అంతా ఆధునిక విద్య అందుకుంటేనే సాధ్యమని కుండ బద్దలు కొట్టినట్లు చెబుతాడు.

దానికి రాజయ్య ఈ పోటీ ప్రపంచంలో పోటీయే ముఖ్యం, పోటీపడి గెలువక పోతే ఎక్కడా ఏది దొరకదని అయితే అది ఎంసెట్ కానక్కర్లేదని "నా ఉద్దేశం ఏంటంటే ఎంసెట్‌లో సీటు రాకపోయినా మునిగిపోయేదేమీ లేదు. డిగ్రీ చదువుకొని అయ్యేయస్‌లు, అయిపియస్‌లు కావడం లేదా! పబ్లిక్ సర్వీస్ కమీషన్ పెట్టే గ్రూపు వన్, గ్రూపు టు పరీక్షలు పాసై పెద్ద ఉద్యోగాలు సంపాయించడం లేదా?..."[13] అంటూ ఎంసెట్ రాకపోతే పిల్లలని మానసికంగా హింసించడం, చదివిందే పదిసార్లు చదవడం వల్ల వారికి ఎంసెట్‌ను భూతంలాగా తయారు చేయడం తప్ప ఏమీలేదని రాములును సముదాయిస్తాడు.

ఇంకా ముప్పై, నలభైవేలు పెట్టి మనలాంటి వాళ్ళు నెల్లూరు, గుంటూరు, హైదరాబాద్‌కు పంపించి ఎంసెట్ లాంగ్‌టర్మ్ ఇప్పించగలమా? ఇలాంటి వాళ్ళతో కూలిపని చేసుకుంటూ గుడిసెలో గుడ్డిదీపం వెలుతురులో చదివే విద్యార్థి పోటీపడగలడా? అసలు ఇది పోటీయేనా! అని అంటాడు. అలా అని నా కొడుకును ఎంసెట్ కోచింగ్‌కు పంపలేమని మనలాంటి వాళ్లకు పట్టుదలే పెట్టుబడిగా ఉండాలని రాములు చెబుతాడు.

శేఖర్ ఎమ్మెస్సీ చేసి లెక్చరర్ అవుతానని లేకపోతే రచయితను అవుతానని ఛాలెంజ్ చేశాడని, వాళ్ళ ప్రతిభ పట్టుదల ఉత్సాహం ఆసక్తి ఎటువైపు ఉంటే అటు ప్రోత్సహించాలని రాములుకు చెబుతాడు.

తెలంగాణ నేల మీద జరుగుతున్న నక్సలైట్ ఉద్యమ సమస్యల్ని ప్రత్యక్షంగా, పరోక్షంగా, నేపథ్యంగా చిత్రించి మనిషిని, మానవత్వాన్ని ఎలా రక్షించుకోవాలో తెలియజేస్తూ, ఆలోచింప జేస్తాయి వీరి బహుజన ప్రేమకథలు

**ఉద్యమంలో పాల్గొనే స్త్రీ పురుషుల దృక్పథాల్లో వుండే తేడాను తెలిపే కథ 'వైరుధ్యాలు'**

'వైరుధ్యాలు' కథలో జైలు నుంచి వచ్చిన భూమయ్య తిరిగి ఉద్యమంలోకి వెళ్ళాలను కుంటాడు. వీలైతే భార్య సుశీలను కూడా ఒప్పించి ఉద్యమంలోకి తీసుకుపోవాలను కుంటాడు. వేసవి కాలం వెన్నెల రాత్రి భార్యాభర్తల మధ్య సంభాషణ నడుస్తుంది. భూమయ్య భార్య సుశీల కుటుంబపరంగా ఆలోచిస్తే, భూమయ్య రేపటి సమాజ పరంగా ఆలోచిస్తాడు. భూమయ్య భార్యను తనతోపాటు ఉద్యమంలోకి రమ్మంటాడు. "నాకు సాతగాదు. ఈ పసిపోరగాల్లను యిడ్సిపెట్టి ఎటనివస్తరు? ఎట్లనివస్తరు? అయినా నువ్వెటుపోతే అటు నేనెందుకు రావాలె అసలు... నీతో సంసారం చెయ్యకపోతే ఎవరితోటన్న అనిపియ్యి, సన్నాసుల తీర్గ తిరుగుదామంటే కుదురుతదా? కుటుంబాన్ని వదిలేయనవసరం లేదని, జనంలో కలిసి, జనంలో జీవిస్తూ వాళ్ళను విప్లవంవైపు నడిపించవచ్చని, అందుకు ఉద్యమ నిర్మాణాన్ని సవరించాలని సుశీల కోరుతుంది.

భూమయ్య ఉద్యోగాన్ని, కుటుంబాన్ని వదిలి రేపటి సమాజం కోసం ఉద్యమించాలని అంటాడు. "రేపటికి రూపంలేదట, రేపటి యాల్లను ఎవలు జూడనోయిన్రు. యిగురం చెప్పు యారవ్వా అంటే, వీన్నిడిసి యింకోన్ని పట్టు అన్నట్టున్నది నీయవారం. యింకోన్ని పట్టే వాడేదో సక్కనోడైతడన్నట్టు". రేపటికి రూపం లేదంటవు. మరి నువ్వు మన యింటికాడ వేపచెట్టు. రాగిచెట్టు పెట్టి కంపనాటితివి. ఎందుకే? అవి పెరిగి నీకే నీడనిస్తయని నమ్మే పెట్టినావే?"[2] అంటూ భార్యా, భర్తల మధ్య ఉద్యమంలోకి వెళ్ళడం వల్ల కుటుంబంలో జరిగే ఘర్షణను తెలియజేస్తుంది.

భూమయ్య ఇంట్లో ఉంటే ఏపనైనా చేసి కుటుంబాన్ని పోషిస్తానన్న భార్యకు నచ్చచెప్పలేక సమాజాన్ని మార్చడానికి ఇంట్లో చెప్పకుండా వెళ్ళాలనుకుంటాడు. ఇంటిని బాగుచేసుకోలేని వాళ్ళు సమాజాన్ని ఏం బాగు చేస్తారని, ఉద్యమాల పేరుతో గొర్రె దాటుడు కార్యక్రమం ఎలా కొనసాగుతుందో, ఉద్యమం వల్ల ఆ కుటుంబాలు ఎంత ప్రతిఫలం చెల్లించాల్సి వస్తుందో వైరుధ్యాలు కథ తెలుపుతుంది.

**వెలకట్టలేని త్యాగాలను సైతం గుర్తించలేని త్యాగమూర్తుల చరిత్రను రికార్డు చేసిన కథ 'ఇల్లాలు'**

'వైరుధ్యాలు' కథకు కొనసాగింపే 'ఇల్లాలు' కథ. కుటుంబాన్ని వదిలి ఉద్యమంలోకి వెళ్ళాలనుకుంటాడు భూమయ్య. అలా వెళ్ళాక ఆయన భార్య, కుటుంబం పడిన వేదన,



కష్టాలను 'ఇల్లాలు' కథ తెలియజేస్తుంది.

ఉద్యమంలోకి వెళ్ళిపోయిన భర్తను తలుచుకుంటూ అష్టకష్టాలు పడి పిల్లల్ని కాపాడుకుంటూ జీవితాన్ని వెళ్ళదీస్తుంది ఇల్లాలు. ఆమెకంటూ సొంతపేరు లేకుండా చేసింది సమాజం. ఉద్యమంలో ఉన్న భర్త ఎక్కడ ఏమి చేసినా పోలీసులు ఇల్లాలును, గుడిసెను ఎన్నిసార్లు నాశనం చేశారో తెలియదు. అయినా భర్తనే తలుచుకుంటూ చావలేక, బ్రతకలేక, భర్త వదిలిన కుటుంబ బాధ్యతలను మోస్తుంది. "అలా ఆమె ఒకరి కూతురుగా, ఒకరి భార్యగా, ఒకరి కన్నతల్లిగానో తప్ప ఈ పితృస్వామిక భాష ఆమెకంటూ ఒక సొంతపేరు లేకుండా చేసింది. అసలు అలాంటి భావాలుంటే కదా భాష ఉండటానికి! తనది కాని జీవితం కోసం ఆమె పుట్టింది పెరిగింది. తనది కాని జీవితంగానే తనువు చాలించింది. సమాజం ఆమె నుండి కోరే త్యాగాలే తప్ప హక్కులు లేని సామాజిక జీవితం ఆమెది. అన్ని పరిస్థితుల్లో కరిగిపోయే త్యాగశీలి ఆమె. కుటుంబాన్ని పోషిస్తూ సమాజం కోసం ఆమె చేసిన త్యాగాల చరిత్ర యిది"[3]

సమాజం ఆమె నుండి త్యాగాలే తప్ప హక్కులు లేని సామాజిక జీవితం కోరింది. అన్ని పరిస్థితుల్లోనూ త్యాగాలు చేసిన చరిత్ర ఆమెది. ఉద్యమ చరిత్రకంటె దాని వెనుక ఉన్న ఎన్నో కుటుంబాలు చేసిన త్యాగమే నిజమైన చరిత్ర. ఉద్యమంలోకి పోయిన వాళ్ళ త్యాగాలనే గుర్తించి వాళ్ళకు ప్రాధాన్యతనిస్తూ వచ్చిన సాహిత్యం కాని, ఉద్యమం కాని, స్త్రీలు పడిన కష్టాలను వాళ్ళనుభవించిన రాజ్యహింసను గుర్తించలేకపోయాయి. ఇలా ఉద్యమం తాలూకు విషాద ఘట్టాలు, ఉద్యమం వల్ల అణగారిన కుటుంబాల జీవితాన్ని యిల్లాలు కథ తెలియజేస్తుంది.

**తల్లి గారిల్లే కదా అనుకొని అగ్నిగుండంలో పడి బూడిద అయిన పార్వతి వంటిదే విప్లవ ఉద్యమం అని చెప్పిన కథ 'దక్షయజ్ఞం'**

ఈ కథకు 'దక్షయజ్ఞం' అనే పేరు పెట్టడంలో రచయితకు గల ప్రాచీన సాహిత్య ప్రవేశం స్పష్టమవుతుంది. పార్వతి దక్షప్రజాపతి కూతురు. తండ్రి యిష్టానికి వ్యతిరేకంగా శివుడిని పెళ్ళి చేసుకుంటుంది. దక్షుడు ఒక యజ్ఞం చేస్తాడు. అందరినీ పిలుస్తాడు. కూతుర్ని, అల్లుణ్ణి పిలవడు. పార్వతి శివుణ్ణి కూడా తన వెంట రమ్మని కోరుతుంది. శివుడు పిలవని పేరంటానికి ఎవరూ పోవద్దని చెపుతాడు. తన కన్న తల్లిదండ్రులింటికి తాను పోవడానికి ఆహ్వానం అవసరం లేదని బయల్దేరుతుంది. అక్కడ తండ్రి అవమానిస్తాడు. ఇటు భర్తను కాదని బయల్దేరిన పార్వతి ఆ అగ్నిగుండంలోనే పడి బూడిదైపోతుంది. అప్పుడు శివుడు తన ప్రమథ గణాలతో దండెత్తి దక్షుడ్ని సంహరిస్తాడు. మొత్తం యజ్ఞం నాశనమైపోతుంది. ఇరు పక్షాలు బూడిదైపోతాయి. విప్లవోద్యమంలో కూడా ఇలాగే జరుగుతున్నదని అందువల్ల ఈ కథకు 'దక్షయజ్ఞం' అని పేరు పెట్టడం జరిగింది. విప్లవోద్యమం అంతా దక్షయజ్ఞంగా మారిపోయిందని ఈ కథ తెలుపుతుంది. విప్లవోద్యమంలోని అనేక చీకటి కోణాలను ఈ కథ జీవితానుభవాల సాక్షిగా మన ముందుంచుతుంది.

భారతీయ కథా సాహిత్యంలో ఒక గొప్ప కథ 'దక్షయజ్ఞం'. తెలంగాణా పల్లెల్లో ఇరవై అయిదేళ్ళుగా జరుగుతున్న విప్లవ ఉద్యమాల స్వరూప స్వభావాలను నగ్నంగా చూపిస్తుంది 'దక్షయజ్ఞం'. ఉద్యమంలోని అనేక సామాజికాంశాల్ని చర్చిస్తుంది. దాంతోపాటు కోస్తా ఆంధ్ర పెట్టుబడిదారులు తెలంగాణాను కబళించి వేస్తూ విస్తరించిన విధానాన్ని తెలుపుతూ ఆంధ్రవలస వాదుల వల్లనే నక్సలైట్ల ఉద్యమం పుట్టుకొచ్చిందని స్పష్టం చేస్తుంది. సామాజిక ఆర్థిక వ్యత్యాసాలు, దోపిడీ రాజ్యం వేసే ఉక్కు పాదం, ఉద్యమాల్లో సైతం విస్తరించిన అగ్రకులతత్త్వం, కుహనా విప్లవకారుల డాంబికం, ప్రజా జీవితంలోకి వచ్చిన మాజీనక్సలైట్లు అడుగడుక్కు చేసే బతుకుపోరు మొదలైన అంశాలను తెలియజేస్తుంది. సమాజంలో రెండు వర్గాలున్నట్లే విప్లవోద్యమంలోనూ రెండు వర్గాలున్నట్లు తెలుస్తుంది. కొంతకాలం ఉద్యమంలో పనిచేసి వచ్చి తమ జీవితాలను అర్పించిన వారు అదే ఉద్యమాన్ని ఎందుకు విభేదిస్తున్నారో వాళ్ళ ఆవేదనను పెంటయ్య పాత్ర ద్వారా రచయిత చిత్రించాడు.

'దక్షయజ్ఞం' కథలో నాయకుడు పెంటయ్య. పెంటయ్యను పోలీసులు జైల్లో పెట్టిన తర్వాత రెండు సంవత్సరాల మూడు నెలలకు కేసు విచారణకు వస్తుంది. కోర్టులో మెజిస్ట్రేట్ ముందు పెంటయ్య తన జీవితాన్ని పెనవేసుకున్న గత చరిత్రను తెలియజేస్తాడు. కుటుంబంలోని పరిస్థితుల వల్ల ప్రభాకర్ స్ఫూర్తితో ఉద్యమంలోకి వెళ్ళి నాలుగేండ్లు చురుగ్గా పని చేస్తాడు. ఉద్యమంలో అగ్రకులాల నాయకత్వం కింద దళితులు ఎందుకు ఎదగలేకపోతున్నారో చెబుతాడు. "ఏ అధికారాన్ని ఎన్నికల్ని గుర్తించ నిరాకరించామో వాటి ద్వారానే నిర్బంధాలకు గురయ్యాం... జీవితాల్ని ఓడిపోయే వ్యూహం ఎత్తుగడలకు నాంది అక్కడే పడింది.... అది సమర్థుల్ని అసమర్థుల్ని చేసింది. తాను సృష్టించుకున్న నిర్బంధాలకు తానే భయపడేట్టు చేసింది"[4] అంటూ శాసనాధికారం, చట్టబద్ధతను నిరాకరించి నిత్య నిర్బంధాలకు లోనయిన తీరును దక్షయజ్ఞం కథ తెలుపుతుంది.

పెంటయ్య ఆ క్రమంలో గత చరిత్రను మన ముందు ఉంచుతాడు. "బహుశా వంద యాభయి రెండు వందల ఏళ్ళ క్రితం ఈ కరీంనగర్ జిల్లాకు అటువైపు కరువుల వల్ల కొందరు పొట్ట చేత పట్టుకొని బతకడానికి వచ్చారు. అవి కాటన్ దొర ప్రాజెక్టులు కట్టడానికి ముందే వచ్చిన కరువులై వుంటాయి. మా ముత్తాత చెప్పేవాడు... ఆ వచ్చిన వాళ్ళు బుడ్డగోచితో మూటెడు సామానైనా లేకుండా వచ్చారని. అలా ఒకర్ని చూసి ఒకరు వారి బంధువుల వలస సాగేది"[5] అంటూ వలస వచ్చిన వారు జమీందార్లుగా, భూస్వాములుగా, దోపిడీదార్లుగా ఎలా ఎదిగారో, తెలంగాణా భూస్వామ్య సమాజం దాని పుట్టుపూర్వోత్తరాలను తెలుపుతూ తర్వాత కాలంలో సమాజంలో భూసంబంధాలు, మానవ సంబంధాలు మారిన క్రమం తెలుసుకోవచ్చు.

కథానాయకుడు పెంటయ్య విప్లవోద్యమంలో చురుగ్గా పాల్గొంటే అతని జాడ కోసం పోలీసులు భార్యా పిల్లలను హింసించి, చెల్లెలు మాలక్ష్మిపై అత్యాచారం చేస్తారు. తనకోసం కుటుంబం రాజ్యహింసను ఎదుర్కొనడం అతన్ని ఆలోచింపజేస్తుంది. "మాకు



యింత అన్నంపెట్టిన కర్మానికి మేం పోయినాక పోలీసులు యిల్లును, ఆడోల్లను అగమాగం చేసేవాల్లు. మొగోల్లు చెట్లు గుట్టలు పట్టుకొని ఉరుకుదురు. ఆడోల్లు, పసిపిల్లలు, ముసలోల్లు, గొడ్డుగోద ఎటు ఉరుకాలె సార్. విప్లవం కోసం యివన్నీ భరించాలె అని ఊరడించిన మా ప్రేమలో ఎంత క్రూరత్వం ఉంది సార్. ఏదో మంచి పని చేస్తున్నారని ఆదరించినందుకు సిద్ధాంతం, విప్లవ వ్యూహం తెలియని వాల్లంతా ఇన్ని హింసలకు గురి కావాలనుకోవడం ఎంత క్రూరత్వం సార్. వాల్లను అడిగి విప్లవ వ్యూహం రూపొందించుకున్నామా, ఏదో పెద్ద అన్నలు చెప్తే అదే నిజమని నమ్మితిమి. జనమూ నమ్మిరి.. .మేం లేకి కులంలో పేదరికంలో పుట్టినందుకు మాకు శీలం ఉండదని, ఆశలు, ఆరాటాలు ఉండకూడదని మీ విశ్వాసం సార్"[6] అంటూ అడుగడుగునా తెలంగాణాలో జరుగుతున్న దోపిడి, హింసతో విప్లవోద్యమంలో ఉన్న వ్యక్తుల కుటుంబాలతో పాటు, విప్లవానికి సహకరించిన కుటుంబాలు ఏ విధంగా సమిధలవుతున్నాయో, ఆకలి దప్పికల కోసం ఇక్కడి ప్రజలు నిరంతరం చేసే పోరాటంలో సంఘర్షణను తెలుపుతుంది.

విప్లవ సిద్ధాంతాలు నమ్మి, దాని వెంట నడిచినానంటాడు. విప్లవమంటూ పీడితులు, బాధితులు విప్లవమనే ఎండమావి వెంట పరుగులు తీసి ఏం కోల్పోతున్నారో, అణగారిన వర్గాలు విప్లవోద్యమాల్లో ఎందుకు అభివృద్ధి చెందలేకపోతున్నారో తెలుపుతాడు.

ఇంకా విప్లవోద్యమంలో పని చేసిన పెద్దకులం వారు సరెండర్ అయినా కూడా పాలక వర్గాల్లో వారి బంధువులు ఏ విధంగా ఉపయోగపడ్డారో, తాను సరెండర్ అయిన తర్వాత తన కులం ఎలా అణగదొక్కబడడానికి ఉపయోగపడిందో తెలుపుతాడు.

"..... మే ఛస్తే వాల్లు కవిత్వం రాద్దామని చూస్తారు. అది చూసి మనం ఛస్తే మనక్కూడా యింతపేరు వస్తుందని నాలాంటోల్లు మల్లా అందులోకి ఉరికి సచ్చుటానికే వాల్లు రాస్తారు. వెనుకట రాజులు యుద్ధాలు చేస్తూ యిలాగే వీరగాథలు పాడించి సైన్యాల్లోకి భర్తీ చేసుకొనేవారు... పల్లెల్లో చెప్పించిన పల్నాటి, బొబ్బిలి యుద్ధం, మహాభారతం వగైరా వీరగాథలన్నీ అందుకు ఉపయోగించుకున్నవే...."[7] ప్రజల్ని విప్లవం వైపు తీసుకువెళ్ళడానికి ఉపయోగపడ్డ ఉద్యమం వాళ్ళ పాటలు, పౌరహక్కుల వాళ్ళను, విప్లవ రచయితలను ఎందుకు పట్టించుకోలేక పోయిందోనని హృదయ వేదనను వ్యక్తం చేస్తాడు. ఈ మాటలు క్షతగాత్రులై గాయపడ్డ ప్రజల హృదయ విదారక వేదనలకు అక్షర రూపంగా చెప్పుకోవచ్చు.

అలాగే విప్లవోద్యమం వల్ల దళిత వర్గాలకు అందాల్సిన అభివృద్ధి అందకుండ అగ్రకులాల అభివృద్ధికి విప్లవం ఏ విధంగా ఉపయోగపడ్డదో, విప్లవం వల్ల బాగు పడిందెవరో తెలుపుతూ... "ఏ గడికోసం... ఏ గడీ ఆధిపత్యం కోసం ఉండాలని ఆయనా... పోవాలని మేమూ పోరాటం చేశామో ఆ గడీని యిపుడా మద్దునూరు దొర ఆవూరికీ ఆవూరి స్కూలుకూ విరాళంగా రాసి యిచ్చి తన కృతజ్ఞత... విజ్ఞత తెలుపుకున్నాడు."[8] అంటూ విప్లవం దొరలకు మేలు చేసిన విధానం తెలుపుతాడు.

విప్లవం భయంతో పల్లెలను విడిచినా "ఇక్కడ దొరలు పల్లెలు వదిలాక సేట్లయ్యారు. పారిశ్రామిక వేత్తలయ్యారు. కాంట్రాక్టర్లయ్యారు. రాష్ట్ర నాయకులయ్యారు. డాక్టర్లయ్యారు, ఇంజనీర్లయ్యారు. ప్రైవేటు కాలేజీల ఓనర్లయ్యారు. ప్రభుత్వ అధికారులయ్యారు. ఊర్లోంచి పారిపోయిన దొరలు, వర్గ శత్రువులంతా బాగానే బతుకుతున్నారు.'[9] అంటూ అంబేద్కర్ కల్పించిన రిజర్వేషన్ల ద్వారా అభివృద్ధి అందాల్సిన కింది కులాలకు అందకుండా, విప్లవం నిర్బంధాల మూలంగా అగ్రకులాలకు ఏ విధంగా మేలు జరిగిందో తెలుపుతాడు. 1956లోనే ప్రత్యేక తెలంగాణ వస్తే ఈ పరిణామాలు జరిగేవి కావని వాఝ్మూలమిస్తాడు.

### ప్రజల సంపద, సరుకులు పరాయీకరించబడ్డ తీరు

"మా సరుకులు కళలు ప్రపంచాన్ని ఆకర్షించాయి.... దాంతో ప్రపంచం నుండి యిక్కడకు వలసలు, దండయాత్రలు సాగాయి. మా సరుకులు తిన్నవాల్లు స్వార్థపరులై దేశాన్ని వాల్లకప్పగించారు... మాకుభాషరాదు.... భావం చెప్పడం రాదు. మాకు చరిత్ర లేదు. నాది చరిత్ర కాదు. ఎవరి చరిత్రనో, నాయకత్వాన్నో మోయడమే నా పని..."[10] అంటూ ఉత్పత్తి కులాల చరిత్రను, శ్రమను వలసవాదులు ఎలా దోచుకున్నారో, ఆవేశంతో ముందు వాళ్ళ లౌక్యంతో విప్లవాన్ని సైతం తమకు అనువుగా ఏ విధంగా మార్చుకున్నారో చెబుతాడు.

### చరిత్రకు కొత్త నిర్వచనం

"కాలం గడిచిన కొద్దీ అనుభూతులు నశిస్తాయి. అనుభవాల చరిత్ర కూడా అదృశ్యమవుతూ ఉంటుంది. వాటినించి పుట్టే దృక్పథాలు మాత్రం ముందుకు సాగుతూనే ఉంటాయి. అందువల్ల చరిత్రంటే దృక్పథాల చరిత్రే..."[11] అంటూ చరిత్రకు కొత్త నిర్వచనం ఇస్తాడు. భారతీయ చారిత్రక భౌతిక వాదానికి అదనపు చేర్పునందిస్తాడు.

### విప్లవం దక్షయజ్ఞంగా మారిన తీరు

గుర్రాల పెంటయ్య అలియాస్ ప్రవీన్ కోర్టులో తన చరిత్రను చెప్పడంతో మొదలైన ఈ కథ లక్షలాది, కోట్లాది తెలంగాణ ప్రజలు స్వేచ్ఛకోసం తపిస్తున్న విధానం, కొంచెం బతుకు మారాలని కోరుకున్న పాపానికి ఏనుగు పాదాల విప్లవ వ్యూహం కింద నలిగిపోతున్న విధానాన్ని తెలుపుతూ కోర్టు హాలులో పెంటయ్య ఆత్మహత్యతో ముగుస్తుంది.

### విప్లవంలో ప్రజల అభివృద్ధి అసాధ్యమైన తీరు

ఈ 'దక్షయజ్ఞం' కథ ఇరవై ఏళ్ళ విప్లవంలో అణగారిన వర్గాల అభివృద్ధి ఎందుకు అసాధ్యమైంది? పోరాట ఫలితాలు ఎందుకు తిరగబడ్డాయో తెలుపుతుంది. ఉద్యమాలు ఏ కొందరి సాహస కృత్యాలు కావని, ఉద్యమాన్ని ఉద్యమ నాయకత్వమే కాకుండా,



జనంలో చైతన్య బీజాలు నాటే రచయితలు, కళాకారులు, మేధావులు, సంస్కర్తలు, నాయకులు విఫలమవుతున్నారని ఉద్యమం నాయకుల ఉద్యమంగా కాకుండా ప్రజా ఉద్యమంగా తీర్చిదిద్దినప్పుడే సరియైన ఫలితాలు వస్తాయని రచయిత అభిప్రాయపడతాడు.

### ప్రవీణ్ జీవితమిచ్చే సందేశం

ఉద్యమంలో పని చేసిన రచయిత అందులోని బలహీనతలను, ఇతర కోణాలను ఎత్తిచూపడం వల్ల కొత్తదృక్పథంతో ఉద్యమ పటిష్టతకు ఉపయోగపడుతుందని, అది విమర్శించడం కాదని తెలుపుతాడు. ఇంతవరకు గెలుచుకున్న ఉద్యమాల చరిత్రకు సంబంధించిన సాహిత్యమే వచ్చింది. కాని ఇలా లోపాలను ఎత్తిచూపే సాహిత్యం రావడం దక్షయజ్ఞం కథలో చూడవచ్చు.

### ఏమీ చేయకుండానే ఏదో సాధించాననుకుని విర్రవీగే గాడిదల కథే 'గాడిద'

మిట్టపెల్లి లక్ష్మణ్ ముప్పయ్యేళ్ళుగా రచనలు చేస్తూ సాహిత్య సేవలో ఉంటాడు. ఇతనికి యాభైయేళ్ళు నిండిన సందర్భంగా మిత్రులందరు కలిసి ఇతని రచనల్నింటిని ఒక సంకలనంగా వేద్దామని నిర్ణయించారు. దానికి "మిట్టపెల్లి లక్ష్మణ్ సర్ణోత్సవ సమితి" పేరున ఒక బృందం ఏర్పాటయింది. తన రచనల్ని సేకరించి భాగాలుగా చేయడం లక్ష్మణ్‌కే వదిలారు.

### స్వర్ణోత్సవ సంచికకోసం

లక్ష్మణ్ క్లాసుమేట్ చింతకింది అవిసయ్య తన పేరును చింతకింది "అవిశ్రాంత"గా మార్చుకుంటాడు. ఈయన ఒక కాలేజి ప్రిన్సిపాల్. వీరికి "కుప్పనపు చీరల కావేరీ" (కోవేరీ)తో కొద్దికాలంగా పరిచయమేర్పడి స్నేహంగా కొనసాగుతుంది. వీరి సహకారంతో తన రచనలను చర్చకు తెస్తాడు. తాను వివిధ సందర్భాలలో రాసిన కవితలు, కొన్ని పిల్లలు చింపివేయగా, చెదలు పట్టినవిపోగా, మిగిలిన వాటిని దుమ్ము దులిపి ఒక క్రమ పద్ధతిలో చదువుకుంటూ సరిచేస్తాడు. తాను చేసిన ప్రసంగాలు, రాసిన సంపాదకీయాలు, చేసిన విమర్శలు, పత్రికలకు విభిన్న సమస్యలపై సందర్భాలపై రాసిన లేఖలు, సమీక్షలు ముందుమాటలు మొదలైన రచనలను సరిచేసుకుంటాడు.

### లక్ష్మణ్ వెనక్కి తిరిగి చూసుకున్నాడు

తన రచనల్ని చదువుతూ జీవితాన్ని వెనక్కి తిరిగి చూసుకుంటే పేదరికంతో గడిపిన బాల్యం, వివిధ సంఘాలలో తిరిగిన అనుభవం, ఉద్యోగంలో ప్రమోషన్లు పొందలేకపోవడం తెలుసుకుంటాడు. తన చిన్న వయస్సులో రాసిన "ధన్యం" కవితను చూసి కోవేరీ చదివి బాగుందని, గొప్ప దళిత దృక్పథం, పీడిత దృక్పథం, స్త్రీవాద దృక్పథంతో ఉందని అంటుంది. చిన్న వయస్సులో ఊహా ప్రేయసిని వర్ణిస్తూ వ్రాసిన

కవితలో అవి లేవని అభిప్రాయపడతాడు.

**గాడిదలుగా తయారయ్యే తీరు**

"నేనో గాడిదను, గాడి తప్పిన గాడిదను, ఏ బూడిదలోనైనా పొర్లే అడ్డగాడిదను, చుట్టూ నలుగురు ఆహో... ఓహో... అంటే ఆ పొగడ్తల బూడిదనే పన్నీరనుకొని పెయ్యంతా పూసుకున్న కీర్తి దురద గాడిదను. కుక్క చేసే పనిని గాడిదలా చేసి వీపు పగుల గొట్టించుకున్న రచయితను. ఒక్క లాఠీ దెబ్బ తినకుండా దేని జోలికి పోకుండా రచనే పరమావధిగా ఎందరో రచయితలు ఎంతో గొప్ప రచయితలైపోయారు... వాళ్ళే యిక నా ఆదర్శం... "[12] అంటూ తనను తాను ఆత్మ విమర్శ చేసుకుంటాడు.

తను సృష్టించిన సాహిత్యం ఎంత తక్కువో తెలుసుకొంటాడు. ప్రపంచ జ్ఞాన సముద్రంలో తనేంటో తెలుసుకొనేసరికి యాభైయేళ్ళు నిండాయని అనుకుంటాడు.

**గాడిదలుగా మారడానికి గల కారణాలు**

సంపాదక వర్గం చర్చించి రచనల్ని కుదించి సంకలనం వేయడానికి పనులు ప్రారంభించారు. మిట్టపెల్లి లక్ష్మణ్ మానసిక స్థితిని వివరిస్తూ ప్రోత్సాహకంగా ముందు మాటలు రాసి పంపాల్సిందిగా అవిశ్రాంత, కోవేరీలు కలిసి ముగ్గురు ప్రఖ్యాత రచయితలకు లేఖలు పంపారు. అందులో విలక్షణంగా ముందుమాట రాసిన "మంచెకట్ల అనంతయ్య" సందేశం కొత్త ఆలోచనలు రేకెత్తిస్తుంది.

**మిట్టపెల్లి లక్ష్మణ్ జీవితం ఇచ్చే సందేశం**

"....అతడి జీవితమంతా ఇతరుల మెప్పు పొందాలనే ప్రయత్నానికే ఖర్చయిపోయింది. అతను జీవితమంతా సమాజానికో రచనలకో వెచ్చించింది నిజమే. కాని అతను సమాజంపైనా సాహిత్యంపైనా తనదంటూ ఏ ముద్రా వేయలేకపోయాడు. కాల పరీక్షలకు నిలబడే రచనలు పిడికెడైనా లేవు అనేది సత్యమే"[13] అంటూ పంపిన లేఖ ఆలోచించేలాగా ఉన్నది. పుట్టిపెరిగిన సమాజం, వర్గం, కులం, పేదరికంను గెలుచుకోవడానికి ఆత్మగౌరవం కోసం పోరాడడానికి ఇంత సమయం పట్టిందని అభిప్రాయపడతాడు. స్వర్ణోత్సవ సభ ముగియడంతో ఇక నుంచి పూర్తి సమయం రచనలకి కేటాయిస్తానని, ఇంతకు ముందు తను వ్రాసిన కవితలను సభా ప్రాంగణంలో కాల్చివేస్తాడు మిట్టపెల్లి లక్ష్మణ్.

మిట్టపెల్లి లక్ష్మణ్‌లు ఏ విధంగా ఉత్తమ రచనలు చేయగలరో, సమాజ శ్రేయస్సు కోసం తమను తాము ఏ విధంగా సరిచూచుకోవాలో, ఆత్మ విమర్శ చేసుకోవాలంటాడు. ఈ కథ ద్వారా బి.యస్.రాములు ప్రజల్ని మేల్కొల్పడమే కాకుండా రచయితల్ని మేల్కొలిపే ప్రయత్నం చేశారు.



**అహంకారం తలకెత్తితే బట్టలు విప్పాల్సివస్తుందన్న కథ 'దుస్తులు' :**

దళితుడైన సత్తయ్య పేదరికంలో పుట్టి, కష్టపడి చదువుకుంటూ టీచర్ ట్రైనింగ్ పూర్తి చేశాడు. తనతో పాటు టీచర్ ట్రైనింగ్ చేసిన సుమతిని ప్రేమించి పెళ్ళి చేసుకుంటాడు. వీరు ట్రైనింగ్ పూర్తయిన తర్వాత ఒక ప్రైవేట్ స్కూలులో ఆ తరువాత జిల్లా పరిషత్ (జడ్.పి.)లో కన్సాలిడేటెడ్ జీతంపై ఉద్యోగాల్లో చేరారు.

**పదవితో వ్యక్తిత్వం మారే తీరు**

సత్తయ్య తన తల్లిదండ్రులను సొంత వూర్లోనే ఉంచాడు. సుమతిని పెళ్ళి చేసుకోవడం ఇష్టంలేని బంధువులు వీరిపై అలగడం వల్ల తమకే నష్టమని గ్రహించి మళ్ళీ ఒక్కటౌతారు. సత్తయ్య ఉద్యోగం చేస్తూ పబ్లిక్ సర్వీస్ కమీషన్ పరీక్ష వ్రాసింతర్వాత రెవెన్యూ శాఖలో చేరాడు. మానసిక బానిసత్వానికి అలవాటైన సుమతి ఇల్లు, పిల్లలతో "మిస్సెస్ యమ్మార్వో"గా గౌరవం పొందుతుంది. సత్తయ్య మాత్రం అధికారం, హోదా, దర్పం మూలంగా పుట్టు ధనవంతునిలా ప్రవర్తిస్తాడు.

**తిరిగి మనిషిగా మారిన ఎమ్మార్వో సత్తయ్య**

ఒక రోజు రాత్రి ఫంక్షన్‌కు వెళ్ళివస్తుంటే దారిలో జీపు చెట్టుకు తగిలి పడిపోతారు. అప్పుడే అక్కడికి వచ్చిన 'అన్నలు' సత్తయ్యను కొట్టి అధికారంలో ఉంటూ చేసిన తప్పులను ప్రశ్నిస్తారు. ప్రాణభయంతో పరుగెత్తిన సత్తయ్యదుస్తులు చినిగి నిస్సత్తువతో ఒక చెట్టుకు ఒరిగి ఆలోచిస్తాడు. తనను తాను ఆత్మవిమర్శ చేసుకుంటాడు. ఈ సంఘటన అతనిలో పరివర్తన తెస్తుంది.

**అధికారం మనిషిని అవినీతిపరుణ్ణి చేస్తుంది**

"అధికారం తలకెక్కాక మనస్సు మారడానికి ఎదుటివారి ప్రతీకార జ్వాలల్లో కదుక్కోవాల్సి రావడమే విషాదం. వైరుధ్యానికి పునాది అధికారం. సంఘర్షణకు అదే ప్రారంభం. వినయమే పరిష్కారం"[14] అంటూ ముగిస్తాడు. ఈ కథలో అధికారం సంపాదించిన సత్తయ్య గర్వంతో తన వాళ్ళకు, ప్రజలకు ఎందుకు దూరమవుతాడో తెలుపుతూ కొంతకాలానికి మారుతాడనే ఆశావహ దృక్పథం కనపడుతుంది.

**ప్రేమ కథలు**

రచయిత 'స్మృతి' కథల సంపుటిలోని కథలలో ప్రేమలోని భిన్న పార్శ్వాలను చిత్రీకరించాడు. తల్లిప్రేమ, స్త్రీ పురుషుల ప్రేమ, రాజకీయాల ప్రేమ, సమాజ ప్రేమ అంటూ ప్రేమలో మమకారాన్ని, మోహాన్ని, ఆపేక్షను శాసిస్తున్న శక్తులేమిటో బి.యస్.రాములు ఈ కథలలో తెలుపుతారు.

## తల్లి త్యాగాలతో ఎదిగిన పిల్లలందరి కథ 'తల్లిసాలు పిల్లడు' :

"తల్లిసాలు పిల్లడు" అనే ఈ కథ బి.యస్.రాములుగారి ఆత్మకథ. ఆత్మకథలతోనే మరాఠీ దళిత సాహిత్యం ఎదిగి ప్రపంచాన్ని ఆకర్షించింది. "ముందు ముందు ఆత్మకథలే నవలలుగా వస్తాయి" అని ప్రేంచంద్ చెప్పిన మాట అక్షరాల నిజం చేస్తూ, తెలుగులో జీవితాన్ని కథా రూపంలో దళితుల ఆత్మకథగా వెలువరించడం బి.యస్.రాములు 'తల్లిసాలు పిల్లడు'తో ప్రారంభించారు.

## భర్తను కోల్పోయిన స్త్రీలు ఎదుర్కొనే అవమానాలు

బి.యస్.రాములు తల్లి బేతి లక్ష్మీరాజు తన ఇరవై ఐదవ యేట భర్తను కోల్పోయింది. తన ముగ్గురు పిల్లల్లో బి.యస్. రాములు రెండవవాడు. భర్త ఆసరాలేని లక్ష్మీరాజు జీవితం, అనేక కష్టాలకు, అవమానాలకు గురయింది. కొన్ని రోజులు కూలిపనులు చేసింది. వ్యవసాయ పనులు పదిమందితోకలిసి చేసింది. వారి నీచపు చూపులు, సూటిపోటి మాటలు భరించలేక అభిమానవతి అయిన లక్ష్మీరాజు బొంబాయిలో నేర్చుకున్న బీడీలు చుట్టడం ద్వారా బీడి కార్మికురాలిగా స్థిరపడుతుంది.

## తల్లి చెప్పే కథలు

లక్ష్మీరాజు పిల్లలకు ఆకలి మరిపించడానికి కథలు చెప్పేది. అలా కథలు విని 'ఊ' కొట్టడం ప్రారంభించిన బి.యస్.రాములు కథా రచయితగా ఎదగడానికి మొదటి ప్రేరణ నిచ్చింది. తల్లి కష్టపడి పిల్లలను చదివించింది. అయినా సమాజం తండ్రిలేని పిల్లలుగానే చూసింది.

## పిల్లలకు అమ్మ కావాలి

"నాన్న పోయాక అమ్మను మారు మనువు (మారుపెళ్ళి) అడిగారు. మాకు అమ్మకావాలి. ఎన్నో రాత్రులు ఏడ్చి ఏడ్చి ఆకలితో నిద్రపోయాం. అమ్మ మళ్ళీ పిల్లలు కనడానికే మారు మనువు అని అర్థమైంది. మారు మనువు పోతే క్రమంగా యిల్లు కాజేయవచ్చుననుకున్నాడు మేనమామ. తాత, అమ్మ మీద ప్రేమతో మారు మనువు సంబంధాలు వెతికాడు. అమ్మకు మళ్ళీ పెళ్ళి చేసుకోవాలనే ఉండింది. అయితే "కన్యాశుల్కం"లోని బుచ్చమ్మలా మౌనంగా ఉండిపోయింది."[1] అంటూ తల్లికోసం, తల్లిమీద హక్కు కోసం పిల్లలు పడే తపన, అభద్రతా భావం, స్త్రీకి పిల్లల పట్ల ప్రేమ ఈ కథలో చూడవచ్చు.

## పోరాటం ఎక్కడో లేదు - బతకడమే ఒక పోరాటం

"పోరాటం ఎక్కడోలేదు. బతుకులోనే పోరాటంఉంది. మన బతుకే ఒక పోరాటం, ఒక స్థాయి బతుకు బతకడమే ఒక పోరాటంగా సాధించుకోవాల్సిన జీవితాలు మనవి.



అందువల్ల మన జీవిత యథార్థ చిత్రణే ఒక గొప్ప సామాజిక విప్లవ నవల, కథ అవచ్చు"[2] అంటూ తల్లి జీవితాన్ని గెలుచుకున్న విధానం, తల్లి ద్వారా ఒక సామాజిక చరిత్రను తెలుపుతాడు.

## తానేమీ చేయకుండా మంది చేస్తే బాగుండనుకునే 'ప్రేమ'

"ప్రేమ" కథలోని జర్నలిస్టు ఒక మాజీ నక్సలైటు. తన భార్య విమల, కూతురు నవతను తీసుకొని తన మరదలు అరుణ పెళ్ళికి బస్సులో వెళుతుంటే ఈ కథ నడుస్తుంది.

## హోల్ టైమర్‌గా మారితేనే విప్లవకారులు?

కాలేజీ విద్యార్థి ఉద్యమాల్లో చురుగ్గా పాల్గొన్న అరుణ నక్సలైట్ ఉద్యమంలో కూడా చేరి పని చేస్తుందని ఆశిస్తాడు. కాని ఆమె పెళ్ళి చేసుకుంటుందని తెలుసుకుంటాడు. "ఉద్యమంలోంచి నేను బయటకు వచ్చినా దానిమీద తీపి చెరిగిపోలేదు. ఈ తీపి వ్యక్తి నిష్టం కాదు. నన్ను నేనుగా ఎదిగించుకోవడానికి ఉద్యమం ఒక చక్కని వాతావరణాన్నిచ్చింది. నన్నునేను సమాజానికి అర్పించుకోవడానికి ప్రేరణనిచ్చింది. అరుణ నాలాగే ఉద్యమానికి నాలుగైదేళ్లయినా అర్పణ భావంతో పని చేస్తుందని ఆశించడానికి సమాజం పట్ల ప్రేమే కారణం"[3] అంటూ ఉద్యమంలోకి వెళ్ళి ఎందుకు పని చేయాలో చెబుతాడు.

## అరుణ పెళ్లిచేసుకుంది

తను ఉద్యమంలోంచి బయటకు వచ్చిన తరువాత బంధుమిత్రుల ఒత్తిడితో పెళ్ళి చేసుకుంటాడు. అలా తాను పెళ్ళి చేసుకున్న పరిస్థితిని తెల్సుకున్న, అరుణ ఇతరుల కోసం బతకాలనే వాంఛ నుంచి బయటపడిందా! ఆమెను ఆమెగా గుర్తించిన హృదయం లభించిందో! అంటూ "స్వచ్ఛమైన ప్రేమకు ఆశించడాల్తో నిమిత్తం లేదు.... యధాతథంగా స్వీకరించి ప్రేమించడమే ఉత్తమ ప్రేమ"[4] అంటాడు.

ఈ కథలోని ప్రేమ తాత్విక దృష్టితో వ్రాసింది. జర్నలిస్టుల ఆలోచన విధానం ఈ కథలో కనబడుతుంది.

## మాయ, మోహం లేకుండా ప్రేమ మాత్రం కొనసాగుతుందా అని ప్రశ్నించిన కథ 'మాయ'

'మాయ' కథలో అసలైన ప్రేమ ఏమిటో, మాయామోహాలు ఏ విధంగా ఉంటాయో, మనుషులకు ఏ విధంగా అవి కలుగుతాయో తెలుపుతూ ప్రేమ, మాయఅనే ఇద్దరు కాలేజీ విద్యార్థినుల మధ్య జరిగే తాత్విక చర్చే 'మాయ' అన్న కథ.

## లైంగికావసరాలకు, ప్రేమకు మధ్య తేడా

"అలాంటి వాటిని లైంగిక అవసరాలు అంటాను. వాటికోసమే ఆరాటపడడం

జంతువులతో సమానం. రాత్రి సినిమాలో చూసింది మనుషుల ప్రేమ కాదు. జంతువుల కన్నా హీనంగా ప్రవర్తించిన మృగాల ప్రేమ. మృగాల లైంగిక అవసరాలకు కొన్ని రుతువులు సీజన్లుంటాయి. మనిషిలోని మృగానికి ఎప్పుడూ సీజనే. అందుకే వారిది మృగాల కన్నా హీనమైన మాయా మోహం"[5] అంటూ గత రాత్రి చూసిన సినిమాలోని ప్రేమకథ గొంతులో తెమడ బయటకు ఉమ్మేసినటువంటిదని, కౌగిలింతలు, శరీరాలు కలుసుకొనేది ప్రేమకాదని, ప్రేమంటే రెండు హృదయాల కలయిక, సహృదయత అన్న ప్రేమ మాటలతో ఏకీభవిస్తూ సినిమాలో చూసింది మాయా, మోహం అని మాయ చెబుతుంది.

## స్త్రీవాదం చెప్పే ప్రేమ

చలం, రంగనాయకమ్మ, ఓల్గా రచనలలోని ప్రేమ గురించి అభిప్రాయమేంటని ప్రేమ అడుగుతుంది. దానికి సమాధానంగా, చలం మాయ, మోహాల వెంట పరుగెత్తి విసుగెత్తి రమణాశ్రమానికి వెళ్లాడని అంటుంది మాయ.

ప్రేమ విసుగెత్తదు. నిత్యనూతనంగా ఉంటుందని మాయ చెబుతుంది. ఇంకా రంగనాయకమ్మ, ఓల్గాలు స్త్రీలకు లైంగిక స్వేచ్ఛ, అణిచివేతల గురించి స్త్రీ, పురుషుల మధ్య సంబంధం గురించి సెక్సువాలిటి కేంద్రంగా చర్చించారని, వీరు మాయా, మోహాలను మరింత అందంగా చెప్పారని మాయ చెబుతుంది.

## మాయామోహం లేకుండా ప్రేమ

ఇంకా వీరి చర్చల్లో ఫిజిక్స్ లెక్చరర్ ఆచార్య నాగార్జున, శంకరాచార్య, మేథా, మహామాయలు కలుస్తారు. గాంధి, జనక మహారాజు, కృష్ణుడు, భక్త మీరాబాయి గురించి వారిలో, నిష్కామకర్మ ఎందుకు సాధ్యపడలేదో, సమాజాన్ని, సామాజిక సంబంధాన్ని మాయ, మోహాలు ఏ విధంగా నడిపిస్తున్నాయో చర్చించుకుంటారు. "బుద్ధుడు మాయలో పడకుండానే ప్రజల్ని ప్రేమించాడు. మాయతో పని లేకుండానే ప్రపంచాన్ని ప్రేమించడం ఎలాగో నేర్పాడు"[6] అని అంటాడు శంకరాచార్య.

ఈ కథలోని భావాలతో ప్రేమపై తమ అభిప్రాయాలను ప్రతి ఒక్కరు బేరీజు వేసుకుంటారు. ఈ కథ రాయడానికి ముందు రచయిత "ప్రేమంటే ఏమిటి?" అనే తాత్విక గ్రంథాన్ని వెలువరించారు. దాని సారాంశాన్ని కొంత ఈ కథారూపంలో మనకందించారు.

## ఫెమినిజం – లైంగికస్వేచ్ఛ – 'మెరుగు'

బి.యస్.రాములు 'మెరుగు' కథలో తెలుగు సాహిత్యంలోకి రాని భారతీయ సమాజాన్ని జీవితాన్ని, యాభైయేళ్ళ పరిణామ క్రమాన్ని, కొత్త కోణంలో చిత్రీకరించాడు.



## లైంగిక సంబంధాల కారణంగా వ్యక్తిత్వాన్ని కించపరచాలా?

"రంగవ్వది నిండు హృదయం. దొరనైనా, నన్నయినా, రాజయ్యనైనా హృదయ పూర్వకంగా ప్రేమించేది. ఎవరైనా అధికారులు వచ్చినపుడు పంపితే వారితోనూ ఎంతో ప్రేమగా ఉండేది. వాళ్ళు ఆమెను మరీ మరీ గుర్తు చేసుకునే వారు. నేను తప్పు చేస్తున్నాను అనే భావన ఆమెలో ఏ కోశానా కనపడేది కాదు. నా బతుకు ఇట్లా కాలిందన్న నిరాశ కూడా ఆమెలో నేనేనాడూ చూడలేదు. అదంతా ఎంతో సహజమైన సంగతిలా, ఉత్సాహంగానే ఉండేది"[7] అంటూ తరతరాలుగా లైంగిక దోపిడికి గురవుతున్న, పీడిత స్త్రీలకు రంగవ్వను ప్రతీకగా చిత్రిస్తూ, ముగ్గురితో సంసారం చేసి దొర తరపున ఇంకా చాలా మందిని సంతృప్తి పరిచిన రంగవ్వ ఇతరులకు సహాయం చేస్తూ హాయిగా గడిపిందని రచయిత లక్ష్మికి చెప్పడం "మెరుగు" కథలోని ఇతివృత్తం.

## సర్కారుజీతంతో దొరలకు సేవచేసిన టీచర్లు

ధర్మపురి రూట్లో ఓ పల్లెలోని టీచర్‌గా పని చేస్తూ ఆ పూరిలో బడి పిల్లలకు పాఠాలు చెప్పకుండా రాజేశ్వర్‌రావు దొరకు పర్సనల్ అసిస్టెంట్ మాదిరిగా ఉంటాడు. దొరల నిరంకుశత్వాన్ని, సామాన్య ప్రజలపట్ల వారి అనుచిత ప్రవర్తనను గమనించి ఏమి చేయలేకపోతాడు. అలాంటి క్రమంలో రంగవ్వ పరిచయం అవుతుంది. దొరకు భార్య రత్నవ్వ కన్న, రంగవ్వ అంటేనే ఎక్కువ ప్రేమ ఉండేది. ఆమె వ్యక్తిత్వం, సంస్కారం, ఆమెపట్ల ప్రేమకు కారణం కావచ్చునని, ఒక దశలో దొర ఆమెను రెండో భార్యగా పెళ్ళి చేసుకోవాలనుకుంటాడు.

## నాటి మధురవాణి, వసంతసేనల వారసురాలు నేటి రంగవ్వ

రంగవ్వకు ఇద్దరు పిల్లలు. గొప్ప అందగత్తె కాకున్నా ఉన్నతమైన వ్యక్తిత్వం ఆమెది. భోగం కులంలో పుట్టినా, ఎంతో సంస్కారం ఉండేది. "కన్యాశుల్కం"లో మధురవాణి, 'మృచ్ఛకటికం'లో వసంత సేన ఈ కాలంలో వుంటే రంగవ్వలాగే ఉండేవారని చెబుతాడు. ఆ వ్యక్తిత్వమే దొరకు నచ్చి, భార్యను తక్కువ చూసేవాడు. కొన్ని రోజులు రత్నవ్వ రంగవ్వను సూటిపోటి మాటలంటే దొర కలుగజేసుకొని ఆమెకు సగం ఆస్థి ఇస్తానంటాడు. రత్నవ్వ కోపంతో తల్లిగారింటికి వెళ్ళి మనసు మార్చుకొని తిరిగి వస్తుంది. దొరసాని రత్నవ్వ టీచర్‌కు దగ్గరౌతుంది. అతడు దొరను గెలుచుకునే ఉపాయం చెప్తాడు. ఇది రంగవ్వ పాలిట శాపం అవుతుంది.

## గెలిచేదాకా ఉండే ఉత్సాహం గెలిచిన తర్వాత పోతుంది

"మనిషికి జయించేదాక ఉండే ఉత్సాహం జయించాక ఉండదేమో... ఆమె ప్రేమను గెల్చుకోవాలి అనుకున్నప్పుడు ఉండే ఉత్సాహం ఆమెను గెల్చుకుని సంసారం చేస్తున్నప్పుడు ఉండదేమో. ఆ ప్రేమ నిలవాలంటే యింకా ఎంతో హృదయ సంస్కారం అవసరం

అంటాడు. నిన్ను జయించాను అన్నభావన ఉన్నంత కాలం ప్రేమించి పెళ్ళి చేసుకున్న వారి మధ్య పెళ్ళి, సంసారం సజావుగా సాగవేమో. ఏమంటే నేను జయించాను అనుకోవడంలో తన ఆధికత్యను ప్రేమించుకోవడమే ఉంది, కాని ప్రేయసిని ప్రేమించడం లేదు. ప్రేమ పెళ్ళిళ్ళు విఫలం కావడానికి కారణం బహుశా వాళ్ళు ఎదుటి వారిని ప్రేమించకుండా తన ఆధిక్యతను ప్రేమించడంలో భాగంగా ప్రేమించారని చెప్పవచ్చు"[8] రంగవ్వను గురించి దొరకాని, రాజయ్య కాని ఎక్కడ నీచంగా మాట్లాడేవారు కారు. ప్రేమను హృదయంలో దాచుకుంటే ఎంత ఉత్సాహాన్ని ఇస్తుందో, చెబుతూ, అదినాకు అలవాటు అని చెప్పుకోవడంలో ప్రేమ ఎలా నిర్వీర్యం అవుతుందో చెప్తూ రంగవ్వ బాగా చదువుకొని దొర తమ్ముని లెక్క పట్నంలో పంతులు ఎందుకు కావద్దని ఆమె తన జీవితం ఎదుగుదలకు ఇచ్చిన ఉత్తేజం గురించి తెలుపుతాడు.

### ఒకనాటి గ్రామీణ లైంగిక సంబంధాలు

కొన్ని రోజుల తరువాత ఆవూరు నుండి బదిలి చేయించుకుంటాడు. లాంగ్ స్టాండింగ్ అని దొరను నమ్మించాడు. అయినా దొర సహచర్యం వదులలేకపోయాడు. ఆ టీచర్ దొరసాని రత్నవ్వతోను, రంగవ్వతోను సంబంధం కొనసాగించాడు. ఆ సంబంధాల్ని వ్యభిచారం అని ఎవరు అనేవాళ్ళు కాదు. ఆ కాలంలో ఇన్ని పట్టింపులు ఉండేవి కావని, ఈ సిన్మాలు, తాళిబొట్టు అంటూ వచ్చి ప్రాతివత్యం మహాగొప్పదని చెప్పే వరకు ఎవరు పట్టించుకోలేదు.

### పెళ్లిలేని లైంగికసంబంధాలు అన్నీ వ్యభిచారం కావు?

"ఉమ్మడి కుటుంబాలు పోయివ్యక్తికుటుంబాలు ఏర్పడ్డాక మాత్రమే ఒక స్త్రీ, ఒక పురుషుడు మన పిల్లలు అనే పాతివ్రత్యం ప్రాచుర్యంలోకి వచ్చిందేమో... అంతకన్నా ముందది కేవలం రాజ వంశాల పాలకవర్గాలకు సంబంధించిన సంస్కృతే. ఎందుకంటే వారి సొంత పిల్లలే ఆస్తి రాజ్యం అనుభవించాలనే దృష్టి వారికే ఎక్కువ. ప్రజలకు అన్నిఆస్తులూ లేవు. స్వచ్ఛమైన ప్రేమ సంబంధాల్తో అన్ని కులాల వాళ్ళు ఎన్నో సంబంధాలు పెట్టుకొని జీవించారు. దాన్ని ఇప్పటి అర్థంతో వ్యభిచారం అనీ, అక్రమ సంబంధం అని అనడం చరిత్రకే అపచారం. అది ఆనాటి సామాజిక దృక్పథం"[9] అంటూ నేను, నాది అనే అహంకారం, స్వార్థం లేకుండా ఉంటే రాజులు మరింత చక్కగా పాలిస్తారేమో అంటాడు.

ఈ కథలో విదేశీ సిద్ధాంతాలను ఒంటబట్టించుకొని ఇక్కడ స్త్రీవాదం పేరుతో ఉద్యమిస్తున్న వాళ్ళు పల్లెల్ని చదివి స్త్రీవాదం వెలికి తీయాలని చెప్తాడు. మధురవాణి అప్పటి పరిస్థితుల్లో ఉత్తర తెలంగాణలో ఉంటే ఇలాగే ప్రవర్తించేదేమో అంటాడు. రంగవ్వ పాత్ర మధురవాణి, వసంతసేనలను ఆదర్శంగా తీసుకుని చిత్రించినట్లు స్పష్టమవుతుంది. స్త్రీవాదం పేరిట ఫ్రీసెక్స్ ఆచరించే వారికి హెచ్చరికగా "మెరుగు" కథను రాశారేమో.



### ముక్కోణపు ప్రేమకథ రూపంలో 25 ఏళ్ల సామాజిక పరిణామాల్ని అందించే 'తెల్లబట్ట'

తెలంగాణాలోని దళిత, విప్లవ, సామాజిక వ్యక్తిగత జీవితాల్లోని ముప్పయ్యేళ్ళ పరిణామ క్రమాన్ని ఆటుపోట్లను, భూసమస్య, కుల సమస్య, రాజకీయాలు, కుటుంబ సంబంధాలు, సామాజిక సంబంధాలు నేపథ్యంగా అవి ఏ విధంగా మార్పుకు లోనవుతున్నాయో అనేవి 'తెల్లబట్ట' కథ ఇతివృత్తం.

### గ్రామీణ సాంఘిక, ఆర్థిక వ్యత్యాసాలు – ప్రేమలు

ఆశయ్య అతని మరదలు సారవ్వ, రాంరెడ్డి దొర కూతురు మాలతిల మధ్య ముక్కోణపు ప్రేమ ఇది. దళితుడైన ఆశయ్య చదువుకోవాలనే కోరికను తండ్రి నర్సింహులు ప్రోత్సహిస్తాడు. తనలా దొర దగ్గర పాలేరు పని చేయకూడదని మాలతితో సమానంగా చదివిస్తాడు. మాలతి, ఆశయ్య ఒకే క్లాసు కావడం దొరకు ఇష్టం లేక ఆశయ్య తొమ్మిదో తరగతిలోనే చదువు మానేయాల్సిన పరిస్థితి వస్తుంది. ఏడాది గడిచినతర్వాత వేసవి సెలవుల్లో సర్టిఫికెట్లు తీసుకొని తాలూకా సెంటర్లో ప్రభుత్వ సాంఘిక సంక్షేమ హాస్టల్లో చేరి పదవ తరగతి సప్లిమెంటరీ పూర్తి చేస్తాడు. ఇంటర్ పూర్తి చేసి డిగ్రీలో చేర్తాడు. అప్పటికి మాలతి కూడా డిగ్రీ పూర్తి చేస్తుంది. సారవ్వకు ఇంట్లో పని ఒత్తిడి కారణంగా ఏడవ తరగతిలోనే చదువు మానేస్తుంది.

ఆశయ్యను మొదట మాలతి పాలేరు కొడుకులా చూసినా లోలోన ఏదో తెలియని ఆకర్షణ ఉంటుంది. సారవ్వ సాక్షిగా మాలతి ఆశయ్య మనసుతో, శరీరంతో ఆడుకొనేది. "భార్య కావల్సిన సారవ్వ ఇద్దరికీ మధ్యవర్తి అయి కాపలాదారు అయి ఎవర్తోనూ అపవాదు రాకుండా కాపాడే సాక్షిగా మారిపోవాల్సి వస్తుంది. ఆమె తన గుండె కోత ఎవరికీ చెప్పుకోలేదు."[10] వయసు పెరిగిందని తల్లిదండ్రులు వెంకటయ్యతో వివాహం జరిపిస్తారు.

### జీవితంలో కాలం తెచ్చే పరిణామాలు

ఆశయ్య చదువు సాగిస్తూ యూనివర్సిటీలో విద్యార్థి సంఘాలలో తిరిగి ఆత్మవిశ్వాసం సంపాదించుకుంటాడు. అలా చదువుకొని ఉద్యోగం సంపాదించిన ఏడాదికే లక్ష్మితో పెళ్ళి జరుగుతుంది. కొద్ది నెలల తేడాతో మాలతి వివాహం ఎస్.ఐ. రాజిరెడ్డితో జరుగుతుంది. సారవ్వ భర్త వెంకటయ్య నక్సలైట్లలో కల్సిండని వేధిస్తూ ఎస్.ఐ. రాజిరెడ్డితో సహా అయిదుగురు కానిస్టేబుల్స్ సారవ్వను రేప్ చేస్తారు. ఇది తెలిసిన మాలతి "రక్తం అంటిన కొడవలికి అతను గుర్తుగా మారాడు. బలిష్టమైన అతని పట్టు తనపై కూడా అత్యాచారం చేస్తున్నట్టుగానే అన్పించేది. క్రమంగా అదే అలవాటైపోయింది. ఆశయ్యతో తొలిరోజుల్లో గడపిన క్షణాల్లోని స్వేచ్ఛ ఆనందం గుర్తొచ్చినపుడల్లాతానేదో కోల్పోతున్నానని బాధపడేది"[11]. మొదట ఆకతాయిగా తిరిగాననుకున్న మాలతి అదే నిజమైన ప్రేమగా గుర్తించింది. పోలీసు వ్యక్తిత్వం సంతరించుకున్న భర్త ఎస్.ఐ. రాజిరెడ్డిని వదిలేసి ఇల్లు చేరుకుంటుంది.

### చేతకాని దద్దమ్మలు ఎదుటివారి మీదికి సమస్యను నెట్టేస్తారు

చేతకాని దద్దమ్మలు ఎదుటివారి మీదికి సమస్యను నెట్టేస్తారు. సారవ్వ భర్త వెంకటయ్య ఇదే పని చేశాడు. అతను విప్లవంలో తిరిగి మళ్ళీ ఇంటికి చేర్తాడు. ఊరు వదిలి తాలూకా సెంటర్లో కాపురం పెట్టారు. ఈ ఆచూకి తెలుసుకొని, రేప్‌లోపాల్గొన్న పోలీసుల వేధింపులకు గురి చేస్తారు. అవి భరించలేక వారికి సారవ్వను అప్పగించి పారిపోతాడు. పోలీసుల లైంగిక హింసతో పాటు, మేనబావ అయిన ఆశయ్యతో సంబంధం అట్టగట్టి తిరుగుబోతని సొంత భర్తే ప్రచారం చేస్తాడు. ఈ బాధలు భరించలేక పిల్లలతో సహా బావిలోకి దూకి ఆత్మహత్యకు ప్రయత్నిస్తుంది. పిల్లలు చనిపోయి, సారవ్వ బతుకుతుంది. హత్య, ఆత్మహత్యా యత్నం కేసు కింద జైలుకు వెళుతుంది.

### జైలు ఒక పాఠశాల

అత్తమామల మరియు భర్త ఆగడాలను వేగలేక భర్తను చంపి జైలుపాలైన సుశీల, తాను లొంగనందున సమాచారం లీక్ చేయడంతో అరెస్టయిన మహిళా నక్సలైట్ శారదలు సారవ్వను ఓదార్చుతారు. సమాచారం తెలుసుకున్న ఆశయ్య సారవ్వకు బెయిల్ ఇవ్వడానికి వస్తాడు. "బావా నిన్నూ, నన్నూ దూరం చేసింది చదువే గదా. నీవు చదువు ఆపేసినా మనకిద్దరికి పెళ్ళయ్యేది. నేను చదువుకోగలిగినా మనిద్దరికి పెళ్ళయ్యేది. మనల్నిద్దర్ని దూరం చేసిన ఆ చదువునే ఈ జైల్లో నేర్చుకుంటాను. నేను చదువుకొని ఉంటే నువ్వు మాలతి వెంట పడేవానివా!"[12] అంటూ మేనరికపు సంబంధాల్లో, పెళ్ళి సంబంధాల్లో విద్యా వ్యవస్థ కలిగించే మార్పును సారవ్వ మాటల్లో చూడవచ్చు.

### తిరిగి గెలుచుకున్న జీవితాలు

జైల్లో నుండి బయటకు వచ్చిన వీరు కొత్త ఆశయాలతో కొత్త ఆశలతో సమాజంలోకి వెళ్తారు. శారద ఉద్యమంలోకి వెళ్తుంది. సారవ్వ టైలర్ పని నేర్చుకుని మంచితనంతో ఆవూరి సర్పంచ్ అయింది. సుశీల మగవాళ్లంతా చెడ్డవాళ్లనే అభిప్రాయంతో ఉంటుంది.

ఈ కథలో విద్యాధరరావు వయస్సు మళ్ళిన, భార్య పోయిన స్నేహితుడు రమేష్‌కు పెళ్ళి చేసుకోవాలనే కోరికను హర్షిస్తూ ఓడిన జీవితాల్ని గెలుచుకున్న శారదనో, సారవ్వనో, సుశీలనో ఎవరో ఒకరిని పెళ్ళి చేసుకొమ్మని ప్రతిపాదించడంతో కథ ముగుస్తుంది. 'తల్లి సాలు పిల్లడు' కథలో కూడా ఇలాంటి ప్రతిపాదన కనపడుతుంది.

### అవకాశమిస్తే ఎంతైనా ఎదుగుతారు అని చెప్పే 'చెలిమ'

దళిత స్త్రీలు రాజకీయాధికారంతో సాధించిన ఆత్మవిశ్వాసం, చదువువల్ల తెలుసుకొన్న జీవితం, పెళ్ళి సంబంధాల్లో వస్తున్న మార్పును "చెలిమ" కథలో చూడవచ్చు.



### స్థానిక రిజర్వేషన్లు స్త్రీలలో తెచ్చిన చైతన్యం

జగిత్యాల దగ్గర ఓ పల్లెటూరులో జడ్పీటిసి సభ్యురాలు ద్యావనవెల్లి కరుణ పెద్దక్క కూతురు శృతికి చీరకట్టిస్తున్నారని రేపు అక్కడికి వెళ్దామని సర్పంచ్ మ్యాకల లక్ష్మితో చెబుతుంది. మరుసటి రోజు ఇద్దరు కలిసి ఆవూరు వెళ్తారు. ఆ వూర్లో బొందలగడ్డ సుధాకర్‌ను పెళ్ళి చూపులు చూడడం అసలు పని. శృతి ఫంక్షను ఆలస్యం అవుతుందని, ఆవూరు సర్పంచ్ భూమయ్య దగ్గరకువెళ్ళి ప్రభుత్వ పథకాలు అమలు చేయాల్సిన తీరు తెలుసుకుంటారు. ఈ సమయంలో బొందలగడ్డ సుధాకర్ బి.ఇడి. పూర్తిచేసిన యువకుడు ఆవూర్లో స్కూల్ పెట్టాలని ఆలోచనతో లోన్ కావాలని భూమయ్య దగ్గరకు వస్తాడు.

### నేటి పెళ్లిచూపుల పద్ధతి మారాలి

### ఆడపిల్లే మగపిల్లవాడింటికి పెళ్లిచూపులకు వెళ్లిరావాలి

ఆ తర్వాత భూమయ్య కరుణ, లక్ష్మిలను వెంట బెట్టుకుని సుధాకర్ ఇంటికి తీసుకువెళ్తాడు. ఇంటి విషయాలు మాట్లాడుకున్న తర్వాత లక్ష్మి కరుణలకు భూమయ్య సుధాకర్ తల్లిదండ్రులను పరిచయం చేస్తాడు. అసలు విషయం లక్ష్మికి సుధాకర్‌తో వివాహ సంబంధం కుదుర్చుకోవడానికి లక్ష్మి వచ్చిందని కరుణ భూమయ్యకు చెబుతుంది. "అసలు నన్నడిగితే పిల్లనే పిలగానింటికి పిల్లగాన్ని చూడపోవాలె.తన అత్తగారిల్లు, పరిసరాలు ఎట్లా ఉంటాయో ఆడపిల్లకే తెల్సుకోవడం అవసరం. ఎందుకంటే పిల్ల అత్తగారింట స్థిరపడ్తది కాని పిలగాడు కాదుగదా, అందుకని పిలగాని యింటికాన్నే పిల్లగాన్ని పెండ్లి పిల్ల తీరు కూసోపెట్టి పిల్ల, పిల్లతల్లిదండ్రులు సూసి మాట్లాడాలే"[13] అంటూ పెళ్ళి సంబంధాలలో రావలసిన నూతన మార్పును ఈ కథలో ప్రతిపాదిస్తారు.

అవకాశం వస్తే పేద మహిళలు కూడా ఎంత ఎత్తుకు ఎదగగలరో ఈ కథ స్పష్టం చేస్తుంది. భావాలు చెలిమ వంటివి. చల్లిన కొద్దీ ఊరుతుంటాయి. అవకాశాలు ఉన్నప్పుడే అది సాధ్యమవుతుంది.

డా॥ కేతు విశ్వనాథరెడ్డిగారు అన్నట్లు"తెలంగాణా భూమిక అర్థమైతే తప్ప రాములు ఒకంతట అర్థం కాదు; రాములు 'తల్లిసాలు' అర్థమైతే తప్ప, ఆయన కథల్లోని జనప్రేమ పూర్తిగా అవగతం కాదు; జనప్రేమలోని భిన్న పార్శ్వాలు అవగాహనలోకి రావు.

రాములు సృష్టించిన కథాపాత్రలు చెప్పిన తెలంగాణా చరిత్ర మనకు ఈ కథల్లో కనపడుతుంది. ఇది మౌఖిక చరిత్రే కావచ్చు. చరిత్ర చెప్పినవాళ్లు చరిత్రకారులు కాకపోవచ్చు. కానీ చరిత్రలో భాగమైన మనుషులు చెప్పిన చరిత్ర అది. ఆత్మకథను కూడా చెప్పడం ద్వారా ఆయన కూడా ఆ చరిత్రలో భాగం అయ్యారు.

బహుజన ప్రేమకథలు సమాజ ప్రేమకథలు, భార్యాభర్తల సమస్య చిత్రణ ద్వారా వైరుధ్యం కుటుంబభారాలూ, ఆశలూ, ఆశయాల మధ్య ఉండే నిరంతర ఐక్యఘర్షణ మనకు అవగతమవుతుంది. సొంత పేరులేని ఇల్లాలి బాధల పాటల పల్లవి 'ఇల్లాలు'.

అజ్ఞాతంలోకి వెళ్లిన భర్త నీడ సైతం భార్య జీవితాన్ని ఏ రకంగా ధ్వంసం చేస్తుందో ఈ కథ ద్వారా మనకు అనుభూతమవుతుంది. దళితవాద, స్త్రీవాద దృక్పథాలనుంచి చర్చించవలసిన కథ ఇల్లాలు.

బహుజన కథలు తెలంగాణా నేలమీద జరుగుతున్న నక్సలైట్ ఉద్యమ సమస్యల్ని ప్రత్యక్షంగా, పరోక్షంగా, నేపథ్యంగా ప్రభావకాంశంగా చిత్రించినవి. ఆ ఉద్యమంలోని అనేక సామాజికాంశాల్ని చర్చకు తెచ్చిన కథ దక్షయజ్ఞం. పేదరికం, సామాజిక వ్యత్యాసాలు, దోపిడీ, కోస్తాంధ్ర పెట్టుబడి విస్తరణ, రాజ్యహింస, ఉద్యమంలోని ఎగబాకుడు తత్వం, యాంత్రికత, కఠినత్వం, మీటింగుల మేరకే ఉండే మేధావి ఉద్యోగుల విప్లవ వాగాడంబం, అగ్రకుల నాయకుల అవకాశాలు, బయటికి వచ్చిన నక్సలైట్ల అభద్రత, ఓడిపోయే జీవితాన్నిచ్చిన పరిస్థితులు ఇలా ఎన్నెన్నో అంశాలు దక్షయజ్ఞంలో చర్చకు వస్తాయి." (స్మృతి కథలు పేజీ 10).

నండూరి రామమోహనరావుగారన్నట్లు "సదువు' కథ చిన్ననాటినుంచి మామూలు చదువులపట్ల విముఖత పెంచుకుని స్వేచ్ఛ, మానవత్వం, కరుణ, ప్రేమ - వీటిని అలవరుచుకోవడమే అసలైన చదువని నమ్మి తన ఆశయాలకు అనుగుణంగా ఆదర్శప్రాయంగా జీవించిన వ్యక్తి ఔన్నత్యాన్ని చిత్రించింది. నిజానికిది ఒక నవలగా విస్తరించదగిన మంచి ఇతివృత్తం."

డా॥ కాలువ మల్లయ్యగారన్నట్లు "చాలామంది రచయితలు కులవృత్తులు నశిస్తున్నాయని వాపోతూ 'భూమి' పట్ల కాల్పనిక భ్రమలు కలిగి ఉంటే రాములుగారు కులవృత్తులు ఎంత తొందరగా వదిలితే అంత మంచిదని స్పష్టం చేస్తారు. కులవృత్తుల్నించి బయటపడి కార్మికవర్గంగా రూపుదిద్దుకుంటున్న క్రమాన్ని కథల్లో విశ్లేషిస్తారు." ఇలా బి.ఎస్. రాములుగారి స్మృతికథల సంపుటి భారతీయ సాహిత్యంలో ఒక ప్రత్యేకత సంతరించుకుంది. వీటి ఇతివృత్తం, కథావస్తువు, శైలీశిల్పం, దృక్పథం జీవితంపట్ల చూపు అన్నీ ప్రత్యేకమైనవే, విశిష్టమైనవే.

"గడిచిన జీవితమే చరిత్ర. అలవాటైన జీవితా విధానమే సంస్కృతి. మానవ సంబంధాలూ, సంస్కృతీ పరిణామాల చిత్రణే అసలైన చరిత్ర. గడిచిన జీవితాన్ని సంస్కృతిని చిత్రించడమే కథలు, నవలలు చేసేపని. రాబోయే జీవితాన్ని చిత్రించినా గడిచిన జీవితంగా చిత్రించడమే కథల్లో, నవలల్లో సాధ్యం. దీన్నే సోషలిస్టు వాస్తవికత అని అంటారు. సమగ్ర దృక్పథంతో చిత్రిస్తే సాహిత్యమే అసలైన చరిత్ర." ఇలా ఈ కథలు చారిత్రక భౌతిక వాద దృక్పథంతో గతం కన్నా వర్తమానం, వర్తమానం కన్నా భవిష్యత్తు ఉజ్వలంగా ఉంటుందని జీవితం పట్ల ఆశను, విశ్వాసాన్ని పెంపొందిస్తాయి. 'చెలిమ', 'తెల్లబట్ట' కథలు అందుకు ఒక తాజా ఉదాహరణ. ఓడిపోయిన జీవితాన్ని కూడా తిరిగి గెలుచుకునే క్రమాన్ని వీరు కథల ద్వారా సూచించారు. ఇది మరింత విస్తృతంగా ఎలా సాధించారో 'మమతలు మానవ సంబంధాలు' కథల సంపుటిలో పరిశీలిద్దాం.

కర్రె సదాశివ్



## మమతలు మానవ సంబంధాలు

**(కుటుంబ సంబంధాల్లో సామాజిక ఆర్థిక చరిత్ర)**

ఈ కథల సంపుటి గురించి సుప్రసిద్ధ సాహితీవేత్తలు చెప్పిన రెండు మాటలు చూద్దాం!

"కథల కోసం పురాణాలు తిరగేయనక్కర్లేదు. చరిత్రలను తవ్వి చూసే అవసరం లేదు. జానపదగాథలను మననం చేసుకోవలసిన పని లేదు. చూడగలిగే కన్నుంటే రాయదగిన కథాంశాలెన్నో దొరుకుతాయి.

శ్రీ బి.ఎస్. రాములుకు ఆ కన్నుంది. చూసిన ప్రతిదాన్నీ తరిచి చూసే చూపుంది. అందిన ఏ చిన్న అంశాన్నైనా కథగా రూపొందించే ప్రతిభ ఉంది. రాములు కథకుడు మాత్రమే కాదు, సామాజిక శాస్త్రవేత్త. అందువల్ల ఆయన కథల్లో మానవసంబంధాలు ప్రధాన వస్తువులయ్యాయి." - డా॥ సి. నారాయణరెడ్డి.

"ప్రత్యక్ష జీవితానుభవం, లోతైన అధ్యయనం, విభిన్న కోణాల నిశిత పరిశీలన, నిర్దిష్టావగాహనాసూత్రం ఉన్నవారికి రచనాసామర్థ్యం తోడయితే వెలువడే సృజనాత్మక సాహిత్యం అది నవలయినా, కథయినా, కవితయినా తప్పనిసరిగా ఆసక్తిదాయకాలవుతాయి. బి.ఎస్. రాములుగారి ఈ సంపుటిలోని కథలు ఆ కోవలోకి వస్తాయి. రాములుగారు వీటన్నిటినీ ఒక నిర్దిష్ట లక్ష్యంతో, ప్రణాళికాబద్ధంగా ప్రయోజనానుద్దేశించి రాసినవే.

ఈ కథలలోని జీవనగతులు నా అవగాహనకు అందేవే గాని, వాటి చుట్టూగల భౌతిక పరిసరాలను బట్టి అవి నాకు ప్రత్యక్షంగా తెలిసిన జీవితాలు కావు. అయినా, ఆ మనుషులు, ఆ మనస్తత్వాలు, ఆ పరిసరాలు, ఆ పరిణామాలు నాకు తెలిసినవే అన్నట్లెందుకున్నాయంటే, చిత్రితాంశం సార్వత్రికం, సార్వజనీనం కనుక. వేర్వేరు దశలలో ఇలాంటి పరిణామాలు ప్రతిచోటా సంభవించినవే. జరుగుతున్నవే, జరగనున్నవే!" - చలసాని ప్రసాదరావు.

"మమతలు, మానవసంబంధాలు' కథల సంపుటిలో 16 కథలున్నాయి. వీటిని రెండు భాగాలుగా వర్గీకరించారు. ఒకటి, కుటుంబసంబంధాల్లో సామాజిక ఆర్థిక చరిత్ర. రెండు, సామాజిక, ఆర్థిక చరిత్రక్రమంలో మానవసంబంధాలు.

మొదటిభాగంలో పాతచీర, వరుసలు, వరలక్ష్మి, తులసి, కొత్తచిగురు, వేదవతి, ప్రేమధార, పంజరం కథలున్నాయి. ఇవి పాత్రల ఆధారంగా నడిచే కథలు. రెండవ భాగంలో మలుపులు, ప్రేమికులు, రాజకీయం, తల్లిపాలు, మమతలు, సహజీవనం, ఐదవవాడు, వారసత్వం అనే కథలున్నాయి. ఇవి పాత్రలద్వారా నడిచినప్పటికి ఈ కథలు సామాజిక చరిత్ర ప్రధానంగా సాగుతాయి. అందువల్ల ఇలా రచయిత తన కథలను రెండు భాగాలుగా వర్గీకరించడం జరిగింది.

**అనుబంధాలు కాలం తీరిపోతున్న తీరును తెలిపే 'పాత చీర'**

మొదటిభాగంలోని 'పాతచీర' కథ మారుతున్న సమాజంలో పాతబడిపోతున్న మానవసంబంధాలు శిథిలమవుతున్న క్రమాన్ని తెలుపుతుంది. 'పాతచీర' అందుకు ఒక ప్రతీకగా తీసుకోబడింది. దాంతోపాటు చేనేతవృత్తికి సంబంధించిన ఇసిరెలను కూడా ప్రతీకగా తీసుకోవడం జరిగింది. పాతచీర ఎంత గొప్పదైనప్పటికి చింపి పిల్లల పీతిగుడ్డలకు వాడతారు. చేనేత పనిముట్లపై ఎంత ప్రేమ ఉన్నప్పటికీ వాటిని పాత సామానువాడికి అమ్మివేస్తారు. అలాగే ఎంత ప్రేమ ఉన్నప్పటికీ మూడుతరాల నాటి బంధుత్వాలు సంబంధాలు కోల్పోయి ఇలాగే వదులుకుంటారు. అదృశ్యమవుతుంటాయి. ఈ తాత్విక కోణాన్ని చెప్పడానికి రచయిత ఈ కథావస్తువును ఎన్నుకున్నారు. ఉమ్మడికుటుంబం చదువుల వల్ల, ఉద్యోగాలవల్ల, ఇతర ప్రాంతాల్లో నివసించడంవల్ల వ్యక్తికుటుంబాలుగా మారుతూ పాత చుట్టాలు, వారి పరిచయాలు కాలం తీరిపోవడం ఈ కథలోని ఇతివృత్తం. ఈ కథాశిల్పం పఠనీయంగా ఉంటుంది.

"నెలరోజులుగా చుట్టాల తాకిడి. రాజేశ్వరమ్మకు ఊపిరి సలపకుండా ఉంది. మూడో కూతురు లావణ్య రెండో ప్రసూతికని ఇంటికొచ్చిన కాన్నించి ఈ తాకిడి మొదలైంది. పి.జి. చేస్తున్న నాలుగో కూతురు వనజ పెళ్లిచూపుల పేర బంధువుల తాకిడి యింకా సాగుతూనే ఉంది.

లావణ్య ఆసుపత్రిలో ప్రసవించింది. చిన్నాపరేషను చేశారు. పెద్దకూతురు విజయ అత్తగారు... చూసిపోవడానికి వచ్చి రెండు రోజులుంది. రెండో వియ్యంకుడు అలా వచ్చి యిలా వెళ్లాడు. రాజేశ్వరమ్మ తమ్ముళ్లు, మరదళ్లు ఓ పూట ఉండి వెళ్లారు."

కాలం తీరిపోయే క్రమంలో మానవీయ సంబంధాలు, వాటి సన్నివేశాలు ఎలా ఉంటాయో ఈ కథలో చూడవచ్చు. రాజేశ్వరమ్మ లింగయ్య దంపతులకు ఇద్దరు కొడుకులు, నలుగురు కూతుళ్ళు. వారికి పెళ్ళిళ్ళు చేసిన నాలుగేళ్ళకు తల్లిదండ్రుల మరియు అత్తమామల హోదా కోల్పోయి కేవలం ముసలి బంధువులుగా మిగులుతారు. రెండో కొడుకు విశ్వనాథం, కోడలు కళావతి చేతుల్లోకి కుటుంబ బాధ్యతలు మారుతాయి.

మూడో కూతురు లావణ్య కాన్పుకు తల్లిగారింటికి వస్తుంది. నాలుగో కూతురు వనజ పెళ్ళి చూపులకు బంధువులు, మేనమామ,మేనత్త, చిన్నమామలు వస్తారు. కోడలు



కళావతి వారిని గుర్తుపట్టలేక పోగా కనీసం మంచినీళ్ళు ఇచ్చి, మర్యాదగా ప్రవర్తించలేక పోతుంది. ఆధునిక జీవనంలో మనిషికి, మనిషికి మధ్య పరిచయాలు ఎందుకు నిలువలేకపోతున్నాయో అని రాజేశ్వరమ్మ బాధపడుతుంది. ఈ క్రమంలో కోడలు కళావతి బీడీలు చేస్తూ, చీరలు అమ్ముతూ జీవనం సాగిస్తుంది.

పాత సామాను అటుకు మీద ఉన్న కారణంగా ఎలుకలు ఉండి చీరలను కొరికేస్తున్నాయని, పాత సామాను అమ్మేయమని భర్త విశ్వనాథంతో కిందకు దించుతుంది. కాని పాత సందుగలోని చీరను చూసిన రాజేశ్వరమ్మ "తమ యింట్లో జరిగిన శుభకార్యాలన్నింటికి ఈ పాత చీరే సాక్షి. రెండో కూతురు పెళ్ళినాడు ఈ చీర కట్టుకునే కాళ్ళు కడిగింది. రెండో కోడలి పెళ్ళిలోనూ తను ఈ చేరే కట్టుకుంది. ఎన్ని పురుళ్ళో, పుట్టు వెంట్రుకలో... మరెన్ని పండుగ పబ్బాలకో ఈ చీర కట్టుకుంది. మేనమామ వీరయ్య ప్రత్యేకంగా నేయించి తల్లిగారి తరుపున తాము యీ యిల్లు కట్టి యిండ్లల్లకు పోయినపుడు పెట్టిన అద్భుతమైన తొమ్మిది గజాల జరీ అంచు చీర"[1] అంటూ తన అనుభవాలతో కలిసిన జ్ఞాపకాలను గుర్తు చేసి మేము బ్రతికినంతకాలం ఈ చీర ఉంచమని కొడుకు విశ్వనాథంతో అంటుంది.

లావణ్య రెండో కూతురు నామకరణోత్సవానికి దూరపు బంధువులు, కొడుకు కోడళ్లు అల్లుండ్లూ బిడ్డలూ వస్తారు. వనజ కూడా తన స్నేహితులతో వస్తుంది.

పురుడు అయిపోయాక కళావతి, నీళ్లు చాలవు, పాలు చాలవు. కూరగాయలు చాలవు. గిన్నెలు చాలవని తన అసౌకర్యాన్ని వ్యక్తపరుస్తుంది. తననెవరూ గుర్తించలేదని రాజేశ్వరమ్మ మేనమామ వీరయ్య కన్నీళ్ళు పెట్టుకుంటాడు. రాజేశ్వరమ్మ ఆలోచిస్తూ "ఎంతోమంది పాత చుట్టాలు. ఎవరితో ఏ పని పడదు. వాళ్ళు అంతే. ఆడపిల్లలకు పెళ్ళిసంబంధాలు వెతకడానికి తప్ప ఈ బంధుత్వాల అవసరాలే అంతరిస్తున్నాయి. కొత్త వియ్యంకులు, వియ్యపురాళ్లు, కొత్త కోడళ్లు, అల్లుళ్ళు, వారి తల్లిదండ్రులు, వారి తోడల్లుళ్లు, వారితో సంబంధాలు కలుపుకు పోవడమే జీవితం అయిపోయింది. ఈ చదువులు, ఉద్యోగాలతో పిల్లలకు పాత చుట్టాలు ఎలా చుట్టాలో తెలియని దశ వచ్చేసింది. వయస్సు, హోదా, అభిరుచుల అంతరాల రీత్యా పాత చుట్టాల పిల్లలతో తమ పిల్లలకు స్నేహమే లేకుండా పోయింది"[2] అంటూ పలుచనైపోతున్న మానవ సంబంధాలు, కనుమరుగవుతున్న ప్రేమ, ఆప్యాయతలు జీవిత చరమాంకంలో తోడు, నీడగా ఉండాల్సిన కొడుకులు, కోడళ్ళ సూటిపోటి మాటలకు, కలుక్కుమనే వృద్ధ దంపతుల హృదయ వేదన ఈ "పాత చీర" కథలో చూడవచ్చు.

**వ్యవసాయం, కులవృత్తులు, వలసలు గ్రామీణ సమాజాన్ని ఆదుకోలేకపోయిన తీరును తెలిపే 'వరుసలు'**

'పాతచీర' కథకు కొనసాగింపుగానే 'వరుసలు' కథ ఇతివృత్తం కొనసాగుతుంది. దీని శైలీశిల్పం వేరు. ఈ కథ బస్సులో మొదలవుతుంది. పాత్రలు, కథావస్తువూ కూడా

దేనికది ప్రత్యేకమైనది. ఈ కథ ఉత్తమ పురుషలో సాగుతుంది.

కథానాయకుడు చదువుకుని చిన్న ఉద్యోగిగా జగిత్యాలలో ఉంటున్నాడు. భార్య సహకరించక ఏ ఫంక్షన్లకు వెళ్ళలేకపోతాడు. దానివల్ల పాత బంధువులు వారి పిల్లలు పరిచయం లేక, పిల్లలకు వరుసలు అవసరం లేక బంధుత్వాలు విచ్ఛిన్నమవుతున్నాయని బాధపడతాడు.

అతని అమ్మమ్మ వారు జగిత్యాలకు నాలుగు కిలోమీటర్ల దూరంలోని జాప్తాపురం. అది పల్లెటూరు. వరుసకు అన్న కూతురు పెళ్ళి అని శుభలేఖ రావడంతో పాత బంధువుల పరిచయాన్ని రెన్యూవల్ చేసుకొనే అవకాశం వదులుకోదలుచుకోలేదు. భార్యా పిల్లలను తీసుకొని చిన్ననాటి జ్ఞాపకాలు, అనుభవాలు నెమరువేసుకుంటూ బస్సులో ఆ ఊరు చేరుకుంటాడు. అప్పటికే పెళ్ళి తంతు జరుగుతూ ఉంటుంది. పెళ్ళిలో అందరు వివిధ వరుసలతో పిలుస్తున్నారు. "ఇలా మా తరంతోనే ఈ పల్లెటూరి చుట్టరికాల వరుసలు అదృశ్యమైపోతున్నాయి అని నిట్టూర్చాను. ఇప్పుడు కొందరు నన్ను బావ, మావయ్య, బాబాయి అనే బదులు గంపగుత్తగా 'సారు' అనే వరుసతో పిలుస్తున్నారు. ఎందుకిలా జరుగుతుంది"[3] అంటూ వేసుకునే ప్రశ్నలు మనలను ఆలోచింపచేస్తాయి.

పెళ్ళి భోజనాలయ్యాక తన పెద్ద అన్న మాటతో సాయంత్రం ఉండాలనుకుంటాడు. పెద్దమ్మ మనుమడిని వెంటతోలుకొని సురేష్ ఇంటికాడ భుక్తాయాసం తీర్చుకోవడానికి బయలుదేరుతాడు. మేనమరదలు సరస్వతి కాళ్లకు నీళ్ళు ఇచ్చి ఆహ్వానిస్తుంది. ఆమె తన మేనమరదలు అని గుర్తుపట్టలేకపోతాడు. సరస్వతే పరిచయం చేసుకుంటుంది. అతడు కూడా తన భార్యను సరస్వతికి పరిచయం చేస్తాడు. సరస్వతిని అడగడానికి తల్లిదండ్రులు వెళ్తే నిరాకరించిన సంగతి గుర్తు చేసుకొంటూ "ఇంటిముందు జాగలేదు ఇంటెనక జాగలేదు. ఓ పొలం లేదు, పెరడులేదు. ఏ పూటది ఆపూట కొనుక్కొని తింటారు. వ్యవసాయం ఉన్న ఇంటికిస్తే ఏడాది గాసం ఇంటినిండా ఉంటుంది. ఏది కొనుక్కోనవసరం ఉండదు. అని నన్ను అల్లున్ని చేసుకోవడానికి వరుస మేనమామలు నిరాకరించారు. నాకోసం పిల్లనిమ్మని అడిగి అమ్మ, అమ్మమ్మ అవమానంతో ఇంటికి తిరిగి వచ్చారు"[4] అంటూ వ్యవసాయానికి ప్రాధాన్యతనిచ్చి, విద్యా ప్రాధాన్యతను గుర్తించని ఆనాటి కాలాన్ని, పల్లెటూరు దృక్పథాన్ని గుర్తుచేస్తాడు.

సరస్వతి తండ్రి నిరాకరించిన కథానాయకుడుతో "బావా! నీ బతుకు మధ్య తరగతి కుటుంబంగా ఎదిగి నా బతుకు బీడి కార్మికురాలిగా భర్త బట్టలమిల్లు కార్మికునిగా మారడానికి కారణమేంటని సరస్వతి అడుగుతుంది.

"అది సరే బావా! ఆధునిక అభివృద్ధి అందుకోవాలన్నావు. వ్యవసాయంలో ఎన్నో ఆధునిక పద్ధతులు వచ్చాయి. అనుసరిస్తూనే ఉన్నాము. బట్టల మిల్లులు కూడా ఆధునిక అభివృద్ధే గదా! అయినా మేం ఎందుకు వెనుకబడ్డట్టు"[5] అంటూ వ్యవసాయాన్ని నమ్ముకున్న వారి బ్రతుకులు మంచిగలేవని, ప్రభుత్వ ఉద్యోగాలు చేసేవారు సుఖంగా ఉంటున్నారని అంటుంది.



ప్రజల కోసమే ఏర్పడిన ప్రభుత్వాలు వ్యవసాయం, తదితర గ్రామీణ వృత్తుల పట్ల నిర్లక్ష్య వైఖరిని చూపుతున్నాయి. యాభై ఏళ్ళలో పల్లెటూరి జీవితాలు పూర్తిగా శిథిలమై, పట్టణ జీవితాలు మాత్రం మధ్య తరగతి జీవితాలుగా ఎలా ఎదుగుతూ విస్తరిస్తూ వస్తున్నాయో, వ్యవసాయదారులు పేదరికంలోనికి ఎలా మారిపోతున్నారో ఈ కథ తెల్పుతుంది. పల్లెటూళ్లలోని వారు వ్యవసాయంపట్ల ఎక్కువ శ్రద్ధతో చదువును అశ్రద్ధ చేయడం వల్ల వాళ్ళ వ్యవసాయం గిట్టుబాటు కాక, ఇతర ప్రాంతాలకు కూలీలుగా, కార్మికులుగా వలసలు కొనసాగాయి. కాలక్రమంలో అరబ్ దేశాలకు కూడా ఈ వలసలు కొనసాగాయి. సింగరేణి గనులు లేకపోయి ఉంటే ఆ కార్మికులు కూడా ఇలాగే వలసలు వెళ్ళవలసి వచ్చేదని, బీడి పరిశ్రమల వల్ల స్త్రీలకు ఉపాధి దొరికి వారి పిల్లలు చదువుకుని, ఉద్యోగాల కెదగడం సాధ్యపడిందని ఈ కథద్వారా తెలుస్తుంది.

**ఆస్తి అంతస్తు పెరిగాక విచ్ఛిన్నమవుతున్న వైవాహికసంబంధాలు 'వరలక్ష్మి'**

తల్లిదండ్రులకు తమ పిల్లలందరూ బాగుండాలని ఉంటుంది. అందరినీ సమానంగా చూస్తుంటారు. ఎదగలేకపోతున్నవారిపట్ల కాస్త ఎక్కువ ప్రేమ చూపిస్తారు. ఎదుగుతున్నవారినుంచి వారికి సహకారం అందించాలని ఆశిస్తారు. అయితే తోడబుట్టినవాళ్లైనప్పటికీ వాళ్లు తమ పిల్లలకు ప్రాధాన్యతనిస్తారు. తోడబుట్టినవారికి ప్రాధాన్యత ఇవ్వరు. తద్వారా తల్లిదండ్రుల ద్వారా కొనసాగే సోషలిస్టు సమాజం ప్రతి తరంలో విచ్ఛిన్నమవుతూ వస్తున్నది. ఈ ఇతివృత్తంతో, తాత్వికదృక్పథంతో ఈ కథ రాయబడింది.

లక్ష్మీనారాయణ – ఎల్లమ్మ దంపతులకు ముగ్గురు కొడుకులు, ఒక బిడ్డ. వీరిలో వరలక్ష్మిని అల్లారు ముద్దుగా పెంచుతారు. కొడుకులు సొంత వ్యాపారం చేసుకుంటూ బతుకుతున్నారు. వరలక్ష్మికి చెవుడు. దాంతో మాటలు కూడా సరిగ్గా రావు. కాని అన్ని పనులు చక్కగా చేస్తుంది. చిన్నప్పుడే మేనబావకిస్తామని పేరుపెట్టుకుంటారు. అలాగే బాల్యవివాహం జరుగుతుంది. పేదరాలైనా సొంత చెల్లెలు కొడుకని అల్లుణ్ణి ఎదిగించడానికి ఎన్నిరకాలుగానో సహకరిస్తాడు. అల్లుడు ఆ ఆసరా అందుకుని రోజురోజుకీ ఎదుగుతాడు. ఎదిగే క్రమంలో అతని అభిప్రాయాలు మారుతుంటాయి. తనకు ఈ భార్య తగదని భావిస్తాడు. కాని ఐశ్వర్యమంతా ఈ భార్యవల్లే వచ్చిందని అతనికి తెలుసు. అయినప్పటికీ విడాకుల కోసం పంచాయితీ పెడతాడు. ఏదో పండక్కి ఇంటికి వెళ్లిన భార్యను మళ్లీ తీసుకురాడు. అలా పంచాయితీ మొదలవుతుంది. ఆమెపట్ల ఏ ఆరోపణ చేయలేకపోతాడు. ఏమైనా చెడు నడవడి కనపడిందా అని పెద్దమనుషులు అడిగితే ఉగ్రుడవుతాడు. మరి ఎందుకు విడాకులు అని అడిగితే జవాబు చెప్పలేకపోతాడు. చివరకు విడాకులు ఇస్తారు. ఆ తరువాత అతడు మరో పెళ్లి చేసుకుంటాడు. ఆ సుఖాల్లో భాగం పంచుకోవలసిన వరలక్ష్మి బేలగా ఏడుస్తూ ఇంట్లో ఉండిపోతుంది. మొదటి సంబంధం దొరకడమే కష్టమయ్యే కాలంలో చెవుడున్న కూతురికి రెండో సంబంధం దొరకడం ఎంతో కష్టం. ఒక పేద ఇంటి పిల్లవాడిని వెతికి రెండోపెళ్లి చేస్తారు. ఆ

కూతురు కుటుంబం నిలబడాలని తల్లిదండ్రులు వారికి సహాయం చేస్తారు. కొడుకులు దాన్ని వ్యతిరేకిస్తారు. తల్లిదండ్రుల హృదయం కలుక్కుమంటుంది. తాము సంపాదించింది తమ కూతురికి పెట్టుకునే హక్కు కూడా లేనందుకు బాధపడతారు. అదే రంధితో తండ్రి గుండెపోటుతో మరణిస్తాడు.

కథ చివర్లో కుటుంబంలోని సోషలిస్టు సమాజం ఎలా అంతరించిందో సామాజిక తత్వవేత్త అయిన రచయిత ఇలా చెప్తారు: "ఒక తరం ముగిసింది. ఒక క్రమం ముగిసింది. ఆరునెలల్లో కొడుకులు ఆస్తులు పంచుకొని మూడు కుటుంబాలయ్యారు. అమ్మ ఎవరి పంచన ఇష్టంలేక తనకు తానుగా బ్రతుకుతుంది. ముగ్గురన్నదమ్ములు తలా ఒక బంగ్లా, వ్యాపారం పంచుకొని స్థిరపడ్డారు. అలా ఒక సోషలిస్టు నమూనా ఉమ్మడి కుటుంబం తండ్రి మరణంతో అంతరించింది. వరలక్ష్మి పేదల్లో ఒక పేదరాలుగా కలిసిపోయింది."

**పెంచి పోషించిన త్యాగాలు లెక్కకురాని తల్లుల కథ 'తులసి'**

'బూడిదకు నీ గతమేదంటే కోపం రాదా' అన్నాడు ఒక గజల్లో సినారె. మండి మండి ఎవరైనా చివరికి బూడిదవుతారు. శక్తులుడిగి అశక్తులవుతారు. అశక్తులయ్యాక వారిని అవమానిస్తే ఆ అవమానాలు రేపు వీరు కూడా పొందవలసి ఉంటుంది. తాతకు కేటాయించిన మట్టిచిప్ప పగిలిపోతే మనవడు ఏడ్చాడట. ఎందుకేడుస్తున్నావని తండ్రి అడిగితే రేపు నీక్కూడా అందులోనే పెట్టాలి కదా! చిప్ప పగిలిపోయె కదా! మళ్లీ నేను కొనాల్సివస్తుంది గదా అని ఏడ్చాడట. అప్పుడు తండ్రికి తల తిరిగిపోయింది. తను చేస్తున్న తప్పు ఏమిటో తెలిసింది.

'తులసి' కథలో వ్యక్తి కుటుంబాలు ఏర్పడ్డాక భార్యాభర్తల్లో ఒకరు పోయాక మిగిలిన ఒకరు ఎవరి పంచనో చేరాల్సివస్తే వారి బతుకు ఎంత దుర్భరంగా ఉంటుందో చిత్రిస్తారు. మరీ ముఖ్యంగా ఆస్తిపాస్తులు కూడబెట్టలేని ముసలివాళ్ల పట్ల పిల్లల ప్రవర్తన మరీ నీచంగా ఉంటుంది. మారుతున్న మానవసంబంధాలు ఏదో కోపంతో తల్లిని, అత్తను విసుక్కుంటే పిల్లలు నిజంగానే ఆమెను నీచంగా చూడ్డం జరిగిన తీరు ఈ కథలో కనబడుతుంది. నిజానికి కొడుకు కోడలుకు ప్రేమ లేక కాదు, కాని మనవలు ఆ అనుబంధాలు ఫీల్ కారు. అలా ఫీల్ కాకపోవడానికి తల్లిదండ్రులు వ్యక్తం చేయాల్సిన ప్రేమ, ఆత్మీయతల్ని వ్యక్తం చేయకపోవడమే కారణం.

తులసమ్మకు ముగ్గురు కొడుకులు. భర్త పోయి పెద్దకొడుకు ఆనంద్, కోడలు సౌమ్యల వద్ద ఉంటుంది. ఆనంద్, సౌమ్యలు ఇద్దరు ఉద్యోగస్థులు. వారు తులసమ్మ పట్ల ఏ విధంగా ప్రవర్తిస్తారో పవన్, ఆదిత్యలు బామ్మ పట్ల అదే విధంగా ప్రవర్తిస్తారు. పిల్లల సేవా, ఇంటిపని తులసమ్మే చేస్తుంది. అయినా కొడుకు, కోడలు, మనుమలు పనిమనిషి కన్న హీనంగా చూస్తారు.

చిన్నకొడుకు అవినాష్ దగ్గరకు పదిరోజుల విశ్రాంతి కోసం వెళుతుంది. తులసమ్మ చిన్నకోడలు ఉర్మిళ కూడా పెద్దకోడలులాగానే చూస్తుంది. అత్తను తిట్టే ఛాన్స్ కోసం



ఎదురు చూస్తుంది. పిల్లలు అడిగినవన్ని చేసిపెడితే నెలరోజులకు కావాల్సిన సరుకులు పదిరోజుల్లోనే అయిపోయాయని తిడుతుంది. అవినాష్ అన్నయ్యను బాగా చదివించావని గుర్తు చేస్తాడు. తులసమ్మ "నువ్వు ఇంటర్ ఫెయిల్ కాకుండా చదువుకొని ఉంటే నీకూ అప్పోసప్పో చేసి పెట్టేవాల్లం కదా! మీ చదువులకు అంతా ఖర్చయిపోయింది. మెడ మీది గుండ్లతో సహా ధారపోసాను. ఇప్పుడు నా దగ్గర ఆస్థి ఏమి లేక మీ అందరికి చులకనైపోయాను"[7] అంటూ వృద్ధాప్యంలో తన మానసిక వేదనను బలహీనతను తెలియజేస్తుంది.

తులశమ్మ సొంత చెల్లెలైన కీర్తిశేషురాలైన వర్ధిని కూతురు జయ పెద్దమ్మని సొంత తల్లిలా భావిస్తుంది. ఆమె తనకు తోడు ఉండాలని తొమ్మిదో నెల అని ఉత్తరం రాస్తుంది. చెల్లెలు చనిపోయిన నుండి జయ తననే అమ్మగా భావిస్తుంది. అందుకే ఉత్తరం అందగానే జయ దగ్గరికి బయలుదేరుతుంది. జయ తులసమ్మకు కూతురులా సపర్యలు చేస్తుంది. "తులసమ్మకు జయ చేసే సపర్యలు చూస్తుంటే ఎంతో సంతోషంగా ఉంది. కాస్త మర్యాద, మన్నన, ఒక మంచిమాట, ఒక చిన్న ప్రశంసతో ఎండమావిలా మారిన తులసమ్మ జీవితం కొత్త చిగురు వేసింది. తులసమ్మ ఆరోగ్యానికి జయ ఆప్యాయతే మందుగా పని చేసింది"[8] వృద్ధాప్యంలో ఉన్న వ్యక్తులకు ఒక మంచిమాట, తోడు, నీడ ఎంత అవసరమో ఈ కథ తెల్పుతుంది. నూటిపోటి మాటలు, వెట్టిచాకిరికి ఉపయోగించుకోవడం, పెద్దలు ఎలా ప్రవర్తిస్తే పిల్లలు కూడా అలా ప్రవర్తిస్తారని, ఆధునిక సంస్కృతిని 'తులసి' కథ తెలియజేస్తుంది.

**విరిగిపోయిన అనుబంధాలు పిల్లలతోనైనా కలుస్తాయని ఆశ కలిగించే 'కొత్త చిగురు'**

అన్నదమ్ములు అనేక కారణాలుగా విడిపోతారు. తిరిగి కలుసుకోలేకపోతారు. అందుకు అనేక కారణాలు ఉంటాయి. ఎవరి కారణాలు వారికి ఉంటాయి. కాని వారి పిల్లలకు తమ బంధువులను కలుసుకోవాలని, అన్నాచెల్లెళ్లు హాయిగా ఆత్మీయంగా ఉండాలని ఉంటుంది. వారి ఈ ఆత్మీయ అవసరాలే రెండవతరంలో తిరిగి ఆ కుటుంబాన్ని కలుపుతాయి. ఉమ్మడి కుటుంబం వివిధ పరిస్థితుల వల్ల విడిపోయి కొంతకాలానికి మళ్ళీ ఆ కుటుంబాలు, పిల్లల కారణంగా కలుసుకొని జీవితాన్ని "కొత్త చిగురు"గా పూయించడం ఈ కథ ఇతివృత్తం.

మదనయ్య, మోహన్ అన్నదమ్ములు. తల్లిదండ్రులు చిన్నతనంలో చనిపోవడం వల్ల అన్నా, వదినెలు కష్టపడి మోహన్‌ను ఉద్యోగం వచ్చేవరకు చదివిస్తారు. పెళ్ళి చేసుకొని ఉద్యోగం చేస్తున్న మోహన్ తన సంపాదనలో చిల్లిగవ్వ ఇవ్వనని మోహన్ అంటాడు. "నీ చిన్నప్పుడు వేరుపడితే నీ చదువు సంగతి తెలిసేది. ఎంతో కష్టపడి మేము నిన్ను చదివిస్తే మంచి ఉద్యోగం వచ్చాక మాకు పెట్టాల్సి వస్తుందని వేరు పడతానంటున్నావు పదు! దేవుడు మాకు రెక్కలిచ్చాడు"[9] అని అన్నావదినలు అంటారు. ఇలా మనస్పర్థలతో అన్నదమ్ములు విడిపోతారు.

మోహన్ – లలితలు ఉద్యోగం చేసే చోటనే కాపురం పెడతారు. వీరికి పవన్ – ప్రవీణ్ పిల్లలు కలిగాక కూడా అన్నా వదినల మీద కోపం పోదు. భార్యా, భర్తల మధ్య గొడవ పిల్లలకు అలుసవుతుంది. “లలితా! సాధారణంగా భార్యాభర్తలు అన్యోన్యంగానే ఉంటారు. ఆయా విషయాల చర్చల్లో మొదలయ్యే అభిప్రాయభేదాలే అన్యోన్యతను భంగపరుస్తాయి. నిజం చెప్పు. నీకూ, నాకూ మధ్య ఏముంది? నాకూ నీవూ, నీకు నేను తప్ప ఈ ప్రపంచంలో మనకు వేరెవరు తోడున్నారు?”[10] అంటూ మోహన్ భార్యభర్తల మధ్య అన్యోన్యతను దెబ్బతీసేవి అభిప్రాయాభేదాలేనంటాడు.

పవన్, ప్రవీణ్ సంక్రాంతి, దసరా సెలవుల్లో పెదనాన్న మదనయ్య ఇంట్లో అన్నయ్య, అక్కయ్యలతో గడుపుతారు. పెద్దల గొడవతో పిల్లలను కట్టడి చేయడం సాధ్యపడలేదు. మదనయ్యకు మనమరాలు పుట్టి నామకరణోత్సవ సందర్భంగా అందరూ కలుసుకుంటారు. విడిపోయిన కుటుంబాలు అందరు కలిసి ఆనందంగా ఉంటారు.

## చేజారిన జీవితాన్ని తిరిగి గెలుచుకున్న ‘వేదవతి’

వేదవతి తెలిసీతెలియని వయసులో అనేక ఎగుడుదిగుడులకు లోనవుతుంది. ఆమెను లైంగికఅవసరాలకోసం వాడుకుంటారు. వాడుకున్నవారు పెళ్లికి నిరాకరిస్తారు. వాడుకున్నదెవరో తెలిసి కూడా తల్లిదండ్రులు ఏమీ చేయలేరు. కన్ను తనదే, వేలు తనదే అని బాధపడతారు. ఈ స్థితిలో కాస్త సాంఘిక గౌరవం ఉన్న కుటుంబం కావడంవల్ల వేదవతి తిరిగి జీవితాన్ని గెలుచుకోగలుగుతుంది. చిన్నకులస్తుణ్ణి పెళ్లిచేసుకున్నందుకు మొదట అతని పట్ల హేళనగా ప్రవర్తిస్తుంది. అది చివరకు తనను కూడా కించపరుస్తుందని తెలుసుకుంటుంది. భర్తను తాను గౌరవిస్తేనే సమాజం కూడా గౌరవిస్తుందని తెలుసుకుంటుంది. ఈ జీవిత సత్యాన్ని విప్పిచెప్పిన ఈ కథ ఒక తాత్విక ఇతివృత్తాన్ని మనకు అందిస్తుంది.

దత్తాత్రేయశర్మ – గంగాయమ్మ దంపతులకు గాయత్రి వేదవతి కూతుళ్ళు, సదాశివ కొడుకు. అక్క గాయత్రి మొగుడు బాదరాయణశర్మతో, శంకరశర్మతో అక్రమ గర్భం దాల్చితే రెండుసార్లు మంగలి మంత్ర సానమ్మ, రాజమ్మల ద్వారా గర్భం తీసేయిస్తారు. అస్థవ్యస్థమైన పనుల వల్ల వేదవతి తండ్రి దత్తాత్రేయ శర్మకు ఒక సమస్యగా తయారైంది.

దత్తాత్రేయశర్మ పెద్దకూతురు పెళ్ళితో సగం ఆస్థి ఖర్చయింది. కొడుకు చదువుతో కొంత పోయింది. ఇప్పుడు వేదవతికి పెళ్ళి చేయడం సమస్య అయింది. వేదవతి పెద్దగా చదువుకోని తిప్పాకర్‌రావుతో పరిచయం ఏర్పడి లేచిపోయి పెళ్ళి చేసుకుంది. ఇది తెలిసి దత్తాత్రేయశర్మ తలెత్తుకోలేక భార్య, కొడుకుతో సహా బొంబాయి వెళ్ళి బతుకుతారు.

తిప్పాకర్‌రావు అసలు పేరు తిప్పయ్య. అతనికి వాళ్ళ తాతపేరు పెట్టారు. కాని తిప్పాకర్‌రావుగా పేరు మారుస్తుంది వేదవతి. తిప్పాకర్‌రావును పెళ్ళి చేసుకున్నాక గాని వేదవతికి లోకం రీతి తెలిసిరాలేదు. వేదవతిని కూతురు నిలదీస్తుంది. ఏంటమ్మా



డాడీని నువ్వు పేరుపెట్టి పిలుస్తావు. మా స్కూల్‌లో ఎవరూ డాడీని మమ్మీలు పేరుపెట్టి పిలువరు అని చెప్తే వేదవతికి తను చేస్తున్న తప్పేమిటో అర్థమవుతుంది.

వేదవతి భర్తను ప్రోత్సహించి ఎక్స్‌టర్నల్‌గా డిగ్రీ చదివిస్తుంది., పిజి పూర్తి చేయిస్తుంది. ఆ తర్వాత తిప్పాకర్‌రావు ఉద్యోగానికి కుదురుతాడు. అంతేకాకుండా చిట్‌ఫండ్ కంపెనీ ఏర్పాటు చేసి, దాన్ని కూడా కొనసాగించే విధంగా చూస్తుంది. “ఇప్పుడు వేదవతికి తనపై ఆధారపడ్డ కుటుంబం నుండి ఇపుడు తాను అందరిలాగ ఇల్లాలుగా మారగలిగినందుకు వేదవతికి సంతోషంగా ఉంది. ఇప్పుడు గతమంతా అమెకొక పీడకల”[11] అంటూ అగ్రకులానికి చెందిన ఓడిపోయిన జీవితాన్ని గెల్చుకున్న క్రమం ఈ ‘వేదవతి’. తాను సంపాదిస్తే భర్త కూర్చుని తింటుంటే భర్తలకన్నా భార్యలే ఎక్కువ అవమానం ఫీలవుతారు. అలాంటి ఉద్యోగినులు భర్తకు ఉద్యోగం దొరకాలని, తానూ అందరిలా ఇల్లాలుగా ఇంట్లోనే ఉండిపోవాలని కోరుకుంటారు. వేదవతి కూడా అదే క్రమానికి చేరుకుంటుంది.

## పేదరికంతో చేజారిన జీవితాల వ్యథ ‘ప్రేమధార’

పరిశ్రమలను మూసివేస్తే దాన్ని నమ్ముకున్న కార్మికులు, వారి కుటుంబాలు ఏ విధంగా పతనమవుతాయి, వాటి పర్యవసానం ఏమిటి? అనేది సువర్ణ, భాగ్యరేఖ అక్కా, చెల్లెళ్ళ పాత్రలు తెలుపుతాయి. ఆకలి, నిరుద్యోగం అభద్రత, మనిషి జీవితాన్ని ఏ విధంగా అతలాకుతలం చేస్తుందో ఆర్ద్రతతో తెలిపే కథ “ప్రేమధార”.

సువర్ణ భాగ్యరేఖల తండ్రి ఒక బట్టలమిల్లు కార్మికుడు. దాన్ని యజమానులు మూసివేస్తారు. అలాంటి పరిస్థితుల్లో కుట్టుపనిని (టైలర్) కులవృత్తిగా చేపట్టిన ఆ కుటుంబం పూటగడవకపోవడం వల్ల ఉన్న ఊరు నుండి మరో ఊరికి వలస వెళ్ళి బతుకును వెళ్ళదీస్తారు. “అక్కయ్యకు పెళ్ళి చేయలేకపోయాడు నాన్న. పశువుల్లా అమ్ముడుపోయే మగాళ్ళను అల్లుళ్లుగా కొనుక్కురాలేక పోయాడు నాన్న. కూడు పెట్టని కులవృత్తి వదిలి బట్టల మిల్లు కార్మికుడయ్యాడు. ఇద్దరు పిల్లలయ్యారు. కొంతకాలం సాఫీగానే సాగింది. మిల్లు మూతపడింది. వేలాది మంది వృత్తి కోల్పోయారు. తమ కుటుంబం బజారున పడింది. పుట్టిన ఊళ్ళో ఉన్నదేమి లేదు. వలస వెళ్ళిన చోట మిగుల్చుకున్నది లేదు. మిల్లు మూత పడ్డాక మరో ఊరికి వలస”[12] కులవృత్తుల పతనం, ఉద్యోగ భద్రత లేని కుటుంబాల వేదన, వరకట్నం స్త్రీల బ్రతుకులను ఏ విధంగా ఛిద్రం చేస్తుందో ఈ సువర్ణ మాటల్లో తెలుసుకోవచ్చు.

సువర్ణ అక్క భాగ్యరేఖ పెళ్ళి చేస్తారని చూసి, ఎవరితోనో వెళ్ళిపోతుంది. అతను వదిలేస్తే, మరొకరితో ఉండి వేశ్యగా మారిపోవాల్సివస్తుంది భాగ్యరేఖ. ఈ సంఘటన సువర్ణకు తెలుస్తుంది సమాజంలో బ్రతకడానికి మగతోడు రక్షణ కావాలని తను ప్రేమించిన శేఖరంతో సువర్ణ లేచిపోతుంది. కొన్ని రోజుల తరువాత శేఖరం అమ్మ, నాన్న చెల్లి పేరు చెప్పి వారం రోజుల్లో తిరిగి వస్తానని సువర్ణతో బొంకి వెళ్ళి వేరే పెళ్ళి

చేసుకుంటాడు. రెండవ భార్యగానైనా ఉంచుకుంటాడని సువర్ణ ఆశపడి భంగపడింది. అలా ఇద్దరు పిల్లల తండ్రి అయిన హోటల్ నడిపే సూరిబాబును పెళ్ళి చేసుకుంటుంది సువర్ణ.

తాగుబోతు సూరిబాబుతో కుటుంబం గడవక బిల్డింగ్ కూలిపనులకు వెళ్తే అక్కడ సూపర్‌వైజర్ హరిబాబుతో పరిచయం ఏర్పడి అది ప్రేమగా మారుతుంది. అతనిలోని స్వచ్ఛమైన ప్రేమను చూసి ఆరాధిస్తుంది. గతం నేర్పిన అనుభవాల కారణంగా సూరిబాబు పెళ్ళి చేసుకుంటాను అన్నప్పటికీ ఏవో ఆదర్శాలతో నిరాకరిస్తుంది. కష్టాల్ని ఎవరితో చెప్పుకోలేక "ఒంటరి జీవితంలో అపుడపుడు అన్పిస్తూ ఉంటుంది. హరిబాబును దూరం చేసుకొని తాను పొరపాటు చేసిందా! తనది ప్రేమా! త్యాగమా! నిస్సహాయ స్థితా! అతనితో పెళ్ళి జరిగి ఉంటే ఎలా ఉండేది? బతుకు యింత దుర్భరంగా ఉండేది కాదేమో"[13] అంటూ సెక్సు శరీరాల వ్యామోహాన్ని తీర్చుకోవడానికని తృప్తి హృదయానికి సంబంధించిందని అతన్ని తలుచుకుంటూ బతుకుతుంది.

ప్రపంచీకరణ ప్రభావాల వల్ల, ప్రైవేటేజేషన్ వల్ల బతుకు దుర్భరమైన స్త్రీలు వేశ్యలుగా మారిన క్రమాన్ని చిత్రిస్తుంది ఈ కథ.

**కుటుంబం స్వార్థం అనే పంజరంగా మారిన తీరును చిత్రించిన 'పంజరం'**

'పంజరం' కథలో కుటుంబం గురించి రచయిత రెండు నిర్వచనాలు ఇస్తాడు. రెండు పరస్పరం వ్యతిరేకంగా కనబడతాయి. కాని రెండూ పరస్పర పూరకాలు. కుటుంబంలో మానవీయ ప్రేమను ఆదర్శీకరిస్తే కుటుంబవ్యవస్థ అదృశ్యం కానవసరం లేదంటాడు. పేదలు ఉన్నతస్థాయికి ఎదిగిన తరువాత కూడా పాత మానవీయ సంబంధాలు కొనసాగిస్తుంటారు. అదొక బలహీనతగా పరిణమించకూడదని మిట్టపెల్లి కొమురయ్య భావిస్తాడు. మిట్టపెల్లి కొమురయ్య బట్టలమిల్లు కార్మికుడిగా పనిచేసి తానే ఒక యజమానిగా ఎదుగుతాడు. తాను చదువుకున్నప్పుడు తన పేదరికంలో ఏ సాయం చేయని స్నేహితుడు తన సహాయం కోసం చేయి చాపుతాడు. అప్పుడు అతని గత ప్రవర్తనంతా కొమురయ్య గుర్తుచేస్తాడు.

ఈ కథ ఉత్తరం రూపంలో సాగుతుంది. ఉత్తరంలో కథ నడపడం ఒక ప్రత్యేక శిల్పం. తన సహాయమడిగిన స్నేహితుడికి రాసే ఉత్తరం ద్వారా మనకు ఇవన్నీ తెలుస్తాయి.

మిట్టపెల్లి కొమురయ్య శ్రామిక వర్గ దృక్పథం కోల్పోకుండానే ఎదిగిన శ్రామిక కుల నూతన పారిశ్రామిక వర్గానికి ప్రతీక. పనితో సంబంధంలేని బ్రాహ్మణీయ దోపిడీ కులాల మధ్య తరగతి వారికి ఆనంద్ ప్రతీక. ఆనంద్ వృథా వ్యయాలను కొమురయ్య ప్రశ్నిస్తాడు. వారి తల్లిదండ్రులపట్ల, అక్కచెల్లెళ్ల పట్ల బాధ్యతారహితంగా ప్రవర్తించిన తీరును గుర్తుచేస్తాడు.



ఆనంద్ కొడుకు ఇంట్లోంచి పారిపోయి తన డిమాండ్లను నెరవేర్చుకోవాలనుకుంటాడు. కష్టం తెలియని బతుకు. బయట సమాజంలో బతకడం చాతకాక తిరిగి ఇల్లు చేరతాడు. రచయిత కుటుంబవ్యవస్థ పట్ల మరో నిర్వచనం ఇలా ఇస్తాడు – "ఈ కుటుంబ వ్యవస్థ ఎంత తొందరగా అంతరిస్తే అంత తొందరగా మనుషుల మధ్య అనురాగం ఆత్మీయత పెరిగి నవసమాజం ఆవిర్భవిస్తుంది. అది మనుపటి సోషలిస్టు వ్యవస్థ కన్నా ఉన్నతంగా ఉంటుంది".

"కుటుంబం మొత్తం సమాజాన్ని ప్రేమించే సంస్కృతిని నేర్పితే కుటుంబం విచ్ఛిన్నమయ్యే అవసరము లేదు"[14]. పిల్లల భవిష్యత్తు పేరుతో కుటుంబాన్ని స్వార్థానికి కేంద్రంగా మార్చకూడదని కొమురయ్య ఆవేదన.

**ప్రేమికులమధ్య సామాజిక, ఆర్థిక వ్యత్యాసాలు**
**కొనసాగే తీరు చెప్పిన 'ప్రేమికులు'**

ప్రతి మనిషి తనకన్నా ఎదిగినవారిని ఆరాధిస్తాడు. ప్రేమిస్తాడు. వాళ్లు కూడా వారికన్నా ఎదిగినవారిని ఆరాధిస్తారు. ప్రేమిస్తారు. వాళ్లు వీరిని నిరాకరిస్తారు. వీరు వీళ్లను ప్రేమించినవారిని నిరాకరిస్తారు. ఇలా ఆర్థిక, సామాజిక అసమానతలు ప్రేమలను నిర్దేశిస్తాయి. నిలిపివేస్తాయి.

'ప్రేమికులు', 'మలుపులు' కథలు జంటకథలు. ఒకే ఇతివృత్తంతో, ఒకే వస్తువుతో అవే పాత్రలతో కొనసాగే కథలు. రెండు కథలు కలిపితే నవలిక అవుతుంది. అందుకే ఈ కథలను ఒకటిగా మార్చి 'బతుకుపయనం' సంపుటిలో 'జీవనయానం' పేరుతో నవలికగా పునర్ముద్రించారు. ఈ కథ అరవింద్ కేంద్రంగా సాగుతుంది. అనేక పరిణామాలను పెనవేసుకొని బహుముఖాలుగా విస్తరిస్తుంది.

అరవింద్ తల్లిదండ్రులు చేనేత వృత్తి చేస్తారు. చెల్లెలు బీడీలు చేస్తుంది. అరవింద్ ఎంబిబియస్ చదువుతుంటాడు. విక్రాంత్ అతనికి స్నేహితుడు. వరసకి బావమరిది కూడా. విక్రాంత్ ఉస్మానియా యూనివర్సిటీలో పిజి చేస్తుంటాడు. అతని తల్లి, చెల్లెలు బీడీలు చేసి విక్రాంత్ చదువులకు పంపిస్తుంటారు. విక్రాంత్ డబ్బును పొదుపుగా వాడతాడు. నిజానికి అరవింద్ విక్రాంత్ చెల్లెల్ని పెళ్లిచేసుకోవాలి. చిన్నప్పుడు అందరూ అలాగే అనుకుంటారు. విక్రాంత్ చెల్లెలు చదువు ఆగిపోతుంది. అరవింద్‌కు ఎంబిబియస్ సీటు రావడంతో ఇక తనను బావ పెళ్లిచేసుకోడని నిర్ణయానికి వస్తుంది. అరవింద్ కాలేజీలో తనకన్నా ఆర్థికంగా, సాంఘికంగా ఉన్నతంగా ఉన్న రాధను ప్రేమిస్తాడు. రాధ ఆమెకన్నా ఉన్నతమైన కుటుంబంలోని వి.యల్. కాంట్‌ను పెళ్లిచేసుకుంటుంది. అరవింద్ తనను ప్రేమిస్తున్న మరో క్లాస్‌మేట్ లతను నిరాకరిస్తాడు. అరవింద్ ప్రేమను రాధ నిరాకరిస్తుంది. ఇలా ప్రతి ఒక్కరూ తనకన్నా పై మెట్టున ఉన్నవారిని ఆశిస్తుంటారు. వాళ్లు వారికన్నా పైమెట్టున ఉన్నవారివైపు చూస్తుంటారు.

"ప్రేమికులు" కథలో అరవింద్‌ను రాధ నిరాకరించినంత మాత్రాన భగ్న ప్రేమికుడిగా ఉండిపోనవసరం లేదని, ఫెమినిజం వచ్చాక "ప్రేమ-పెళ్ళి" "కుటుంబం" అన్నవాటికి నిర్వచనాలు మారాయని విక్రాంత్ అరవింద్‌కు చెబుతాడు. విక్రాంత్ చిక్కడపల్లి లైబ్రరి హాలులో జరిగే "పెళ్ళి-దృక్పథాలు" అనే సెమినార్‌కు రమ్మని ఆహ్వానిస్తాడు. ఈ సెమినార్‌లో చాలామంది వక్తలు ఉపన్యాసాలిస్తారు. ప్రేమలో ఫ్యూడల్ పెట్టుబడిదారీ దోపిడి వర్గాల పురుషాధిపత్య వాదుల దృక్పథం ఉందని తెలుసుకొని అరవింద్‌కు కొత్త ఆలోచనలు వస్తాయి. విక్రాంత్ చెల్లెలు సావిత్రిని కాదని, రాధను ప్రేమించానని, అరవింద్ దీనిలో ఏది నిజమైన ప్రేమో తేల్చుకోలేకపోతాడు.

కొద్దికాలానికి అరవింద్ డాక్టర్ అవుతాడు. తన తమ్ముడు ఆనంద్‌కు మెడికల్ షాపు పెట్టిస్తాడు. తండ్రి కులవృత్తిని వదిలి ఆ షాపులోనే కూర్చుంటున్నాడు. తల్లి దేవక్క అరవింద్ పెళ్ళి చేసుకుంటే తమ బాధ్యత తీరుతుందని, అరవింద్‌తో పని చేసే అరుణను పెళ్ళి చేసుకొమ్మంటుంది. దానికి అరవింద్ అరుణది అగ్రకుల సంస్కృతి మనది పని చేసుకుని బతికే సంస్కృతి అంటాడు.

**అమెరికా ఒక యవ్వనకాల దేశం**

న్యూయార్క్‌లో భర్త వి.యల్. కాంట్ చనిపోవడంతో రాధ సొంత ఊరికి తిరిగి వస్తుంది. భర్తను కోల్పోయిన రాధను అరవింద్ హాస్పిటల్‌లో పని చేయాలని లత కోరుతుంది. దానికి రాధ తండ్రి సత్తయ్య సరేనంటాడు. ఓ సందర్భంలో లత రాధను అమెరికా జీవితం ఎలా ఉంటుంది అని అడుగుతుంది. "ఎవరి కోసం బతుకుతున్నామో, ఎందుకోసం బతుకుతున్నామో ఆలోచించుకునే టైం లేనంత వేగంగా అక్కడి జీవితం సాగుతుంది. ఎవరో అన్నట్టు అది యవ్వనకాల దేశం. జీవితంలోని మిగతా దశలకు అంతగా పనికిరాదు. ఆ వే ఆఫ్‌లైఫ్‌ను, స్టాండర్డ్ ఆఫ్ లివింగ్‌ను తట్టుకోవడం కష్టం" అంటూ పాశ్చాత్య జీవన సరళిని చెబుతుంది.

**ఎదిగినవారిపైనే అందరి ఆశలు**

నారాయణ సేట్ అప్పుగా ఇచ్చిన డబ్బుతో డాక్టర్ అయిన అరవింద్, నిర్మల భర్త మదన్ చనిపోవడంతో పెళ్ళి చేసుకోవాలని లత, విక్రాంత్‌లు అంటారు. ఎన్నికల్లో పోటీ చేసి ఓడిపోయిన నారాయణ సేటు అతని కొడుకు శ్రీనివాస్ అప్పుల పాలవుతాడు. శ్రీనివాస్‌తో తిరిగిన అరవింద్ తమ్ముడికి మెడికల్ షాపు గిరాకి తగ్గుతుంది. ఎదగాల్సిన వారి జీవితాలు ఎదగకుండా పోయాయి.

విక్రాంత్, లతలకు అంతకు ముందే వివాహం జరుగుతుంది. వీరు కరీంనగర్‌లో శ్రీరాజరాజేశ్వర కళ్యాణ మండపంలో డాక్టర్ అరవింద్, డాక్టర్ అరుణల వివాహం మీటింగ్ పెళ్ళి పద్ధతిలో జరిపిస్తారు. డాక్టర్ రాధ ఒక ఆదర్శంతో సిరిసిల్లలో హాస్పిటల్ నెలకొల్పి పేదలకు అతి తక్కువ ఫీజుతో వైద్య సేవలు అందిస్తుంది. ఈ విధంగా



స్నేహితుల ద్వారా, ప్రజా సేవతో వచ్చిన పేరు ప్రఖ్యాతులతో విక్రాంత్ తల్లి సక్కుబాయి మున్సిపల్ కౌన్సిలర్‌గా గెలుస్తుంది.

అరవింద్, లత, విక్రాంత్, నిర్మల, అరుణ, సక్కుబాయి సహకారంతో రాధ ఎమ్మెల్యేగా గెలుస్తుంది. కాని అరుణ తండ్రి దయాకర్‌రావు ఓడిపోతాడు. డాక్టర్ రాధ క్లాసుమేటు అయిన డాక్టర్ రాజేశ్వరరావుతో వివాహం ఘనంగా జరుగుతుంది.

'ప్రేమికులు' కథ ఒకరు ఎదగడం వల్ల కుటుంబమే కాకుండా ఒక సోషలిస్టు దృక్పథం గల సమాజం కూడా రూపొందించుకోవచ్చు అని చూపుతుంది.

**రాజకీయం**

రాజకీయాలు నిత్యనూతనంగా ఉంటాయి. వాటిని ఎప్పటికప్పుడు పరిశీలిస్తూ తమ కనుకూలమైన నిర్ణయాలను తీసుకోవాల్సి ఉంటుంది. రాజకీయాలు పేకాటలాంటివి. ప్రతి రౌండులో కొత్త నిర్ణయాలు తీసుకోవాలి. అవతలివారి నిర్ణయాలను వమ్ము చేయాలి. ఆ శక్తి లేనివారు ఓడిపోతారు.

శంకరం కూతురు లత. శంకరం గురువు ఈశ్వరయ్య. వీరి మధ్య ఈనాటి రాజకీయాలు వ్యూహ ప్రతివ్యూహాలు, రాజకీయంలోని మెలకువలు 'రాజకీయం' కథలో కనబడతాయి.

ఒక జాతీయ పార్టీ శంకరంకు ఎమ్మెల్యేగా పోటీ చేయడానికి కోరుకున్న నియోజకవర్గంలో టికెట్ ఖరారు చేసింది. ఇది శంకరంకు ఇరవై యేళ్ళ కల. ఉద్యోగం చేస్తున్న కాలంలో రాజకీయ నాయకులతో అనుభవించిన కష్టాలు, వారు చూపించే అధికార దర్పం, వారికున్న ప్రజాదరణ చూసి రాజకీయాల్లో దిగాలనుకున్నాడు. ఆ కల నెరవేరబోతుందని, తన జీవితంలో అత్యంత ఆనంద క్షణాలను అందరితో పంచుకుంటాడు. ఆ ఆనందం కూతురు లతతో పోతుంది. ఆమె నాన్న పేరిట, అమ్మ పేరిట ఉన్న ఆస్థులు అమ్మడానికి, కొనడానికి ఎవరికీ వీలులేదని పత్రికల్లో ప్రకటన ఇచ్చింది. ఈశ్వరయ్యకు ఫోన్ చేసి చెప్పింది.

ఈశ్వరయ్య శంకరంతో లత ఉద్యోగానికి రాజీనామా చేసి ఎన్నికల్లో పోటీ చేస్తుందట అని భర్త లెక్చరర్ కాబట్టి ఆర్థికంగా యిబ్బంది లేదట అంటాడు. లత రాజకీయాల్లోకి వస్తుందని నాకు చెప్పలేదని అంటాడు శంకరం. "ఆ మాటకొస్తే రాజకీయాలో దిగుతానని ఇందిరాగాంధీ చెప్పిందా! రాజీవ్‌గాంధీ చెప్పాడా, సోనియా గాంధీ చెప్పిందా! రబ్రీదేవి చెప్పిందా! లతకు తెల్సిన రాజకీయం నీకు తెలియక పాయె. రాజకీయాల్లో ఎపుడూ అఫెన్సు దాడే ఉంటుంది. ఎదుటి వాళ్ళు ఏది చెప్పి డిఫెన్సులో పడేయాలని చూస్తారో దాన్నే ఎదుటివారి మీద విసరడం అఫెన్సు"[3] అంటూ రాజకీయంలోని రహస్యం తెలిసిన వాడిలా ఈశ్వరయ్య చెబుతాడు.

ఇంకా లత రాజకీయంలో అరవైఏళ్ళ ముసలివాళ్లు పోటీ చేయకుండా ఒక

ప్రైవేటు బిల్లు ప్రవేశపెట్టి అసెంబ్లీ చేత ఆమోదింపచేసి రాష్ట్రపతి, పార్లమెంటుకు సిఫార్సు చేస్తుందని, చెబుతాడు. లత రహస్యంగా రాజకీయ శిక్షణ తరగతులు నిర్వహిస్తుందని తెలుసుకొని శంకరం వెళ్తాడు. అక్కడ మూడు పదులు నిండని కుర్రాడు బోధాయన "రాజకీయాలంటే కులమో, వర్గమో, ధనమో, మతమో, సాంఘీక విప్లవమో కాదు ఇందులో ఏ ఒక్కటి లేదు. అయితే వీటన్నింటినీ సమన్వయిస్తూ, సమాజాన్ని, దాని చలన సూత్రాలను రెగ్యులేట్ చేస్తూ మెజారిటీ ప్రజల సమ్మతితో వీలైనంత మేరకు సమాజాన్ని ముందుకు నడిపేట్టు చేయడమే రాజకీయం"[4] అసమర్థుడైన శంకరంకు టికెట్ వస్తే తాను సులభంగా గెలువవచ్చని అతనికి ఆ టిక్కెట్టు రావడానికి ఎదుటి పార్టీ ముత్యంరెడ్డి రెండు లక్షలు ఖర్చు చేస్తాడు, అందుకే లత ఎన్నికల్లో నిలబడుతుందని అంటాడు. ఈ రాజకీయాలు అర్థంకాక శంకరం తలపట్టుకుంటాడు.

**తల్లిపాలు**

'తల్లిపాలు' కథలో తల్లి విమల-కొడుకు ఉదయ్‌ల మధ్య రాజకీయసిద్ధాంతాల పట్ల సంఘర్షణ ఉంటుంది. పార్టీకి కృతజ్ఞతగా ఉండాలని తల్లి అంటుంది. కృతజ్ఞత మనిషికి భారం కావద్దని కొడుకు అంటాడు. శ్రామికులు, పీడితులు ఒక పార్టీలో ఉండి జీవితాన్ని ధారపోస్తే నవతరం వాటిని ఏ విధంగా వ్యాఖ్యానిస్తుంది. వ్యక్తిగత గ్రూపు ప్రయోజనాలతో పార్టీలలో భావజాలం లేక, అనుచరగణం చేస్తున్నదేమిటో "తల్లిపాలు" తెలియజేస్తుంది.

దళిత, శ్రామిక కులం నుండి ఎదిగిన కె.కె. తన పార్టీకోసం కొడుకులను, కోడళ్ళను ఇతర బంధుగణాన్ని దూరం చేసుకుంటాడు. పార్టీలో పరిచయమైన కూతురులాంటి విమల, ఆమె కొడుకు ఉదయ్ కె.కె.ను మాత్రం ఆత్మీయంగా చూసుకుంటారు. ఒక దశలో పార్టీలో సేవలే తప్ప అధికారం ఇవ్వనిరాకరించిన కె.కె.ను ఆ పార్టీలోని కొందరు పార్టీ నుండి బహిష్కరించాలని చూస్తారు. కె.కె. జీవితాన్ని ధారపోసి ఎదిగించిన పార్టీ అతనినే బహిష్కరించాలని చూడడం రేపు తనను కూడా అలాగే బహిష్కరిస్తుందేమోనని తల్లితో ఉదయ్ అంటారు. కె.కె.తో కలిసి ఉదయ్ వేరే జాతీయ పార్టీలో చేరాలనుకుంటాడు.

సొంత పార్టీని తన పార్టీగా మార్చుకోలేని వాళ్ళు ఇతర పార్టీలకు వెళ్ళాలనుకోవడం మూర్ఖత్వం అని విమల అంటుంది. కె.కె. ఆత్మహత్యకు ప్రయత్నించి హాస్పిటల్‌లో కోలుకోవడంతో పార్టీ కె.కె. పట్ల ప్రజల స్పందన చూసి పార్టీ బహిష్కరణ నిర్ణయాన్ని వెనక్కి తీసుకుంటుంది. ఉదయ్‌కి సొంత పార్టీ ఇచ్చిన ఆత్మవిశ్వాసంతో మరో జాతీయ పార్టీలో చేరుతాడు. స్వంత పార్టీలోనే కె.కె.కు మేలు జరగాలని ఆశిస్తాడు.

జాతీయ పార్టీ ఉదయ్‌నే కె.కె.పై అభ్యర్థిగా నిలుపుతుంది. ఉదయ్ గెలుస్తాడు. కె.కె. కన్స్యూమర్ ఫోరం అఖిలపక్ష కమిటీ సభ్యుడుగా నామినేట్ చేయబడతాడు. ఒకే పార్టీలో ఉంటే ఇద్దరు బహిష్కరించబడేవారే. వేరు వేరు పార్టీల్లో చేరడం వల్ల లాభం



చేకూరిందని అనుకుంటారు. అలా అరుణను విమల వేరేపార్టీలో చేరాలని ప్రోత్సహించడం ఉదయ్‌కి నచ్చక "అమ్మా! కన్నతల్లి పార్టీ ఎంత బలహీనపడితే ఈ పార్టీలోనా స్థానం కూడా బలహీనపడుతుంది. రష్యాలో సోషలిజం పడిపోయాక ప్రపంచమంతా సోషలిజానికి, సోషలిస్టు భావనకు ఎదురైన ప్రమాదం మీకు తెల్సు"[5] అంటూ రెండు పార్టీలలో నాయకత్వంగా మనం బలంగా ఉన్నప్పుడే గౌరవం ఉంటుందని వివరిస్తాడు. ఇలా అన్ని పార్టీల్లో బిసి, ఎస్సీ, ఎస్టీలు బలంగా ఉండాలంటాడు.

**మమతలు**

కథ ప్రారంభంలో "డబ్బు అధికారం కులం స్వార్థం అంతస్తు ముందు ప్రేమలన్నీ ఉత్తవే"[6] అంటాడు కాంతయ్య. ఆ తరువాత అనుభవం ఆ నిర్వచనాన్ని మార్చుతుంది. ఈ రెండు నిర్వచనాలు తాత్వికపరమైనవే. రెంటిని విడిగా చూస్తే రెండూ సరైనవే అనిపిస్తాయి. అదే తత్వవేత్తల విశిష్టత.

చంద్రమ్మ, గౌరమ్మ తొమ్మిది పదేళ్ళ వయస్సులో జగిత్యాలకు కొత్తకోడండ్లుగా వస్తారు. గౌరమ్మ పెండ్లిలో ఒక గొడవ కారణంగా బంధువులు దూరమైతే చంద్రమ్మ అన్నింటికి తోడవుతుంది. వీరి స్నేహం బలపడినాక చంద్రమ్మకు కాంతయ్య, గౌరమ్మకు సరళ (సరవ్వ) పుడుతారు. గౌరమ్మ భర్త వేరే స్త్రీని ఉంచుకుని ఊళ్ళు తిరిగితే కాంతయ్యఅన్ని బాధల్లోను పెద్ద కొడుకులా ఆదుకుంటాడు.

అలా సరవ్వ, కాంతయ్యలు ఒకే స్కూలు, ఒకే కాలేజీలో చదువుకుంటారు. కాంతయ్య ఎప్పుడూ తోడుగా ఉంటాడు. బట్టలు వేసుకోవడం రాని వయసునుండి వాళ్లిద్దరూ స్నేహితులు. వయసుతో పాటు వారి అవగాహన వికసిస్తుంది. ఒకరిని ఒకరు ఇష్టపడతారు. పెళ్లిచేసుకోవాలనుకుంటారు. అందుకు ఎవరికీ అభ్యంతరం ఉండాల్సిన అవసరం లేదు. కాని కొన్ని సామాజిక పరిణామాలు దాన్ని అసాధ్యం చేశాయి.

కరీంనగర్ జిల్లా భూముల్లోకి పోచంపాడు కాల్వ నీళ్ళు అందాయి. చెడిపోయిన గౌరమ్మ భర్త తిరిగి ఇంటిపట్టున ఉండడం మొదలవుతుంది. అతడు కొన్ని భూములను ప్లాట్లుగా చేసి అమ్మితే చాలా డబ్బు వస్తుంది. కొన్ని భూములలో వ్యవసాయం చేస్తూ ట్రాక్టర్ కొని ఎదుగుతాడు. చంద్రమ్మ భర్తేమో కులవృత్తులు వదిలి బొంబాయి బట్టలమిల్లు కార్మికుడిగా పనిచేసి 1982లో దత్తా సామంత్ నాయకత్వంలో చేసిన సమ్మెతో ఇల్లుచేరి సైకిల్‌పై బట్టల మూటతో ఊళ్ళు తిరుగుతాడు. సరవ్వ, కాంతయ్య ఇష్టపడ్డా సరవ్వ తండ్రి నిరాకరిస్తాడు. సరవ్వ లేచిపోదామంటుంది. ఆమె రుక్మిణి కాదలచుకున్నా అతడు కృష్ణుడు కాలేకపోతాడు. అది అతని వైఫల్యం. ధైర్యంలేనితనం. దాంతో జీవితం మరో మలుపు తిరుగుతుంది.

ఆమె హైదరాబాద్ చేరి ఎదుగుతుంది. భర్త చక్కని ఉన్నత ఉద్యోగి. బాగా ఉన్నవాళ్లు. వారితో తనకు పోలికే లేదు. ఆమె ఫెమినిజం చదివి, ఉద్యమాలు తిరిగి

మరింత ఎదుగుతుంది. కాంతయ్య నిరుద్యోగంతో బాధపడుతుంటాడు. క్రమంగా ఇన్‌ఫీరియారిటీ కాంప్లెక్స్‌కు గురవుతాడు. ఆమెను కలవడానికే జంకుతుంటాడు. తప్పు తనదైనప్పటికీ తన జీవితం ఇలా కావడానికి ఆమెనే కారణమని బలంగా భావిస్తాడు. ఆమెను సూటిపోటీ మాటలతో బాధపెడుతుంటాడు. అయినప్పటికీ ఆమె అతన్ని మన్నిస్తుంది. అయినా అతడు ఆమెను తప్పించుకొని తిరుగుతుంటాడు.

అలా కొన్ని రోజుల తరువాత సరవ్వ ఊరువస్తే కాంతయ్య ఆమెను తప్పించుకొని తిరుగుతాడు. ఆమె కాంతయ్యను వెతుక్కుంటూ వాళ్లింటికి వెళుతుంది. కాంతయ్య తల్లిముందు ఆమె నేను ఏం తప్పు చేశాను అత్తయ్యా! నన్ను ఎందుకు తప్పించుకుని తిరుగుతున్నాడు అని ఏడుస్తుంది. ఎక్కడెక్కడో తిరిగి ఇల్లు చేరిన కాంతయ్యకు తల్లి హితబోధ చేస్తుంది. సరవ్వను కలిసి రా పోరా అని బతిమాలుతుంది. మెల్లిగా బయలుదేరతాడు. అక్కడ సరవ్వ తల్లి ఆప్యాయంగా పలకరిస్తుంది.

ఆ తరువాత సరవ్వకు, కాంతయ్యకు మధ్య ఫెమినిజం, బహుజనిజం మధ్య చర్చలు జరుగుతాయి. ఆమె అభివృద్ధికి, ఆమె కులమే కారణమని నిందిస్తాడు. ఆమె ఆశ్చర్యపోతుంది. కొత్తగా ఈ కులతత్వం ఎందుకు అంటగడుతున్నావని నిలదీస్తుంది. కాంతయ్య సిద్ధాంతాలను, చరిత్రను ఏకరువు పెడతాడు.

సరవ్వ "నీవు కూడా పెళ్ళి చేసుకొని ఆత్మవిశ్వాసంతో బతక"మంటుంది. నన్ను తలచుకొని బాధపడడం వల్ల లాభం లేదని "కాంత్! కాలం గాయాల్ని మాన్పుతుంది, జ్ఞాపకాలు గాయాన్ని కెలుకుతాయి. కొత్త అనుభవాలు, కొత్త పరిచయాలు, కొత్త జీవితాలు, కొత్త జ్ఞాపకాల్ని సృష్టిస్తాయి. అవి పాత జ్ఞాపకాల్ని మరుగుపరుస్తాయి"[7] అంటూ నిన్ను మరిచిపోలేదని చెబుతుంది. సరవ్వకు పెండ్లి అయిన తరువాత చాలా మార్పు వచ్చిందని, భాష, కట్టు, బొట్టు మారిందని కాంతయ్య గ్రహిస్తాడు.

"సరూ! పారిశ్రామికీకరణ మీకు ఆధునిక అభివృద్ధిని, నాగరికతను యిచ్చింది. కాని మా వాళ్ళకు ఉన్న కులవృత్తులు పోగొట్టింది. మా జీవితాలు కాలే కడుపులతో కొడిగట్టిపోయినై. అంబేద్కర్ ఎందరికో వెలుగు చూపినా గాంధీ పంథాయే రహదారి అయింది. కాని ఈ యిద్దరికి గురువైన జ్యోతి భాపూలే వేసిన బి.సి.ల దారి అక్కడే ఆగిపోయింది"[8] అంటాడు. పెళ్ళి చేసుకుని సావిత్రిబాయిపూలే లాగా నీ భార్యను ఎందుకు ఎదిగించకూడదు అంటుంది సరవ్వ.

కాంతయ్య, పద్మను పెళ్ళి చేసుకొని విద్యావంతురాలిని చేస్తాడు. ఇద్దరు పత్రికను స్థాపించి సంపాదకీయాలు రాస్తారు. ఇప్పుడు సరవ్వ "స్వేచ్ఛ, సమానత్వంతో కూడిన ప్రేమ ముందు డబ్బు, అధికారం, స్వార్థం, కులం, మతం అన్ని వట్టివే"[9] అంటూ బుద్ధుడు చూపిన ఆచరణ మార్గం ఆదర్శం కావాలంటుంది.

పార్లమెంటులో బిసిలకు చట్టసభల్లో రిజర్వేషన్లు ఉండాలని ప్రవేశపెట్టిన బిల్లుపై చర్చ జరుగుతున్న కాలంలో ఫెమినిస్టులు స్త్రీల రిజర్వేషన్ల చర్చ ముందుకు తెచ్చారు.



స్త్రీల రిజర్వేషన్లలో బిసి రిజర్వేషన్లు ఉండాలని బిసిలు కోరారు. స్త్రీలు నిరాకరించారు. ఆ చర్చంతా ఈ కథా ఇతివృత్తంలో ఇమిడిపోయింది. ఫెమినిజం ముందుకు సాగుతుంది. బిసివాదం ఉన్నచోటనే ఉండిపోతుంది. ఈ చారిత్రక విషాదాన్ని చెప్పడానికి రెండు పాత్రలను సృష్టించి వారిని ఎదిగించి చర్చించినతీరు అపూర్వం.

**రాజీపడడమే సహజీవన రహస్యం**

సహజీవనం కథలో దంపతులు కోరుకున్నదానికి భిన్నంగా తోడు దొరుకుతారు. ఇంట్లో ఉండాలని కోరుకుంటే ఉద్యోగం చేస్తాననే భార్య దొరుకుతుంది. భార్య ఉద్యోగం చేయాలని కోరుకుంటే ఇంట్లో ఉండే ఇల్లాలు దొరుకుతుంది. వీటికి పరిష్కారం వృద్ధదంపతులను అడుగుతారు. రాజీపడడమే సహజీవన రహస్యమని చెప్తారు. అప్పుడు ఎవరు ఎవరికి రాజీపడాలో చర్చిస్తారు. నాకోసం నీవు రాజీపడాలని ఎదుటివారిని డిమాండ్ చేస్తారు. ఇలా కథ మళ్లీ మొదటికి వస్తుంది. ఈ తాత్విక ఇతివృత్తం అనేక మలుపుల గుండా అనేక జీవితాల గుండా సాగుతుంది.

లక్ష్మణ్, రాము, శ్యాం, రాజు అనే నలుగురు డిగ్రీ చదువుకునే కుర్రాళ్ళు. ఒకే రూంలో సహజీవనం చేస్తుంటారు. వీరి ద్వారా 50 ఏళ్ళలో మానవ సంబంధాల్లో వస్తున్న మార్పులు భార్యా, భర్తల మధ్య చర్చ, వైవిధ్య పూరితమైన దృక్పథాలు గూర్చిన చర్చనే "సహజీవనం" కథ ద్వారా తెలుపుతాడు.

ఆ నలుగురు యువకులు సమాజాన్ని పరిశీలించి ఎలాంటి బ్రతుకు సరైందో! ఎవరు ఎలాంటి పెళ్ళిళ్ళు చేసుకోవాలో జీవితాన్ని ఎలా గెలుచుకుంటున్నారో! సమాజంలోని కొన్ని కుటుంబాలను గమనించి చర్చించుకుంటారు. పదేళ్ళ తరువాత మళ్ళీ కలుద్దాం అంటూ సెలవుల్లో ఇంటికి వెళతారు.

పదేళ్ళ తర్వాత రాజు అనబడే బుచ్చిరాజంకు పి.జి. చేసిన భాగ్యరేఖతో పెళ్ళి జరుగుతుంది. పి.జి. చదువు మంచి మొగుడి కోసమే గాని ఉద్యోగం చేయడానికి కాదంటుంది. బుచ్చిరాజంను పిచ్చిరాజంగా మారుస్తుంది భాగ్యరేఖ. లక్ష్మణ్ ఆటో యాక్సిటెంటయి జిరాక్స్ సెంటర్ పెట్టుకుంటాడు. బట్టలుతుకుతుందనుకున్న భార్య లక్ష్మి, లక్ష్మీదేవిలా తయారవుతుంది. శ్యాం భార్య అరుంధతి పి.జి. చేసి కుటుంబ గొడవలు, పిల్లలు పుట్టడం, గ్రూపు టు రాస్తుంది. తెలివైన పిల్ల అని మండలాధ్యక్షురాలిని చేస్తారు. టీ, టిఫిన్లు అందిస్తే చాలనుకున్న రాము భార్య గీతాదేవి ఉద్యోగం చేస్తుంది. ఆమె తన అత్త, మామలను సరిగా చూడదు. పెళ్ళిళ్ళ పట్ల చర్చ జరుపుకున్ననలుగురు మిత్రులు అనుకున్నదొకటి జరిగిందొకటని లోకరీతిని తెలుసుకుంటారు.

**వారసత్వం**

'వారసత్వం' కథ తెలంగాణ ప్రాంతంలోని 70 ఏళ్ల సామాజిక పరిణామాలే ఇతివృత్తంగా సాగుతుంది. మూడు తరాల మధ్య ఏర్పడిన అంతరాలు స్వాతంత్ర్య

సమరయోధుల ఘోష, నేటి నిరుద్యోగం, అరబ్బు దేశాలకు వలస, పల్లెటూరి సంబంధాలను నిరసించడం మొదలైనవన్నీ ఈ కథలో చిత్రించబడ్డాయి.

గంగరాజం యాభై ఏళ్ళ స్వాతంత్ర్యానికి ప్రతీక. గంగరాజం-లింగమ్మలకు ఏడేళ్లపుడు పెళ్ళవుతుంది. 1927 నాటికి నిజాం స్థాపించిన ప్రభుత్వ పాఠశాలలో చదువుతున్న రోజుల్లో ఒక బెంగాలీ బెనర్జీ ప్రధానోపాధ్యాయుడు 1905 నాటి బెంగాల్ విభజన, వందేమాతరం ఉద్యమం గురించి విషయాలను నమ్మకస్థులైన విద్యార్థులకు చెప్తుండేవాడు. వారిలో గంగరాజం ఒకడు. అలా చిన్న నాటి నుండి విన్నవి యుక్త వయస్సులో జగిత్యాలలో జరిగే మీటింగ్‌లకు వెళ్ళేవాడిగా చేసింది. అలా అనేక మంది నాయకులతో పరిచయాలయ్యాయి. "అంతదాకా ప్రపంచం అంటే పల్లెనే అనుకున్నాడు. ఈ పల్లెను మించిన ప్రపంచం ఉంది. ఈ దొరలను మించిన రాజ్యం వుంది. రవి అస్తమించని బ్రిటీష్ సామ్రాజ్యం వుంది. సోషలిస్టు, రష్యా వుంది. ఆంధ్ర మహాసభ వుంది. కాంగ్రెసు ఉంది. గాంధీ వున్నాడు. గ్రంథాలయ ఉద్యమంలో భాగంగా పంచిన పుస్తకాలెన్నో చదివాడు"[10] అంటూ దేశభక్తిని నింపుకొని కులవృత్తి చేసుకుంటూ దొరలకు వ్యతిరేకంగా నాన్న-లింగం వెంటా తిరిగి, నైజాంకు వ్యతిరేకంగా రజాకార్ల దురాగతాలను ఎదుర్కొంటాడు.

- అలా 1945లో చేనేత సహకార సంఘం నిర్మాణంలో, వెట్టి నిర్మూలన, సబ్సిడినూలు, ఖాదీ ఉద్యమానికి కృషి చేశాడు. "స్వాతంత్ర్యం వచ్చింది. దొరల పెత్తనానికి గోరీ కట్టేశామన్నారు. కానీ గోరీలోంచి తిరిగి కొత్త ఎత్తులతో దొరలు ముందుకు వచ్చారు"[11] అంటూ అవకాశాలను అందిపుచ్చుకొని దేశాన్ని తన గుప్పిట్లోకి ఎలా తెచ్చుకున్నారో తెల్పుతాడు.

గంగరాజం కొడుకు లెక్చరర్ రాజేశం - లక్ష్మీబాయిల కూతురు కిరణ్మయి పల్లెటూరు మేన సంబంధం వస్తే నిరాకరిస్తుంది. తాత, నానమ్మలను పంపి ఆ సంబంధం వద్దని చెప్పమంటుంది. పెద్దరికం, అహంకారంతో నా కిష్టంలేని పెళ్ళి చేయవద్దంటుంది. "నువ్వేదో పెద్ద స్వాతంత్ర్య పోరాటం చేశానని గర్వం నీకు. నిన్ను నువ్వు ప్రేమించుకున్న స్వార్థం తప్ప నువ్వు నిజంగా ప్రజల్ని ప్రేమించిందెప్పుడు. ఎపుడో చేసిన దాన్ని చెప్పుకొని అంతకు ఎన్నో రెట్లు మీరు సుఖాలనుభవించారు. స్వార్థం వల్లనే అక్కడే ఆగిపోయారు. మీరింకా పోరాటం చేసి ఉంటే సమాజం యింకా ఎదిగి వుండేది. సర్పంచ్ పదవే నీకు గొప్పదైంది. ఎమ్మెల్యేనో, ఎం.పి.నో ఎందుకు కాలేదు. నీ స్వార్థం కోసం కాకపోతే పల్లెల్లో ఉన్నదంతా అమ్ముకొని కోరుట్లలో ఎందుకు సెటిల్ అవుతావు. తద్వారా పల్లె సమాజం ముప్పయేళ్ళు వెనక్కి పోలేదా!"[12] అంటూ పల్లెలు వెనుకబడటానికి కారణం చెబుతుంది.

ఊర్లోకి వెళ్ళిన గంగరాజంను చెల్లెలు సంగమ్మ ఇంట్లోకి ఆహ్వానిస్తుంది. రెండో మనుమడు అజయ్ తాతను పలకరిస్తాడు. ఆనాటి పోరాటాలను తెలుసుకుంటూ నాకు కండక్టరు ఉద్యోగమైనా ఇప్పించలేని మీరు స్వాతంత్ర్య సమరయోధుడని చెప్పుకోవడం



ఎందుకని అజయ్‌అంటాడు. ఉద్యోగాల కోసం వాళ్ళను బతిమలాడేకంటే మండలాధ్యక్షునివో, ఎమ్మెల్యేనో అవమంటాడు. అరబ్బు దేశాలకు మీలాంటి వాళ్ళు వెళ్ళేకంటే దేశం అమ్ముడవుతుంటే చూస్తున్నారని గంగరాజం ఆవేదన వ్యక్తం చేస్తాడు.

తాత మాటలకు "ఈ దేశం నాకేమిచ్చిందని పోరాటం చెయ్యాలే తాతా! ఈ స్వాతంత్ర్యం వల్ల ఈ అభివృద్ధి వల్ల లాభపడ్డవాళ్ళు పోరాటం చెయ్యాలె. కనీసం కండక్టరు ఉద్యోగం యివ్వకుండా అరబ్బు దేశాలకు తరుముతున్న ఈ దేశం అమ్ముడుపోతే నేనెందుకు పోరాడాలి, దేశాల్ని అమ్ముకతింటే నా వాటా నాకు పారెయ్యమంటా. అంతే! ఈ దేశం ఏమైపోతే నాకేమిటి? మళ్ళీ విదేశీ పాలనలోకి పోతే ఎక్కువ సంతోషిస్తాను. నాకు లేని అభివృద్ధి, స్వాతంత్ర్యం మిగతావాళ్ళ కెందుకందాలి"[13] అని అజయ్ అంటాడు. ఈనాటి యువకుల ఆలోచన విధానాలు అజయ్ మాటల ద్వారా విని గంగరాజం వణికిపోతాడు.

జాతీయోద్యమకాలం నుండి మొదలయిన గంగరాజం జీవితం అవగాహన, ఆశలు అతని కళ్ళముందే అతని మనుమలు, మనుమరాళ్ళు రూపంలో విచ్ఛిన్నమయ్యాయి, స్వాతంత్ర్యానంతర పరిణామాలు, గ్లోబలైజేషన్ పరిణామాలు సామ్రాజ్యవాద దోపిడీకి అనువుగా పర్యవసించిన తీరును 'వారసత్వం' కథ తెలుపుతుంది. చారిత్రక భౌతికవాద దృక్పథంతో 70ఏళ్ళ సామాజిక చరిత్రను కథా రూపంలో అందించిన కథ ఇది.

మమతలు మానవ సంబంధాలు సంపుటి గురించి రాచపాళెం చంద్రశేఖర రెడ్డి ఇలా అంటారు "సామాజిక వ్యవస్థలో సంస్కరణలు వచ్చినప్పుడు మానవ సంబంధాల్లోనూ సంస్కరణలు వస్తాయి. సామాజిక వ్యవస్థలో గుణాత్మక మార్పులొచ్చినప్పుడు మానవ సంబంధాల్లోనూ గుణాత్మకంగానే మార్పులు వస్తాయి. ఒక రకంగా చెప్పాలంటే మానవ సంబంధాల చరిత్రే సమాజ చరిత్ర అవుతుంది. అలా ఈ సంపుటిలోని కథలన్నీ భారతీయ సమాజ చరిత్రను చిత్రించిన కథలు. సమాజ చరిత్రకు ప్రతిఫలన రూపమైన సాహిత్యం కళల్లో ఇలా మానవ సంబంధాల చరిత్ర కనిపిస్తుండడం సహజం. అమలులో ఉండే మానవ సంబంధాల పట్ల ఏ కాలంలోనైనా కొందరికి తృప్తి, మరికొందరికి అసంతృప్తి ఉండడం అసమ సమాజంలో సహజం. మమతలు, సహజీవనం, అయిదోవాడు, పంజరం, వారసత్వం, వరుసలు కథలు దీన్నే నిర్ధారిస్తాయి. డెబ్బయి ఏళ్ళ సామాజిక పరిణామాల్ని కథ ప్రక్రియ రూపంలో నిక్షిప్తం చేసిన కథలివి."

జి.గంగాధర్ ఈ కథల గురించి ఇలా విశ్లేషించారు "ఆధునిక మానవ జీవితంలో సామాజిక సంబంధాలను, కుటుంబ సంబంధాలను, మానవ స్వభావాలను నిర్దేశిస్తున్న శక్తులేమిటో బి.ఎస్.రాములు గారి కథలు చదివితే ఒక లోతైన అవగాహన కలుగుతుంది. మనిషిపై వ్యవస్థ విధిస్తున్న పరిమితులకు తోడుగా వ్యక్తిగత స్వార్థంతో తనకు తాను విధించుకుంటున్న పరిమితుల్ని సామాజిక పరిణామాల అనివార్యతలో భాగంగా విశ్లేషించి చూపడం బి.ఎస్.రాములు గారి కథల విశిష్టత."

ప్రపంచీకరణ నేపథ్యంలో

## వేపచెట్టు కథల సంపుటి

ఈ కథల సంపుటిలో ఎనిమిది కథలున్నాయి. అవి 'నాగశాల', 'అయిదవవాడు', 'చేయూత' 'మలుపులు', 'సంబంధం', 'ప్యారసైట్సు', 'వేపచెట్టు', 'కామన్‌వెల్త్'. మలుపులు కథ మమతలు మానవ సంబంధాలు కథల సంపుటి నుండి పునర్ముద్రణగా ఇందులో చేరింది. మిగిలిన ఏడు కథలను ఈ అధ్యాయంలో పరిశీలిస్తాను.

ఈ కథల సంపుటి ఆసియా సోషల్ ఫోరమ్, హైదరాబాద్ మహాసభల సందర్భంగా వెలువడింది. గ్లోబలైజేషన్‌కు వ్యతిరేకంగా ఈ మహాసభలు జనవరి 2003లో హైదరాబాద్‌లో జరిగాయి. గ్లోబలైజేషన్ పరిణామాలను చిత్రిస్తూ ఒక రచయిత రాసిన కథలతో వెలువడిన సంపుటిలో ఇదే మొదటిది. ఈ కథలన్నీ గ్లోబలైజేషన్ పరిణామాలు జీవితంలో ఎన్ని రకాలుగా పరచుకొని సాగుతున్నాయో తెలుపుతాయి. గ్లోబలైజేషన్ అనేది ఇప్పుడే ప్రారంభమైంది కాదని బౌద్ధం ఒక సామాజిక ఉద్యమంగా, గ్లోబలైజేషన్ ప్రారంభించిందని తత్వవేత్తగా రచయిత భావిస్తారు. అందువల్ల తొలి కథగా 'నాగశాల' కథను ఇందులో చేర్చారు.

### మూడు శతాబ్దాల చరిత్ర పరిణామాలను చిత్రించిన 'నాగశాల'

నాగశాల కథ శాతవాహనుల తర్వాత మూడు శతాబ్దాల ప్రజల సాంఘిక స్థితి గతులను తెలుపుతుంది. కులాలు రూపుదిద్దుకుంటున్న క్రమంతో పాటు అవి ఎలా మారుతూ వచ్చాయో కూడా ఈ కథలో చిత్రించారు. కళాకారుడు కాదల్చుకున్న వ్యక్తి రాజు ఎందుకయ్యాడో ఈ కథలో చూడవచ్చు. తాను కళాకారుడైతే ఒక్కడే కళాకారుడిగా ఎదుగుతాడు. రాజ్యాన్ని పరిపాలిస్తే ఎంతోమందిని కళాకారులుగా ఎదిగించవచ్చు అని భావిస్తాడు.

"నాగశాల" కథలో ప్రధాన పాత్ర నాగశాల. నాగపాల, నాగపుత్రి వీరి తల్లిదండ్రులు. నాగపుత్రి ఒక దేశపు యువరాణి. ప్రజల్ని పీడించిన సొమ్ముతో అనుభవించే రాజభోగాలు, సుఖాలను వదిలి కళాకారుడైన నాగపాలను ప్రేమించి మారువేషంలో అతనితో ఈ ఊరు వచ్చింది. అనేక ఊళ్ళు తిరిగారు. ఆ అనుభవంతో



కొడుకు నాగశాలకు తల్లి నాగపుత్రి దేశాటన, యుద్ధ విద్యల పట్ల ఆసక్తి పెంచుతుంది. నాగపాల కళలు, శాస్త్రాల పట్ల ఆసక్తి పెంచుతాడు. యుద్ధ విద్యలు నేర్చుకొన్నాక బావ ఇలానాగతో కలిసి దేశాటన చేసి లోకరీతి తెలుసుకోవాలనుకుంటాడు.

దేశాటనకు బయలుదేరేముందు నాగపాల తగు జాగ్రత్తలు చెబుతాడు. స్త్రీలను గౌరవించు, రాజులతో, జ్ఞానులతో వాదాలు, పంతాలు వద్దని చెబుతూ "నాగసా! బౌద్ధులకు దూరంగా ఉండు. వాళ్ళు ఏవో మాయమాటలు చెప్పి నీ మనసు విరిచేస్తారు. నిన్ను కూడా బౌద్ధ భిక్షువుగా మారుస్తారు. మాకు పుట్టిన ఎనిమిది మందిలో మీ అక్క అలా అయిపోగా మిగిలింది నీవొక్కడివే. నీవు భిక్షవుగా మారితే మనం తరతరాలుగా వృద్ధి చేసిన ఈ కళలు కూడా నీతోనే నశించిపోతాయి. అందుకని బౌద్ధులు కనబడితే తప్పుకొనిపో. మహిమలు, మంత్రాలున్నాయని సిద్ధులు నీకు నేర్పుతామని శిష్యరికం చేయమని మోసం చేస్తారు జాగ్రత్త"[1] అని నాగపాల చెబుతాడు.

తండ్రి మాటలను తూ.చ. తప్పకుండా పాటిస్తూ దేశాటన చేస్తున్న నాగశాలకు ఏడాదిన్నరలో ప్రయాణిస్తున్నప్పుడు బాటసారులను, బౌద్ధులను దొంగలు వస్తువులు లాక్కొని చావబాది వదిలేస్తారు. గాయాలతో వారిని తక్షశిల తీసుకెళ్ళారు బౌద్ధులు. తక్షశిలలో కాషాయ వస్త్రధారి అదీర వాళ్ళందరిని ఆదరించింది. ఇలూచి నాగశాల వారి మిత్రులు కొద్ది రోజులు అక్కడే ఉన్నారు. ఆమె తన పూర్వీకులు తైలాంగులని చెప్పింది. తాను చైనా చూడాలనే కోరికతో వారితో ప్రయాణమయింది.

'ఆనందబుద్ధ' గురువు టిబెట్టు దారిలో గాడిదల మీద గ్రంథాలతో శిష్యులతో వెళుతున్న గురువును నాగశాల గుర్తించాడు. "నాగశాలా! శ్రీ పర్వత రాజ్యం ఇప్పుడు కళ కోల్పోయింది. అన్యులు ఆక్రమించారు. మహా విద్యాలయాలు మూగపోయాయి. ఎందరో శిష్యులు, బిక్షులు హతులయ్యారు. మీ బావ అస్సక మహారాజు గారి సామ్రాజ్య విస్తరణ కాంక్ష ఫలితమిది. మొత్తం రాజ్యాలన్నీ పరస్పర యుద్ధాలతో ఆక్రమణలతో దోపిడీలతో అల్లకల్లోలంగా ఉన్నాయి. ఇప్పుడిప్పుడే మీరు అటు వెళ్ళడం మంచిది కాదు. మాతో పాటు చైనాకు రండి. దుమ్మపాల భిక్షు మనకాశ్రయమిస్తాడు. ఈ విలువైన గ్రంథాలను కాపాడడం భవిష్యత్తు కోసం ఎంతో అవసరం. దమ్మపాల వీటిని చైనా భాషలోకి అనువదించాలనుకుంటున్నారు."[2] అని నాగశాలకు ఆనందబుద్ధ అక్కడి పరిస్థితిని చెబుతాడు.

అందరు కలిసి చైనా వెళ్ళారు. చైనీయులు తైలాంగుల పట్ల గౌరవంగా ఉంటారు. ఆనంద బుద్ధ తెచ్చిన గ్రంథాల్లో పైశాచీ భాషలో రాసిన గుణాఢ్యుడి 'బృహత్కథ'ను ఇలూచి చైనా భాషలోకి అనువదించుమని ఆనంద బుద్ధను కోరుతుంది.

నాగశాలకు దేశాటన అనుభవంతో ప్రజలకోసం బౌద్ధంకోసం రాజ్యం, శాంతి కోసం పరిష్కారం "రాజ్యాధికారం" ఒక్కటేనని గ్రహిస్తాడు. అధీర, నాగశాల సన్నిహితంగా ఉన్న తీరు గమనించి వారికి పెళ్ళి జరిపించాడు ఆనందబుద్ధ గురువు. నాగశాల ఒక

మహారణ్యంలో నది సమీపాన ఇల్లు నిర్మించి వ్యవసాయక్షేత్రాన్ని నిర్మించాడు. కొద్ది కాలంలోనే అనేక మూకలను తిప్పికొట్టి నాగశాలను రాజుగా గుర్తించారు. పొరుగున ఉన్న స్త్రీ రాజ్యం తన తల్లిదని తెలుసుకున్నాడు. తన అల్లుడు అస్సక రాజు రాజ్య విస్తరణతో ముందుకు వస్తున్నాడని తన కొడుకు నాగశాలతో సంధి చేసుకొంటుంది.

నాగశాల వ్యూహంతో అస్సక మహారాజును అంతమొందించి విశ్వ విద్యాలయాలను నెలకొల్పాడు. దేశదేశాల కళాకారులను గౌరవించి దేశదేశాల్ని ఆకర్షించాడు. నాగశాల అధిరల పుత్రునికి "నాగపాల" అని తన తండ్రి పేరు పెట్టుకున్నాడు. నాగపాల తండ్రి దేశాటనకు బయలుదేరి వెళ్తాడు.

నాగపుత్రి తన కొడుకును ఎన్నాళ్ళనుంచో ఒక ప్రశ్న అడగాలనుకుంటుంది. మీ నాన్నలా గొప్ప కళాకారుడివి అవ్వాలనుకొని దేశాటన చేసి రాజ్యాధినేతవయ్యావేమిటని ప్రశ్నిస్తుంది.

"అమ్మా! నీకన్నీ తెలుసు, ఎక్కడ రాజ్యం శాంతి సుస్థిరత పంటల సమృద్ధితో సుభిక్షంగా ఉంటుందో అక్కడ సమస్త విద్యలు కళలు వికసిస్తాయి. నేను కళాకారుడిని కావడం వల్లే బౌద్ధ భిక్షువును కాకుండా రాజ్యాధినేతను కావాలనుకున్నాను. నేనొక్కడిని ఎదగడం కన్న ఎంతో మందికి నీడనీయడం నాకు తృప్తినిచ్చింది. నాగపాల కూడా దేశాటనతో రేపెప్పుడో ఇదే నిర్ణయానికొస్తాడనుకుంటానమ్మా!" అంటూ నాగశాల చివరి సంభాషణ ముగిస్తాడు.

'నాగశాల' కథ తైలాంగులే తెలంగాణ వారని తెలుపుతుంది. ప్రజలు రాజ్యాధికారం కోసం ఎందుకు కృషి చేయాలో తెలుపుతుంది. కళాకారులు, రచయితలు, మేధావులు చరిత్రను ఎలా అధ్యయనం చేయాలో తెలుపుతుంది.

**ఫెమినిజం తెచ్చిన దుష్పరిణామాలను చిత్రించిన 'అయిదవవాడు'**

ఫెమినిజం అనేక మంచి పరిణామాలను తెచ్చింది. ప్రతిదాన్ని దుర్వినియోగం చేసేవాళ్ళు ఎప్పుడూ వుంటారు. ఫెమినిజాన్ని దుర్వినియోగం చేసే వాళ్ళు సమాజంలో ఎలాంటి పరిణామాలకు కారకులవుతున్నారో ఎందరి జీవితాలతో ఆటాడుకుంటున్నారో ఈ కథ తెలుపుతుంది. తన వ్యక్తిగత అభివృద్ధి కోసం ఒక స్త్రీ అనేకమంది జీవితాలతో, కుటుంబాలతో ప్రేమ పేరుతో ఆడిన నాటకాలు ఎన్నో జీవితాల్లో విషాదాన్ని కలిగిస్తాయి. ఇంత బరువైన ఇతివృత్తాన్ని వస్తువుగా తీసుకొని కథను చాలా ఉత్కంఠ కలిగించే విధంగా ప్రారంభిస్తారు. కథ ప్రారంభమే పాఠకుణ్ణి కట్టిపడేస్తుంది. ఎప్పుడో కాలేజి విద్యార్థి జీవితంలో మొలకెత్తిన ప్రేమ భావాలు పెళ్ళయ్యాక ఎన్నో ఏళ్ళకు తిరిగి ప్రత్యక్షమైనట్లు ఉత్తరం రావడం సుమలతకి ఆనందం కలిగిస్తుంది. ఆ ఉత్తరాన్ని సుమలత పిల్లలే దయానంద్ అంకుల్‌తో రాయించారని తర్వాత తెలుస్తుంది. అలా కథ జలపాతంలా సాగుతూ వుంటుంది. ముగింపు శరత్‌బాబు నవలల్లో లాగా ఉదాత్తంగా ఉంటుంది. సంక్షిప్తంగా కథ ఇలా చెప్పుకోవచ్చు.



సుమలత-శైలజ అనే ఇద్దరు ఆడవాళ్ళు, దయానంద్, రత్నాకర్ అనే ఇద్దరు మగవాళ్ళ మధ్య నడిచే కథ అయిదవవాడు. కాలేజీ చదివే రోజుల్లో సుమలతను పెళ్ళి చేసుకుంటానన్న వారిలో అయిదవవాడు దయానంద్. సుమలత శైలజతో ప్రేమించబడ్డానికి అందం ఒక్కటే ముఖ్యం కాదని హృదయ సౌందర్యం, ప్రేమను వ్యక్తం చేసే అవకాశం ముఖ్యమని అంటుంది. అందంగా లేననే ఇన్ఫీరియారిటీతో అందరితో ప్రేమించబడేట్టు చేసుకోవడానికి శైలజ ప్రయత్నిస్తుంది.

సుమలత చదువులో డిస్టింక్షన్ తెచ్చుకున్న వారినే పెళ్ళి చేసుకుంటాను అంటే దయానంద్ విద్యార్థి రాజకీయాలకు దూరంగా ఉండి బాగా చదువుకొని అటు తర్వాత జె.యన్.యు లో ఉద్యోగంలో చేర్తాడు. ఆ తర్వాత సంవత్సర కాలంలో "శైలజను ప్రేమించిన రత్నాకర్ తనను పెళ్ళి చేసుకోవడానికి అంగీకరించడం ఆశ్చర్యం అన్పించింది. భగ్న ప్రేమికుడితో తన వైవాహిక జీవితం. అంతకన్నా ఆశ్చర్యకరంగా శైలజ దయానంద్‌ను పెళ్ళిచేసుకోవడం. ఏడాది వ్యవధిలో ఎన్నో ఊహించని మలుపులు తిరిగాయి జీవితాలు" అని లక్నోలో ఉద్యోగం చేస్తున్నప్పుడు నెల రోజులు అక్కడ ఉండి దయానంద్‌ను ఆకర్షించి పెళ్ళి చేసుకొని కూతురును కని దయానంద్‌ను, కూతురును వదిలి మరొకరితో శైలజ అమెరికా వెళ్ళి పోతుంది. శైలజ దయానంద్ ఆసరాతో జె.యన్.యూలో చేరిన కృతజ్ఞత అయినా లేకుండా భర్తను, కూతురును వదిలి వెళ్ళడం "స్త్రీ స్వేచ్ఛకు" ప్రతీకగా నిలుస్తుంది.

సుమలత రత్నాకర్ పెట్టే హింసను భరించలేక తనను ప్రేమించిన దయానంద్ దగ్గరకు పిల్లలతో సహా పోవాలనుకుంటుంది. అంతలో చిననాటి మిత్రుడు ధర్మరాజు కూతురు పెళ్ళికి రమ్మని సుమలతకు దయానంద్ ఉత్తరం రాస్తాడు.

పిల్లలతో సహా సుమలత లక్నో వెళుతుంది. దయానంద్ కూతురు సుమలత పిల్లలు కలుసుకుని ఆనందంగా గడుపుతారు.

సుమలత కూతురు 'భవ్య' మమ్మీని దయానంద్ అంకుల్‌ను పెళ్ళి చేసుకోమంటుంది. అప్పుడు దయానంద్ "పాపా ! దూరంగా ఉండి స్నేహంగా సహకరించుకోవడంలో ఉండే పవిత్రతను సమాజం హర్షిస్తుంది. కల్సి జీవిస్తే అదే సమాజం ఈసడిస్తుంది. ఈ విలువలు మారే దాకా సహనం తప్పదు. కాలమే సమస్యల్ని పరిష్కరిస్తుంది" అని అంటాడు.

చివరగా సుమలత దయానంద్ కలిసి బ్రతికే అవకాశం ఉండి సుమలత ఉద్యమ జీవితంలోకి వెళుతుంది. మొదటే చెప్పినట్టు ఈ కథ స్త్రీ స్వేచ్ఛను విమర్శనాత్మక దృష్టితో వ్రాసినది.

**ఆదుకునే హస్తం వుంటే ఎంతమేరకైనా ఎదగవచ్చునని చెప్పే 'చేయూత'**

రిజర్వేషన్ల వల్ల ఎంతో బాగుపడిపోయారని కొందరు ఈర్ష్య పడుతుంటారు. కానీ ఆ రిజర్వేషన్లను అందుకునే స్థాయి కూడా ప్రజలకు లేదు. రిజర్వేషన్లను అందుకోటానికి కూడా ఒక స్థాయి అవసరం. రిజర్వేషన్ల వల్ల కొంతమేరకే ఎదగడం

సాధ్యమవుతున్నది. ఆర్థిక, సాంఘిక స్థితులు ఇంజనీరు కావలసిన వారిని టీచర్‌గా బతకడానికి పరిమితం చేస్తున్నాయి. 'చేయూత' కథలో కనీసం టీచరైనా అయ్యింది అరుణ. వేపచెట్టు కథలో మహేష్ సాఫ్ట్‌వేర్ ఇంజనీర్ అయి అమెరికా వెళ్ళాల్సిన వాడు కనీసం టీచర్‌కూడా కాలేకుండా తాపీ మేస్త్రీగా బతుకుతుంటాడు. అభివృద్ధిని, రిజర్వేషన్లను అందుకోవడంలో ఎన్నో అడ్డంకులు వున్నాయి. పోటీప్రపంచం రిజర్వేషన్ల పేదలను అనేక రకాలుగా ఇన్ఫీరియారిటీ కాంప్లెక్స్‌కు గురి చేస్తున్నారు. అందువల్ల ఎదగగలిగి వుండి కూడా ఎదగలేకపోతున్నారు. అవమానాలు దీనికి తోడై తమ జీవితాలను తామే కుదించుకుంటున్నారు. వేపచెట్టు కథ ఇలా విషాదంగా ముగిస్తే చేయూత కథ గుడ్డిలో మెల్లలాగా కాస్త అభివృద్ధిని అందుకున్న తీరును తెలుపుతుంది.

పోచయ్య కూతురు అరుణ. పదోతరగతి చదివించడం తల్లిదండ్రులకు భారమవుతుంది. ఆర్థిక భారంతో పాటు సాంఘీక భారం, సాంస్కృతిక అణచివేత వీరిని కృంగదీస్తుంది. ఆ ఊరి స్కూలు టీచరు, ఆ అమ్మాయి చదువులో బాగుందని పోచయ్యను ఒప్పించి హాస్టల్లో వేసినారు. అక్కడ హాస్టల్ మ్యాట్రన్ లలిత పరిచయం అవుతుంది. ఆమె చేయూతతో అరుణ ఇంటర్ పూర్తి చేస్తుంది.

1986 నుండి తెలుగుదేశం ప్రభుత్వం డిగ్రీ జూనియర్ కళాశాలలకు హాస్టల్ వసతిని రద్దు చేసింది. ఎందరో దళితులు చదువుకోలేకపోయారు. హాస్టల్ మ్యాట్రన్ లలిత దగ్గర ఉంటూ మార్చిలో వచ్చే స్కాలర్‌షిప్ కోసం చూస్తూ మిల్లుపని చేసి చదువుకుంది. అరుణకు చిల్లర ఖర్చులకు పుస్తకాలకు మ్యాట్రన్ లలిత సర్దేది. లలిత అరుణను టి.టి.సి. చేసి టీచర్ కావాలని లేదా హాస్టల్ మ్యాట్రన్ అయి హాస్టల్‌ను గొప్ప ఆదర్శ హాస్టల్‌గా తీర్చిదిద్దేటట్లు చేయాలని అనుకుంటుంది. హాస్టల్లో నిత్యం వణికిపోయే ఉద్యోగం వద్దంటుంది లలిత. డిగ్రీ పూర్తిచేసి ఎమ్మెస్సీ సెకండ్ క్లాసులో పాసవుతుంది.

అయిదేళ్ళ తర్వాత లలిత అసిస్టెంట్ సోషల్ వెల్ఫేర్ ఆఫీసర్‌గా ప్రమోషన్ మీద వెళ్ళి వేరే ఊర్లో పని చేస్తుంది. అరుణ టీచరుగా ఉద్యోగంలో స్థిరపడుతుంది. చెల్లెలిని, తమ్ముడిని చదివిస్తుంది. అరుణ ఉన్న ఊళ్ళో ఆమె ప్రేరణతో అనేకమంది ఆడపిల్లలు చదువుపట్ల ఆసక్తితో చదువుకుంటారు. లలిత పాత జిల్లాకు బదిలీపై వచ్చి అరుణ ఉద్యోగం చేస్తున్న ఊళ్ళోని బడికి వెళ్తుంది.

ఇద్దరూ తాము గెలుచుకున్న జీవితాలు గెలువాల్సిన లక్ష్యాలు ఉన్నాయని నిర్ధారించుకుంటారు.

'చేయూత' కథలో బి.యస్.రాములు దళితులు రిజర్వేషన్ల ద్వారా అభివృద్ధి అందుకోవాలని ప్రైవేటీకరణ వల్ల, గ్లోబలైజేషన్ వల్ల పేదవారికి జరిగే నష్టాలను చెప్పి గెలుచుకున్న జీవితం పట్ల నిరాశ పెంచకూడదని చెబుతాడు. 1986లో తెలుగుదేశం ప్రభుత్వం జూనియర్, డిగ్రీ కళాశాలకు హాస్టల్ సౌకర్యం లేకుండా చేయడం వల్ల చాలా మంది దళితులు ఏ విధంగా చదువుకోకుండా నష్టపోయారో తెలియజేస్తాడు.



స్త్రీలకు ఉద్యోగ భద్రత ఇచ్చే ఆత్మవిశ్వాసం, కట్నాల తీరు, చదివిన అమ్మాయిల పట్ల తల్లిదండ్రులకు కలిగే భావనలను చిత్రించినారు.

అంబేద్కర్, భాగ్యరెడ్డి వర్మ, ఆధునిక భారతదేశం మొట్టమొదటి మహిళా టీచరు సావిత్రిబాయి పూలే, మహాత్మ జ్యోతిరావు పూలే మొదలగు వారి స్ఫూర్తి గురించి దళితులు ఎదగాల్సిన అవసరం గురించి ఈ కథలోని పాత్రల ద్వారా చిత్రించాడు రచయిత.

**జీవితంలోని మలుపులు అన్నీ మన ప్రమేయంతోనే జరగవని తెలిపే 'మలుపులు'**

కుటుంబంలో ఒకరు బాగుపడితే అది ఎందరి ఎదుగుదలకు ఉపయోగ పడుతుందో సమాజంలో వారికి పెరిగే ఆదరణ ఎలాంటిదో మలుపులు కథ తెలుపుతుంది. డాక్టర్‌గా ఎదిగిన అరవింద్ చుట్టూ ఈ కథ నడుస్తుంది. అరవింద్ పెళ్ళి చుట్టూ అనేక ఉపకథలు పెనవేసుకొని స్వాతంత్ర్యానంతరం ఆధునిక అభివృద్ధిలో కొంత అందుకోగలిగిన సమాజం ఎలాంటి పరిణామాలతో ముందుకు సాగుతున్నదో మూడు దశాబ్దాల సామాజిక చరిత్రను ఈ కథ రికార్డు చేస్తుంది. ముక్కోణపు ప్రేమ కథ రూపంలో సామాజిక అర్థశాస్త్రాన్ని ఇతివృత్తంగా తీసుకొని కథా వస్తువు సాగుతుంది.

అరవింద్ జగిత్యాల చేనేత కార్మిక కుటుంబానికి చెందినవాడు. ఉస్మానియా మెడికల్ కాలేజీలో మెడిసిన్ చదువుతుంటాడు. నాన్నకు ఆరోగ్యం బాగలేదని తమ్ముడు వ్రాసిన ఉత్తరంతో కుటుంబ పరిస్థితులను గుర్తుచేసుకొని జగిత్యాలకు ప్రయాణమవుతాడు. ఇంటికి చేరిన అరవింద్ మంచానపడిన తండ్రిని చూచి పోషకాహార లోపమే పేద దేశాల్లో అన్నింటికన్నా పెద్ద జబ్బు అన్న ఫ్రెంచ్ సామాజిక అర్థశాస్త్రవేత్త మాటలు గుర్తు చేసుకుంటాడు.

తనకు మామ అయిన నారాయణ సేటు కూతురు నిర్మలను పెళ్ళి చేసుకుంటే తమకు ఆర్థికంగా ఎదుగుదలకు తోడ్పడుతాడని తల్లిదండ్రుల అభిప్రాయం. కాని తన క్లాస్‌మేట్ రాధ తాను ప్రేమించుకున్న సంగతి చెప్పలేకపోతాడు. తాను చదువుకు, కుటుంబ అవసరానికి బాకీ క్రింద డబ్బు ఇచ్చిన మామ నారాయణ సేటు కూతురు నిర్మలను చేసుకుంటే కట్నం కింద తనను అమ్మేయదలచుకున్న అమ్మానాన్నల గురించి ఆలోచిస్తూ "బాకీ పెట్టుబడి జీవితాభివృద్ధి కోసం పెట్టుబడి రెండు వేరు వేరు సామాజిక సంబంధాలను పరిణామాలను సృష్టిస్తాయంటాడు ఫ్రెంచ్ శాస్త్రవేత్త. అమెరికా ప్రపంచబ్యాంకు ఇచ్చే పెట్టుబడులన్నీ బాకీ పెట్టుబడులే తప్ప నిజమైన సామాజికాభివృద్ధి పెట్టుబడి క్రమాలకు సంబంధించినవి కావు" అన్న మాటల గురించి ఆలోచిస్తాడు.

నారాయణ సేటు నామీద పెట్టుబడి పెట్టేకంటే తమ్ముని కన్న చిన్నదే కనుక నిర్మలనిచ్చి పెళ్ళి చేస్తే తనలా ఎదిగించవచ్చని అరవింద్ అభిప్రాయపడతాడు. దాంతో తల్లి దేవక్క "గంత ఓపికలు, మంచి గుణాలు ఎవలకున్నయిరా! పండించడానికి ధరకద్దమని వస్తరు. మంచి సీరెలు నెయ్యిని అనే రైతులు మొత్తం పైసలు అద్మాసు

యిస్తే యింత కన్న తక్కువ ధరకు, ఇంతకన్న మంచిగ నేసి ఇస్తుంటిమి. ఈ అప్పులు వడ్డీలు అన్నీ తగ్గు. గట్ల ముందుగాల పెట్టుబడి పెట్టమంటే ఎవలకైనా బుగులే"[7] అంటూ ప్రతినిత్యం చేనేత వృత్తి కులాలు ఎదుర్కొనే సంక్షోభాలకు వారి వెనుకబాటు తనానికి గల కారణాలు తెలుపుతుంది.

అరవింద్ నిర్మలను కాదన్నాడని నారాయణసేటు ఒక లెక్చరర్ కిచ్చి పెళ్ళి జరిపిస్తాడు. ఎనిమిది నెలలు గడిచిన తర్వాత అరవింద్ రాధను కలిసి అమ్మా, నాన్నలను మన పెళ్ళికి ఒప్పించానని చెబుతాడు. కాని రాధ అప్పటికే అమెరికాలో సెటిలైన వి.యల్.కాంత్ (వనమాల లక్ష్మీకాంత్)తో పెళ్ళి సెటిలైందని చెబుతుంది. నిర్వేదంతో హాస్టల్‌లో ఉన్న అరవింద్‌ను విక్రాంత్ ఓదార్చుతాడు. నిర్మలను చేసుకున్నా బాగుండేదని బాధపడతాడు. అరవింద్‌ను బాధపడకని "ఎవరైనా ఉన్న స్థితినించి మరింత ఉన్నత జీవితం గెలుచుకోవాలనుకుంటారు. సమాజంలోని దాని పర్యవసనాలే నేటి ప్రపంచం, ఆర్థిక వ్యవస్థ అని మనదేశ దుస్థితికి ఈ దృష్టే ఎలా కారణమో ఫ్రెంచి శాస్త్రవేత్త ఎంత బాగా చెప్పాడు"[8] అని విక్రాంత్ చెబుతాడు.

ప్రేమించిన రాధ కాదన్నదని భగ్న ప్రేమికుడిగా ఉండిపోవాల్సిన పని లేదని, ఫెమినిజం వచ్చాక పెళ్ళి, కుటుంబం, వాటి విలువలు మారిపోయాయని చెబుతాడు. "మానవి" సంస్థ చిక్కడపల్లి సెంట్రల్ లైబ్రరీలో "పెళ్ళి-దృక్పథాలు"పై సెమినార్ నిర్వహిస్తున్నారని అక్కడికి రమ్మని చెబుతాడు. అరవింద్, విక్రాంత్ వెళ్ళేసరికి అమెరికన్ ఫెమినిస్టు ప్రసంగం సాగుతుంది.

అరవింద్ ఆ ప్రసంగంలోని మాటల్లో రాధ, నిర్మల క్షట్నంతో హోదాను కొన్నట్లేనని ఆలోచిస్తాడు. విక్రాంత్ చెల్లె సావిత్రిని తమ్ముడికి అడిగానని తల్లి దేవక్క చెబుతుంది. లత, విక్రాంత్‌ను ఇష్టపడుతుంది.

అరవింద్‌పై స్థాయి రాధను చేసుకోలేక, నిర్మలను కాదని క్రిందిస్థాయి సావిత్రిని చేసుకోలేక పోయాడు. ఈ కథలో క్రింది కులాలకు చెందిన విద్యార్థుల జీవితాలలో పొంచివున్న ప్రమాదాన్ని విక్రాంత్ తెలియపరుస్తాడు. అసమానతలు, పెట్టుబడి, గ్లోబలైజేషన్ పరిణామాలను ఈ కథ విశదీకరిస్తుంది.

**వాడుకొని వదిలేసే మానవ సంబంధాలుగా మారుతున్న మనుషుల గురించిన 'సంబంధం'**

మనుషులు అవసరానికి వాడుకొని వదిలేసే సంబంధాలుగా మానవ సంబంధాలను మార్చివేయడంలో ప్రపంచీకరణ ప్రభావం ఎంతో వుంది. దీన్ని ఇంగ్లీషులో యూజ్ అండ్ త్రో సంస్కృతని పిలుస్తున్నారు. పెళ్ళి సంబంధాల కోసం ఒక ఉన్నత ఉద్యోగి వెనకటి కాలం నాటి స్నేహితులను గుర్తు చేసుకొని చిరునామాలను సంపాదిస్తాడు. ప్రేమను వలకబోస్తాడు. పెళ్ళి సంబంధాలు చూడమని కోరతాడు. మీ ఊరికి వస్తానంటాడు. స్నేహితుడు ఆ అమ్మాయికి సంబంధం వెతికి పట్టణం వెళతాడు. అప్పటికి



ఆ అమ్మాయికి పెళ్ళయిపోయి అమెరికా వెళ్ళిపోతుంది. కనీసం పెళ్ళి కార్డు కూడా పంపని మనిషిని తాను స్నేహితునిగా భావించి ఆటో ఛార్జీలు పెట్టుకొని ఇంత దూరం రావడం ఎంత బుద్ధి తక్కువో తెలుసుకుంటాడు. ఇలా మానవ సంబంధాలు వాడుకొని వదిలేసే సంబంధాలుగా మారుతున్న క్రమాన్ని పెళ్ళి సంబంధాల పరిణామాలను ఇతివృత్తంగా తీసుకొని ఈ కథ నడుస్తుంది.

ఈ కథలో బంధుత్వం, స్నేహాలు - అధికారం, హోదాల ముందు ఏ విధంగా ఓడిపోతాయో ఉమ్మడి కుటుంబాలు విచ్ఛిన్నమవుతున్న తీరు ఎలా వుంటుందో తెలుపుతుంది. మారుతున్న మానవ సంబంధాల పరిణామ క్రమాన్ని ఎల్లయ్య, కరుణాకర్ పాత్రల ద్వారా రచయిత తెలుపుతాడు. ఇక కథా వస్తువు చూద్దాం.

ఎల్లయ్య స్కూల్ టీచర్, కరుణాకర్ హైదరాబాద్‌లో ఓ డిస్ట్రిక్ ఆఫీసర్ హోదాలో ఒకే కులం, ఒకే ఊరు అయి ఉండి ఇరవై సంవత్సరాలలో ఒక్కసారి మాత్రమే ఫోన్‌చేసి తన కూతురుకు ఒక మంచి సంబంధం చూడమని కోరతాడు.

ఆధునిక కాలంలో పట్టణాలలో కులాల వారీగా వివాహ పరిచయ వేదికలు ఉన్నా "అక్కడా అనుమానాలే. ఎవరి జీవిత నేపథ్యం ఏమిటో పరస్పరం తెలియక అయోమయం. మళ్ళీ పుట్టి పెరిగిన ఊళ్ళవైపు జిల్లా వైపు దృష్టి సారించడం... హైదరాబాద్ పెళ్ళి సంబంధాలు జగిత్యాలలోనో, కోరుట్లలోనో, మెట్‌పల్లిలోనో సెటిల్ కావడం విచిత్రం"[9] అంటూ అమ్మాయి, అబ్బాయి హైదరాబాద్‌లో ఉన్నా మళ్ళీ పాత బంధువుల ద్వారా సెటిలవుతున్నాయి. ఉమ్మడి కుటుంబాలు పోయి వ్యక్తి కుటుంబాలు వచ్చాక ఉన్న ఊరితో సంబంధం తెగిపోయాక మనిషికి మరే సంబంధం ఉండదని, కులం ద్వారానో, స్నేహం ద్వారానో సంబంధాలు కలుపుకోవాలనుకుంటారు.

ఎల్లయ్య తన సహ ఉద్యోగి రాజేశ్వర్‌కు కరుణాకర్ విషయం చెబుతాడు. కరుణాకర్ తన కూతురును మీ కొడుక్కే అడగవచ్చుకదా! అని రాజేశ్వర్ అంటాడు. సామాజిక విలువలు మనిషి ఆలోచనల్ని ఎలా నియంత్రిస్తాయో అని, కరుణాకర్ హోదా ధనిక సంస్కృతి తన మనసులో ఉండి ఆలోచన రాలేదని, తనకు కొడుకు ఉన్నాడని అడగలేదని, ఆఫీసర్ కింది ఉద్యోగులకు చేసే ఆజ్ఞలా అనిపించి మనసులో బాధపడతాడు.

ఎల్లయ్య తన భార్యతో కరుణాకర్ కూతురు విషయం మాట్లాడుతాడు. కొడుకన్న బాగుపడాలని ఆశిస్తాడు. ఇంకా తన స్నేహితుడు పురుషోత్తం ఇంటికి వెళ్ళి అతని కొడుకు బయోడేటాను తీసుకుంటాడు. ఈ ఇద్దరిలో ఎవరికో ఒకరికి సంబంధం కుదుర్చాలని ప్రయత్నిస్తాడు. చివరికి కరుణాకర్ భార్య ఎల్లయ్యకు ఫోన్‌చేసి సారీఅండి! ఆయనకు అనుకోకుండా టూరు పడిందని చెబుతుంది. ఇంకాస్త మంచి సంబంధం దొరికిందని భావిస్తాడు ఎల్లయ్య.

ఎల్లయ్య, పురుషోత్తంలు కొడుకులకోసం వధువుకావాలని పత్రికా ప్రకటన ఇస్తారు. ఒకే ఉద్యోగానికి రెండు అప్లికేషన్ల మాదిరిగా కరుణాకర్ రెండో కూతురు

బయోడేటా ఇద్దరికి రావడంతో ఆశ్చర్యపోతారు.

"మార్కెట్ ఎకనామీ అంటే ఇదే సార్! మనుషుల్ని మానవ సంబంధాల్ని కూడా సరుకుల్లా అవసరమైనప్పుడు కొనుక్కొని వాడుకొని వదిలేసే సంస్కృతి ఇది. ఈ సిద్ధాంత పాఠాలు మీరే చెబుతారు. మీ సంబంధాల్ని మాత్రం అట్లా విశ్లేషించుకోరేం? దీన్ని మీరు ప్రేమ, స్నేహం అని మోసపూరిత అనుబంధాల రూపం అద్దుతారు"[10] అన్నాడు రాజేశ్వర్. ఇలా మార్కెట్ ఎకానమి మానవ సంబంధాలను మార్చిన తీరును చిత్రించడం సామాజిక శాస్త్ర నైపుణ్యం ఉన్నప్పుడే సాధ్యం.

**శ్రమ పట్ల గౌరవం లేకుండా ఇతరుల శ్రమను ఆశించే 'ప్యారసైట్లు'**

'ప్యారసైట్లు' కథ మధ్య తరగతి కుటుంబాల్లో పెరుగుతున్న కొత్త తరం పిల్లలు పనికి దూరమై, శ్రమను అగౌరవపరిచే దృష్టితో టీవీలకు అతక్కుపోయి ఏ కష్టం తెలియకుండా, ఏ అనుబంధం తెలియకుండా లోకం తెలియకుండా బ్రాయిలర్ కోళ్ళలా పెరుగుతున్న క్రమాన్ని చిత్రిస్తుంది. తమ పిల్లలు పని చేయరని చెప్పుకోవడం గొప్పగా ఫీలయితే ఆ తరువాత వారికి ఎదురయ్యే కష్టాలు ఏమిటో ఈ కథలో ఇతివృత్తంగా తీసుకున్నారు. కథా వస్తువు కుటుంబం సంబంధాలు మారుతున్న క్రమం. తాత, తల్లిదండ్రులు, పిల్లల మధ్య కోల్పోతున్న ఆత్మీయత, అనుబంధాలు. ఇలా పట్టణాలలోని అపార్ట్‌మెంట్ల వారి జీవన విధానం, మానవ సంబంధాలు టి.వి.లు పిల్లలపై చూపే ప్రభావాన్ని చిత్రించిన కథ 'ప్యారసైట్లు'.

సుమిత్ర – భూకేశ్వర్‌ల పిల్లలు రాకేష్, వినీత్, సౌందర్య-శ్రీకాంత్‌ల పిల్లలు అతుల్, హిరణ్. ఒకే అద్దె ఇంట్లో సహజీవనం చేసే కుటుంబాలు. సుమిత్ర పిల్లలు ఇంటిపని వంటపనిలో ఆసక్తితో పని చేస్తుంటారు. పనిపట్ల గౌరవం పెంచుతుంది సుమిత్ర. సౌందర్య కుటుంబం ఇరవై రోజుల క్రింద అద్దెకు దిగుతారు. శ్రీకాంత్ సౌందర్యల మ్యారేజ్‌డేకి సుమిత్ర భోజనాలు ఏర్పాటు చేసి ఆహ్వానిస్తుంది. సౌందర్యకు హృదయం నిండిపోతుంది. ముఖ్యంగా సుమిత్ర పిల్లలు పనిపట్ల గౌరవాన్ని చూపటం ఆకట్టుకుంటుంది.

పల్లెటూల్లో సౌందర్య అత్తమామల దగ్గర ఉంటుంది. రోగిష్టి అత్తమ్మ, కోపిష్టి మామయ్య, పెళ్ళికాని ఆడపడుచు వాళ్ళ బరువూ, బాధ్యతల్ని మోయడం జీవితం వెట్టి చాకిరిలా అనిపించి శ్రీకాంత్‌ను వేరే ఊరికి బదిలీ చేయించుకునేటట్లు చేసింది. పేగుబంధం తెగి తన కుటుంబంతో స్వేచ్ఛాజీవి అయింది సౌందర్య.

సౌందర్య ప్రేమ వలకపోసి మందితో పని తీసుకోవడంలో దిట్ట. సుమిత్ర పిల్లలు ఎంతో పని చేసుపెడుతుంటారు. కానీ సౌందర్య పిల్లలు ఏ పనీ చేయరు. తమతో పాటు పని చేయాలని వాళ్ళు కోరతారు. తమ పిల్లలకు ఏ పనీ రాదని వెనకేసుకొస్తుంది సౌందర్య. సుమిత్ర తమ పిల్లలు మీ ఇంట్లో పని మనుషులు కాదని హెచ్చరిస్తుంది.

సౌందర్య తండ్రికి ఆరోగ్యం బాగా లేదని టెలిగ్రాం వస్తుంది. బట్టలు సర్దుకొని



వెళ్తుంటే "నీ ఉద్దేశం ఏంటి? నేను టెన్త్ ఫెయిల్ కావాలనా ! ముసలివాడు ఎప్పుడైనా చావకతప్పదు. నా భవిష్యత్తు పాడు చేస్తావా ? యిక్కడ పని ఎవరు చేస్తారు"[12] అంటాడు అతుల్.

సౌందర్య వెళ్ళి నాన్న చనిపోయాడని ఫ్రెండింటికి ఫోన్ చేస్తుంది. శ్రీకాంత్ తయారయ్యాడు. అతుల్, హిరణ్‌లను రమ్మంటాడు. "సారీ డాడీ! క్రికెట్ మ్యాచ్ నడుస్తుంది. పైగా డేంజరస్ డెవిల్ సీరియల్ మిస్సవుతుంది"[13] అంటూ చనిపోయిన తాతయ్య తిరిగిరాడని, చచ్చిపోయాక తాతయ్య డేంజరస్ డెవిల్ సీరియల్‌లో లాగా మారతాడా అని హిరణ్ అంటాడు. తండ్రి కొడతాడు.

"పిల్లల్ని స్వయం పోషకంగా పెంచడం చాతకాక గారాబం చేసి ఇప్పుడు కొట్టడం దేనికి, మీరు తప్పుచేసి వాళ్ళను శిక్షించడం ఎందుకు? చిన్నప్పటినుండి అన్నిపనులు నేర్పి పనిపట్ల గౌరవం కలిగిస్తే యిలా జరగదని నేను చెప్తూనే ఉన్నాను" అంది సుమిత్ర.

పనిపట్ల గౌరవం లేక, ఎలక్ట్రాన్ మీడియా ప్రభావంతో మానవ సంబంధాల పట్ల ప్రేమలేక పోవడం, పెద్దల పట్ల గౌరవం లేకపోవడం ఈ "ప్యారసెట్లు" కథ తెలుపుతుంది.

**మానవ వనరులను వృధా చేస్తున్న సామాజిక చరిత్రే 'వేపచెట్టు'**

ప్రపంచీకరణ ప్రభావాలు అనేక రకాలు. కొన్ని దశాబ్దాల క్రితం అమెరికాలో స్థిరపడిన రాజేశ్వర్‌రావు తమ వూరికి, తమ దేశానికి ఏదైనా చేయాలని ఇండియాకి వస్తాడు. స్కూలులో మెరిట్ స్కాలర్‌షిప్పులు ఇస్తాడు. హైదరాబాద్‌లో ఎన్ఆర్ఐగా ఒక పరిశ్రమ స్థాపించాలనుకుంటాడు. పేదలకు సాయం చేయాలనుకుంటాడు. ప్రభుత్వం అధికారులు ఎవరూ సహకరించరు. అంతా అవినీతిలో కూరుకుపోయి చేతులు చాపుతుంటారు. దాంతో ఇండియాలో పరిశ్రమ పెట్టాలనే ఆలోచన విరమించుకుంటాడు. అప్పటికే ఇండియాలో పరిశ్రమ పెట్టబోతున్నట్లు అందరికీ తెలిసిపోతుంది. అందులో తమ పిల్లలకు ఉద్యోగాలు ఇవ్వాలని ఎందరో బంధుమిత్రుల పేరుతో వెంటబడతారు. ఇవన్నీ చూసి ఉక్కిరి బిక్కిరి అవుతారు. దాంతో పరిశ్రమ స్థాపించే ఉద్దేశ్యాన్ని మార్చుకుంటాడు. ఈ సామాజిక ఇతివృత్తంతో కథా వస్తువును అమెరికాకు అతడు పుట్టి పెరిగిన గ్రామానికి మధ్య మారిన మానవ సంబంధాలను, గ్రామీణ సమాజాన్ని తీసుకొని చిత్రిస్తాడు. విప్లవ ఉద్యమం తరువాత గ్రామాల్లో వస్తున్న ప్రపంచీకరణ పరిణామాలు పేదలకు రిజర్వేషన్లు కూడా అందుకోలేని దుస్థితిని తెచ్చిపెట్టాయి. అందుకు మహేష్ బలి అవుతాడు. ఇంజనీర్‌గా తన పాలేరు కొడుకును చూడాలనుకున్న రాజేశ్వర్‌రావుకు అతడు మేస్త్రీగా బతకడం చూసి కన్నీళ్ళు తెచ్చుకొని వెనక్కి వెళ్ళిపోతాడు. ఈ దేశంలో 'వేపచెట్టు'లో ఎన్నో ఔషధ గుణాలు వున్నట్లే మనుషుల్లోను ఎన్నో నైపుణ్యాలు వున్నాయి. కాని వాటిని సద్వినియోగం చేసే వాళ్ళే లేరు అని రాజేశ్వర్‌రావు వాపోతాడు. కథ సంక్షిప్తంగా ఇలా నడుస్తుంది.

వెంకట్రావ్ చిన్న కొడుకు రాజేశ్వర్‌రావు. మైసయ్య, వెంకట్రావ్ ఇంట్లో పాలేరు పని చేస్తుంటాడు. రాజేశ్వర్‌రావును "చిన్నదొర" అని పిలిచేవాడు.

రాజేశ్వర్‌రావు రైతు కుటుంబంలో పుట్టి పట్నంలో చదివి అమెరికాలో సెటిలౌతాడు. తన వూరు జగిత్యాలకు ఇరవై యేండ్ల తర్వాత వచ్చి స్కూల్లో పిల్లలకు పదవతరగతి ఫస్టుక్లాస్‌లో పాస్ అయినవారికి తనపేరు మీద ప్రతిభా పురస్కారాలను ప్రతి సంవత్సరం ఇస్తూ వస్తున్నాడు. వూర్లోకి వచ్చినపుడు తన పాలేరు మైసయ్యను గుర్తు పెట్టుకొని తనక్లాస్‌మేట్స్ అయిన ప్రధానోపాధ్యాయుడు ఆంజనేయులు, హాస్టల్ వార్డెన్ కరుణాకర్ గార్లతో రమ్మని కబురు పంపుతాడు.

వేపచెట్టు కింద పడుకున్న మైసయ్య, రాజేశ్వర్‌రావును కలవడానికి వెళ్తాడు. తన కుటుంబ స్థితిగతులు చెబుతాడు. పెద్దకొడుకు పదవ తరగతి ఫెయిలై వ్యవసాయం చేస్తున్నాడు. చిన్నోడు పది పాసైనాడని చెబుతాడు. ఆంజనేయులు, కరుణాకర్‌లు మైసయ్య కొడుకు మహేష్ మంచి విద్యార్థి అని, తెలివిగలవాడని, చదివిస్తే ఇంజనీర్ కాగలడని చెబుతారు. కాని ఇది సాధ్యపడేలా లేదని మైసయ్య అంటాడు.

ఈ పోటీ ప్రపంచంలో డబ్బుల్తో పోటీ పడలేక గుంటూరు, విజయవాడ, ఒంగోలు లాంటి పట్నాలలో ఎంసెట్ కోచింగ్ పంపే స్థోమత లేక మహేష్ ఎక్కడికి వెళ్ళలేక పోతాడు. కరుణాకర్, ఆంజనేయులు తమ పిల్లలను గుంటూరు కోచింగ్‌కు పంపిస్తారు. మైసయ్య కొడుకు వూళ్ళో వుండి చదువుకొని అత్తెసరు మార్కులతో పాసవుతాడు. ఎమ్.సెట్ సీటు రాదు.

"మీరు మంచిగా చదువు చెప్తే నా కొడుకుకు గూడ ఇంజనీరింగ్ సీటు రాకపోవునా! మీరు చెప్పే సదువుల మీద మీకు నమ్మకముంటే మీ కొడుకులను నాకొడుకుతోటి యిదే బడిలో ఎందుకు సదివించలేదు. రాజేశ్వరరావు దొర, మీరు చిన్నప్పటి క్లాసుమేట్లు అని తెగ చెప్పుకుంటారు. అందరు ఒకటే బడిలో సదువుకుంటే నా కొడుకే ఫస్టువచ్చు. ఆ రోజులెటు పోయినవి. ఇపుడు కనీసం మీ కొడుకులన్నా నాకొడుకు క్లాసుమేట్లు కాలేకపోయిన్రు. పేదోల్లందర్ని సర్కారుబడిలో, కాలేజీల్లో ఏరేసి ఉంచినట్లయింది. వేలకు వేలు సర్కారు జీతాల్తోటి ప్రయివేటుగ సదివిస్తరు. నాకొడుకు వజ్రాల తునక సారు"[14] అంటాడు మైసయ్య. ఈనాటి విద్యావ్యవస్థలోని లోటుపాట్లు, ఆధునిక విద్యను దళితులు అందుకోలేకపోవడానికి కారణాలు తెలుపుతాడు.

మహేష్ ఇష్టంలేని డిగ్రీ చదివి ఫేలై ఇంటినుండి పారిపోయి బొంబాయిలో మేస్త్రీ పని చేస్తుంటాడు. మైసయ్య మహేష్ జాడ తెలుసుకొని తీసుకొచ్చి పెళ్ళి చేసి, ఆస్తి పంచి ఇస్తాడు. ఆస్తి పంపకంలో తాను రోజు నిద్రించే వేపచెట్టును కొట్టేస్తారు కొడుకులు. రాజేశ్వర్‌రావు హైదరాబాద్‌లో ఫ్యాక్టరీ కట్టే ఆలోచనతో అమెరికా నుండి వచ్చి రెండురోజులు వూళ్ళో ఉంటాడు. ఒకరోజు దారిలో మహేష్ కనబడి మీరు ఫ్యాక్టరీ కడుతున్నారట ! తనకు మేస్త్రీ పని వచ్చునని, మేస్త్రీ పని ఇప్పించమంటాడు లేదా



వాచ్‌మెన్ పని ఇచ్చినా చేస్తానంటాడు. "ఇంజనీర్‌గా పెట్టుకుందామనుకున్న మహేష్ – వాచ్‌మెన్ పని అడగడంతో రాజేశ్వర్‌రావు కళ్ళలోంచి నీళ్ళు జలజల రాలాయి. ప్రభుత్వం, సమాజం ఉన్నంతలో ఇంత చేసినా అణగారిన వర్గాలకు, కులాలకు అభివృద్ధి ఎందుకందడం లేదో అర్థం కాలేదు"[15] అనుకుంటాడు రాజేశ్వరరావు.

ఈ కథలో దళితులు రిజర్వేషన్లు ఉన్నప్పటికీ ఎదగలేకపోతున్న తీరు కనపడుతుంది. అందుకు ప్రైవేటీకరణే ప్రధాన కారణం. కార్పొరేట్ విద్య వల్ల పేదలు ఈ పోటీలో ఎదగలేకపోతున్నారు.

**సామాజిక సంపద అందరికీ చెందాలని కామన్‌వెల్త్ దేశాల గురించి కుటుంబ సంబంధాలుగా మార్చి చెప్పిన కథ 'కామన్‌వెల్త్'**

బ్రిటీష్ పరిపాలనలో వున్న దేశాలు స్వాతంత్ర్యం పొందాక తిరిగి ఒక సంస్థను ఏర్పాటు చేసుకున్నాయి. సమస్యలు, సంస్కృతి సంబంధాలు ఒక మేరకు ఒకే విధంగా వున్నాయని ఈ దేశాలు ఈ సంస్థకు కామన్‌వెల్త్ దేశాలు అని పేరు పెట్టుకున్నాయి. రచయిత కామన్‌వెల్త్ అనే పేరును అనేక అర్థాలతో ఈ కథకు ఖాయం చేసినట్లుంది. ప్రపంచ సంపద అంతా ప్రజలకు చెందాల్సిందే అనే అర్థంతో కామన్‌వెల్త్ పదానికి నిర్వచనం ఇస్తారు. అదే సమయంలో కుటుంబ సంబంధాలు ప్రపంచీకరణలో మారుతూ సామాజిక విలువలు, సంస్కృతి మారుతున్న క్రమంలో మనుషుల నడవడి మారుతున్న తీరును ఈ కథ చిత్రిస్తుంది. ప్రపంచీకరణలో మానవ సంబంధాల పరిణామం ఈ కథ ఇతివృత్తం. కథా వస్తువు ఇప్పుడిప్పుడే మధ్యతరగతిగా ఎదుగుతున్న ప్రజల జీవితాల్లోని పరిణామాలు.

"కామన్‌వెల్త్" కథలోని మధ్యతరగతి జీవితానికి ప్రతినిధిగా "ఎల్లాకర్" చర్య ఆసక్తికరంగా ఉంటుంది. కన్యాశుల్కం నాటకంలోని గిరీశం వంటి స్వభావాన్ని ఎల్లాకర్ కలిగి వుంటాడు. ఏ విషయాన్ని సమర్థించినా దానికి ఒక లాజిక్‌ని సృష్టిస్తాడు. తనదే రైటు అని ఎదుటి వారితో అనిపిస్తాడు. ఒకసారి ప్రపంచీకరణ ప్రమాదం అంటాడు. తనకు అనుకూలంగా వుంటే ప్రపంచీకరణ ఎంతో అవసరం అంటాడు. ఇలా ఎప్పటికప్పుడు అభిప్రాయాలను మార్చుకుంటూ వుంటాడు.

అలాగే జీవితంలోను అభిప్రాయాలను ఎప్పటికప్పుడు మార్చుకుంటాడు. ఉదాహరణకు తాగుబోతు భర్త బతికున్నంత కాలం ఒకరకంగా మాట్లాడి అతడు చనిపోయాక మరో తీరుగా ప్లేటు మారుస్తాడు. విజయలక్ష్మి భర్త పోషేందర్ తాగుడుకు బానిసై చనిపోతాడు. భర్త ఉండే కన్న భర్త చనిపోయినంక బాగుందని చిత్రహింసలు పెట్టే భర్తకన్న ఈ జీవితం నయమంటాడు ఎల్లాకర్. అలాగే భర్త పోయిన స్త్రీలు మళ్ళీ పెళ్ళి చేసుకోవచ్చని స్త్రీ వాదులు ఉద్యమాలు చేస్తున్న కాలమని, భర్త పోషేందర్ ఉద్యోగం వస్తుందని చెబుతాడు.

విజయలక్ష్మి ఏడాది గడచినంక ఉద్యోగంలో చేరుతుంది. వెంకటేశ్వర్లు(వెంకులు)

భార్య శారదకు రాజేశ్వర్ తమ్ముడు. రాజేశ్వర్ తన భార్య సాధనకు మధ్య కుటుంబ గొడవల కారణంగా కోర్టులో విడాకుల కేసు నడుస్తుంది. ఒకరోజు వెంకులు తన బావమర్ది రాజేశ్వర్‌తో ఎల్లాకర్ దగ్గరకు వచ్చి విజయలక్ష్మికి రాజేశ్వర్‌కు మనమే దగ్గరుండి పెళ్ళి చేయాలంటాడు. అందరు దగ్గరుండి వారికి పెళ్ళి చేస్తారు. రాజేశ్వర్ విజయలక్ష్మి ఉద్యోగం జీతం మీద పెత్తనం చేయడం మూలంగా అభద్రత ఏర్పడి తన పిల్లలను పెంచుకోవడానికి రాజేశ్వర్‌కు దూరం కావడానికి ప్రయత్నిస్తుంది. రాజేశ్వర్ మొదటి భార్య సాధన తల్లిగారింట్లో భర్తలేని స్త్రీగా ఎన్నో అనుభవాల్తో రాజేశ్వర్‌కు దగ్గరౌతుంది. విజయలక్ష్మి - రాజేశ్వర్‌లను సాధన చూసి చూడనట్లు ఉంటుంది. ఇది శారద గమనిస్తుంది. వీరు 'కామన్‌వెల్త్' దేశాలమాదిరిగా ఉంటున్నారని ఎల్లాకర్ అంటాడు.

"బ్రిటీష్ పాలన నుండి స్వాతంత్రం పొందిన దేశాలు కల్సి పెట్టుకున్న సంఘమే కామన్‌వెల్త్, బ్రిటీషోల్లు పోయినా, వాల్లిచ్చిన సంస్కారం పోలేదు. వాల్లిచ్చిన సంబంధాలు పోగొట్టుకోదల్చుకోలేదు. అట్లా కామన్‌వెల్త్ దేశాల కూటమి ఏర్పడింది. అట్లనే ఈ గ్లోబలైజేషన్, పితృస్వామికం తెచ్చే మార్పులు, సంస్కారం సంబంధాలు గూడా అనివార్యంగానే కొనసాగుతాయి. పితృస్వామ్య వ్యవస్థ ఉన్నంత కాలం శుక్రనీతి పద్ధతిలో ఈ సర్దుబాట్లు తప్పవు" అని శారదతో ఎల్లాకర్ అంటాడు.

రాజేశ్వర్ రెండేండ్లు చిన్న చిన్న వ్యాపారాలు, ఉద్యోగాలు చేసి కంప్యూటర్ నేర్చుకొని ఉద్యోగం వెతుక్కుని అమెరికాలో స్థిరపడ్డాడు. విజయలక్ష్మి కొడుకు నవనీత్‌ను ఇంజనీర్‌ను చేయించి అమెరికా తీసుకెళ్ళాడు. సాధన పిల్లలు, విజయలక్ష్మి కలిసి హైదరాబాద్‌లో ఇకే ఇంట్లో ఉంటున్నారు. వీరి బాధ్యత ఎల్లాకర్ చూస్తుంటాడు. అప్పుడు రాజేశ్వర్ అమెరికాను వ్యతిరేకించినవాడు. ఇప్పుడు ఇండియాను వ్యతిరేకిస్తున్నాడు.

ఒకసారి ఎల్లాకర్ భార్య రాగరాణి హైదరాబాద్ వెళ్ళి రెండ్రోజులు ఉండి విజయలక్ష్మి, సాధన దగ్గర తన కూతురు రమ్యను పెళ్ళి చేసుకొమ్మని నవనీత్‌కు అడిగింది. వారు రాజేశ్వర్‌కు ఫోన్ చేసి ఖాయం చేసుకున్నారు. సాధన తన సొంత కొడుకు పెండ్లిలా నవనీత్, రమ్యలకు పెళ్ళి చేస్తారు. వారిని అమెరికా పంపిస్తారు. సాధన, విజయలక్ష్మి ఇప్పుడు సొంత అక్కాచెల్లెండ్లు తీరుగా మంచిగా ఉంటున్నారు.

వెంకులుతో ఎల్లాకర్ "అరేయ్ వాల్లు కామన్‌వెల్త్ దేశాల వంటి వాల్లురా! వాల్లు కల్సే ఉంటారు. దోపిడి చేసే అమెరికా చేయబడే ఇండియా గూడ ఇప్పటి తీరు రేపు గూడ వీల్ల తీరే కల్సి ఉంటరు. అట్ల కల్సి ఉండటానికి ఎప్పటి అవసరాలు అప్పటికి పుట్టుకస్తనే ఉంటయిరా వీల్లకు పుట్టుకచ్చినట్టు" అని అంటాడు.

ఈ కథలో విజయలక్ష్మి - రాజేశ్వర్ - సాధనల మధ్య సంబంధం అందరికీ సాధ్యంకాదు. గ్లోబలైజేషన్ ద్వారా లబ్దిపొందుతున్న అగ్రకులాలలో దాన్ని ఎందుకు వ్యతిరేకిస్తున్నారో తెలుపుతాడు.

సుప్రసిద్ధ సాహితీవేత్త డా॥ ఎస్.వి.సత్యనారాయణ వేపచెట్టు కథా సంపుటి



గురించి ఇలా విశ్లేషించారు. "ఈ సంపుటిలోని ప్రతి కథా ఒక జీవితానుభవానికి ప్రతీక. పాత్రచిత్రణ ద్వారా, సంభాషణల ద్వారా సామాజిక తత్వవేత్తగా తాను చెప్పాల్సిన భావాలను వివరించడం ఈ కథల రూపవైవిధ్యం. అంతస్సారం సామాజిక తత్వశాస్త్రమే. సంభాషణల ద్వారా జాగ్రత్తగా కథల్లో కూడా భావజాల చర్చను జరిపించడం ఈ కథల గొప్పతనం. కులం, వర్గం, జెండర్ కన్స్యూమరిజం, సంస్కృతి మొదలైన పలు అంశాలపై ఆలోచనలను ప్రేరేపింపచేస్తాయి - ప్రపంచీకరణ నేపథ్యంలో వేపచెట్టు సంపుటిలోని కథలు."

ప్రముఖ సాహితీవేత్త అంబటి సురేంద్రరాజు వేపచెట్టు కథా సంపుటి గురించి ఇలా అంటారు "ఎప్పటికప్పుడు కృత్రిమమైన కొత్త కొత్త అవసరాలు, అమానవీయ అవసరాలు సృష్టిస్తూ వాటికి మనుషులను బానిసలను చేస్తూ మనుగడ సాగించడం పెట్టుబడిదారీ వ్యవస్థ నైజం" అన్నాడు మార్క్స్. నయావలస కాలంలో నయా ఉదారవాద సూత్రాలకు లోబడి పెట్టుబడి తన మానవతావాద ముఖాన్ని బయటికి తీసి, (మానవత్వ ముసుగు తగిలించుకుని) కూలీలు, కార్మికులను తీరు తీరు సరుకులతో ముంచెత్తుతుంది. గతంలో తానెన్నడూ వాడనివి, వాడాలనుకోనివి, తన అవసరం కానివి, తనకు ఉపయోగపడనివి - ఎందుకు, ఎలా వాడాలో, అవి ఎలా ఉపయోగమో ఇల్లిల్లు తిరిగి ప్రచారం చేస్తుంది క్యాపిటలిజం." "బి.ఎస్.రాములు గారి కథలలో ఈ అన్ని ప్రపంచ పరిణామాల ప్రతిఫలనం తెలంగాణ తొలితరం శూద్ర, మధ్య తరగతి కుటుంబాల మీద ఏ విధంగా పడినదీ చూడవచ్చు... ఈ కొత్త రకం సామాజిక అభివృద్ధి తాలూకు ప్రధాన జీవన ప్రవంతికి వెలుపల ముప్పయికోట్ల జనం ఉంటారనే వాస్తవికాంశం ఇందులో వ్యక్తమైంది."

ఇలా బి.యస్.రాములు ఈ కథల్లో 70ఏళ్ళ తెలంగాణ సామాజిక, రాజకీయ, ఆర్థిక సాంస్కృతిక కోణాలను చిత్రించారు. పల్లెలు, పట్టణాలు, మారుతున్న మానవతా విలువలు ప్రాజెక్టులు తెచ్చిన మార్పులు, వలసలు, చేతివృత్తులు కోల్పోతున్న తీరును తెలిపారు. మానవ సంబంధాలు, ప్రేమ, ఆప్యాయతలు, కనుమరుగవుతున్న తీరును అక్షరీకరించారు. ఒక్క మాటలో చెప్పాలంటే భారతీయ సాహిత్యంలో అనితర సాధ్యమైన తాత్విక, సామాజిక, సాంస్కృతిక ఇతివృత్తాలను కథావస్తువులను తీసుకొని విస్తృతంగా ఈ కథలలో చిత్రించారు. వాటిని మరింత వివరంగా వివిధ కోణాలలో తర్వాతి అధ్యాయంలో చూద్దాం.

# బి.ఎస్. రాములు కథలు - వివిధ కోణాలు - విశ్లేషణ

గత అధ్యాయంలో కథల్లోని తాత్వికతను, ఇతివృత్తాన్ని, కథావస్తువును సంక్షిప్తంగా పరిచయం చేశాను. ఈ అధ్యాయంలో కథల్లోని సామాజిక పరిణామాన్ని, సాహిత్య విశేషాలను విశ్లేషిస్తాను. గ్రామీణ జీవితంతో పాటు ప్రాంతీయ, జాతీయ అంతర్జాతీయ పరిణామాల నేపథ్యం ఈ కథల్లో కన్పిస్తుంది. గ్రామీణ భూస్వామ్య వ్యవస్థలో ప్రజలు ఎదుర్కొంటున్న ఇబ్బందులు, భూస్వామ్య వ్యవస్థలో భాగమైన కుల వ్యవస్థలో దళితులు మరియు వివిధ సామాజిక వర్గాల జీవితం ఈ కథల్లో సజీవంగా చిత్రితమయింది. ప్రధానంగా స్మృతి కథలు వీటిని చిత్రించాయి. చారిత్రక భౌతిక వాదం వీరి అన్ని కథల్లోని అంతస్సూత్రం.

జాతీయ, అంతర్జాతీయ పరంగా వస్తున్న సామాజిక ఉద్యమాల అంతస్సారం వీరి కథల్లో కన్పిస్తుంది. పంచవర్ష ప్రణాళికలు అవి తీసుకువచ్చిన ఆర్థిక పరమైన మార్పులు, గ్లోబలైజేషన్, కన్స్యూమరిజమ్ నేపథ్యంలో మనుషులు వినియోగదారులుగా మారిపోయిన క్రమం, చేతివృత్తుల పతనం, గ్రామాలు వదిలి పట్టణాలకు వలసపోతున్న ప్రజలు, కుల కట్టుబాట్లు చెరిపివేసి ఏర్పడుతున్న ఆధునిక వివాహ సంబంధాలు, ఆధునిక విద్య, వేగంగా జరుగుతున్న సామాజిక పరిణామాలు ఈ కథల్లో చూస్తాం. ఇంకా ప్రపంచానికంతటికి సామ్యవాద స్వప్నాన్ని చవిచూపిన రష్యా, ఆ తరువాత సోషలిస్టు రష్యా పతనం, గ్లోబలైజేషన్ పరిణామాలు కథావస్తువుగా వీరి తాత్విక నేపథ్యంలో ఒదిగిపోయాయి.

### గ్రామీణ భూస్వామ్య కులవ్యవస్థ - ప్రజల మధ్య సంబంధాలు వాటి పరిణామాలు

బి.ఎస్.రాములు కథలు గ్రామానికి చిన్న పట్టణాలకు మధ్య వారధి నిర్మిస్తాయి. భూస్వామ్య వ్యవసాయ సమాజం, మధ్య తరగతి సమాజం పరస్పరం ప్రభావితమవుతున్న తీరును ప్రధానంగా చేసుకున్నారు. కులవృత్తులు గిట్టుబాటు కాకుండా పోవడం వల్ల పెరుగుతున్న వలసలు సృష్టిస్తున్న పరిణామాలు వీరి కథల్లో మరో ప్రధానాంశం. స్మృతి కథ సంపుటిలో 1970 నుండి 1997 వరకు తెలంగాణ సమాజంలోని చారిత్రక ఘటనలను కథా వస్తువులో భాగంగా విలీనం చేశారు. ఎక్కడా మనకు చరిత్ర చెబుతున్నట్లు కనపడదు. భూస్వామ్య వ్యవస్థ క్రమక్రమంగా మారుతున్న తీరును ఈ కథల్లో చూడవచ్చు. విప్లవం తెచ్చిన మంచి పరిణామాలను స్మృతి కథలో చక్కగా



చిత్రించారు. అదేసమయంలో విప్లవ కారులుగా మారే ఉత్తేజాన్ని వైరుధ్యాలు కథలో విశ్లేషించారు. ప్రేమ కథలో విద్యార్థులు, యువతరం విప్లవ కారులుగా మారాలనే ఆకాంక్షను వ్యక్తపరిచారు. దక్షయజ్ఞం కథలో పేద కులాల నుండి విప్లవంలో చేరిన వారికి అభివృద్ధికి బదులుగా జీవితం ఓడిపోయే క్రమాలు ఇచ్చిన విప్లవ వ్యూహం ఎత్తుగడలను సమగ్రంగా చిత్రించారు. విప్లవోద్యమానికి ప్రధాన కారణం 1969లో ప్రత్యేక తెలంగాణ ఉద్యమం వచ్చినప్పుడు ప్రత్యేక రాష్ట్రాన్ని ఏర్పాటు చేయకపోవడమే అని స్పష్టం చేస్తారు. తెలంగాణలో పెరుగుతున్న నిరుద్యోగ సమస్యే జైతెలంగాణ ఉద్యమానికి, నక్సలైట్ల ఉద్యమానికి ప్రధాన కారణమని ఆంధ్ర వలస వాదులు అన్నిటినీ ఆక్రమించుకోకపోతే తెలంగాణ ప్రాంతంలో సామాజిక పరిణామాలు శాంతియుతంగా సాగి వుండేవని విపులంగా వివరిస్తారు. అందుకు రచయిత జీవితమే ఒక తార్కాణం. రచయిత జీవిత పరిచయంలో కూడా దీన్ని గమనించవచ్చు.

గ్రామీణ భూస్వామ్య, కుల సమాజంలో ప్రజల మధ్య సంబంధాలు వాటి పరిణామాల గురించి అనేక విషయాలను కొత్తగా విశ్లేషించారు. ఉదాహరణకు ఉమ్మడి కుటుంబాల గురించి, కుటుంబ వ్యవస్థ పరిణామాల గురించి స్త్రీ, పురుష సంబంధాల గురించి అనేక కోణాల్లో చిత్రించారు.

"ఆర్థికాభివృద్ధి వలన కుల వ్యవస్థ మారుతుందా? కుల వ్యవస్థ మారితేనే ఆర్థికాభివృద్ధి సాధ్యమా?

చదువువల్ల సామాజికాభివృద్ధి కలిగి తద్వారా కుల వ్యవస్థ మారిపోయి ఆర్థికాభివృద్ధి సాధ్యమవుతుంది. ఈ విషయాన్ని స్మృతి, బందీ, రియల్ ఎస్టేట్, సదువు, మార్పు కథల్లో సిద్ధాంత పరంగా చర్చించి పాఠకులను తీవ్రంగా ఆలోచింప జేస్తాడు రచయిత. దాంతో పాటు రచయిత ప్రజల జీవితాల్లో వస్తున్న ఆర్థిక, సాంస్కృతిక పరిణామాలను, తరాల అంతరాలను, ఒడిదొడుకులను, ఆలోచనల్లో మార్పులను ఈ కథల్లో బలంగా లోతుగా చిత్రించడాన్ని గమనించవచ్చు.

"రియల్ ఎస్టేట్ వ్యాపారమంటే మానవ సంబంధాల్ని వ్యాపారంగా మార్చుకోవడం. విద్య అనేది ఒక గొప్ప రియల్ ఎస్టేట్. అర్థశాస్త్రమేఅన్నిటికీ నిర్ణాయక అంశం అనుకొన్న తన ఆలోచనలోనే పొరపాటున్నట్టుంది. సోషలిస్టు విప్లవ పోరాటాలు వెనకడుగు వేసి గిడసబారి పోవడానికి ఇదే కారణమేమో. 'రియల్ ఎస్టేట్' కథలో ఎకనామిక్సు లెక్చరర్ మల్లయ్య చేసుకొనే ఆత్మావలోకన ఆలోచింపదగింది." (సదానంద శారద-స్మృతి కథలు పేజి 12-13)

ఇలా రచయిత ఈ దేశాన్ని భూస్వామ్య వ్యవస్థ అని వర్గీకరించిన నక్సలైట్ల ఉద్యమం నుండి విభేదిస్తూ ఇది ఆధునిక విద్య అందుకోవడం ద్వారా పరిష్కరించడం అవసరమని అప్పుడే భూస్వామ్య వ్యవస్థ బలహీనపడుతుందని అంబేద్కర్ ఇలాగే ఆలోచించారని చెబుతారు. భూస్వామ్య సమాజం పారిశ్రామిక సమాజంగా ఎదుగుతూ

అభివృద్ధి ఫలాలను వాళ్ళే అందుకుంటున్నారని అలా కాకుండా పేదలు అభివృద్ధి ఫలాలు అందుకోవాలని అందుకని వ్యవసాయంపై ఆధారపడిన పేదలందరినీ ఆధునిక విద్య వైపు, ఆధునిక వృత్తుల వైపు మళ్ళించి ఎదిగించాలని, అంతేగాని దున్నే వాడికి భూమి కార్యక్రమాల ద్వారా ప్రజలకు నిజమైన ఆధునిక అభివృద్ధి అందదని తద్వారా పాలకవర్గాలే ఆధునిక అభివృద్ధిని అందుకుని ముందుకు సాగుతారని పేదలు నిరంతరం వెనకబడి పోతుంటారని స్మృతి కథల సంపుటిలో స్పష్టం చేస్తారు.

సదువు కథలో విప్లవం గురించి మారిన తన అభిప్రాయాలకు దగ్గరగా వుండే ఈ వాక్యాలను ఒక పాత్ర చేత అనిపిస్తాడు. “విప్లవం అనేది నీ కోరిక. నీ కోరికను ప్రజల కోరికగా మార్చాలన్నదే సిద్ధాంత పోరాటమంతా! నీ కోరికల్ని ప్రజల మీద రుద్దుతున్నావు. ప్రజలుకొందరు ఔననడంతో అది ప్రజల కోరిక అని మభ్య పెడుతున్నావు. నీవు ప్రజల కోసం పని చేయడం అంటే ఏమిటి? నీకంటూ నీకే కోరికలూ లేని స్థితికి నీవు చేరుకున్నపుడు కదా నువ్వు ప్రజల కోసం పని చేయడం సాధ్యపడేది? అంటే నీ కోరికల్ని నీవు జయించావా? నిన్ను నీవు జయించావా? నీ మనస్సును నీవు జయించావా?” అని ప్రాచీన బౌద్ధ తాత్విక దృష్టితో గంగాధరి వేసే ప్రశ్నలు పాశ్చాత్య తాత్విక దృక్పథంతో పని చేసే ఉద్యమ కారులను ఆశ్చర్యంలో పడవేస్తాయి.

“మనస్సనేది చైతన్యం అయినపుడు చైతన్యం నుండే దృక్పథాలు, సిద్ధాంతాలు, కోరికలు పుడుతున్నపుడు మనస్సు గురించి చర్చించడం భావ వాదం ఎలా అవుతుంది?” అని ప్రశ్నిస్తాడు గంగాధరి. భావవాదుల్లా సన్యాసుల్లా కనపడే తత్వ గురువులు ఇంత లోతైన చర్చ చేస్తారా అని వారికి తొలిసారిగా అనుభవమైంది.”

స్మృతి కథలో వెనకటి సమాజం ఎలా వుండేదో దుబ్బక్క మాటల్లో వివరంగా చిత్రించారు. భూస్వామ్య సమాజం మారుతున్న క్రమాన్ని మెరుగు, తెల్లబట్ట కథలు అపూర్వంగా చిత్రించాయి. విప్లవం చేయని వారిలో కూడా విప్లవ ప్రభావం తెచ్చిన పరిణామాలు ఈ కథల్లో కనబడతాయి. ఇలా వ్యవసాయ, భూస్వామ్య సమాజం, సంస్కృతి వాటి పరిణామాలు, తాత్విక నేపథ్యం, ఆర్థిక నేపథ్యం, వాటి కుల పునాదితో సహా సమగ్రంగా స్మృతి కథల సంపుటి మనముందుంచుతుంది. అందువల్ల ఇది కేవలం కథల సంపుటి కాదు. సామాజిక చరిత్రను పునర్నిర్మిస్తున్న సామాజిక, చారిత్రక కథనం ఇది.

దక్షయజ్ఞం కథలో భూమిపై మొదట ఎవరి యాజమాన్యం లేదని 1840 నుండి 1860ల మధ్య కాలంలో బ్రిటీష్ వారి వలస పాలన కింద పన్నుల వ్యవస్థ కోసం పెట్టిన బిల్‌కలెక్టర్లు భూస్వాములుగా, జమీందార్లుగా ఎదిగారని స్పష్టం చేస్తారు. ఇలా భూస్వామ్య వ్యవస్థ ఇటీవలే పుట్టి పెరిగిందని తెలుపుతారు. ఇంతదాకా భూస్వామ్య వ్యవస్థ వేల ఏళ్ళ నుంచి ఉందని చెబుతున్న చరిత్రను పూర్వపక్షం చేస్తారు. భారతదేశంలో అతిపెద్ద రాజ్యమైన నైజాం రాజ్యంలో భూమి పన్ను, పంట పన్ను వసూలు చేయడానికి పెట్టుకున్న యంత్రాంగం భూస్వాములుగా, జమీందారులుగా, దోపిడీదార్లుగా, స్థానిక



పరిపాలకులుగా మారడాన్ని, తెలంగాణా భూస్వామ్య సమాజాన్ని దాని పుట్టు పూర్వోత్తరాలను, సమాజంలో భూసంబంధాలు మారిన క్రమం వీరి కథల్లో కొత్త కోణాల్లో చిత్రించబడ్డాయి.

**బి.ఎస్.రాములు కథల్లో పంచవర్ష ప్రణాళికల ద్వారా**
**నీటి పారుదల ప్రాజెక్టులు తెచ్చిన ప్రజల చరిత్ర తాలూకు పరిణామాలు**

ప్రాజెక్టుల వల్ల, పంచవర్ష ప్రణాళిక వల్ల గ్రామీణ సమాజంలోని అగ్రకులాలే లాభపడ్డారు. పేదలు వున్న వృత్తులు కోల్పోయి మరింత పేదలయ్యారు. కూలీలయ్యారు. వారికి ఇటు ఆధునిక అభివృద్ధి అందలేదు. అటు పాతవృత్తులు పనికి రాకుండా పోయాయి. ఈ క్రమాలనుండి చదువుకొని మధ్య తరగతిగా ఎదుగుతున్న శ్రేణులను కూడా మార్పు, బందీ, తల్లిసాలు పిల్లడు, దుస్తులు, గాడిద కథల్లో చిత్రించారు.

స్వాతంత్ర్యానంతరం కొన్ని వ్యవసాయ కులాలు ఎలా ఎదిగి ధనికులుగా, కాంట్రాక్టర్లుగా మారినారో ‘స్మృతి’, ‘వారసత్వం’ కథల్లో చిత్రీకరించారు. చేతి వృత్తి కులాల వాళ్ళు చదువుకొని చిన్న చిన్న ఉద్యోగాలు సంపాదించుకొని మధ్య తరగతి కుటుంబాలుగా ఎదిగిన క్రమాన్ని కూడా ఈ కథలో చిత్రించారు. అదే సమయంలో సన్నకారు రైతులు పల్లెటూళ్ళలో ఎలా చితికి పోతూ వస్తున్నారో “వరుసలు” కథలో చిత్రించారు.

వరుసలు కథలో నూనె గానుగలు నడిపేవాళ్ళు, వ్యవసాయం చేసేవాళ్ళు, భూమిని నమ్ముకున్నవాళ్ళు, కాలక్రమంలో నూనె మిల్లుల వల్ల, పరిశ్రమల వల్ల, వ్యాపార పంటల వల్ల పూర్తిగా చితికిపోయారు. ఒకప్పుడు పల్లెటూరు పిల్లని పట్టణానికి ఇవ్వడానికి భూమి లేదు, వ్యవసాయం లేదు, ఇంటిముందు స్థలం లేదు, అని పల్లెటూరివాళ్ళు నిరాకరించేవాళ్ళు. కాలక్రమంలో పట్టణంలో ఉండేవాళ్ళు కాస్త చదువుకొని ఉద్యోగాలు సంపాదించుకొని మధ్యతరగతిగా ఎదిగారు. 50 ఏళ్ళలో పరిస్థితి తిరగబడింది. ఇప్పుడు పల్లెటూరి పిల్లల్ని పట్టణాల పిల్లలు చేసుకోవడానికి ముందుగా రావడం లేదు. ఈ పరిస్థితి “వరుసలు” కథలో చూస్తాము. చదువుకుని బావ ఎదగడం, తను బీడీ కార్మికురాలిగా, తన భర్త మిల్లు కార్మికుడుగా మిగిలిపోవడం సరవ్వను కలిచివేస్తుంది.

“ఏమైనా బావా! నాయనా అవ్వా ఒక్కరేమిటి మా యీ పల్లెల్లో వ్యవసాయాన్ని నమ్ముకొని బతికిన వాళ్ళున్నారు గానీ బాగుపడ్డవారు లేరు. వ్యవసాయాన్ని నమ్ముకుంటే తిండికి కొరతలేదు. కాని జంతువులు కూడా ఏదో తిని బతుకుతాయి. మా మీద వేసే పన్నుల్తో అడ్డగోలు జీతాలు దొబ్బి మీరు సుఖాలనుభవిస్తున్నారు. మేమేమో వెనుకబడిపోతున్నాం, ప్రభుత్వం మీ సౌఖ్యాల కోసమే పుట్టినట్టుంది. మా కోసమని పుట్టిన ప్రభుత్వం మీ సుఖాలు, సౌకర్యాలకి పరిమితమైపోయింది. అందుకే నువ్విట్లా ఎర్రగా బుర్రగా నునుపు తేలినావు. నీ పిల్లలు బాగా చదువుకొని ఎదుగుతున్నారు”[3] అంటూ వ్యవసాయదారులు పేదరికంలో మగ్గిపోతున్న తీరును, చదువుపట్ల అశ్రద్ధ

వల్ల వ్యవసాయం గిట్టు బాటుకాక, ఇతర ప్రాంతాలకు కూలీలుగా, కార్మికులుగా వలసలు సాగించిన తీరును, అరబ్ దేశాలకు కూడా వలసలుగా పోయిన ఎందరినో కథల ద్వారా చూపిస్తారు.

వ్యవసాయ, గ్రామీణ అగ్రకులాలు, పట్టణాల్లోని మధ్యతరగతి కుటుంబాలు, పారిశ్రామిక అభివృద్ధితో ఎదుగుతున్న వర్గాలు విద్యావంతులైన వారు, ఉద్యోగ అవకాశాలు అందిపుచ్చుకున్న అగ్రకులాలు ఎదగడానికి వ్యవసాయంలో పంచవర్ష ప్రణాళికలే కారణం. అవి ఇతర కులాలకు సరిగ్గా అందక పోవడానికి కూడా అవే కారణమని ఈ కథల ద్వారా రచయిత నిర్ధారిస్తారు.

ఇలాంటి క్రమంలో అగ్రకుల స్త్రీలు ఫెమినిజం సిద్ధాంతాలను ధరించి సమాజంలో స్త్రీలకు సమాన హక్కులు కావాలని ముందుకు వచ్చారని "మమతలు, ప్రేమికులు, మలుపులు, ఐదవవాడు", కథలు స్పష్టం చేస్తాయి. బి.సి.లకు 1932 నుండి రిజర్వేషన్లు అమలు చేసి ఉంటే ఇప్పుడు ఎదిగిన అగ్రకులాలకు బదులుగా బి.సి.లు కూడా ఎదిగి ఉండేవారని "మమతలు" కథ ప్రతిపాదిస్తుంది. ఎస్టీ, ఎస్సీల రిజర్వేషన్‌లు వారివి వారికి పోగా అగ్రకులాలు అదనంగా అనుభవించేదంతా బి.సి.లకు చెందాల్సిందే. దాన్ని బి.సి.లకు దక్కనీయకుండా రాజకీయాలు, పంచవర్ష ప్రణాళికలు ఎలా చేస్తాయో "మమతలు", "రాజకీయం" కథలు చిత్రించాయి.

భూమి ఎవరిది వారికి ఇప్పించకుండా, భూసంస్కరణలు అమలు జరపకుండా పంచవర్ష ప్రణాళిక ద్వారా, నీటి ప్రాజెక్టుల ద్వారా, స్వాతంత్ర్యం అనంతరం జరిగిన అభివృద్ధి వందేళ్ళ క్రితమే అన్యాయంగా స్వంతం చేసుకొని ఎదిగిన భూస్వామ్య దోపిడీ కులాల ఎదుగుదలకే మరింత ఉపయోగపడ్డాయి. ఏమీ లేని వాళ్ళు కూడా ధనిక రైతులుగా ఎదగడం ప్రారంభమైంది. ఆ తరువాత వాళ్ళు అన్ని రంగాలను తమ ఆధిపత్యంలోకి తెచ్చుకుని రాజకీయ ఆర్థిక రంగాల్లో ఎదిగి స్థిరపడ్డారు. ఈ కథల్లో నీటి పారుదల ప్రాజెక్టుల ద్వారా నీళ్ళు అందిన భూముల వాళ్ళు భూస్వాములుగా, ధనిక రైతులుగా మారిన క్రమాన్ని తెలుసుకోవచ్చు. మమతలు కథలో దశాబ్దాల స్నేహం సరవ్వ, కాంతయ్యల పెళ్ళి జరగకుండా పోవడానికి కులాలు, ప్రాజెక్టుల వల్ల జరిగిన అభివృద్ధి ఎలా కారణమైందో చూడవచ్చు.

**బి.ఎస్.రాములు కథల్లో దళితుల జీవితం-దళితుల విద్య-సామాజిక పరిణామాలు**

బి.ఎస్.రాములు కథల నిండా దళితుల జీవితం విస్తారంగా పరచుకొని ఉంటుంది. దళిత రచయితల కళాకారుల, మేధావుల ఐక్యవేదిక వ్యవస్థాపక అధ్యక్షులుగా ప్రజల జీవితాలను అధ్యయనం చేస్తూ కథలుగా, సైద్ధాంతిక వ్యాసాలుగా మలుస్తూ వేలాది ప్రసంగాలు చేశారు. దళిత వాద కోణంలో మానవతా వాదాన్ని ప్రధానం చేసి చిత్రించిన దళిత కథలు వీరివి. వీరి దళిత కథా వస్తువులో మొత్తం సమాజం అద్దంలో కొండలా కనపడుతుంది. ఆధునిక విద్య అందుకున్న దళితుల గురించి, అందుకోలేక



పోతున్న దళితుల గురించి చేయూత, వేపచెట్టు, రియల్ ఎస్టేట్, అయిదవవాడు కథల్లో అనేక కోణాల్లో చిత్రించారు. విప్లవాల్లో దళితులు ఓడిపోతున్న తీరును దక్షయజ్ఞం కథలో చిత్రించారు. చదువు పట్ల పేదలకు గల ఆర్తిని పాలు, బడి కథల్లో చిత్రించారు. చదువుకొనే దళిత విద్యార్థులు విప్లవం వైపు ఎలా ఆకర్షితులయ్యారో సామాజిక పరిణామాలకు ఎలా కారకులయ్యారో సహజాతాలు కథలో చిత్రించారు.

వ్యవసాయ కూలీలు, పాలేర్లు, పనిమనుషులు మధ్యతరగతిగా ఎదగాలని, మంచి చదువు చదవుకొని మంచి ఉద్యోగాలు చేయాలని ఎన్నోకలలు కన్నారు. అలాంటి తల్లుల కలలను "పాలు" కథలో చూడవచ్చు. చదువుకొని బాగుపడాలనుకునే విద్యార్థుల గురించి 'బడి', 'సహజాతాలు', 'వేపచెట్టు', 'చేయూత', 'రియల్ ఎస్టేట్', 'బందీ', 'మార్పు', 'సదువు', 'తల్లిసాలు పిల్లదు' కథల్లో చిత్రించారు.

దళితుల జీవితాలు బాగుపడాలని ఎన్నో ఆశలు పెంచుకుని, అంబేద్కర్ రాజకీయ, ఉద్యోగ, విద్యారంగాల్లో రిజర్వేషన్లు సాధించారు. దానివల్ల కొందరు ఎదగడానికి అవకాశం చిక్కింది. కాని అందరూ ఇంకా ఎదగవలసి ఉన్నది. విద్యావ్యవస్థ, పాఠ్య ప్రణాళికలు, పరిసరాలు అందుకు అనుకూలంగా లేవు. ఈ విషయాల్ని 'బడి', 'పాలు', 'సహజాతాలు', 'సదువు', 'చేయూత', 'వేపచెట్టు' కథలు చిత్రించాయి.

'బందీ', 'రియల్ ఎస్టేట్', 'మార్పు', 'దుస్తులు', 'గాడిద', 'తల్లిసాలు పిల్లదు', 'తెల్లబట్ట', 'మలుపులు', 'ప్రేమికులు', 'అయిదోవాడు' మొదలైన కథలు, చదువు ద్వారా పైకొచ్చిన బి.సి. ఎస్సీ కులాల మధ్యతరగతి గురించి, విద్యావంతుల గురించి వారు సంస్కృతిలో, అవగాహనలో మారుతున్న తీరు గురించి చిత్రించారు.

అయితే విద్య, ఉద్యోగం, ఆర్థిక అంతస్తు, వారి కులంపట్ల ఉన్న చిన్న చూపును పోగొట్టుకోలేక పోయాయని 'బందీ', 'రియల్ ఎస్టేట్', 'తెల్లబట్ట' కథలు స్పష్టం చేస్తాయి. అందువల్ల కుల అంతరాలను తొలగించే కృషి చేయని మార్క్సిస్టులు అంతిమంగా అగ్ర కులాలకే మేలు చేస్తారని రియల్ ఎస్టేట్ కథలోని ఒక పాత్ర ద్వారా వివరిస్తారు. భారతదేశంలో చారిత్రక భౌతికవాదం ఎలా ఉండాలో ఆ పాత్ర ద్వారా స్పష్టం చేస్తారు.

"రియల్ ఎస్టేట్" వ్యాపారమంటే చాలామంది యిళ్ళు జాగల వ్యాపారం అంతేగదా! అనుకుంటారు. "రియల్ ఎస్టేట్" వ్యాపారమంటే మానవ సంబంధాల్ని వ్యాపారంగా మార్చుకోవడం. మనుషులున్నచోట మానవ సంబంధాలున్నచోట రద్దీ పెరుగుతుంది"[4] అంటూ మానవ సంబంధాలు వ్యాపారమయం అవుతున్న తీరును తెలుపుతారు.

"అంబేద్కర్ గొప్ప ఆర్థిక శాస్త్రవేత్త కావడం వల్లే కుల నిర్మూలనా తత్వవేత్తగా ఎదగడం సాధ్యమైందనే విషయాన్ని తానే కనుకున్నంత సంబరపడి పోయాడు మల్లయ్య కుల నిర్మూలనా తత్వవేత్త కాకుండా ఎవడూ గొప్ప ఆర్థిక శాస్త్రవేత్త కాలేడీ దేశంలో అని మల్లయ్య యిప్పటి విశ్వాసం. ఏమంటే కులవ్యవస్థ గొప్ప అర్థశాస్త్రం కూడా"[5] అంటూ

మల్లయ్య పాత్ర ద్వారా తెలియజేస్తాడు. చదువు వల్ల సామాజికాభివృద్ధి కలిగి తద్వారా కుల వ్యవస్థ మారిపోయి, ఆర్థికాభివృద్ధి సాధ్యమవుతుంది. ఈ విషయాన్ని 'స్మృతి', 'బందీ', 'రియల్ ఎస్టేట్', 'మార్పు' కథల్లో చర్చించి తీవ్రంగా ఆలోచింపజేస్తాడు రచయిత.

ఇంకా దళితుల ఎదుగుదల క్రమంలో వారు ఎదుర్కొంటున్న పరిస్థితుల పరిణామాలున్నాయి. 1977 నుండి తెలుగునాట సామాజిక జీవితంలో వస్తున్న పరిణామాలు చదువు, ఆర్థిక అసమానతలు, అవి రూపాంతరం చెందుతున్న తీరు తెన్నులు, రిజర్వేషన్లు ఉన్నప్పటికీ అందుకోలేని అవరోధాలు, భావజాల రంగంలో వస్తున్న పరిణామాలు మొదలైనవి చిత్రిస్తూ ఒక క్రమంలో పాలు - చదువు, సహజాతాలు కథల్లో చెప్తూ, 25 ఏళ్ళలో ఇక్కడి సమాజంలో ఏమేమి మార్పులు వచ్చాయో, ప్రజలు ఎలా అభివృద్ధి చెందారో, ఎలా అభివృద్ధి చెందలేక పోయారో ఈ కథలు స్పష్టం చేస్తాయి. 'పాలు', 'బడి' కథలు 1977లో తెలంగాణలో విప్లవోద్యమం ప్రారంభమైనప్పుడు ప్రజల జీవితాల్లో అవగాహనల్లో వస్తున్న చైతన్యం, మార్పులను చిత్రీకరించడం జరిగింది. దళిత, బహుజనులు చదువుకోవాలనే ఆరాటాన్ని ఈ కథలు చిత్రించాయి. 'సహజాతాలు' కథ. ఆ క్రమంలో విద్యార్థులు విప్లవ కార్యకర్తలుగా మారడాన్ని తెలియజేస్తాయి.

విప్లవ రంగంలోకి కార్యకర్తగా ఎదగాలనుకున్న విద్యార్థిని స్త్రీవాద దృక్పథంతో అలా మారాల్సిన అవసరం లేదని జీవితాన్ని గెలుచుకోవడం, మార్చుకోవడం పరోపకారం ముఖ్యమని, మారిన క్రమాన్ని "ప్రేమ" కథలో ఒకమాజీ నక్సలైటు తన మరదలు అరుణ జీవితాన్ని చెప్తూ.... "అరుణ తనను తాను తెలుసుకోవడంలో చలం పాత్ర ఎక్కువా? రంగనాయకమ్మ పాత్ర ఎక్కువా? ఓల్గా పాత్ర ఎక్కువా? స్త్రీవాదమే ఆమెను నా అంచనాలకు భిన్నంగా ఎదిగేట్టు చేసిందా?"[6] అంటూ ఈ కథలోని మాజీ నక్సలైటు అయిన జర్నలిస్టు అభిప్రాయపడతాడు.

"సదువు" కథ ప్రస్తుత విద్యావ్యవస్థ గ్రామీణ మెజారిటీ ప్రజల జీవితాల కనుగుణంగా లేదని తెలియజేస్తుంది. "సదువు" కథలో లచ్చయ్యసారు తన శిష్యుడు గంగాధరి చదువుకోనని మొండికేయడంతో ఓదార్చి మనసులో "అయినా పాఠాలను అందుకోగల స్థాయి ఉన్నవాడే తన స్వేచ్ఛకేదో అడ్డంకిగా ఈ చదువూ నోట్సూ మారిందనుకున్నాడు. ఈ పాఠ్య పుస్తకాలు పట్టణవాసపు అగ్రకులాల మధ్య తరగతి పిల్లలకోసం రాసినట్టుంటాయి. పల్లెటూరి పిల్లలకు అందునా దళితులకు అవి ఏ మాత్రం ఆసక్తిలేని విధంగా ఉంటాయి. చిన్నప్పుడు తానూ ఎదుర్కొన్నాడీ సమస్య"[7] అంటూ విద్యావ్యవస్థ గ్రామీణ మెజారిటీ ప్రజలకు, దళితులకు ఆసక్తికరంగా లేకపోవడాన్ని తెలుసుకోవచ్చు.

"చేయూత" కథలో ఇంజనీర్ కావాల్సిన దళిత విద్యార్థిని ఉపాధ్యాయురాలుగా మారిన తీరును తెలుపుతుంది. "చాలా ఆనందంగా ఉంది మేడం. టీచర్ ఉద్యోగంలో యింత తృప్తి, జాబ్ సాటిస్ఫాక్షన్ ఉంటుందని టీచర్ అయ్యాకే తెలిసింది. ఇంజనీర్



కాలేక పోయాననే చింత తగ్గుతోంది"[8] అంటూ హాస్టల్ మ్యాట్రిన్ లలితతో అరుణ అంటుంది. ఈ ఆధునిక విద్య డబ్బుమయమైపోయి పేదలకు అందుబాటు లేక పోవడం వలన తనకన్న తక్కువ మార్కులు తెచ్చుకున్న వాళ్ళు కోచింగ్‌లతో సీట్లు సంపాదించి, ఇంజనీర్లై అమెరికాకు వెళ్తుంటే ఈ డబ్బుతో చదువు కొనుక్కొనే పోటీల్లో పోటీ పడలేని విద్యార్థులు కృంగిపోయి గెలుచుకోగలిగే జీవితాన్ని కూడా ఎలా ఓడిపోయారో వేపచెట్టు కథలో చూడవచ్చు. ఈ వేపచెట్టు కథలో "మహేష్! నువ్వా! నువ్వు ఇంజనీర్‌వి కాలేదా? ఇంత ముసలివాడిలా అయిపోయావేంది! అసలేం జరిగింది?"[9] అంటూ ఆశ్చర్యపోయాడు రాజేశ్వరరావు. ఊళ్ళో తమనాన్న సాగించిన దౌర్జన్యాలకు భిన్నంగా వుండాలని, తమ పాలేరు కొడుకు ఇంజనీర్ అయ్యాడని తాను సగర్వంగా చెప్పుకుందామనుకున్న రాజేశ్వర్ రావు కళ్ళల్లో తడి.

**బి.ఎస్.రాములు కథల్లో కులాతీత వివాహాలు**
**పెళ్ళి సంబంధాల్లో వచ్చిన మార్పులు**

పెళ్ళి గురించి, కుటుంబ వ్యవస్థ గురించి బి.ఎస్.రాములు గారి కథలు పలు కోణాల్లో కొత్త విషయాలను మన ముందుంచుతాయి. తన తాత్విక దృక్పథంతో అనేక అంశాలను మన ముందుకు తెచ్చి ఒక సంఘర్షణకు గురి చేస్తారు. రెండు భిన్న అంశాలను మన ముందు వుంచుతారు. రెండూ సరైనవే అనిపిస్తాయి. వాటి పరిమితులను తెలుపుతారు. మెరుగు, తెల్లబట్ట, అయిదవవాడు, కామన్‌వెల్త్ కథల్లో వైవాహికేతర లైంగిక సంబంధాలను, వాటి పరిణామాలను చిత్రిస్తారు. రియల్ ఎస్టేట్, మమతలు కథల్లో అగ్రకులాల్లో పెరిగిన ఆర్థిక చైతన్యం తిరిగి అగ్రకులతత్వాన్ని పెంచిన తీరును కులాతీతంగా పెళ్ళి జరగాల్సిన క్రమాన్ని ఎలా అడ్డుకుంటుందో మన ముందుంచుతారు.

జీవితంలో వివాహం తప్పనిసరి అని అనుకొంటున్నా, వ్యక్తిత్వ నిర్మాణంలో వివాహం కూడా భాగమై ఎదుగుదలకు తోడ్పడుతుందనుకొన్న తమ ఆలోచనలను గౌరవించే యిద్దరు వ్యక్తుల మధ్య పెళ్ళి జీవితానికి, ఆదర్శానికి మరింత వెలుతురునిస్తుంది. ఈ కాలంలో జరిగిన పలు వివాహాలలో క్రిందిస్థాయి కార్యకర్తలే కాకుండా విశ్వవిద్యాలయాల స్థాయిలో ఉండి, ఉన్నత చదువులు చదివిన యువకులు క్రిందిస్థాయి కార్యకర్తలను కూడా పెళ్ళి చేసుకున్నారు. వీరు తమ జీవితంలోని ఎక్కువ భాగం ఉద్యమానికి ధారపోసారు. ఇలాంటి వారి జీవితాలు ఈ కథల ద్వారా తెలియజేస్తారు.

ఈ కార్యకర్తలు మరియు యువకులు చేసుకున్న ప్రేమ వివాహాలు అన్ని విజయవంతం అయ్యాయా! అని ఆలోచించడం పక్కన పెట్టి నిత్యం జరుగుతున్న మార్పులతో ఆలోచనల మధ్య గల వైరుధ్యాల ఘర్షణలో మరింత పరిపక్వత సాధించిన లేదా ఆశయ సాధనలో వైరుధ్యాలు పెరిగినా కొంతమంది దూరం అవుతుండడం సహజం. ఇది చరిత్రే. "పెళ్ళి" అనేది ఒక బానిస కట్టుబాటు అయితే దానికి చచ్చేంత వరకు కట్టుబడి ఉండాలి. స్వతంత్ర ఆలోచనలతో ఉన్నత వ్యక్తిత్వం కోరుకుంటే మాత్రం

అణిగిమణిగి ఉండాలి. పెళ్ళి పురుషునికి ఎంత ముఖ్యమో స్త్రీకి అంతే ముఖ్యం అనే విషయం గ్రహించిన స్త్రీ, పురుషుల సంబంధాలు సజావుగా సాగిపోతాయి. ఈ విషయాలను 'సహజీవనం', 'ప్రేమికులు', 'వేదవతి', 'అయిదవవాడు', 'వరలక్ష్మి', 'ప్రేమధార' కథలు పలు కోణాల్లో చిత్రించారు. "సహజీవనం" కథలో లక్ష్మణ్, రాము, శ్యాం, రాజు అనే నలుగురు చదువుకునే యువకులు వారి మాటల్లో "లక్ష్మణ్ టెన్త్ చదివిన అమ్మాయితో బట్టలు ఉతింకించాలనుకోవడం నీకు సిగ్గు అనిపించడం లేదా? అంటూ రాము ఆశ్చర్యంగా అడిగాడు.

"ఎందుకు సిగ్గు? ఏ వృత్తి అయినా గౌరవనీయమైనదే" ఒక వృత్తి సమాజానికి అనవసరమైతే అదే అంతరిస్తుంది కదా!" అంటాడు లక్ష్మణ్. "అసలు మన భార్యలు పని చేయడం ఎందుకు! వాళ్ళు పిల్లల్ని చూసుకుంటూ వచ్చిన వాళ్ళకు యింత చాయో, టిఫినో అందిస్తూ ఉంటేచాలు" అనుకుంటాడు రాము.

"ఈ కాలంలో భార్యా, భర్తలు యిద్దరు కల్సి పని చేస్తేనే కుటుంబాన్ని కాస్త మంచిగా పోషించుకోవచ్చు రామూ"[10] అంటూ అభ్యంతరం చెప్పాడు రాజు" ఇలా పెళ్ళి పట్ల యువకుల ఆలోచన విధానాన్ని తెలుసుకోవచ్చు.

"ప్రేమికులు" కథలో "ప్రేమ, పెళ్ళి కుటుంబ వ్యవస్థ, సామాజిక సంబంధాలు, సంస్కృతి, ఇవన్నీ రాజకీయాలే. ప్రతివ్యక్తిగత విషయం కూడా రాజకీయమైనదే, సామాజికమైనదే, వీటితో పాటు ఉద్యమాల, పార్టీల, భావజాలాల, సంస్కృతుల పవర్ సెంటర్స్ అన్నీ సోషల్ క్యాపిటల్ సంచయాలే"[11] అని విక్రాంత్, అరవింద్ పాత్రల ద్వారా వివాహాలకు ఆర్థిక కారణాలు అర్థం చేసుకోవచ్చు. "వేదవతి" కథలో బ్రాహ్మణ కులానికి చెందిన వేదవతి, దళితుడైన తిప్పాకర్ రావును ప్రేమించి పెళ్ళి చేసుకుని జీవితాన్ని గెల్చుకున్న తీరు చూడవచ్చు. "ప్రేమధార" కథలో కులవృత్తి కోల్పోయి, పెళ్ళి చేయలేక లేచిపోయిన సువర్ణ, సూరిబాబుతో పెళ్ళి చేసుకొని పిల్లల్ని కని కూడా హరిబాబు అనే మేస్త్రీతో "ప్రేమను" కొనసాగించి పెళ్లిచేసుకోలేకపోతుంది. "అయిదవవాడు" కథలో సుమలత, దయానంద్‌లు కాలేజీలో ప్రేమించి పెళ్ళి చేసుకోలేకపోతారు. గెలువాల్సిన వీరి ప్రేమ గెలవలేకపోతుంది.

'మమతలు' కథలో పెళ్ళి పట్ల మరికొన్ని ఆసక్తికరమైన అంశాలను చూడవచ్చు. "పెళ్ళయితే ఏడేళ్ళ వయస్సు పెరిగినంత అనుభవం వస్తుందట. నీకుమాత్రం పదిహేనేళ్ళ వయస్సు పెరిగినంత అనుభవం పెరిగింది. మీ ఆయన నీకన్నా ఏడేళ్ళు పెద్ద. సహచర్యంతో అతనితో సమానమైనావు. పెళ్ళితో మరో ఏడేళ్ళ అనుభవం పెరిగింది. ఇట్లా నీకు మూడేళ్ళకే పదిహేనేళ్ళ వయస్సు అనుభవాలూ పెరిగినై. నాకు పెళ్ళయితే పెరిగేది ఏడేళ్ళ వయస్సే. నాభార్య ఏడేళ్ళు చిన్నదయితే నా అనుభవాలు ఆమెతో సమానమై ఏడేళ్ళు, వెనక్కి తగ్గుతాయేమో... ఎందుకో నీకు తెల్సు. నీ అంత చదువుకున్న అమ్మాయి మాకులంలో నాస్తోమతకు దొరకడం అసాధ్యం"[12] అంటూ తను ప్రేమించిన సరవ్వతో ఆర్థిక పరమైన, కులపరమైన కారణాల మూలంగా పెళ్ళి చేసుకోలేక పోయానని



కాంతయ్య తెలియజేస్తాడు.

"వారసత్వం" కథలో మేన సంబంధాలు, గ్రామీణ జీవితాలపట్ల చిన్న చూపును తెలియజేస్తూ, ఈనాటి అమ్మాయిలు పట్టణంలో ఉండి పల్లె సంబంధాల్ని నిరాకరించడం తెల్పుతుంది. "దక్షయజ్ఞం" కథలో కథానాయకుడు పెంటయ్యను ప్రేమించిన సరవ్వ ఆ పార్టీ జిల్లా కార్యదర్శి సుధాకర్‌ను చేసుకోవడం ఒక కులాతీత వివాహాలకు ప్రతీక. వివిధ విప్లవ పార్టీలలో పనిచేసే కార్యకర్తలు కులాతీత వివాహాలు చేసుకుంటున్నారని తెల్పుతుంది.

కులాలు పోవాలన్నా, కులాలు పోవాలని ఎన్ని ఉపన్యాసాలిచ్చినా కులాలు మరింత బలపడుతున్నాయి. కాని ఉద్యమంలో పాల్గొన్న అనేకమంది కార్యకర్తలు గాని, సానుభూతి పరులుగాని పలువురు కులాంతర వివాహాలు చేసుకొన్నారు. ఈ కథలు పెళ్ళి పట్ల ఆధునిక సమాజంలో వస్తున్న నూతన ఆలోచన దృక్పథాలకు సూచనగా చెప్పవచ్చు. ప్రేమలు, కులాతీత ప్రేమలు, గ్రామీణ స్త్రీల ఆలోచనలో మార్పు, వివిధ రాజకీయ పార్టీలలో పనిచేసే యువతీయువకులు ప్రేమించి పెళ్ళి చేసుకుంటున్న తీరు, పెళ్ళి పట్ల పెళ్ళి తరువాత కలిగే అనుభవాలు, ఆలోచన విధానం 'సహజీవనం', 'ప్రేమికులు', 'వేదవతి', 'అయిదవవాడు', 'వరలక్ష్మి', 'ప్రేమధార' కథలు చిత్రించాయి.

**బి.ఎస్.రాములు కథల్లో తెలంగాణ చరిత్ర**
**విప్లవ ఉద్యమాలు-వాటి పరిణామాలు**

బి.ఎస్.రాములు విప్లవోద్యమంలో చాలా కాలం పని చేశారు. ఉద్యోగం వదిలి రహస్య జీవితంలోకి వెళ్లారు. 1977 నుండి విప్లవం గురించి రచనలు చేశారు. 50 దాకా విప్లవ కథలు రాశారు. అటు తరువాత విప్లవ ఉద్యమ కార్యక్రమాల్లో అవగాహనలో అనేక పొరపాట్లు వున్నాయని గమనించారు. ఆధునిక అభివృద్ధి పేదలు అందుకోవడానికి అనువుగా ఈ ఉద్యమాలు లేవని గుర్తించారు. దాంతో సైద్ధాంతికంగా తలపడ్డారు. పార్టీలోనే వుంటూ సైద్ధాంతికంగా ఎన్నో పోరాటాలు చేశారు. తిరిగి బహిరంగ జీవితంలోకి వచ్చాక తన అవగాహనను బహిరంగంగా అందరిముందు వుంచారు. గతితర్క తత్వ దర్శన భూమిక గ్రంథంతో తెలుగు నేలలోని వామపక్షాల, నక్సలైట్ల భావజాలంపై పూర్తిస్థాయిలో సిద్ధాంత చర్చను ప్రారంభించారు. అది వారి దృక్పథాలను ఎంతగానో ప్రభావితం చేసింది.

వామపక్షాల, నక్సలైట్ల దృక్పథం, కార్యక్రమాలు అసమగ్రమని అవి అంబేద్కర్ కన్నా ఎంతో వెనకబడి కొనసాగుతున్నాయని విప్లవ పార్టీల్లో, ఉద్యమాల్లో అగ్రకుల తత్వనాయకత్వం బలంగా కొనసాగుతున్నదని అందుకే అంబేద్కర్‌ను, మహాత్మా ఫూలేను భారతీయ, సామాజిక విప్లవ కారులుగా స్వీకరించడం లేదని చర్చను ముందుకు తెచ్చారు. పార్టీలు, ఉద్యమాలు ఈ చర్చతో కదలబారాయి.

ఇదే అవగాహనతో బి.ఎస్.రాములు సామాజిక పరిణామాలను విప్లవ

పోరాటాలను వాటి పర్యవసానాలను పునర్వ్యాఖ్యానిస్తూ కథలుగా చిత్రించారు. అవే స్మృతి కథల సంపుటిలో చూడవచ్చు.

బి.ఎస్.రాములు వ్రాసిన "స్మృతి" కథలు సంపుటంలో కొత్త కోణాలలో తెలంగాణ చరిత్రను నిక్షిప్తం చేశారు. ప్రత్యేకంగా స్మృతి, మమతలు, వారసత్వం, వరుసలు, దక్షయజ్ఞం కథల్లో ఈ విషయాల్ని చిత్రించారు. చరిత్రకందని కాలంలో గిరిజనులు తెగలు వలసల్ని మాని అడవుల్ని నరికి సాగుచేసి వ్యవసాయం చేసి, స్థిర జీవితం ఏర్పరచుకున్నాక, వ్యాపారం కోసం కోమట్లు, పన్నులకోసం జాగీర్దారుల పట్వారీ గుమాస్తాలు, బ్రాహ్మణులు చేరి బాకీల కింద అంత తమదిగా చేసుకున్నారు. "దక్షయజ్ఞం" కథలో ఈ విషయాన్ని "ఆ కాలంలో యాభై రూపాయలకు ఎకరం మంచి భూమి. మా తాత కాలంలో ఎకరానికి నూటయాభై నుండి మూడు వందలే ఉండేది. ఇక్కడి వాళ్ళ అమాయకత్వాన్ని చూసి వాళ్ళు పెరిగిపోయారు. వాళ్ళలో చాలా మంది కాలక్రమంలో దొరలుగా రూపాంతరం చెందారు. ఆనందరావు దొర ఎనిమిదోతరం వారసుడు. అతని తండ్రి రాంరావు దొర నాటికి మమ్మల్ని దోచుకోవడం పూర్తయి నాలుగు తరాలు గడిచినట్టున్నాయి.

"పోంగ... పోంగ... మా వంతు వచ్చేసరికి కొంచెం పెరడు మిగిలింది. ఎనభై ఏళ్ళ కింద కరువుల్లో తహసీలు కట్టలేక సాగులోకి తెచ్చిన నలభై ఎకరాల భూమిని వదులుకున్నాడట మాతాత. దొరలు పట్వారీలు కల్సి అలాంటి భూములన్నింటిని తమ పేరు మీద రాసుకొని వందల, వేల ఎకరాలకు ఎదిగారు"[13] అంటూ కథానాయకుడు తెలంగాణలోని వేల ఎకరాల భూములను ఎలా దోచుకున్నారో తెల్పుతాడు. దాని కారణంగా మాల, మాదిగ, గిరిజన జాతులు ఎలా అణిచివేయబడ్డారో ఈ కథ తెల్పుతుంది.

ఇంకా బ్రిటీష్ వారి వలస పాలనకింద వున్న ప్రాంతాల్లో 1840-1860 మధ్య కాలంలో పన్నుల వ్యవస్థ కోసం పెట్టిన బిల్ కలెక్టర్లు భూస్వాములుగా, జమీందార్లుగా ఎదిగారు. వీరు దోపిడీదార్లుగా, స్థానిక పరిపాలకులుగా మారిన తీరు ఈ కథల్లో కనబడుతుంది.

భూసమస్యకు తెలంగాణలో మొదట్లో పెద్దగా ప్రాధాన్యత లేదు. విస్తారమైన భూమి, అడవులు, వాగులు, నదులు ఉండడం వల్ల ప్రతి కులం వాళ్ళు కూడా భూమిని కలిగి ఉండే వారు. భూమిలేని కులాలు అంటూ పెద్దగా ఉండేవికావు. సేద్యానికి అనువుగా మార్చుకున్న భూములను గిరిజనులు, మాల, మాదిగ, యానాదుల నుండి స్వాధీనం చేసుకున్న వారే భూస్వాములుగా ఎదిగిన తరువాత భూములు కోల్పోయిన వారి పక్షాన ఆంధ్ర మహాసభ ఉద్యమం కూడా ఏమి చేయలేకపోతుంది. వాళ్ళు ఇలా భూములు కూడబెట్టుకున్న వాళ్ళ నుండి ఎదిగిన వాళ్ళే కావడం ప్రధాన కారణం. అందువల్ల భూమి కావాలని భూస్వాముల పెత్తనం పోవాలని కోరుకునే ప్రజలకోసం ఆంధ్రమహాసభ రెండుగా చీలిపోయింది. చీలిపోయిన ఆంధ్రమహాసభకు కమ్యూనిస్టులు వారి అభిమానులు



నాయకత్వం వహించారు. "వారసత్వం" కథలో గంగరాజం పాత్రద్వారా ఈ పరిణామాలను చిత్రించారు.

"1922 లోనే నిజాం నవాబు వెట్టిచాకిరీ రద్దుచేస్తూ ఫర్మానా (జీ.వో.) జారీ చేసినా దొరల వెట్టి తప్పలేదు. పన్నులు వసూలు కోసం ప్రభుత్వ నిర్వహణ కోసం దొరల మీద, ధనికుల మీద ఆధారపడ్డం వల్ల అంతా చుట్టుకు వచ్చింది. ఉన్నత కులాల్లో పుట్టిన ఉన్నత వంశాల వారిని, ధనికులను ఉద్యోగాల్లో పెట్టుకుంటే డబ్బుకోసం కక్కుర్తి పడరని నిజాం ఆశించాడు. కాని వాళ్ళే ఎక్కువ దోచారు. ప్రజల్ని పీడించడానికి అధికారం, కులం, ధనం అన్నీ తోడయ్యాయి. ప్రజల్ని పీడించి, వెట్టి చేయించుకుని మరిన్ని సుఖాలకు మరిగి సోమరిపోతులయ్యారు. దాంతో నైజాం రాష్ట్రం బాగా వెనుకబడి పోయింది. వారి ద్వారా నిజాం ప్రభుత్వం ఎంతో అప్రదిష్టపాలైంది. పేదోల్లకు ఉద్యోగాలిస్తే అటు ప్రజలకు, ఇటు ప్రభుత్వానికి భయపడుతూ పని చేసేవారు. ఇన్ని ఘోరాలు జరిగేవికాదు. నిజాంకు ఆ సలహా యిచ్చిందెవరో, అంబేద్కర్‌ను ప్రిన్సిపల్ సెక్రటరీగా తీసుకుందామనుకున్న నిజాంను పక్కదోవ పట్టించింది వారే కావచ్చు"[14] అగ్రకులాల వారి ఎదుగుదల కోసం వారి స్వార్థ బుద్ధి మూలంగా తెలంగాణలో జరిగిన సామాజిక మార్పును గమనించవచ్చు.

"దొరల ద్వారా, దొరల చెప్పుచేతల్లో ఉండే కుల పెద్దల ద్వారా జరిగే అన్యాయాలు, వెట్టి, కుల బహిష్కరణ, సాంఘీక బహిష్కరణ భరించలేక ఎందరో క్రైస్తవం, ఇస్లాం పుచ్చుకున్నారు. వాళ్ళను శుద్ధి చేసి కులంలోకి, వెట్టిలోకి రమ్మనడానికి తప్ప ఆర్య సమాజం తమకు చేసిందేమీ లేదని గంగరాజం గ్రహించాడు. చిన్నాన్న పిల్లలు తురకమతం పుచ్చుకొని ఊళ్ళోంచి వెళ్ళిపోయారు. ఎట్లా మొదలైందో ఎందుకు మొదలైందో తెలియదు గానీ దొరలతో నైజాంతో తుపాకుల పోరాటం మొదలైంది. దాంతో ఊళ్ళో ఉన్న వాళ్ళు పారిపోవాల్సి వచ్చింది. ఆ తర్వాత దొరలు పారిపోయారు. పల్లెలు వదిలి పట్నాల్లో సంపాదించడం మొదలెట్టారు"[15] ఇలా భూమి శిస్తు వసూలుదార్లే భూస్వాములుగా, జమీందార్లుగా ఎదిగి తరువాత నిజాంను పక్కదోవ పట్టించారు.

భూములు, వెట్టి, కుల, సాంఘీక బహిష్కరణలను నిరసిస్తూ అనేక మంది నాయకులు బూర్గుల రామకృష్ణారావు, స్వామి రామానందతీర్థ, సురవరం ప్రతాపరెడ్డి, మాడపాటి హన్మంతరావు, గుంటుక నర్సయ్య పంతులు, గంగుల భూమయ్య, వట్టికోట ఆళ్వారుస్వామి, అంబల్ల రాజారాం, సోషలిస్టు తిరుమలరావు వంటి వారు ఆంధ్రమహాసభ ద్వారా ఉద్యమించారు. ఆంధ్రమహాసభ నుండి చీలిపోయినవారు కమ్యూనిస్టులతో కలిసి భారతదేశం స్వాతంత్ర్యానికి ముందు నుండే తెలంగాణ సాయుధపోరాటం ప్రారంభిస్తారు. తెలంగాణ సాయుధ పోరాటంతో పల్లెల్లో ఉండే దొరలు, భూస్వాములు పల్లెల్ని వదిలి పట్నాలకు పారిపోతారు. అలా పారిపోయిన వారు పట్నాల్లో ధనికులుగా స్థిరపడతారు. సైనిక చర్య ముగిసిన తర్వాత కొత్త ఎత్తులతో దొరలు ముందుకు వస్తారు. దళితులు పూర్తిస్థాయిలో ఎదగలేక రిజర్వేషన్ల ద్వారా వివిధ పార్టీలలో ఉండిపోయి సేవచేస్తారు.

భూ సమస్యకు ఏ రాజకీయ పార్టీ కూడా పరిష్కారం చూపలేకపోయింది.

తెలంగాణ వెనుకబడిపోవడానికి ఒక కారణంగా నైజాం పరిపాలనా కాలంలో విస్తరించిన బ్రిటీషాంధ్రులు తెలంగాణలో అన్ని రంగాలను, ఉద్యోగాలను ఆక్రమించడం వల్ల తెలంగాణా ప్రజల అభివృద్ధి ఆగిపోయిన క్రమాన్ని "దక్షయజ్ఞం" కథలో చిత్రించారు.

సమైక్య రాష్ట్రం ఏర్పడిన తరువాత తెలుగు రానివాళ్ళను ఉద్యోగాల్లోంచి తొలగించారు. నైజాం రాష్ట్రంలో ఉర్దు అధికార భాషగా ఉండేది. అలా సుమారు 50 వేల మందిని ఉద్యోగాల నుండి తొలగించారు. వారి స్థానంలో బ్రిటీష్ ఆంధ్రప్రాంతం నుండి నియామకాలు చేసారు. అట్లా అన్ని రంగాలలో వలసలు, ఆక్రమణలు పెరిగిపోయాయి. తెలంగాణలో వ్యవసాయాభివృద్ధి మందకొడిగా సాగింది. అయినప్పటికిని పంచాయితీరాజ్ వ్యవస్థ వల్ల గ్రామ గ్రామాన వెలసిన పాఠశాలల వల్ల, లక్షలాది మంది పిల్లలు విద్యావంతులయ్యారు. 1964 నుండి వలస వచ్చిన వారితో ఉద్యోగాలు నింపడంతో స్థానిక తెలంగాణ యువకులకు ఉద్యోగాలు దొరకక వారిలో అశాంతి నెలకొంది.

1967లో ప్రారంభం అయిన ఆంధ్ర గోబ్యాక్ ఉద్యమం 1969లో ప్రత్యేక తెలంగాణ రాష్ట్ర ఉద్యమంగా రూపుదిద్దుకుని 1972 వరకు కొనసాగింది. తద్వారా పి.వి. నరసింహారావు తెలంగాణకు ముఖ్యమంత్రి అయ్యాడు. ఆయన భూసంస్కరణలు, మాతృభాషలో విద్యాబోధన ప్రవేశపెట్టాడు. దాంతో కోస్తా భూస్వాములు పనిగట్టుకొని, భూసంస్కరణలను వ్యతిరేకించి, జై ఆంధ్ర పేర ఉద్యమించి పి.వి.ని పదవీచ్యుతుణ్ణి చేసారు.

సహజ వనరులతో, సహజ పద్ధతిలో అభివృద్ధి చెందాల్సిన తెలంగాణ ప్రాంతం అభివృద్ధి ఫలాలు - జలాలు ఉద్యోగాలు యితర ప్రాంతాలకు ఉపయోగపడ్డం వల్ల భూస్వామ్య వ్యవసాయ సమాజం నుండి, సమాజ పరిణామగతిలో పట్టణ, మధ్యతరగతి, పారిశ్రామిక, రాజకీయ, కాంట్రాక్టర్ల, విద్యారంగ వర్గాల ఎదుగుదల అనేది బక్కచిక్కిపోయింది. అందువల్ల పాలక వర్గాలు మొదలుకొని, పేద ప్రజల దాక అందరి అభివృద్ధి, విస్తరణ, వ్యాప్తి ఆగిపోతే సమాజంగాని, సంస్థగాని సైన్యుగాని, పార్టీగాని, సంస్కృతిగాని, నాగరికతగాని, మరింత అభివృద్ధి చెందే బదులుగా, అంతర్గత వైరుధ్యాలతో సంక్షోభాలతో శిథిలమవడం ప్రారంభమవుతుంది.

తెలంగాణ అభివృద్ధి పరిణామం ఆగిపోవడం వల్ల అది తద్వ్యతిరేకంగా అంతర్గత వైరుధ్యాలుగా అంతర్గత సంక్షోభాలుగా రూపుదిద్దుకుంటుంది. ఈ పరిణామాలను 'వారసత్వం', 'దక్షయజ్ఞం', 'తెల్లబట్ట', 'ఇల్లాలు' కథలలో తెలుపుతాడు. కోస్తా ప్రాంతం వలె, స్వాతంత్ర్యానంతరం జరగాల్సిన అభివృద్ధి తెలంగాణలో జరిగి ఉంటే తెలంగాణలోని భూస్వాములు, బడా పారిశ్రామికవేత్తలుగా, కాంట్రాక్టర్లుగా, పరిపాలనాధికారులుగా, గ్రామీణ సమాజం నుండి పట్టణ సమాజంగా ఎదిగుండేవారు. బ్రిటీష్ ఆంధ్రప్రాంతంలో యిలా జరిగింది. తెలంగాణ ప్రాంతంలో ఇది ఆగిపోయింది.



దానివల్ల అంతర్గత సంక్షోభం మొదలైంది. దాన్నించి బయటపడడానికి శాసనసభ, పార్లమెంట్ ఎన్నికలు, స్థానిక సంస్థల ఎన్నికలు అన్ని కులాల వారికి ఆశను, విశ్వాసాన్ని నింపి ఓటు హక్కు విలువను, అధికారం యొక్క ప్రాధాన్యతను తెలుపలేకపోయారు.

1960 నుండి ప్రజలు స్వాతంత్ర్యం అంటే ఏమిటో శాసనసభా, పార్లమెంటు, స్థానిక సంస్థల రాజకీయ అధికారం, ఓటు హక్కు విలువ ఏమిటో తెలుసుకోవడం పెరిగింది. ఎక్కడికక్కడ గ్రామీణ ప్రాంతాలలో శాంతియుత ఉద్యమాలు సాగాయి. దొరలకు వ్యతిరేకంగా, భూస్వాములకు వ్యతిరేకంగా చట్టసభలకు పోటీ చేసి కొద్దివేల ఓట్లతో ఓడిపోతారు. ఇప్పుడున్న బి.సి., ఎస్.సి.,. చైతన్యం ఆరోజుల్లో ఉండి ఉండే వాళ్ళు గెలిచి ఉండేవారు అని 'వారసత్వం' కథ తెలుపుతుంది.

శాంతియుతంగా సాగుతున్న ఈ పరిణామంతోపాటు కొత్తగా ఎదిగివస్తున్న విద్యార్థి, యువజనులు ప్రత్యేక తెలంగాణ ఉద్యమాన్ని ప్రారంభించారు. దీన్ని బ్రిటీష్, ఆంధ్ర పత్రికలు నిరంతరం వ్యతిరేకార్థాలతో ప్రచారం చేసాయి. వీటిలో కొన్నింటిని పూర్వ పక్షం చేస్తూ 'వారసత్వం', 'దక్షయజ్ఞం', 'ప్రేమికులు', 'మలుపులు', 'స్మృతి', 'వరుసలు', 'మార్పు' కథలలో చిత్రించారు.

కోట్లాది ప్రజల ఆశలని వ్యక్తం చేస్తూ, జీవన ప్రమాణాల కోసం, స్వేచ్ఛ, సమానత్వం, సామాజిక, రాజకీయ, భాష, సమానత్వం కోసం ఆరాటపడిన యువతరం చేపట్టిన 'ఉద్యమం పలు విధాలుగా అణచివేయబడింది. కమ్యూనిస్టులు, బ్రిటీష్ ఆంధ్రవాదులు సమైక్యరాష్ట్రం, తెలుగు జాతి పేర సిద్ధాంత బూచి చూపి అణచివేసారు. ఎన్నికలలో ప్రత్యేక తెలంగాణ నినాదంతో గెలిచిన నాయకత్వం సమైక్య రాష్ట్రాన్ని కోరే కాంగ్రెస్‌లో విలీనం అయిపోయింది. యిలా రెండు రకాలుగా వెన్నుపోట్లకు గురైంది.

మూడవ వెన్నుపోటు నక్సలైటు ఉద్యమం పేరిట, సిద్ధాంతంపేరిట జరిగింది. బ్రిటీష్ ఆంధ్ర వలసవాదులు తెలంగాణ జాతి ఆత్మగౌరవ పోరాటాన్ని, దాని నాయకత్వాన్ని రెండుగా చీల్చి అంతర్గత వైరుధ్యాలను ప్రాచుర్యంలోనికి తెచ్చారు. తద్వారా అభివృద్ధిలో ఎదురుగా కనబడుతున్న భూస్వాములే కారణం అని స్థానికులు అనుకున్నారు. కాని భూస్వాములు కూడా అభివృద్ధిలోకి రాకుండా చేయబడుతున్నారని అటు భూస్వాములకు కాని ఇటు ప్రజలకు గాని తెలియదు. అది తెలియజెప్పడానికి సురవరం ప్రతాపరెడ్డిలాంటి మేధావులు, జర్నలిస్టులు తెలంగాణాలోని తర్వాతి తరంలోకి అందిరాలేదు. అందుకు కారణం తెలుగు పత్రికలన్నీ బ్రిటీష్ ఆంధ్ర భూస్వామ్య, పారిశ్రామిక, కమ్మ, రెడ్డి, బ్రాహ్మణ కులాల ఆధిపత్యంలో ఉండడం. వాళ్ళు తెలంగాణ నుండి అలాంటి వారిని ఎదగకుండా చేసారు. తెలంగాణ ప్రాంత ప్రజల జీవితాన్ని చరిత్రను చిత్రించే రచయితల్ని ఎదగకుండా చేశారు. ఈ పరిణామాల్ని "దక్షయజ్ఞం" కథలో చిత్రించారు.

తెలంగాణా చరిత్రలో నక్సలైటు ఉద్యమానికి ప్రత్యేకత ఉంది. సామాజిక,

రాజకీయ, స్వేచ్ఛ, సమానత్వం, భాష, జీవన ప్రమాణాల కోసం నిరంతర పోరాటం సాగిస్తున్న తెలంగాణా ప్రజల అంతర్గత వైరుధ్యాలు, సంక్షోభాలు నక్సలైటు ఉద్యమాలవైపు ఆకర్షింపజేశాయి. ఈ పరిణామాల్ని 'దక్షయజ్ఞం' కథలో 'స్మృతి' కథలో ఇలా చెబుతారు. "గీ అన్నలచ్చినంక అందరి పెద్దరికాలు పాయె.... అందరు ఆజాదై పోయిన్రు అని అంటే అనరాబిడ్డా.... ఎట్టి జేయించుకొని కాలుమీద కాలేసుకొని బతికినోల్లకు ఎనకటి కాలమే మంచి గుండకపోతే.... ఏది మంచిగుంటది బిడ్డా"[16] అని దుబ్బవ్వ పాత్ర నక్సలైటు ఉద్యమం వచ్చిన తరువాత ప్రజల్లో కలిగిన మార్పును తెలియజేస్తుంది.

నక్సలైటు ఉద్యమం, సిద్ధాంతాలకు ఆకర్షితులైన యువకులు, కార్యకర్తలు దొరల, భూస్వాముల పెత్తనం నుండి ప్రజలను చైతన్యం చేస్తున్న వారి ఆత్మ విశ్వాసం, ఈ ప్రపంచాన్ని మారుస్తామన్న వారి భావనను, విప్లవంలో ఉండే ఉత్తేజాన్ని ఇలా చెబుతారు. "అందులో ఉండే ఆనందం ఉత్తేజం మీకు తెలియదు .... అడవుల్లో చెట్ల కింద కూర్చుని ఈ ప్రపంచాన్ని మారుస్తామని చర్చలు చేస్తుంటే కలిగి ఆనందం ఆత్మవిశ్వాసం మీ ఊహకు అందదు.... పల్లెల్లో .... గూడెంలల్లో, గుడిసెల్లో గుడ్డి దీపం వెలుగుల్లో .... మా మాటల్తో వాల్లుకు బతుకుమీద విశ్వాసం కలుగుతుంటే .... ఎండిన చాపల్లాంటి ఆ శరీరాల్లో ... మానిపోయిన ముఖాల్లో రానిపోసినట్టు ఆశలు చైతన్యం కదలాడుతుంటే.... మనిషనే వాడెవడికైనా వారికోసం ప్రాణాలీయాలనే అన్పిస్తుంది. నా భార్య నర్సవ్వ పొద్దుల్తో ఉన్నప్పుడు ఈ ప్రపంచాన్ని మోస్తున్నది నా కడుపులోనే కదా అన్నట్టు నిండుగా నవ్వే ఆ నవ్వు చూస్తే నా కొంచెం ఈర్ష్య కలిగేది. మేం ఈ ప్రపంచాన్ని మారుస్తున్నాం అనే భావన, మాలో ఈ ప్రపంచాన్ని మోస్తున్నది మేమే అనే ఆత్మవిశ్వాసాన్నిచ్చింది. విప్లవంలో గల ఈ సుఖం, ఆత్మవిశ్వాసం వల్లే ఎన్ని బాధలైనా పడడం సాధ్యపడింది."[17]

అంటూ విప్లవ కార్యకర్తలు ఆశలు, ఆశయాలు, సిద్ధాంత వ్యూహం ఆచరణ పేదలకు మేలు చేస్తున్నాయని అనుకుంటే, వ్యూహం తిరగబడిన తీరు అది అగ్రకుల భూస్వాములకు ఏదో విధంగా మేలు చేసింది. దళితుల జీవితాల ఎదుగుదలను మార్చలేకపోయింది. దొరలు కొత్త ఎత్తులతో ముందుకు వచ్చారని చెబుతాడు. ఏ గడీ ఆధిపత్యం కోసం పోరాటం చేసి గెలిచామనుకుంటే' ఆ గడీలు పల్లెల్ని వదిలి దొరలు సేట్లాయ్యారు, కాంట్రాక్టర్లయ్యారని, పారిశ్రామికవేత్తలు, రాష్ట్ర నాయకులు అయ్యారని తెలుపుతాడు.

రాజకీయాలలో కూడా ఇలాంటి పరిస్థితులే ఎదురుకావడం 'వారసత్వం' కథలో 1952లో జరిగిన ఎన్నికలు ధృవీకరించాయి. "తమ జాతి ఉద్ధరణకు మొదలైన మెట్‌పల్లి ఖాదీ సంస్థ కూడా క్రమంగా విజయరామారావు, చొక్కారావు వంటి దొరల పెత్తనంలోకి పోయింది. తెలుగుదేశం పార్టీ వచ్చేదాక బి.సి.ల నాయకత్వం అంటూ లేకుండా చేయగలిగారు. ఎలా జరిగిందో చాపకింద నీరులాగా అంబల్ల రాజారాంను ఎమ్మెల్యేగా గెలిపించుకుంటే ఏదో చేస్తాడనుకుంటే తన కులం వారితో పాటు అందరితో "దొర"



అనిపించుకున్న అహంకారంతో అతనికీ గంగరాజంకూ బెడిసికొట్టింది"[18] అంటూ రాజకీయాలలో అగ్రకులాల ఎదుగుదల సాధ్యపడడానికి, ఎస్సీ, ఎస్టీ, బి.సి. వర్గాలు నెగ్గిన దొరల నిర్ణయాలకు కట్టుబడడం తప్ప ఏమిలేదని తెలుపుతుంది.

అలాగే విప్లవ సిద్ధాంతాలు, పాటలు విని వెళ్ళిన కార్యకర్తలకు విప్లవం అంతు దొరకని సముద్రంలా, ఎండమావిలా తోచింది. నక్సలైట్లకు సహకరించిన ప్రజలు హత్యలకు, రేప్‌లకు గురై ప్రతినిత్యం భయంగా బ్రతకవలసిన స్థితి వచ్చింది. ఎన్నికలను నిరాకరించి నిర్బంధాలకులోనై, పోలీసుల కళ్ళనుండి తప్పించుకుని సిద్ధాంతాలను ఆశయాలను నమ్మినా ఆ తర్వాత సిద్ధాంతాలకన్న ప్రాణాలు కాపాడుకోవడం సమస్యగా తయారైంది.

నక్సలైటు కార్యకర్తలు ఎన్నిరోజులు నిర్బంధాన్ని ఎదుర్కోవడం అంటూ అంతర్గత కల్లోలంతో విప్లవోద్యమాన్ని, నిర్మాణాన్ని విబేధిస్తుంది. కుటుంబం, పిల్లల బాగుకోసం ప్రారంభమైన ప్రస్థానం నిత్యనిర్బంధంలో కూరుకుపోయి ఆలోచిస్తే ".... ఎవరికి దొరకకుండా ఎంతకాలమని తిరగడం.... మా తోవలు జాడలు పోలీసుల క్కూడా తెల్సిపోయాయి. దమ్ము (అలసట) వచ్చినపుడు సేద తీరడానికి చూస్తే విప్లవం అంతూ దరీలేని ప్రవాహం. నిరంతరం ఈదాల్సిందే. విప్లవానికి అవతల ఒడ్డు, యివతలి ఒడ్డూ అంటూలేవు. అందులో కొట్టుకు పోవడం తప్ప"[19] అంటూ విప్లవోద్యమంలో తిరగబడిన ఆలోచనా విధానం, కుటుంబాన్ని పిల్లలను వదిలివెళ్ళిన కార్యకర్తలు ప్రాణత్యాగానికి సిద్ధపడినా సమస్యలు మరింత పెద్ద సమస్యలుగా తయారు కావడమే తప్ప, ఏ భూస్వామ్య వ్యవస్థ పోవాలని పోరాటాలు చేస్తారో ఆ వ్యవస్థకే మేలు జరిగి తను అష్టకష్టాల్లో నిర్బంధంలో కూరుకు పోయిన తీరును 'దక్షయజ్ఞం' కథలో పెంటయ్య అనే మాజీ నక్సలైటు ఆవేదనలో చూడవచ్చు.

సమాజంలో రెండు వర్గాలున్నట్టే ఉద్యమంలోనూ రెండు వర్గాలున్నట్లు చెబుతూ . . "ఆ పద్ధతిని రూపొందించిన వాళ్ళు పార్టీలో తమ అధికారం పోగానే హాయిగా ఎంచక్కా భార్యా, పిల్లల్తో.... మనుమరాళ్ళతో కాలం గడుపుతున్నారు. వాళ్ళు మళ్ళీ విప్లవం అని ఊసెత్తితే ఒట్టు. అలాంటివాళ్ళను నమ్ముకొని ముందటపడి మూతి పళ్ళురాలగొట్టుకున్న వాళ్ళల్లో నేనొకరిని సార్"[21] అంటాడు. విప్లవోద్యమంలో అగ్రకులాల ఆధిపత్యం, దళితులు, చదువురాని నక్సలైట్లు ఉద్యమం వీడినా వెన్నంటి ఉండే రాజ్యహింసను తెల్పుతుంది.

"విప్లవంలో చేరి జీవితాన్ని ఓడిపోయాను. జీవితాన్ని గెలుచుకోవాలని విప్లవంలో చేరి నాకు ఓడిపోయే జీవితాన్నిచ్చింది."[22] అంటూ విప్లవ సిద్ధాంతాలు, వ్యూహాలు తిరగబడిన ఫలితంగా కోలుకోలేని వారి మనోవేదనను చూడవచ్చు. "సార్.... నా వాళ్ళకు పోరాటం చేయడమే తప్ప.... దాని లాభాలు పొందడం తెలవది. నావాళ్ళకు రోషం ఆవేశమే తప్ప లౌక్యం తెలవదు. లౌక్యం ముందు తుపాకులు ఓడిపోతున్నాయి. నావాళ్ళకు చావడం తప్ప బతుకును గెల్చుకోవడం తెలువది. వేల ఏండ్ల నుండి సకల

సరుకులు కళలు సృష్టించిన మా చేతుల్తో వాటిని "మార్కెట్" చేసికొని అమ్ముకోవడం తెలియని అణగారిన కులాల వాళ్ళం...."[23] అంటూ సామాజిక, రాజకీయ ఉద్యమ జీవితాలలో పోరాటాలు చేసి ఫలితాలు పొందలేక దళిత బహుజనులు పడుతున్న బాధలు పేర్కొన్నారు.

తెలంగాణ ప్రాంతంలో భూస్వామ్య దోపిడీకి అడ్డుకట్ట వేయడానికి 1972లో సీలింగ్ విధానం వచ్చినా అది ప్రజలకు కాకుండా భూస్వాములకే అనుకూలంగా మారింది. ప్రజలకు భూమిని మరింత దూరం చేసింది. భూమిని అమ్ముకున్న భూస్వాములు కొత్తగా మధ్య తరగతి భూస్వాములను తయారు చేయడానికి ఈ సీలింగ్ విధానం తోడ్పడింది.

ఎమర్జెన్సీకి ముందు తరువాత నక్సలైటు ఉద్యమంలో భాగంగా "గ్రామాలకు తరలండి" అనే పిలుపు విద్యార్థులను ముఖ్యంగా విశ్వవిద్యాలయాలలో ఉన్న వారికి గ్రామాల వైపు తొంగిచూసే అవకాశం కల్పించింది. ఇది గ్రామాలలో జరుగుతున్న దోపిడీలూ, అరాచకాలు వెలుగుచూసే అవకాశం కల్పించింది. హాస్టల్ల్లో తింటూ, ఫ్యాన్‌ల క్రింద కూర్చొని చదువుకునే యువకులు కటిక నేల మీద పడుకొని, ఆ యింట్లో ఈ యింట్లో మక్కగట్క, అంబలి అడుక్కుని త్రాగి, రోజుల తరబడి ప్రజలను చైతన్యవంతులుగా తీర్చి దిద్దడానికి చేసిన ప్రయత్నంలో ఆ యువకులు మరింతగా చైతన్యవంతులు అయిన ఆ కాలంలో వీరిలోని మార్పును ఏ పత్రికా రచయిత ఏ మేధావి రికార్డు చేయలేక పోయారు.

ఆనాటి పరిస్థితులను చరిత్రలోకి మార్చడానికి ఉపయోగపడే కథలు, గ్రామాలలోని జన జీవితాన్ని, వారి కడగండ్లను బి.యస్.రాములు ఈ కథలలో చిత్రించారు. తెలంగాణ ప్రజల పోరాటం ఒక్క భూస్వామ్య వ్యవస్థతోనే కాకుండా, వెనుకబాటుతనం, ఆలోచన వ్యవస్థ, కులాల మధ్య లోపించిన సమన్వయం, చేజారి పోతున్న కుల వృత్తులు, మానవ సంబంధాలను ఒక్కొక్కటిగా ఏరుకొని చారిత్రక నేపథ్యంతో కాలానుగుణంగా వచ్చిన మార్పులను ఆలోచనలను చిత్రించిన ఈ కథలు తెలంగాణ ప్రాంత చరిత్రకు నిదర్శనాలుగా పేర్కొనవచ్చు.

**బి.ఎస్.రాములు కథల్లో చేతివృత్తి కులాలు-వలసలు**
**మారుతున్న ప్రజల చరిత్ర పరిణామాలు**

తెలంగాణ ప్రాంతంలో నీటి వనరులు పుష్కలం. కాకతీయులు వందల, వేల చెరువులు కట్టించారు. నిజాం కాలంలో కూడా నీటి వనరులు, పరిశ్రమలు ఎంతగానో అభివృద్ధి చెందాయి. దాని వల్ల వ్యవసాయం, కులవృత్తులు, పాడిసంపద, పశుసంపద, ఎంతో అభివృద్ధి చెందాయి. విస్తారమైన అడవులు, కొండలు, సారవంతమైన నేలలు, జీవనదులు ఇందుకు నిదర్శనం. అయినప్పటికీ భూస్వామ్య దోపిడీ వల్ల ప్రజలకు సుఖ శాంతులు కరువయ్యాయి.



అలాంటి ప్రత్యేక పరిస్థితుల వల్లనే నైజాం రాజ్యం ప్రపంచంలో మూడవ సంపన్న రాజ్యంగా వెలసిల్లింది. అయితే 1957 నుండి ఈ స్థితి మారింది. చెరువు కట్ట తెంపివేస్తే చెరువులోని మొత్తం నీరు పల్లంలో ఉండే పొలాలకు, చెరువులకు చేరుతుంది. తెలంగాణ ప్రాంత నీటి వనరులు, నీటి ప్రాజెక్టులు నిర్లక్ష్యం చేయబడ్డాయి. గోదావరి, కృష్ణ నదులతో పల్లంలో ఉండే కోస్తాంధ్ర ప్రాంతాల అభివృద్ధి వేగిరపరిచారు. దాంతో తెలంగాణ ఉద్యోగాలు, భూములు ఆంధ్ర వలస వాదుల పరమయ్యాయి. ప్రత్యేక తెలంగాణ ఉద్యమం 1969లో ఉధృతంగా సాగింది. ఇవన్నీ దక్షయజ్ఞం, వారసత్వం కథల్లో చిత్రించబడ్డాయి.

వ్యవసాయ సమాజం, కులవృత్తుల సమాజం పారిశ్రామిక అభివృద్ధి వల్ల ఆధునిక విద్య వల్ల, పట్టణీకరణ వల్ల మారుతూ వచ్చింది. 200 ఏళ్ళుగా కులవృత్తులు దెబ్బతిన్నాయి. ప్రజలు సామాన్య కార్మికులుగా మారి వలసలు సాగించారు. అలా వలస వెళ్ళిన తెలంగాణ వాళ్ళు కొందరు ఆర్థికంగా పుంజుకున్నారు. షోలాపూర్ - భీవండి, సూరత్, అహ్మదాబాద్, పూనా, ఔరంగాబాద్ మొదలైన ప్రాంతాల్లో పారిశ్రామికవేత్తలుగా ఎదిగారు. ఈ క్రమం 'పంజరం' కథలో చూస్తాము.

1964లో దళితులు ఉద్యోగాలు పొంది మధ్యతరగతిగా ఎదిగినా భూస్వాముల సేవచేయడం తప్పలేదని ".... నేను టీచర్‌గా అపాయింటయి ధర్మపురి రూట్లో ఓ పల్లెలోని స్కూల్లో చేరిన కాలంలో అంతా దొరలదే రాజ్యం. నేను పేరుకే టీచర్ని గానీ ఆచరణలో ఆవూరి రాజేశ్వర్‌రావు దొరగారికి సర్కార్ జీతం తీసుకుంటూ ఉచితంగా పనిచేసే చదువుకున్న పాలేర్ని. కొంచెం అందంగా చెప్పాలంటే దొరగారికి పర్సనల్ అసిస్టెంటుని"[24] అంటూ ఉద్యోగాలు పొంది మధ్యతరగతి కుటుంబాలుగా మారుతున్న వాళ్ళు పల్లెల్లో భూస్వాములకు, వారు ఉంచుకున్న వారికి కూడా ఎలా సేవలు చేయాల్సివచ్చిందో "తెల్లబట్ట" కథ తెలుపుతుంది. 1964 నుండి 1977 మధ్యగల కాలంలో గ్రామీణ ప్రాంతాల్లో వచ్చిన మార్పులను ఈ కథ ద్వారా తెలుసుకోవచ్చు.

వ్యవసాయ సమాజం - కులవృత్తుల సమాజం పారిశ్రామిక అభివృద్ధి వల్ల మానవ సంబంధాల్లో జరిగే పరిణామాలను "వరుసలు" కథలో కథా నాయకుడు సరవ్వకు చెబుతాడు. "వెనుకట వ్యవసాయం ప్రధాన జీవనాధారం అందుకని అదిలేని నాకు నిన్ను యివ్వనన్నారు. ఇపుడది గిట్టుబాటు లేనిదైపోతున్నది. వెనకటి బట్టల మిల్లు కార్మికరంగం దాని స్థానం బలంగా ఉన్నంతకాలం కూలీ బాగా గిట్టుబాటై ఆ కార్మికుల్లోంచే చిన్న పెట్టుబడిదారులు పుట్టి యిపుడు షోలాపూర్; భీవండి బట్టల మిల్లుల యజమానులయ్యారు. ఇపుడా అవకాశం లేదు. కంప్యూటర్ ఎలక్ట్రానిక్ రంగాలిపుడీ దశలో ఉన్నాయి. అందులో నిన్నటి ఉద్యోగుల్లోంచి నేడు వేల కోట్ల అధిపతులయ్యారు"[25] అంటూ అందరు కుల వృత్తులు పోతున్నాయని వాపోతుంటే, కులవృత్తులను వదులుకుని పారిశ్రామిక అభివృద్ధి సాధించాలని తెల్పుతాడు రచయిత.

కులవృత్తులు వదిలి చదువుపైన ఆసక్తి పెంచుకుని చదువుకుని ఉద్యోగిగా మారిన

వ్యక్తి 'మార్పు' కథలో ఆధునిక విద్య అవకాశాన్ని తన కొడుకు అందుకోలేకపోతే స్నేహితుడు రాజయ్యతో అన్నమాటలు "ఈ చదువు లేకపోతే తన బతుకంతా శూన్యమే. రాజయ్య బతుకూ అంతే. ఇక ఏం చూసుకొని ఏం చేసికొని బతికితే తాముఈ స్థాయికి రావడం సాధ్యం? పది ఎకరాల ఆసామి ఒక అటెండరు స్థాయిలోనైనా బతుకుతున్నాడా! పొలం వుండగనే సరా! ఎంత పెట్టుబడి కావాలె. ఎందరు సహకరించాలె"[26] అంటూ విద్య అవసరాన్ని తెలుపుతాడు.

ప్రఖ్యాత కథా రచయిత డా॥ కాలువ మల్లయ్య ఈ సామాజిక విశ్లేషణ చారిత్రక భౌతిక వాదానికి సంబంధించినదిగా పేర్కొంటూ.... "చాలామంది రచయితలు తమ కథల్లో కులవృత్తులు పోతున్నాయని వాపోవడం చూస్తుంటే బి.యస్.రాములు గారు చదువుకుని, జీవితాన్ని గెలుచుకుని కుల వృత్తులు వదులుకోవాల్సిన అవసరాన్ని నొక్కిచెపుతారు. కొందరు రచయితలు భూమిపట్ల కాల్పనిక భ్రమలు కల్గియుంటే రాములు గారు కులవృత్తి నుండి బయటపడి కార్మికవర్గంగా రూపుదిద్దుకుంటున్న క్రమాన్ని కథల్లో చిత్రించారు.... నడుస్తున్న భారతీయ సమాజ చరిత్ర సంస్కృతి అందులో వస్తున్న మార్పులు, మారుతున్న విలువలు జరుగుతున్న సంఘర్షణను సామాజిక తాత్విక పోరాటాలతో సహా, ఉద్యమ జీవితాలు, ఉద్యమేతర జీవితాలు తెల్సుకోవాలంటే 'స్మృతి" కథల సంపుటిలో కథలు చదవడం అవసరం. ఇవి ఖచ్చితంగా సమకాలీన సమాజాన్ని నూటికి నూరు పాళ్ళు నిజాయితీతో చిత్రించిన ఉత్తమ కథలు"[27] అంటూ 'స్మృతి' కథల సంపుటి ముందు మాటలో పేర్కొన్నారు.

**బి.ఎస్.రాములు కథల్లో ఆధునిక విద్య తెచ్చిన మార్పులు**
**సామాజిక, ఆర్థిక చరిత్ర–సామాజిక పరిణామాలు**

ఆధునిక విద్య తెచ్చిన చరిత్ర పరిణామాలను బి.ఎస్.రాములు గారు అనేక కథల్లో చిత్రించారు. అసలు కథలన్నీ అందుకోసమే రాశారా అనిపిస్తుంది. ఆధునిక అభివృద్ధి అందుకోవడానికి ఆధునిక విద్య అనివార్యం. అందువల్ల ఆధునిక విద్య ప్రాధాన్యతను తద్వారా కలిగే పరిణామాలు – మార్పు, పాలు, బడి, సహజాతాలు, స్మృతి, బందీ, రియల్ ఎస్టేట్, తెల్లబట్ట, అయిదవవాడు, చేయూత, వరుసలు, వేదవతి, మలుపులు, ప్రేమికులు, మమతలు, సహజీవనం, వారసత్వం, సంబంధం, పేరసైట్స్, వేపచెట్టు, కామన్‌వెల్త్ మొదలైన కథలన్నీ ఆధునిక విద్య తెచ్చిన ఆర్థిక, సామాజిక పరిణామాలను చిత్రించినవే. భారతదేశంలోని 110 కోట్ల జనాభాలో 35 కోట్ల మంది మధ్య తరగతి, ఉన్నత తరగతి స్థాయికి ఎదిగారు. ఇందుకు ఆధునిక విద్య ప్రధాన కారణం. ఆధునిక విద్య లేకుండా ఈ 35 కోట్లలో ఎదిగిన వాళ్ళు అయిదు శాతం కూడా వుండరు. అందువల్ల ఆధునిక విద్య ప్రాధాన్యతను గుర్తించి ఎంతో విస్తారంగా కథలు రాశారు. పేదలకు పెట్టుబడి దొరకడం కష్టం. పారిశ్రామికవేత్తలుగా మారడం కష్టం. కానీ విద్య అందుకొని ఎదగడం ఎంతో సులభం.

"ప్రపంచీకరణ నేపథ్యంలో వేపచెట్టు" కథల సంపుటిలోని "నాగశాల" కథలో



కళాకారులు, రచయితలు, మేధావులు, ప్రజలు రాజ్యాధికారం కోసం ఎందుకు కృషి చేయాలో, చరిత్రను ఎలా అధ్యయనం చేయాలో తెల్పుతుంది. శాతవాహనుల తరువాత క్రీ.శ.2వ శతాబ్దం నుండి 5వ శతాబ్దం వరకు తెలుగు ప్రాంతంలోని చరిత్రలో ఖాళీగా ఉండిపోయిన కాలాన్ని చారిత్రక ఆధారాలతో సామాజిక చరిత్రను బి.యస్.రాములు పునర్నిర్మించారు. "భర్తృహరి" అనే కవి ఏడుసార్లు బౌద్ధం నుంచి బ్రాహ్మణ మతంలోకి, బ్రాహ్మణవాదం నుంచి బౌద్ధంలోకి మారాడని చరిత్ర చెపుతుంది. అలా ఒక కాలంలో తమ కులాలను మార్చుకున్న కాలం చరిత్రలో ఉంది. చాలా కులాలు తమ జీవిత కాలంలోనే వృత్తి కులాలనుండి, వ్యవసాయ కులాలనుండి, గిరిజన తెగలకు రాజులుగా మారారు. అలా మారిన క్రమం ఎలాంటిదో తెలుపుతుంది.

ఈ కాలంలో చైనా నుండి కాబూల్ దాకా జరిగిన బౌద్ధ ప్రచార ప్రస్థానాలను తెలుపుతూ, బౌద్ధ దృక్పథంతో రాజ్యాధికారం అంటే ఏమిటో, దాన్ని ఎలా నిర్వహించాలో తెల్పుతూ "అమ్మా! ఈ ప్రపంచంలో గుర్తించాలనే కోరిక ఉన్నప్పుడు అలా అనుకున్నాను. ఆనంద బుద్ధ బోధనలతో ఎవరో గుర్తించాలనే కోరికను జయించాను, కాదు అదే అదృశ్యమైపోయింది. గొప్ప కళాకారుడినవ్వాలనే కోరిక కూడా అలాగే అదృశ్యమైపోయింది. నాన్నను నువ్వు పెళ్ళి చేసుకున్నాక రాజ్యాలు మారింది రాజ్యభీతి వల్లనే కదా! అస్సకబావ అక్కని, జ్ఞానాన్ని కళల్ని చెరపట్టాడు. అందుకని నేను రాజ్యాన్ని చేపట్టాలనుకున్నాను. అమ్మా! నీకన్నీ తెలుసు, ఎక్కడ రాజ్యం శాంతి, సుస్థిరత, పంటల సమృద్ధితో సుభిక్షంగా ఉంటుందో అక్కడ సమస్త విద్యలు కళలు వికసిస్తాయి. నేను కళాకారుడిని కావడంవల్లె బౌద్ధ భిక్షువును అవకుండా రాజ్యాధినేతను కావాలనుకున్నాను. నేనొక్కడిని ఎదగడం కన్నా ఎంతో మందికి నీడనీయడం నాకు తృప్తినిచ్చింది. నాగపాల కూడా దేశాటనతో రేపెప్పుడో ఇదే నిర్ణయానికొస్తాడను కుంటానమ్మా!"[28] అంటూ కవులు, కళాకారుల సమస్త విద్యలు రాజ్యం సుభిక్షంగా ఉంటేనే సాధ్యపడుతుందని రాజ్యభీతి ఉండకూడదని చెబుతుంది.

అలాగే 'పాలు' కథా సంపుటంలో 'పాలు', 'బడి', 'సహజాతాలు' కథలు ఆధునిక విద్య వల్ల సమాజంలో కలిగే మార్పును తెలుపుతాయి. పాలుకథలో గంగపోచం 'బడి' కథలో పోచయ్య 'సహజాతాలు' కథలో బాబు, శ్రీనులుగా విద్య ద్వారా ఎదిగి పోరాట మార్గం ద్వారా సమాజాన్ని మార్చాలనే లక్ష్యం వరకు అంతస్సూత్రంగా పనిచేసింది విద్యేనని తెలుపుతాడు.

"మమతలు మానవ సంబంధాలు" కథల సంపుటిలోని 'వరుసలు', 'కొత్త చిగురు', 'వేదవతి', 'మలుపులు', 'ప్రేమికులు', 'మమతలు' కథలలో విద్యవల్ల ఎదిగిన పరిణామాలను చిత్రించాడు. 'వరుసలు' కథ తన మరదలు సరవ్వను పిల్లనివ్వమని తల్లిదండ్రులు అడిగితే వ్యవసాయం లేదని నిరాకరిస్తే – చదువుకుని ఉద్యోగస్థుడైన రాములు బావను చూసి ఇది విద్యవల్ల గెలుచుకున్న జీవితమని గ్రహిస్తుంది సరవ్వ. 'కొత్త చిగురు' కథలో మోహన్, మదనయ్యలు 'వేదవతి' కథలో వేదవతి, తిప్పాకర్‌రావులు,

'మలుపులు' కథలో కులవృత్తి చేసుకు బ్రతికే తల్లిదండ్రుల నుండి వారి కొడుకు చదువుకొని డాక్టర్‌గా స్థిరపడడం. 'ప్రేమికులు' కథలో లత, రాధలు 'మమతలు' కథలో కాంతయ్య, సరవ్వలు పాత్రలు విద్య ప్రాధాన్యతను తెలుపుతాయి.

'స్మృతి' కథా సంపుటిలోని 'స్మృతి' కథలో మల్లేశం తల్లి కొక్కుల దుబ్బక్క మాటల్లో "సదువైనంక ఉత్తగనే తిరిగితివి.... బీడీలు చెయ్యిరా అంటే నీ పానం వంగకపాయె... దుకాన్ల జీతముంటివి గని బీడీలు చేయకపోతివి.... ఏదోగా ఆపతి మల్లన్న జాబుల నూట యిరవై రూపాయలకు నౌకరి దొరికె.

"ఆపతి మల్లన్న కాదత్తా.... హాఫ్ ఎ మిలియన్ జాబు అనే స్కీము కింద పందొమ్మిది వందల డెబ్బయి మూడుల హెచ్.సి. సిరీన్ అనేటాయన గవర్నర్ పాలన ఉన్నప్పుడు అయిదు లక్షల ఉద్యోగాలు అని పెట్టిండు". కస్తూరి రాజేశం సవరించాడు."[29]

"బందీ" కథలో కథానాయకుడు తను ఉద్యోగిగా ఎదిగిన క్రమాన్ని వివరిస్తూ "అంతకుముందు చిన్నప్పుడు మా అవ్వతో వెళ్ళి పటేండ్ల ఇండ్లల్లో పశువుల పేడ తీసేవాణ్ణి. మావూరి రెడ్డి నన్ను పాలేరుగా జీతానికి వుంచుకోవాలనే చూశాడు. మా అవ్వ (అమ్మ) మనస్సు గట్టిది. మా నాయిన (నాన్న) హృదయం గొప్పది. చేసేది ఇటుక బట్టీల కూలి పనైనా చదువుతో ఒనగూడే ప్రయోజనాల గురించి గొప్ప అవగాహన గలవాడు. నన్ను కనీసం బడిపంతులునైనా చేయాలని మా నాయిన తపన"[30] గ్రామీణ భూస్వామ్య వ్యవస్థలో దళితులు దొరల వద్ద పాలేర్లుగా పనిచేస్తే, చదువు ద్వారా బడిపంతులుగా, ఆర్డీవోగా ఉన్నత ఉద్యోగాలు చేయడం రిజర్వేషన్ల ద్వారా సాధ్యపడిందని తెలుస్తుంది.

"రియల్ ఎస్టేట్"లోని మల్లయ్య కష్టపడి చదువుకుని ఎకనామిక్స్ లెక్చరర్‌గా ఎదిగి తన కొడుకు సందీప్‌ను ఇంజనీరింగ్ కాలేజీలో లెక్చరర్‌గా ఎదిగిస్తాడు. కూతురు పావనిని ఎం.బి.బి.ఎస్., చిన్న కొడుకు క్రాంతిని డిగ్రీ చదివిస్తుంటాడు. పేద కులంలో పుట్టిన మల్లయ్య మావోను అభిమానిస్తాడు. "చైనాలో మావో ప్రవేశపెట్టిన విద్యా ప్రణాళికను కమ్యూన్లను ఎంతో అభిమానిస్తాడు. ఒక పూట పని ఒకపూట చదువు అనే షిఫ్టు పద్ధతి అతనికి గొప్ప ఆదర్శం. కుల వ్యవస్థ విధించిన దారిద్ర్యం, అసమానతలకు "పని చదువు" షిఫ్టు పద్ధతే పరిష్కారం అంటాడతడు. అపుడే మన ఇండియాలో "నిర్బంధ ప్రాథమిక విద్య" ఆశయం నెరవేరడంతోపాటు "ఉన్నతవిద్య" అందరికీ అందుబాటులోకి వస్తుందని అతని విశ్వాసం. తద్వారా ఈ దారిద్ర్యం, సోమరితనం, పనిపట్ల అగౌరవం, కులమతాల హెచ్చుతగ్గులు అదృశ్యమవుతాయంటాడు"[31] దళితుల ఎదుగుదలకు మల్లయ్య మాటలు మార్గదర్శకం. దళితులు విద్యద్వారానే అగ్రకులాల వారితో సమానంగా, సామాజిక జీవితం అనుభవించడం సాధ్యపడుతుందని అనడానికి ఈ కథలన్నీ ఉదాహరణగా చెప్పుకోవచ్చు.

"మార్పు" కథలో రాములు ఆనాటి కాలంలో చదువుకొనడానికి కనీస సౌకర్యాలు



లేకున్నా చదువుకుని ఉద్యోగాన్ని సాధించానని తన మనసులోని భావాన్ని కొడుకుతో వ్యక్తం చేస్తాడు. ఇపుడు ఇన్ని అధునాతన సౌకర్యాలు ఉండి కూడా కొడుకు కనీసం ఎంసెట్‌లో ర్యాంకు తెచ్చుకోలేక పోవడంతో ముడిపెట్టి చర్చిస్తాడు. అయితే విద్యలో పోటీ వల్ల పిల్లలు పడే మానసిక వేదన, అగ్రకులాలతో పోటీ పడి డబ్బు పెట్టి కోచింగ్ సెంటర్‌లకు పంపలేని స్థితి, విద్యా వ్యవస్థలో మారుతున్న పరిస్థితులను కళ్ళకు కట్టినట్లు "మార్పు" కథ మనముందుంచుతుంది.

"గాడిద" కథలో మిట్టపెల్లి లక్ష్మణ్ ఉత్తమ సాహిత్యాన్ని సృష్టించాల్సిన సమయాన్ని ప్రజా సంఘాల్లో, ఉద్యమాల్లో పనిచేసి కోల్పోతాడు. చివరికి సాహిత్య రంగానికి పూర్తి సమయం కేటాయించడం చేస్తాడు.

"దుస్తులు" కథలోని దళితుడైన సత్తయ్య కష్టపడి తల్లిదండ్రులు చదివిస్తే టీచర్ ట్రైనింగ్ పూర్తయ్యాక, ఉన్నత కులానికి చెందిన తన క్లాస్‌మేట్ సుమతిని పెళ్ళి చేసుకుని అధికారంతోడై, సత్తయ్య అగ్రకులాల్లోని వ్యక్తిగా తల్లిదండ్రులను, దళితులను నీచంగా చూస్తుంటాడు. "ఇప్పుడు సత్తయ్య నడకలో నిలువెల్లా అహంకారం, గర్వం తొణికిసలాడుతుంటాయి. దాన్ని కొందరు అతని మొహంలో వెలిగే గొప్ప తేజస్సు అని ప్రశంసిస్తుంటారు. ఆఫీసరంటే అలా ఉండాలి, అని ఆ దర్పాన్ని పొగుడుతారు. సత్తయ్య మాటల్లోని దర్పం పెద్దపులి గాండ్రింపులా ఉంటుంది. అతని ముఖ కవళికల్లోనే కాదు కదలికల్లోనూ గర్వం, తేజస్సు నిండుకుండలా కదలాడుతూ ఉంటాయి"[32] దళితుడు విద్యావకాశాలు, తల్లిదండ్రుల, బంధువుల ద్వారా ఎదిగి అధికార దర్పం, గర్వంతో తనవారిని చూడలేడని చివరగా వినయమే పరిష్కారంగా ఉంటుందని ఈ కథ ద్వారా తెల్పుతాడు.

తెలంగాణలో బడిపంతులు ఉద్యోగాలు చేసేవారు దొరలపెత్తనం కారణంగా బడిపిల్లలకు చదువు చెప్పలేకపోవడాన్ని తద్వారా పేదరికంలో ఉన్న పిల్లలను చదువు ద్వారా ఎదిగించడం సాధ్యపడదు. "నాక్కూడా తెలియకుండా చేసుకునే పనులున్నపుడే దొరనన్ను వదిలేసేవాడు. ఆ తీరిక సమయాల్లోనే నేను స్కూలు నడిపేవాన్ని. అందుకే ఆవూరిలో ఎవరికి సదువులు అబ్బలేదు. దొరకు కావాల్సింది కూడా అదే"[33] భూస్వామ్య సమాజంలో ప్రజలకు విద్య ఎలా అందకుండా చేశారో ఈ కథ తెలుపుతుంది.

## బి.ఎస్.రాములు కథల్లో గ్లోబలైజేషన్-కన్స్యూమరిజం పరిణామాలు

తెలుగు సాహిత్యంలో ప్రపంచీకరణ పరిణామాల గురించి వెలువడిన తొలి కథా సంపుటి 'వేపచెట్టు'. ఇందులోని 'అయిదవవాడు', 'చేయూత', 'మలుపులు', 'సంబంధం', 'ప్యారసైట్సు', 'వేపచెట్టు', 'కామన్‌వెల్త్' కథలు గ్లోబలైజేషన్, కన్స్యూమరిజమ్, ప్రైవేటైజేషన్ పరిణామాలను తెలియజేస్తాయి.

'అయిదవవాడు' కథలో ఫెమినిజం పేరిట కొందరు స్త్రీలు భర్తల ద్వారా పైకి వచ్చి వారి ఆసరాతో ఎదిగి మరొకరితో లేచిపోవడం, ఇతరుల జీవితాలతో ఆడుకోవడం,

తద్వారా ఇతరుల జీవితాలు కుటుంబ సంబంధాలు ఎలా విచ్ఛిన్నమవుతున్నాయో తెలుపుతుంది. సుమలత ప్రేమించిన దయానంద్‌ను, సుమలత స్నేహితురాలు శైలజ లక్నోలో కొన్ని రోజులు అతని ఆసరాతో అక్కన్నే ఉండి ఆకర్షించి, అయిదంకెల ఉన్నతోద్యోగిని పైసా కట్నం లేకుండా పెళ్ళి చేసుకుంటుంది. దయానంద్‌ను గెలుచుకుని సుమలతతో యిలా అంటుంది. "పిచ్చి సుమా! జీవితమంటే పెళ్ళి, భర్త, పిల్లలు కాదని అంతిమ లక్ష్యం మరింత ఉన్నతంగా ఉండాలని నువ్వే అన్నావు గుర్తుందా!"

'నేనన్నది ఈ సమాజం మారాలని, కుల, మత వర్గాతీత సమసమాజ నిర్మాణం అంతిమ లక్ష్యంగా ఉండాలని. అంతేగాని భర్త పిల్లల్ని కూడా కాదనేంత స్వార్థం అంతిమ లక్ష్యంగా ఉండాలని కాదు శైలూ!" సుమలతకు స్త్రీ స్వేచ్ఛ గురించి కొత్త అర్థం శైలజ చెప్పడం స్త్రీలలో కలిగే విపరీత ఆలోచన ధోరణిగా చెప్పవచ్చు.

"శైలజ అమెరికా వెళ్ళింతర్వాత ఆమె తరుపు బంధువులు ఇల్లు వదిలిపోయారు. అప్పుడు జైలు నుండి విడుదలైన వాడిలా స్వేచ్ఛగా దయానంద్ ఊపిరి పీల్చాడు. కానీ శైలజ లేని ఒంటరితనం, తనకు బాసటగా భవ్య...." భర్తను, కూతురును వదిలిన శైలజ మారుతున్న భార్యాభర్తల బాంధ్యవ్యాలకు ప్రతీకగా చెప్పవచ్చు. సుమలత భర్త రత్నాకర్ దయానంద్ పేరుతో ఆమెను పెట్టేహింస, దయానంద్ ప్రేమను తలుచుకు బాధపడే సుమలత, జీవితమంతా భార్యాభర్తల మధ్య, ప్రేమికుల మధ్య సంఘర్షణ ఎలా కొనసాగుతుందో 'అయిదవవాడు' కథలో చిత్రించారు.

అలాగే 'చేయూత' కథలో అరుణ హాస్టల్ మ్యాట్రన్ లలిత సహాయంతో పేదరికం తాలూకు ఆర్థిక పరిస్థితులను అధిగమించి ఉపాధ్యాయురాలుగా స్థిరపడుతుంది. ఈ కథ స్త్రీలకు సమానత్వం, స్వేచ్ఛ అవసరాన్ని చిత్రిస్తుంది. 'మలుపులు' కథలో కులవృత్తుల ద్వారా బతికే కుటుంబం నుండి ఉన్నత చదువు చదువుతున్న అరవింద్, తనకన్న పై స్థాయి రాధతో పెళ్ళి కాలేకపోవడం, బాధతో ఇలా అనుకుంటాడు. "తన లాంటి వాళ్ళకు అటు పూర్తి పైస్థాయి రాధతోనూ పెళ్ళి వీలు కాలేదు, ఇటు పూర్తిగా కిందిస్థాయి సావిత్రితోనూ పెళ్ళి కాలేని స్థితి. ఎందుకిలా జరుగుతోంది. పెళ్ళికి మనిషి యిష్టాయిష్టాల ప్రమేయం లేదా!" ప్రతివర్గంలోనూ, ప్రతి కులంలోనూ తనకన్న పై స్థాయిలో ఉన్నవారికి చేరుకోవాలనే తపన ఉండడం సహజమే. జీవితంలో వాటి పర్యవసానాలు ఎలా ఉంటాయో ఈ కథలు తెల్పుతాయి.

'సంబంధం' కథలో పెళ్ళి సంబంధాల పట్ల మారుతున్న ఆలోచన విధానం, గ్లోబలైజేషన్ ప్రభావం చూడవచ్చు. ప్రాణ స్నేహితులైన కరుణాకర్, ఎల్లయ్య చాలా ఏళ్ళ తరువాత ఫోన్‌లో మాట్లాడుకుంటారు. పట్టణంలో కరుణాకర్ తన కూతురుకు పెళ్ళి సంబంధం చూడమనే అవసరం ఎల్లయ్యను గుర్తుచేసుకొనేట్టు చేసింది. ఎల్లయ్యకు ఫోటోలు పంపిస్తే వెతకడం ప్రారంభిస్తాడు. ఎల్లయ్య తన కొలీగ్ రాజేశ్వర్‌తో ఇలా అంటాడు. "మొత్తానికి పెళ్ళి కూడా ఉద్యోగం తీరే అప్లికేషన్లు, బయోడేటాలమయమై పోయింది" అన్నాడు ఎల్లయ్య నవ్వుతూ.



"పెళ్ళి అనేది ఉద్యోగం కన్నా ఎక్కువ కదా బావా!, ఉద్యోగాలు ఎన్నైనా చేయొచ్చు వదిలేయొచ్చు. నచ్చని ఊరైతే ట్రాన్స్‌ఫర్ చేయించుకోవచ్చు. ఈ పెళ్ళి సంబంధాల్ని, వారి బంధువుల్ని అలా చేయలేం గదా. అందుకని ఉద్యోగానికి కావాల్సిందాని కన్నా ఎన్నోరెట్లు వివరాలు ఇంటర్వ్యూలు, జాగ్రత్తలు అవసరం.

"మ్యారెజెస్ ఆర్ మేడిన్ కట్నం, కులం, స్టేటస్, జాబ్ అన్నది ఇప్పుడు మన జీవితాల్లో ఆచరణకొస్తున్నది" అన్నాడు ఎల్లయ్య. పెళ్ళి సంబంధాలు బంధువుల ద్వారా, సొంత ఊరివారి సమాచారాలతో జరిగే పరిణామాలనుండి, కంప్యూటర్ బయోడేటాల సహాయంతో మ్యారెజ్ బ్యూరోలు, స్నేహితుల ద్వారా జరగడం గ్లోబలైజేషన్‌లో భాగంగా ఎలా కన్స్యూమరిజమ్‌లో భాగంగా మారుతున్నామో ఈ 'సంబంధం' కథ ద్వారా తెలుసుకోవచ్చు.

'ప్యారసైట్లు' కథ పిల్లలు టీవీలకు అతుక్కుపోయి కోల్పోతున్న మానవ సంబంధాల స్పర్శ లేమి, బడాయిలకు పోయే తల్లి, చివరకు తన పిల్లలతో ఎదుర్కొన్న భంగపాటు గ్లోబలైజేషన్ పరిణామాలు కుటుంబంలోకి, సంస్కృతిలోకి ఎలా చొచ్చుకువచ్చాయో చిత్రిస్తుంది.

"సౌందర్య వాళ్ళ నాన్న చనిపోయాడని వెంటనే రమ్మని ఫ్రెండింటికి ఫోన్ రావడంతో హుటాహుటిన తయారయ్యాడు శ్రీకాంత్.

అతుల్, హిరణ్‌లు టీవీల వద్ద కూర్చున్నారు. "తొందరగా రెడీ అవ్వండి" అని తొందర పెట్టాడు శ్రీకాంత్.

"సారీ డాడీ! క్రికెట్ మ్యాచ్ నడుస్తుంది. పైగా డేంజరస్ డెవిల్ సీరియల్ మిస్సవుతుంది. మేం వంట చేసికొంటాం లేదా సతీష్ వాళ్ళ యింట్లో భోంచేస్తాం మీరు వెళ్ళండి" అన్నాడు అతుల్.

శ్రీకాంత్‌కు ఆశ్చర్యం వేసింది. తాతయ్య చచ్చిపోయాడన్న బాధే లేదేంటి వీరికి. ఒరేయ్! మిమ్మల్ని గుండెల మీద ఎక్కించుకుని ఆడించాడ్రా తాతయ్యా! నీ పురిటి ఖర్చులు పెట్టి గోల్డ్‌చైన్ పెట్టాడ్రా" అరిచాడు శ్రీకాంత్.

"అయితే ఏంటి డాడీ! చచ్చిపోయిన తాతయ్య మేం వచ్చామని చూడరాడు గదా! మీరే వెల్లండి" అన్నాడు అతుల్.

"చచ్చిపోయిన వాళ్ళంటే నాకు చాలా భయం డాడీ! చచ్చిపోయాక తాతయ్య డేంజరస్ డెవిల్ సీరియల్‌లోలా మారతాడా డాడీ! భయపడ్తూ అడిగాడు హిరణ్" అంటూ పిల్లలు ప్రేమ ఆప్యాయతలు తెలియక టీవీలు చూస్తూ సోమరిపోతులుగా మారడం, తల్లిదండ్రులపట్ల గౌరవం లేక వారి ప్రవర్తనలో కలిగిన మార్పును 'ప్యారసైట్లు' కథలో చూడవచ్చు. అలాగే "వేపచెట్టు" కథలో మైసయ్య కొడుకు మహేష్ తెలివైన విద్యార్థి అయి ఉండి ప్రైవేటు చదువులు, కోచింగ్‌లకు డబ్బు పెట్టుబడిగా పెట్టలేక మేస్త్రీ పని చేస్తుంటాడు.

వెంకట్రావు దొర చిన్న కొడుకు రాజేశ్వరరావు ఉన్నత చదువులు చదివి అమెరికాలో సెటిలవుతాడు. మహేష్‌కు చదువు చెప్పిన గురువులు సుగుణాకర్, ఆంజనేయులు, మహేష్‌ను కొడుకులా భావిస్తారు. ఆర్థిక పరిస్థితి అందించలేక బాధపడుతూ "మహేష్ కూడా ఒక వేపచెట్టు, ఒక కలబంధ మొక్క. అతని శక్తిసామర్థ్యాలు మనం గుర్తించడం లేదు. గ్లోబలైజేషన్‌లో భాగంగా లేదా ప్రైవేటైజేషన్‌లో భాగంగా అతని మీద పేటెంటు హక్కులు తీసుకుని అవన్నీ వెలికి తీసి వినియోగంలోకి తెచ్చే మానవ వనరుల శాఖ ఉంటే ఎంత బాగుండు. అపుడు మహేష్ కూడా రాజేశ్వరరావు లాగే మన పిల్లల్లాగే ఎదుగుతాడు అన్నాడు ఆంజనేయులు" అంటూ ప్రైవేటైజేషన్ అగ్రకులాల ఎదుగుదలకు ఎలా తోడ్పడుతుందో, పీడిత కులాలకు ఎలా శాపంగా మారుతుందో తెల్పుతుంది.

"కామన్‌వెల్త్" కథలో ఎల్లాకర్ మధ్యతరగతికి ప్రతినిధిగా గ్లోబలైజేషన్, అమెరికా సామ్రాజ్యవాద ప్రభావంతో భారతదేశంలోని ప్రజలలో కలిగే ఆలోచన మార్పులను తెల్పుతాడు. విజయలక్ష్మి భర్త పోషేందర్ తాగుబోతై మరణిస్తే సాటి స్త్రీ శారద మాటల్లో "పదకొండో రోజునాడు విజయలక్ష్మి బొట్టు, గాజులు, మట్టెలు పగులగొట్టి తెల్లచీర కట్టిస్తుంటే మా శారద మరో యిద్దర్ని వెంటేసుకుని అది దుర్మార్గం అన్నది. బొట్టు మొగునితోని రాలేదు. గాజులు మొగునితోని రాలేదన్నది. మంగళసూత్రం, మట్టెలు తీసేస్తే తీసేయిన్రి అని వాదనకు దిగింది" అంటూ సాంప్రదాయాన్ని బద్దలుకొట్టే కొత్త ఆలోచన ధోరణిని చూడవచ్చు. భర్త ఆస్థిలో వాటాను, పెన్షన్‌ను అనుభవిస్తున్నప్పుడు అతని జ్ఞాపకాలను కూడా జీవితాంతం అలాగే ఉండేలా చట్టం తేవాలనే, తర్కంతో చేసే ఎల్లాకర్ చర్చ ఆసక్తికరంగా ఉంటుంది.

అలాగే మానవ సంబంధాల్లో వస్తున్న మార్పులు, అమెరికాలో ఉద్యోగాలు చేయడం, భర్త చనిపోయిన తరువాత ఇతరులతో లైంగిక సంబంధాలు పెట్టుకుంటూనే పిల్లల ఎదుగుదల కోసం తల్లి కృషి చేయడం, ఆ పిల్లలు ఎదిగి అమెరికాకు వెళ్ళిపోయాక అంతదాకా దూరంగా ఉన్న వాళ్ళే తమ పిల్లనిద్దామని అర్రులు చాచడం, వైవాహికేతర లైంగిక సంబంధం పెట్టుకున్నాయన తన భార్యా పిల్లలతో పాటు ఆమెతోను, ఆమె పిల్లలతోనూ ఎంతో ఆత్మీయంగా ఉండి అందరి మెప్పును పొందడం వంటి సంక్లిష్ట విషయాలను మారుతున్న లైంగిక సంబంధాలను అమెరికా అభివృద్ధిని ఈ "కామన్వెల్త్" కథలో చిత్రించారు.

భార్య సాధనను వొదిలిన రాజేశ్వర్, భర్తను కోల్పోయిన విజయలక్ష్మి, కొన్ని రోజులుగా ఎవరికి తెలియకుండా కలుసుకుని అక్రమ సంబంధం పెట్టుకొని జీవితం వెళ్ళదీస్తారు. ఎల్లాకర్, బావ వెంకులు సహాయంతో కలిసి ఉండటం, విజయలక్ష్మి పిల్లలను తన పిల్లలుగా చూసుకోవడం, తల్లిగారింట కొన్నిరోజులు ఉండి తన తప్పు తెలుసుకొని రాజేశ్వర్‌తో సాధన కలుస్తుంది. "ప్రపంచీకరణ నేపథ్యంలో వేపచెట్టు" కథల సంపుటి గూర్చి ముందుమాటలో ప్రఖ్యాత సాహితీవేత్త డా॥ అంబటి సురేంద్ర రాజు ఇలా అంటాడు.



"విజయలక్ష్మి – రాజేశ్వర్, సాధనల మధ్య రచయిత చూపిన సంబంధం అన్ని కుటుంబాలలో సాధ్యపడేది కాదు. అభివృద్ధి చెందని ప్రాంతానికి, ఆధిపత్య స్థానంలో లేని కులాలకు చెందిన వారు కావడం మూలంగానే ఎల్లాకర్ ఈ ముగ్గురి మధ్య చేసిన మధ్యవర్తిత్వం ఫలించింది. గ్లోబలైజేషన్ మీద ఎల్లాకర్ చేసిన చర్చ కూడా తన మధ్య తరగతి స్థితికి, పాత్ర పోషణకు అనుగుణంగా సాగిందే తప్ప వాస్తవ పరిస్థితిని పరిగణనలోకి తీసుకుని కాదు. కులవ్యవస్థ వలన లబ్ధి పొందడమేగాక అతి సహజంగా గ్లోబలైజేషన్ ఫలాలను సైతం పొందుతున్న అగ్రకులాలు గ్లోబలైజేషన్ శ్రామిక కులాలకు ఒక నాటికి మంచి చేస్తుందని ఎల్లాకర్ పాత్ర ద్వారా రచయిత చెప్పించడం అతివ్యాప్తి అనాలి" అంటూ అక్రమ లైంగిక సంబంధాలు, పిల్లలు వారి పట్ల కలిగే అనుబంధాల మార్పులు, అగ్రకులాలలో సాధ్యపడదని, గ్లోబలైజేషన్ వ్యతిరేకించే శక్తులు వారి ప్రయోజనాలు, అణగారిన కులాలకు ఉపాధి లేకపోవడం, కులవృత్తులు పోయి, జీవన విధానం మారి, చదువుకున్న చదువుకు సరియైన ఉద్యోగం దొరక్కపోవడం, ప్రపంచీకరణ ప్రభావం వస్తువ్యామోహంతో భూమి, నీరు దోపిడికి గురౌతుంది. బతుకు కూడా ఒక వనరుగా మనకు తెలియకుండానే దోపిడీకి గురౌతుందని ఈ "కామన్‌వెల్త్" కథలో స్పష్టంగా తెలుస్తుంది."

## బి.ఎస్.రాములు కథల్లో సోవియట్ రష్యా పతనం తరువాత సోషలిస్ట్ దృక్పథం–చరిత్ర

రెండవ ప్రపంచయుద్ధం ముగిసిన తరువాత అప్పటిదాకా అగ్ర రాజ్యాలుగా ఉన్న జర్మనీ, ఇంగ్లాండ్ వంటి యూరప్ దేశాలు జపాన్ లాంటి ఆసియా దేశాలు యుద్ధం వల్ల ఆర్థిక భారంతో వాటి ఆర్థిక వ్యవస్థ శిథిలం అయిపోతుంది. ఆ సమయంలో తటస్థంగా ఉంటూ యుద్ధాల వల్ల నష్టం లేకపోగా, ఆ యుద్ధాల వ్యాపారం చేసి లాభపడిన అమెరికా అగ్రరాజ్యంగా ఎదగడం ప్రారంభం అయింది. రవి అస్తమించని బ్రిటీష్ సామ్రాజ్యం తన వలస దేశాలను, తన దేశం స్థాయి పరిపాలనా వ్యయంతో పరిపాలించడం పెనుభారంగా పరిణమించింది. దీనికి తోడు రెండవ ప్రపంచ యుద్ధకాలంలో అనేక దేశాలలో యుద్ధానికి సహకరిస్తే, మీ దేశాలకు స్వాతంత్ర్యం యిస్తామని అప్పటి జాతీయోద్యమ నాయకులకు హామీలిచ్చి, వారి సహకారం తీసుకొని ఉంటారు. తద్వారా రెండవ ప్రపంచ యుద్ధకాలంలో వలసదేశాల్లో చైనాలోలాగా వలసవాద దేశాలకు వ్యతిరేకంగా అంతర్యుద్ధాలు జరగలేదు. దానివల్ల శాంతియుత పరివర్తనలో భాగంగానే నాగరిక పద్ధతుల్లో ఆయా దేశాల జాతీయోద్యమాలకు అధికారాన్ని అప్పగిస్తూ ఇంగ్లాండ్, ఫ్రాన్స్ దేశాలు తప్పుకొన్నాయి.

అట్లా 1932 నుండి బ్రిటన్ భారతదేశంలో ప్రజలకు అధికారాన్ని పరిపాలన వ్యవస్థను అప్పగిస్తూ, అందుకు తగిన శిక్షణనిస్తూ, పాలనా సాంప్రదాయాలను నెలకొల్పుతూ వస్తుంది. రెండవ ప్రపంచ యుద్ధం తరువాత ఇంగ్లాండ్‌లో, ఎన్నికల్లో అప్పటి ప్రభుత్వం మారింది. లేబర్ పార్టీ "వలస దేశాలకు స్వాతంత్ర్యం యిస్తాం" అనే

నినాదంతో గెలిచింది. లేబర్ పార్టీ ప్రధాని అట్లీ నాయకత్వంలో వలసదేశాలు స్వాతంత్ర్య దేశాలుగా మారడానికి తగిన చర్యలను చట్టపరంగా తీసుకొన్నారు. అలా భారతదేశం 1947 ఆగస్టు 15వ తేదీన స్వతంత్ర్య దేశం అయింది.

బ్రిటీష్ వారి కాలం నుంచి భారతీయ పారిశ్రామిక అభివృద్ధి జౌళిమిల్లుల అభివృద్ధి వేగం పుంజుకుంది. మహారాష్ట్ర, గుజరాత్ ప్రాంతాలలో ఈ పరిశ్రమలు కేంద్రీకరించబడ్డాయి. అందువల్ల చేనేత కార్మికులు తమ వృత్తి వదిలి బొంబాయి, అహ్మదాబాద్, సూరత్ మొదలైన ప్రాంతాలకు వలసలు పోయారు. తెలంగాణ ప్రాంతం నుంచి లక్షలాది చేనేత కార్మికులు అలా వలస వెళ్ళి చేతివృత్తి కళాకారుల స్థాయి నుండి కార్మికులుగా మారిపోతారు.

మహాత్మ జ్యోతిరావు పూలే, నారాయణలోఖండే స్థాపించిన సత్యశోధక ఉద్యమం వీరి సమస్యలను పట్టించుకుని పని గంటల తగ్గింపును, కూలీల పెంపును డిమాండ్ చేసి సాధించుకొన్నాయి. ఈ వలస ప్రస్థానంలో తెలంగాణలో సృష్టించిన సామాజిక పరిణామాలను 'వరుసలు', 'మమతలు', 'వారసత్వం' కథలలో ఇలా చిత్రించారు.

"వరుసలు" కథ వ్యవసాయం, కులవృత్తులను వదిలి పారిశ్రామిక అభివృద్ధి వైపు పయనిస్తున్న సమయం. 'మిల్లు నూనె ప్రవేశంతో గానుగ వ్యాపారంతో రాజాలా బతికిన కుటుంబాలు కొత్త వృత్తులు వెతుక్కోవాల్సివచ్చింది. వారికి బట్టలు నేయడం అనేది ఎపుడో మానేసిన కులవృత్తి. ఏ వ్యాపారమూ, వ్యవహారమూ తోచక, చెప్పేవారు లేక పదిమంది దాకా బొంబాయి బట్టల మిల్లుల్లో కార్మికులుగా చేరారు. ఆ కాలంలో టీచర్లకన్నా, ఎన్జీవోలకన్న బట్టలమిల్లు కార్మికులకే గిట్టుబాటు ఎక్కువ"[43] వ్యవసాయం తరువాత పరిశ్రమలు అభివృద్ధి చెందిన క్రమంలో కార్మికులుగా చేనేత కులవృత్తులు వదిలి వలసలు పోయారు. వ్యవసాయం, గానుగల వారి జీవితాన్ని బాగుపరుచుకోవడానికి పారిశ్రామిక అభివృద్ధి, జౌళిమిల్లులు తోడ్పడ్డాయి.

"ఉన్న ఊరు మీద మమకారం ముఖ్యంగా మిల్లు కార్మికులుగా కోల్పోయిన స్వేచ్ఛ వ్యవసాయపనుల్లో అంతా తమ ఇష్టం. పెదనాన్నలు యిలా ఆలోచించి ఇల్లు చేరినా ఆ తర్వాత ఇంట్లో వెళ్ళక నగదు చూసిన కన్ను భీవండి వెళ్ళక తప్పలేదు. భీవండిలో ఏ కార్మిక చట్టాలూ, రక్షణలు ఉండవు కూలీ తప్ప."[44] ఉన్న ఊరు వదిలి ఉపాధి వెతుక్కుంటూ వెళ్ళిన వారి వలస జీవితాల వ్యధలను తెలుపుతుంది. మిల్లు పరిశ్రమల్లో కార్మికులు పనిగంటలు తగ్గించాలని, కూలీలు పెంచాలని డిమాండ్ చేసి సాధించుకున్నారని తెలుసుకోవచ్చు. ఇక్కడే ఉంటూ విద్య ద్వారా ఎదిగిన వారు మధ్య తరగతిగా ఎదగడానికి సాధ్యపడింది. 'వరుసలు' కథలు ద్వారా వ్యవసాయం యొక్క సామాజిక ప్రాధాన్యత తగ్గిపోతూ పారిశ్రామికరణ, విద్య ప్రాధాన్యత పెరుగుతున్న క్రమాన్ని పేర్కొంటుంది.

'మమతలు' కథలో సరవ్వా, కాంతయ్యలు ఒకే స్థల కాలాలలో పుట్టి పెరిగినా ప్రేమ విఫలం కావడానికి కారణం పారిశ్రామిక అభివృద్ధేనని కథలో చిత్రించారు.



పారిశ్రామిక అభివృద్ధి వలన రిజర్వేషన్లలో మార్పులు వచ్చాయి, చదువుకున్న యువకులు ఎస్సీ, ఎస్టీల రిజర్వేషన్లు పోగా మిగిలిన బి.సి. కులాలకు రిజర్వేషన్ల ద్వారా అందాల్సినదంతా అగ్రకులాలకు ఎలా చేరుతుందో తెలుపుతూ...

"సరూ.... అరవై ఏళ్ళుగా మీరనుభవిస్తున్న ఉద్యోగ విద్యావకాశాల్లో అధిక శాతం మాకు అందకుండా లాక్కున్నవే. జనాభా నిష్పత్తిలో 1932లో పూనా ప్యాక్టుతో పాటు బీసి రిజర్వేషన్లు కూడా అమలయి ఉంటే మీకీ ఆధిక్యత అవకాశాలెక్కడివి. మీ ఆయన కన్నా ఉన్నత స్థాయిలో నేనుండే వాడినికదా"[45] 1932వ సంవత్సరం నుండి రిజర్వేషన్లు అందాల్సి ఉండగా కమీషన్ల మీద కమీషన్లు వేసి సంవత్సరాలు గడుస్తున్నవి. తద్వారా బీసీలకు అందాల్సిన రిజర్వేషన్లు లేక అగ్రకులాలే అనుభవిస్తున్నారు. కుల వృత్తులపై ఆధారపడ్డ ఎస్సీ, బీసీ కులాలు వెనుకబడిపోయాయి. స్త్రీలకు మూడోవంతు రిజర్వేషన్లు కావాలని, పార్లమెంటులో చట్టం తేవడం వెనుక చర్చ చేసిన వారు, బీసీలకు రిజర్వేషన్లు కావాలని అడిగిన రామమనోహర్ లోహియా వారసుల్ని స్త్రీ వ్యతిరేకులుగా చిత్రించడం వెనుక అగ్రకుల స్వార్థం ఉందని తెలుపుతుంది.

'వారసత్వం' కథలో గంగరాజం అనే స్వాతంత్ర్యం సమరయోధుడు అనేక ఉద్యమాలలో పాల్గొన్నవాడు. తెలంగాణ సాయుధ పోరాటం, స్వాతంత్ర్యం ఉద్యమాలను, స్వాతంత్ర్యం తరువాత ఖాదీ ఉద్యమం, చేనేత సహకార సంఘాల నిర్మాణాన్ని కొనసాగించిన వాడు. చేనేత కార్మికుల చైతన్యం వల్ల గాంధీజీ కాంగ్రెస్ జెండాకు రాట్నం చిహ్నాన్ని చేర్చి, స్వదేశీ ఉద్యమం, జాతీయోద్యమాన్ని నిర్వహించాడు.

భారతదేశం స్వతంత్ర దేశంగా ఏర్పడ్డాక కూడా దేశంలో 550 పైచిలుకు సంస్థానాలు అలాగే మిగిలిపోయాయి. ఇంగ్లాండు కన్న పెద్దదైన, ప్రపంచంలో మూడవ సంపన్న రాజ్యంగా ఉన్న నైజాం రాజ్యం స్వతంత్ర దేశంగా ఉండాలని నిజాం రాజు అభిలషించాడు. 1968లో బ్రిటీష్ ఆంధ్ర ప్రాంతాన్ని యుద్ధ వ్యయం క్రింద నైజాం రాజు బ్రిటీష్ ప్రభుత్వానికి అప్పగించడం వల్ల నిజాం రాజ్యానికి సముద్రతీరం లేకుండా పోయింది. 1948లో ఇండియాకు వ్యతిరేకంగా నైజాంరాజు ఐక్యరాజ్యసమితిలో దరఖాస్తు చేసుకొన్నప్పటికి అతని కోరిక నెరవేరలేదు. సరిగ్గా యిదే సమస్యపై జమ్మూ-కాశ్మీర్ సమస్య కూడా ఐక్యరాజ్యసమితిలో చర్చనీయాంశం అయింది. అయితే అది సరిహద్దు ప్రాంతంలో ఉండడంవల్ల అంతర్జాతీయ సమస్యగా యిప్పటికి ప్రపంచం దృష్టిని ఆకర్షిస్తూనే ఉంది.

నిజాం రాజ్యం అలా కాకుండా సైనికచర్య చేపట్టి, 1948 సెప్టెంబర్ 13 నుండి బ్రిటీష్ పరిపాలన వారసత్వాన్ని స్వీకరించిన భారత పాలక వర్గం యుద్ధాన్ని ప్రకటిస్తుంది. సెప్టెంబర్ 17 తేదీన నిజాం రాజు సంధి కుదుర్చుకొని తొలగిపోతాడు. అందువల్ల ఈనాటికి సెప్టెంబర్ 17, 1948 తేదీన హైదరాబాద్ విమోచన దినంగా జరుపుకుంటున్నాం.

సుమారు 200 సంవత్సరాలు బ్రిటీష్ అధికారం భారతదేశంలో కొనసాగడానికి

ప్రత్యక్షంగా, పరోక్షంగా సహకరించిన సంపన్న నైజాం రాజ్యం తన స్వంత ఉనికిని యిచ్చును చాటుకొంటూనే ఉంది. 1948 సెప్టెంబర్ 17 నుండి 1956 అక్టోబర్ 31 వరకు నైజాం ప్రాంతం స్వతంత్ర రాష్ట్రంగా స్వంత ఉనికిని, అభివృద్ధిని,స్వతంత్ర పరిపాలన వ్యవస్థను ఏర్పరచుకొని అభివృద్ధి చెందింది. 1956 నవంబర్ 1వ తేదీ నుండి నైజాం ప్రాంతంలోని తెలంగాణ తన స్వతంత్ర ఉనికిని కోల్పోయింది. సమైక్య రాష్ట్రం పేరుతో అంతర్గత వలస ప్రాంతంగా మార్చబడి సహజ వనరులు, ఉద్యోగాలు, ఆర్థిక సంపద కొల్లగొట్టబడింది. ఆర్థిక సంక్షోభంలో దిన దిన గండం నూరేళ్ళ ఆయుష్షుగా కర్నూలు రాజధానిగా మనుగడ సాగిస్తున్న ఆంధ్ర రాష్ట్రం, ఆంధ్రప్రదేశ్ ఏర్పడ్డాక నైజాం ప్రాంతంలోని సంపదను, ఉద్యోగాలను, జలవనరులను, ప్రభుత్వ కార్యాలయాలను చివరకు 350 ఏళ్ళ చరిత్ర కల్గి, ప్రపంచ ప్రసిద్ధి పొందిన హైదరాబాద్ నగరాన్ని కూడా వలసలకు, ఆశ్రయానికి, దోపిడీకి నిలయంగా కోస్తా, ఆంధ్ర వారు మార్చుకున్నారు. ఈ పరిణామాల్ని 'దక్షయజ్ఞం' కథలో చిత్రించారు. 'రాజకీయం' కథలో దీని తరువాత పరిణామాల్ని చిత్రిస్తూ, కుల వృత్తుల వల్ల రాజకీయాలు, అధికార సమస్యలు తెలియక వెనుకబడి పోయిన వారి బాధలను చూడవచ్చు.

"కులవృత్తుల్లో ఉండిపోయినపుడు రాజకీయాల, అధికార సమస్య మనకు సంబంధించి కాదనుకున్నాం. అందువల్ల జాతీయోద్యమం కన్నా బలంగానే కుల సంఘాల ఉద్యమాలు నడిచినా రాజకీయలక్ష్యం లేకపోవడం వల్ల జాతీయోద్యమంలో భాగంగా చరిత్రకెక్కలేదు" అంటూ జాతీయోద్యమంలో కులం పాత్రను, స్వాతంత్ర్యానంతరం ఆయా రాష్ట్రాలలో ఒక్కొక్క కులం అధికారంలోకి రావడానికి గల కారణాలు "వారసత్వం" కథ తెలుపుతుంది. తెలుగుదేశం ప్రభుత్వం జాతీయ రాజకీయాలకు ఎగబాకడం వెనుక అనేక పరిణామాలను తెలుసుకోవచ్చు.

**బి.యస్. రాములు కథల్లో స్త్రీలు ఎదుర్కొంటున్న సమస్యలు పరిస్థితులు-పరిణామాలు**

జనాభాలో స్త్రీలు సగం. కానీ బి.ఎస్.రాములు గారి కథల్లో స్త్రీలే హెచ్చు భాగం. స్త్రీల ద్వారా పిల్లల సమస్య ముందుకొస్తుంది. స్త్రీల ద్వారా పురుషుల సమస్య ముందుకొస్తుంది. స్త్రీలకు ప్రత్యేకమైన భాష, అభివ్యక్తి ఉంటుంది. స్త్రీల భాషలో, అభివ్యక్తిలో ఆత్మీయత, ఆర్ద్రత వుంటాయి. స్త్రీల హావభావాలు ప్రత్యేకంగా వుంటాయి. స్త్రీల సమస్యలు స్త్రీల దృష్టి కోణం ప్రత్యేకంగా వుంటుంది. ఒకే కుటుంబంలో జీవించినప్పటికీ స్త్రీల దృష్టి వేరు, పురుషుల దృష్టి వేరు. వీటన్నిటినీ బి.ఎస్.రాములు గారు ఎంతో చక్కగా కథల్లో చిత్రించారు. తల్లిసాలు పిల్లడుగా స్త్రీల మధ్య పెరగడం వల్ల స్త్రీల గురించి ఆత్మీయంగా, ఆర్ద్రంగా రాయడం సులువైంది.

పాలు కథలో పిల్లల పట్ల తల్లి ఆర్తి కనిపిస్తుంది. సహజాతాలు కథలో తన క్లాసుమేటు పిల్లల పట్ల తల్లి తనంలో వుండే ఆర్ద్రత కనిపిస్తుంది. స్మృతి కథలో కష్టాలను ఈది గట్టెక్కిన కస్తూరి దుబ్బవ్వలోని మనసు నిండిన తల్లితనం కనపడుతుంది. బందీ



కథలో ట్యూషన్ చెప్పించుకొన్న తల్లి ట్యూటర్ పట్ల ఒక తల్లిగా, ఆత్మీయంగా చూసుకున్న ఆర్ద్రత చూడవచ్చు. వైరుధ్యాలు కథలో పిల్లల కోసం మనం కుటుంబంగా జీవించాలనే ఇల్లాలు విప్లవం చేస్తూ కూడా కలిసి కుటుంబంగా జీవించాలనే ఆర్తి కనపడుతుంది. ఇల్లాలు కథలో మూడు తరాల స్త్రీలు విప్లవంలో చేసిన త్యాగాల ఫలాలు చరిత్ర కాకుండా పోయిన క్రమాన్ని చూడవచ్చు. దక్షయజ్ఞం కథలో విప్లవ కారుడి చెల్లెలు పడిన కష్టాలు, కన్నీళ్ళు కంటతడి పెట్టిస్తాయి. తల్లిసాలు పిల్లడు కథలో తల్లి పట్ల పిల్లలకు గల ప్రేమతో తల్లి తన జీవితాన్ని త్యాగం చేసిన తీరు జీవితమంత సత్యంగా సాక్షాత్కరిస్తుంది. ప్రేమ, మాయ కథల్లో విద్యార్థినులు యువతరం ఆడపిల్లలు ఆలోచిస్తున్న తీరును చూడవచ్చు. మెరుగు, తెల్లబట్ట కథల్లో స్త్రీల జీవితాలు, పురుషుల సమాజంలో పొందుతున్న పరిణామాలను చిత్రించారు. చెలిమ కథలో స్త్రీలకు రాజకీయ అధికారం వస్తే ఆలోచించే తీరు ఎలా మారుతుందో తెలుపుతుంది.

పాతచీర కథలో ఇల్లాలు స్త్రీలు ఎదుర్కొనే సమస్యలు చిత్రించారు. వరుసలు కథలో మేనమరదలు తన ప్రమేయం లేకుండానే కోల్పోయిన జీవితాన్ని, పొందిన చైతన్యాన్ని చిత్రించారు. తప్పటడుగులు వేసినప్పటికీ జీవితాన్ని తిరిగి ఎలా గెలుచుకోవచ్చో వేదవతి కథలో చిత్రించారు. ముసలి తల్లి ఎదుర్కొనే బాధలను తులసి కథలో చూడవచ్చు. అన్నదమ్ముల స్వార్థంతో చెల్లెలు జీవితం అన్నదమ్ముల కన్నా వెనుకబడి పేదరాలిగా మిగిలిపోయిన క్రమం వరలక్ష్మి కథలో చూడవచ్చు. తల్లిపాలు కథలో తల్లిలోని కృతజ్ఞతా భావాన్ని చూడవచ్చు. మమతలు కథలోని సరవ్వలో ఒక గొప్ప ప్రేమికురాలు, తల్లితనం గల ఒక గొప్ప ఫెమినిస్టును చూడవచ్చు. ఆమె తన చిన్ననాటి స్నేహితున్ని ఎదిగించడంలో పడే ఆవేదనను గమనించవచ్చు. సహజీవనం కథలో స్త్రీల ఆలోచనకు, పురుషుల ఆలోచనకు ప్రతిసారీ జరిగే సంఘర్షణ ఎలా వుంటుందో చూడవచ్చు. అయిదవ వాడు కథలో కొందరు స్త్రీలు, మరికొందరు స్త్రీల పురుషుల జీవితాలతో ఎలా ఆడుకుంటూ విషాదం నింపుతారో తెలుపుతుంది. ఆధునిక యువతులు పల్లెలను ప్రేమించడం లేదని పట్టణ జీవితాన్ని ఇష్టపడతారని వారసత్వం కథ తెలుపుతుంది.

చేయూత కథలో అభివృద్ధినందుకోవడంలో స్త్రీలు ఎదుర్కొనే అదనపు కష్టాలను చిత్రించారు. కామన్‌వెల్త్ కథలో స్త్రీలు వారి అవసరాలు ఎలా వుంటాయో చిత్రించారు. ఇలా అనేక కోణాల్లో స్త్రీల సమస్యలను కథల్లో సామాజిక చరిత్రగా అక్షర బద్ధం చేశారు.

బి.ఎస్.రాములు కథల్లో అగ్రకుల స్త్రీలు, దళిత బహుజన స్త్రీలు ఎదుర్కొంటున్న సామాజిక పరిస్థితులు, రాజ్యహింసకు బలౌతున్న తీరు, కుటుంబ జీవితంలోని సంఘర్షణ, స్త్రీలు పోరాడి గెలుచుకున్న జీవితాలు, ఎదగాల్సిన క్రమంలో ఓడిపోయిన స్త్రీల బాధలు, ప్రేమలు, పెళ్ళి సంబంధాలు, వరకట్న సమస్య, సామాజిక అసమానతలకు స్త్రీలు బలౌతున్న తీరు చదువులు, ఉద్యోగ జీవితాలు, మారుతున్న పరిస్థితులలో స్త్రీలు ఎదుర్కొంటున్న సమస్యలు మొదలైన అంశాలను కథల్లో చూడవచ్చు.

'స్మృతి' కథల సంపుటిలో 'స్మృతి', 'వైరుధ్యాలు', 'ఇల్లాలు' 'దక్షయజ్ఞం', 'తల్లిసాలు పిల్లడు', 'మెరుగు', 'తెల్లబట్ట', 'చెలిమ' కథల్లో స్త్రీల ఆలోచన విధానం మారుతున్న తీరు, స్త్రీల హృదయాలలో అంతర్గత సంఘర్షణ, అక్రమ లైంగిక సంబంధాలు, వస్తు వ్యామోహం, ఉద్యమ జీవితం పట్ల భార్య, భర్తల మధ్య అంతర్గత సంఘర్షణ, భర్తలను కోల్పోయిన స్త్రీల బాధలు చిత్రితమయ్యాయి.

'స్మృతి' కథలో కొక్కుల దుబ్బక్క దళిత బహుజన స్త్రీలపై భూస్వామ్య వ్యవస్థలో దొరలు, పట్వారీ, పటేండ్ల అరాచకాలను, అత్యాచారాలను ఇలా తెల్పుతుంది. "మంచిగ అంటే మంచిగనే చేస్తరు. ఊరోల్లందరు గల్సి దొరల పట్వారి, పటేలు యిండ్లల్ల బతుకమ్మలు తీసుకొని ఆడుటానికి పోవాలే. అన్లకెల్లి మంచిగ కనపడ్డోల్లను వాల్లు ఎపుడు యింటికి పిలిసి పట్టెమంచం ఎక్కుమంటరో తెలువది.... గొడ్ల కొట్టంలోనో, పెరట్ల మంచెలకాడనో, ఎక్కడికి గుంజుకపోతరో తెల్వది.... మంచి చీరె కట్టుకోను భయం...."[49] ఆనాటి సమాజంలో సంపదలను సృష్టించే దళిత బహుజన స్త్రీల దైన్యాన్ని తెలుపుతుంది.

'దక్షయజ్ఞం', 'వైరుధ్యాలు', 'ఇల్లాలు', 'మెరుగు', 'తెల్లబట్ట' కథలు తెలంగాణ నక్సలైట్ ఉద్యమ జీవితంలో స్త్రీలకు ఎదురైన కష్టాలను చిత్రించాయి. ఇప్పటివరకు నక్సలైటు ఉద్యమ జీవితంలో ఎక్కువగా ఉద్యమ కార్యకర్తల పోరాటాలనే హైలెట్ చేస్తూ సాహిత్యం వచ్చింది. కాని ఇంటి వద్ద కుటుంబాన్ని పోషిస్తూ అనేక నిర్బంధాలకు స్త్రీలు ఎలా బలౌతున్నారో ఇవి తెలుపుతాయి.

'వైరుధ్యాలు' కథలో ఉద్యమంలో పూర్తికాలం కార్యకర్తగా మారడానికి భర్త భూమయ్య, భార్య సుశీలతో తీవ్ర చర్చ చేస్తాడు.

"ఎట్లా? యిగో గీపిలగాన్లతోటి గిట్లనే కలిసి వుండాలె?"

"గట్లయితే ఎట్లనే? యిగమరి యీసమాజాన్ని మార్చుడెట్లనే?"

"గవన్నీ నాకు తెలువయి. గీల్లను సాదుకుంట ఏమన్న చెయి. కాని నా కండ్లముంగట వుండాలె"[50] అంటూ కుటుంబ జీవితాన్ని, భారాన్ని భార్యకు వదిలేసి, కుటుంబమంత స్త్రీలదే అన్నట్లు భూమయ్య పూర్తికాలం ఉద్యమ జీవితంలోకి వెళ్ళాలనుకుంటాడు.

'ఇల్లాలు' కథ అత్యంత దయనీయమైనది. ఎవరూ ఈ కథను రాయడానికి సాహసించలేరు. అతను ఆమెను వదిలేసి వెళ్ళిపోయాడని ఆ ఊళ్ళో అందరికీ తెలుసు. అయినా అతని నీడ ఆమెను నిత్యం పీడలా వెన్నాడుతూనే ఉంది. నిజానికి పీడలకు అతని ప్రమేయం లేదేమో. నడిమి వాళ్ళు నడమంత్రపు సిరిగలవాళ్ళు తెస్తున్న కష్టాల మధ్య నలిగిపోతుంది ఆమె. ఆమెది ఒంటరి ఆకాశం, ఆ ఊరి ఆకాశం నిండా నిర్బంధం నిరాశా చీకటి పరుచుకుంది. ఆమె పిడికెడు గుండె జడుసుకుంటోంది"[51] ఉద్యమమే జీవితమని, పూర్తికాలపు కార్యకర్తగా కుటుంబాన్ని వదిలేసి వెళ్ళితే అనేక నిర్బంధాలను



ఎదుర్కొంటున్న స్త్రీల వైపు నుంచి ఈ కథ సాగింది. వీరి కష్టాలను, అవమానాలను, త్యాగాలను ఏ సమాజం, ఏ సాహిత్యకారుడు గుర్తించక పోవడం దురదృష్టం.

విప్లవవ్యూహం, ఎత్తుగడలు అన్నీ మగ దృక్పథానికి, మగ పెత్తనానికి పరిమితమై కొనసాగుతున్నాయి. అందువల్ల విప్లవ వీరోచిత పోరాటాల్ని చిత్రించి, స్త్రీలు పడే మానసిక వేదన, రాజ్యహింసకు భయపడి సహకరించని సమాజం, జీవితంలో నిత్య నిర్బంధాలను చిత్రించడం లేదు. ఇలా జీవితమే పోరాటంగా సాగిస్తూన్న దయనీయమైన స్త్రీల బ్రతుకులను 'వైరుధ్యాలు', 'ఇల్లాలు' కథలలో చూడవచ్చు.

ఈ 'ఇల్లాలు' కథ విప్లవ పత్రికల్లో ప్రచురణకు కూడా నోచుకోలేదు. ఇంత దైన్యమైన జీవితం పట్ల విప్లవ సాహితీ వేత్తలకు సానుభూతి ఏ మేరకు వుందో ఇది స్పష్టం చేస్తుంది. ఈ కథ పెద్దగా వుందని కొందరు, తెలంగాణ భాషలో వుందని కొందరు ఇలా అనేక కారణాలతో నిరాకరించారు. ఇలా ఈ కథా ప్రచురణ కూడా దయనీయం. చాలా కథల్లో పాత్రోచితమైన భాష వాడిన రచయిత ఈ కథను, దక్షయజ్ఞం కథను వ్యవహారిక భాషలో రాశారు. తెలంగాణ భాషలో రాసిన ఈ కథలను అచ్చు వేయడానికి చాలా పత్రికలు నిరాకరించాయి. రహస్య జీవితం గడుపుతున్నప్పుడు రాసిన 'ఇల్లాలు' కథ చివరకు బహిరంగ జీవితంలోకి వచ్చాక నలుపు పత్రికలో అచ్చయింది.

'దక్షయజ్ఞం' కథలో కథానాయకుడు పెంటయ్య ఉద్యమంలో చురుగ్గా పాల్గొంటూ ఉంటే ఆచూకి కోసం ఇంటిమీద పడి పెంటయ్య చెల్లెలు "మాలక్ష్మి"ని ఉద్యమకారులకు సహకరిస్తున్నదనే నెపంతో ఎస్సైతో సహా అయిదుగురు అత్యాచారం చేస్తారు. ఉద్యమ కార్యకర్తలు, ప్రభుత్వం పోలీసుల హింసల మధ్య, ఉద్యమానికి, సిద్ధాంతాలకు ఏమాత్రం సంబంధంలేని 'మాలక్ష్మి'లాంటి స్త్రీలు ఎందరో బలౌతున్నతీరు 'దక్షయజ్ఞం' కథ తెల్పుతుంది.

"మా చెల్లెల్ని రేప్ చేసిన విషయం తెల్సి కొంచెం ఎక్కువ కట్నంతో తల్లీ తండ్రీ లేని పేదవాడు చేసుకోవడానికి ముందుకొస్తే ఎంతో సంతోషించాము. మానవత్వం ఇంకా బతికే వుందనుకున్నాం. కాని పెళ్ళి కట్నంతో షాపు పెట్టుకొని ఆ షాపుతో డబ్బూ గౌరవం పెరిగాక మాలచ్చిని వదిలించుకోవాలని చూశాడు.... పోలీసులు చేసిన రేప్ గురించి గుచ్చి గుచ్చి అడిగి వారితో అక్రమ సంబంధాలు అంటగట్టి వేధించడం ప్రారంభించాడు. ఆ బాధలకు తాళలేక బావిలోకి దూకింది. చావుదప్పి కుంటిదైపోయింది. వాడు వదిలేశాడు.

ఆకలికి ఆగలేక మాలచ్చి ఎవరికో అలవాటైంది.... అది తెల్సీ మళ్ళీ పెళ్ళి చేయలేని నిస్సహాయత. కుమిలి కుమిలి ఏడ్వడం తప్ప ఏం చేయలేక పోయాను. మొదట అలవాటైన వాడు మోసం చేశాడు.... దానికిపుడు తిరుగుబోతు అనే పేరొచ్చింది. లక్షల మంది విద్యార్థి యువజనుల్ని ఆర్గనైజ్ చేసినా వాళ్ళ సంస్కృతిని ఏం మార్చగలిగాం.... వాళ్ళల్లో ఏ ఒకరైనా మాలచ్చిని పెళ్ళి చేసుకొంటే దాని బతుకు

యిట్లా మారి ఉండేదేనా.... విప్లవంలో తిరుగుతూ అందరికి అన్నాలు పెడ్తూ చెప్పిన పనల్లా చేసే మాలచ్చిని కులపోల్లు చేసుకోవడానికి భయపడిరి. అంత తెలివిగల దాన్ని చేసుకుంటే చెప్పినట్టు వినదని మామీద నిర్బంధం వాళ్ళ మీద కూడా పడుతుందని మరో భయం. అన్నీ కలిసి మాలచ్చి బతుకు యిట్లా అయిపోయింది"[52]

'స్మృతి' సంపుటిలో 'మెరుగు' 'తెల్లబట్ట' జంటకథలు. ఇవి తరతరాలుగా దోపిడీకి, లైంగిక పీడనకు గురౌతున్న పీడిత స్త్రీల బతుకుల్ని చిత్రించిన కథలు. స్త్రీలు ఏ త్యాగం చేసినా సమాజం హర్షిస్తుంది. కాని శీలాన్ని అర్పిస్తే సమాజం హర్షించలేదు. కారణం శీలాన్ని, పాతివ్రత్యానికి ప్రధానం అనుకోవడం. సమాజంలో ఇద్దరు భార్యలతో సుఖంగా సాగిన సంసార జీవితాలు చాలా ఉన్నాయి. కాని ఇద్దరు భర్తలతో సుఖంగా సాగిన సంసారాలు లేవు. ఇలాంటి అరుదైన జీవితాలను మెరుగు కథలో చిత్రించారు.

"తెల్లబట్ట" కథలో అగ్రకుల స్త్రీ మాలతికి దళిత పురుషుడు ఆశయ్యకు మధ్య సంబంధం సాగుతుంది. సారవ్వ భర్త వెంకటయ్య నక్సలైటుగా అజ్ఞాతంలో ఉంటే పోలీసుల అత్యాచారానికి బలౌతుంది. వెంకటయ్య ఉద్యమ జీవితం వదిలి తాలూకా సెంటర్లో సారవ్వతో కాపురముంటే పోలీసుల వేధింపులు. వారిని ఎదుర్కోలేక భార్యను భర్త తిరుగుబోతు అంటూ వేధిస్తాడు. ఆమె అవమానంతో పిల్లలతో సహా ఆత్మహత్య ప్రయత్నం చేస్తుంది. పిల్లలు మరణించి ఆమె బ్రతుకుతుంది కాని, హత్య, ఆత్మహత్యనేరం కింద జైలుకు వెళుతుంది.

జైలులో, నీచమైన అత్తమామలు, భర్త ఆగడాలకు వేగలేక భర్తను చంపి జైలుకు వచ్చిన సుశీల, తాను లొంగనందుకు తమలో ఒకడు పోలీసులకు సమాచారం లీక్‌చేస్తే అరెస్టయిన మహిళా నక్సలైటు శారద ఈ ముగ్గురూ కలుసుకుంటారు.

జైలులో కష్టాలు, కన్నీళ్ళు, అవమానాలను పంచుకుని జీవితంలో కొత్త వెలుగులతో జైలునుండి బయటికి వస్తారు. అందులో సారవ్వ పుట్టి పెరిగిన ఊరిలో టైలర్ పని నేర్చుకొని, అంగన్‌వాడి టీచర్‌గా జైలులో చదివిన చదువుతో పిల్లలతో ఆనందంగా ఉంటుంది" ఎక్కడ పోగొట్టుకున్నామో అక్కడే వెతుక్కోవాలంటారు పెద్దలు. నేను పుట్టి పెరిగిన పల్లెలో, కులంలో నా జీవితాన్ని పోగొట్టుకున్నాను. అక్కన్నే నా జీవితాన్ని గెలుచుకుంటాను"[55] అంటుంది శారద. ఇలా జీవితం ఇచ్చిన అనుభవాలతో, ఆత్మ విశ్వాసంతో బతుకుతుంది సారవ్వ. సుశీల మళ్ళీ పెళ్ళి చేసుకోవాలని నిర్ణయించుకుంది. శారద బతకడానికి అవకాశాలు ఉన్న ఉద్యమ జీవితాల్లోకి వెళ్తుంది.

'మెరుగు' 'తెల్లబట్ట' కథలలోని రంగవ్వ, సారవ్వ, మాలతి, శారద. లక్ష్మి, సుశీల పాత్రలను మగతోడు లేకుండా జీవితానుభవాలతో ఓడిపోయిన జీవితాన్ని తిరిగి గెలుచుకున్న తీరు స్త్రీవాద దృక్పథంతో చిత్రించినవి. "మృచ్ఛకటికం"లోని వసంత సేన, శకారుడు, "కన్యాశుల్కం"లోని మధురవాణి, గిరీశం పాత్రలు స్థల, కాలాలు మారి మెరుగు, కామన్‌వెల్త్ కథల్లోకి నడిచినట్లుగా ఉంటాయి పాత్రలు. గురజాడ గారి



"కన్యాశుల్కం" నాటకం కూడా వైవాహికేతర లైంగిక సంబంధాలు కేంద్రంగా సాగిన కథగా గుర్తు చేసుకోవచ్చు. ఇప్పటిదాకా తెలుగు సాహిత్యంలోకి రాని సమాజాన్ని, జీవితకోణాల్ని 'మెరుగు', 'తెల్లబట్ట', 'కామన్‌వెల్త్' కథల్లో బి.యస్.రాములు చిత్రించారు.

బి.ఎస్.రాములు గారి కథలు తెలంగాణ సమాజంలోని 70 ఏళ్ళ సామాజిక పరిణామాలను, సామాజిక, ఆర్థిక, సాంస్కృతిక, తాత్విక అంశాలతో సహా మన ముందుంచుతాయి. ప్రతి కథలో ఒక తాత్విక అంశ ఉంటుంది. తాత్విక అంశానికి అనువుగా ఇతివృత్తం వుంటుంది. ఇతివృత్తానికి అనువుగా కథా వస్తువు వుంటుంది. కథా వస్తువుకి అనువుగా శైలి, శిల్పం వుంటుంది. జీవితానికి అనువుగా సిద్ధాంతాలు వుంటాయి. జీవితమే ప్రాథమికంగా ఇవన్నీ కథల్లో ఒదిగిపోతాయి. ఒక కథలో ఇన్ని అంశాలను జోడించి కథ చెప్పడం అందరితో అయ్యే పని కాదు. ఎంతో సామాజిక ఆచరణ, అధ్యయనం, జీవితానుభవం వున్న వారికే ఇలా రాయడం సాధ్యం. బి.ఎస్.రాములు గారు భారతదేశం గర్వించ దగిన రచయితల్లో, తత్వవేత్తల్లో ఒకరు. వారి, సిద్ధాంతాల్లోని లోతు, వారి జీవితంలోని ఆచరణ, అనుభవాలు కథల్లో విస్తారంగా పరుచుకొని కథాశిల్పం ఒక జీవనదిలా ప్రవహిస్తూ వుంటుంది.

## బి.ఎస్.రాములు గారి కథల్లో శైలి, శిల్పం – రసం, ధ్వని

బి.ఎస్.రాములు గారు తెలుగు ప్రాచీన సాహిత్యాన్ని మదించిన సాహితీవేత్త, ప్రాచ్య, ప్రాశ్చాత్య, అలంకార శాస్త్రాలను కాచివడపోసిన అలంకారికులు. తెలుగు కథా సాహిత్యానికి 'కథల బడి – కథా సాహిత్య అలంకార శాస్త్రం' గ్రంథాన్ని అందించారు. తత్వశాస్త్రంలో గతితర్క, తత్వదర్శన భూమికను అందించారు. వీరి కథల్లో శైలి, శిల్పం వైవిధ్య భరితంగా పరిణామ శీలంగా కనబడుతుంది. ఏ కథకు ఏ శిల్పం ఏ శైలి నప్పుతుందో బాగా తెలిసిన కథా శిల్పి. బి.ఎస్.రాములు గారు కథకులకు కథకుడు అని ప్రసిద్ధి పొందారు.

పాలు కథా శైలి, శిల్పం కరుణ రసాత్మకంగా సాగుతుంది. ఇది రస సిద్ధాంతానికి దగ్గరగా వుంటుంది. అలాగే అయిదవవాడు కథ కూడా విషాద, కరుణ రసాత్మకంగా వుంటుంది. బతుకుపోరు నవల జీవితంలోని అన్ని రసాలను మేళవించుకున్న నవల. సదువు కథ తాత్విక దృక్పథమే రసంగా ముందుకు సాగుతుంది. సహజాతాలు ఉద్వేగ రసంతో కొనసాగడం చూడవచ్చు. స్మృతి కథలో మానవీయ ప్రేమ రసం తొణికిసలాడుతుంది. బందీ కథలో ప్రేమతో పాటు ఆత్మగౌరవం పట్టుదల కలిగిన అవగాహన శిల్పం స్పష్ట పడుతుంది. మార్పు కథ సంభాషణా చతురతతో సాగుతుంది. సదువు కథ వందలాది సంఘటనలతో చకచకా సాగిపోతుంది. వైరుధ్యాలు కథ భార్యాభర్తల అనుబంధం, సంఘర్షణ రూపు కట్టిస్తుంది.

ఇల్లాలు కథ విషాదాంత శైలి, కరుణ రసానికి శిల్పానికి ఒక చక్కని ఉదాహరణ. దక్షయజ్ఞం కథ బీభత్స రసానికి పరాకాష్ట. గాడిద కథ వ్యంగ్య హాస్య కథ శిల్పానికి

ప్రతీక. దుస్తులు కథ ధ్వన్యాత్మకంగా సాగుతుంది. తల్లిసాలు పిల్లడు వాత్సల్య రసాన్ని బాల్య స్మృతులను రసాత్మకం చేస్తుంది. ప్రేమ, మాయ కథలు రసంతో పాటు ధ్వనిని మేళవించి అర్థమయినట్లే కనబడతాయి. తరచి చూసిన కొద్దీ మరెన్నో అర్థాలు స్ఫురిస్తాయి. మెరుగు కథ శ్రవ్య కథా శిల్పంలో సాగుతుంది. రసాత్మక కథను ధ్వన్యాత్మకంగా చేయడం ఇందులోని విశిష్టత. అందువల్ల రసం కన్నా ధ్వని ఆకర్షిస్తుంది. మళ్ళీ మళ్ళీ చదవాలనిపిస్తుంది. తెల్లబట్ట కథ జీవితంలోని రసాలను వైవిధ్య పూరితంగా మేళవిస్తుంది. చెలిమ కథ సంభాషణా చతురతతో ఉత్సాహ రసంతో సాగుతుంది.

పాత చీర కథ నివేద రసంతో సాగితే వరుసలు కథ అసూయ రసంతో పాటు రుసరుసల రసంతో ముగుస్తుంది. వరలక్ష్మి కథ ఒక విషాదాంత కరుణ రసాత్మక కథ. తులసి కథ శిల్పంలో సులభంగా కనిపిస్తూ కరుణ రసంతో ఆర్ధ్రతను కలిగిస్తుంది. వేదవతి కథ జలపాతంలా సాగిపోతుంది. ప్రేమాధార కథ విషాదాంత ప్రేమ కథను కరుణార్ధ్రంగా నిండు విషాదంతో మన ముందుంచుతుంది. ఇందులోని శిల్పం కరుణ రసం, విషాదం పాఠకులను మరోకథను వెంటనే చదవనీయదు. కొద్ది రోజుల దాకా ఆ కథే అందులోని జీవితాలే మనను వెంటాడుతుంటాయి. జీవితం ఇంత విషాదంగా మారడానికి కారకులెవరనే ప్రశ్న మనను వేధిస్తూ వుంటుంది.

పంజరం కథ ఉత్తరం రూపంలో సాగే శైలిలో రాసిన చక్కని కథ. ఇందులోని విషయాలను మరో కథా రూపంలో ఇంత స్పష్టంగా చెప్పడం అసాధ్యం అనిపిస్తుంది. ఇలాంటి శిల్పాన్ని ఎన్నుకోవడంలో రచయిత నైపుణ్యం స్పష్టపడుతుంది.

మలుపులు, ప్రేమికులు కథలు సాదాసీదా ప్రేమ కథల్లా సాగుతాయి. కానీ శిల్ప నైపుణ్యంతో సామాజిక, ఆర్థిక చరిత్రను సామాజిక అర్థ శాస్త్రాన్ని రంగరించి మనకు అందిస్తాయి. అందులో ప్రేమ రసంతో పాటు తాత్విక ధ్వని ప్రధానమైనది. ఇలా ధ్వనితో పాటు రసాన్ని అందించడం అంత సులభం కాదు. దాన్ని మమతలు, అయిదవవాడు, వారసత్వం కథల్లో రచయిత గొప్పగా సాధించారు. రాజకీయాల్లో ఎంతో ప్రవేశం వుంటే తప్ప రాజకీయం, తల్లిపాలు వంటి కథలను ఆ శైలి, శిల్పాలను వెలువరించడం కష్ట సాధ్యం.

వేపచెట్టు కథ ఆనందం విషాదంగా మారే జీవన విషాదాన్ని శిల్పంగా కలిగి వుంటుంది. నాగశాల కథ హాలీవుడ్ చారిత్రక పాతసినిమా చూసినంత గంభీరంగా సాగుతుంది. చరిత్ర పట్ల సాధికారికత సాధించకుండా ఇందులోని వర్ణనలు, సంస్కృతి రాయడం అసాధ్యం. చేయూత కథ జీవితంలో పట్టుదలతో కష్టాల్లో కూడా ముందుకు సాగే సింద్‌బాద్ నావికుడి సాహసాల రసంతో నిండి వుంటుంది. సంబంధం కథ తాత్విక అవగాహనతో సంభాషణ చతురతతో శైలి, శిల్పాన్ని కొనసాగిస్తుంది. ప్యారసైట్స్ కథ సన్నివేశాలను సంఘటనలుగా దృశ్య రూపం కలిగించిన శైలి, శిల్పాన్ని పొదువుకుంది. కామన్‌వెల్త్ కథ జీవితానుభవం పండిన తత్వవేత్త అలవోకగా చెప్పే శైలి శిల్పాన్ని స్పష్టం చేస్తుంది.



ఇలా ప్రతి కథ ప్రత్యేక శైలి శిల్పాన్ని కలిగి వుంది. ఈ శైలి, శిల్పం ఇంత వైవిధ్య పూరితంగా వుండడానికి కారణం రచయిత నిరంతర అధ్యయనమే. తెలుగులో వచ్చే కథా సాహిత్యాన్ని విడవకుండా చదువుతూ యువతరం రచయితలను ప్రోత్సహించడం ఆయన నిత్యకృత్యం. భారతీయ సాహిత్య ఆకాశంలో ఇంత వైవిధ్య పూరితమైన జీవితాన్ని గడిపి అంతే వైవిధ్య పూరితమైన రచనలను అందించిన వారు అరుదు. సమకాలిక సమాజంలో బి.ఎస్.రాములు గారు తనకు తానే సాటి.

కథల్లోని భాష, శైలి నుడికారాల విషయానికి వస్తే తెలంగాణ పదాలతో, నుడికారాలతో తెలంగాణ భాషను పత్రికా భాషగా మలచిన తీరు ఆత్మీయంగా ఉంటుంది. ఆర్ధ్రంగా వుంటుంది. తెలంగాణ భాషలోని సౌందర్యాన్ని చూసి పాఠకులు ఆనంద, ఆశ్చర్యాలకు లోనవుతారు. తెలంగాణ ప్రజలు తమ భాషను కథల్లో చూసుకొని గొప్ప ఉత్తేజం పొందుతారు. పాత్రోచిత భాషను రాయడంలో చేయి తిరిగిన నైపుణ్యం కనపడుతుంది. కొందరు తెలంగాణ రచయితలు తెలంగాణ భాషను వ్యతిరేకించే విధంగా రాస్తుంటారు. వారి భాష సాన పెట్టడం అవసరమని బి.ఎస్.రాములు గారు కథలు స్పష్టం చేస్తాయి. భాషను సాన పెట్టడంలో బి.ఎస్.రాములు గారు 'బతుకుపోరు' నవలతోనే సిద్ధహస్తులని నిరూపించుకున్నారు. అందువల్ల వీరి కథలు అన్ని ప్రాంతాల ప్రజలకు ఆదరణీయమయ్యాయి. తెలంగాణ భాషను ప్రేమించడంలో వీరి కథలు ఎంతగానో తోడ్పడ్డాయి. అయితే పత్రికలు ఇచ్చిన అవకాశం మేరకు తెలంగాణ భాష తెలంగాణ కథకులు కథల్లో ప్రవేశ పెట్టారు. ఇదొక చారిత్రక పరిమితి అని చెప్పవచ్చు.

కథల్లోని సాహిత్య, సామాజిక దృక్పథానికి వస్తే బి.ఎస్.రాములు గారి కథల్లో అనేక దృక్పథాలు, సిద్ధాంతాలు ఏకకాలంలో ఒక సమన్వయంలో కొనసాగుతుంటాయి. ముఖ్యంగా మానవతా వాదంలో భాగంగా బౌద్ధవాదం, దళితవాదం, బిసివాదం, స్త్రీవాదం, తెలంగాణ రాష్ట్ర వాదం ఒక తాడులా, ఒక పూలదండలా పెనవేసుకొని సాగుతుంటాయి. 1996 నుండి రచయిత తెలంగాణ రాష్ట్రం కోసం సైద్ధాంతిక, భావజాల రంగాల్లో, సాహిత్య రంగంలో నిరంతరం కృషి చేస్తున్నారు. అది దక్షయజ్ఞం వంటి కథల్లో కూడా కనపడుతుంది. తెలంగాణ దృక్పథంతో సమగ్ర సామాజిక కథ 50 ఏళ్ళ తెలుగు కథ తీరుతెన్నులు, సాహిత్య చరిత్రను కొత్త చూపుతో తిరగరాయాలి అనే గ్రంథాలను వెలువరించారు. అలాగే తెలంగాణ రాష్ట్రం ఏర్పడే దాకా ప్రతినెల ఒక పుస్తకం తీసుకురావాలని పూనుకున్నారు. అయిదు పుస్తకాలు ఈ వరసలో ప్రచురించారు. తెలంగాణ తల్లి రూపకల్పన చేశారు. ఇలా తెలంగాణ రాష్ట్ర ప్రజల కోసం వారి జీవితాల బాగు కోసం నిరంతరం శ్రమిస్తున్నారు. అయిదేళ్ళుగా సామాజిక, తాత్విక రంగాలకు పూర్తికాలం కార్యకర్తగా జీవితాన్ని అంకితం చేశారు. భారతీయ, సామాజిక, ఆర్థిక, తాత్విక చరిత్రను పునర్‌నిర్మించే కృషి చేస్తున్నారు. బి.ఎస్.రాములు గారి కథలు భారతీయ సాహిత్య చరిత్రలో ఠాగూర్, ప్రేమ్‌చంద్ కథల్లా నిత్యనూతనంగా నిలిచిపోతాయి.

ముగింపు :

## ఒక విశ్లేషణ-సంశ్లేషణ-ఒక అంచనా

### భారతీయ సాహిత్యంలో

# బి.ఎస్. రాములుగారి స్థానం మహోన్నతమైనది

బి.ఎస్. రాములుగారి వ్యక్తిత్వం, సాహిత్యం, సామాజిక ఆచరణ, త్యాగం బహుముఖీనమయినది. కొన్ని విషయాల్లో కొందరితో బి.ఎస్.రాములుగారిని తులనాత్మక అధ్యాయనంచేసి చెప్పవచ్చు. కాని బహుముఖీన వ్యక్తిత్వాన్ని, సాహిత్య కృషిని, సామాజిక ఆచరణను, త్యాగాన్ని సాహితీ, ఉద్యమ నిర్మాణం మొదలగు అన్నింటి విషయాల్లో పోల్చడానికి పోలిక దొరకడం అంత సులభం కాదు.

వీరి విషయంలో భారతదేశంలోని ప్రేంచంద్, రాహుల్ సాంకృత్యాయన్, వేమన, పోతులూరి వీరబ్రహ్మం, కబీర్, గురురవిదాసు వంటి మహాకవులు, రచయితలు గుర్తుకువస్తారు. అయితే ఆధునిక సాహిత్యంలో పూర్తి స్థాయిలో పోల్చడానికి వెతుక్కోవలసి వుంటుంది. ప్రేంచంద్ మహా రచయితగా కథలు, నవలలు రాయడంతోపాటు భారతీయ సాహిత్యంలో ప్రోగ్రెసివ్ రైటర్స్ - అసోసియేషన్ వ్యవస్థాపక అధ్యక్షుడిగా, హంస పత్రిక సంపాదకుడిగా ఎంతగానో కృషి చేశారు. బి.ఎస్.రాములుగారు కూడా రచనలు చేయడంతో పాటు అనేక మంది రచయితలను ఎదిగించారు. రచయితల సంఘాలను నిర్మించారు. ఆం.ప్ర. దళిత రచయితల, కళాకారుల, మేధావుల ఐక్యవేదిక వ్యవస్థాపక అధ్యక్షులుగా విశేషంగా కృషిచేశారు.

సైద్ధాంతిక, తాత్విక రంగంలో, సామాజిక ఉద్యమ భావజాల రంగంలో బి.ఎస్.రాములుగారు కొండలను ఢీకొన్నారు. ఢీకొనడమే కాదు, కొండలను పిండిచేశారు. నూతన నిర్మాణాలను అభివృద్ధి చేశారు. ఈ విషయంలో ప్రేంచంద్, రాహుల్ సాంకృత్యాయన్ మొదలైనవారితో బి.ఎస్.రాములుగారికి పోలిక కుదరదు. ఇదొక మహత్తరమైన కృషి.

అలాంటి సైద్ధాంతిక పోరాటం రష్యాలో షొలకోవ్, గోర్కీ కొంత చేసినట్లుగా కనబడుతుంది. గ్రాంసి, రోజా లగ్జంబర్గ్, జార్జి లూకాస్, డా॥బి.ఆర్.అంబేద్కర్, ఎంగెల్స్ మొదలైన వాళ్లు చేసిన సైద్ధాంతిక పోరాటం ఒక సంశ్లేషణలో బి.ఎస్.రాములుగారిలో



చూడవచ్చు. అందుకే దళిత దార్శనికులు మహాకవి కత్తి పద్మారావుగారు బి.ఎస్.రాములుగారిని ఒక సామాజిక, తాత్విక విశ్వ విద్యాలయం అని వేమన, పోతులూరి వీరబ్రహ్మం మొదలైనవారితో పోల్చారు.

బి.ఎస్.రాములుగారు కాలంతోపాటు ఎదుగుతూ వచ్చిన మహా రచయిత. కథలు, నవలలు, సాహిత్య విమర్శతో పాటు, సాహిత్య అలంకార శాస్త్రాలను సృజించారు. భావితరాలకు నూతన మార్గ దర్శనం చేశారు. కథాశిక్షణ శిబిరాల ద్వారా వందలాది మంది యువ రచయితలను సాహితీవేత్తను తీర్చిదిద్దారు. గ్రామీణ ప్రాంతాలలో అట్టడుగు వర్గాల్లో, పేదల్లో వున్న సృజనాత్మకతను వెలికి తీసి కథకులుగా మార్చారు. సాహితీవేత్తగా వీరి కృషి అనితరసాధ్యమైనది.

బి.ఎస్.రాములుగారు సవ్యసాచి. సాహిత్యం, సామాజిక, సాంస్కృతిక రంగాలను దేన్నీ వదలలేదు. తనదైన ముద్ర వేసి దార్శనికునిగా, నాయకుడిగా మార్గదర్శనం చేశారు. ముందుకు నడిపించారు.

నేను పరిశీలనలోకి తీసుకున్న కథా సంపుటాల విషయానికి వస్తే, భారతీయ సాహిత్యంలోనే కాదు, ప్రపంచ సాహిత్యంలోనూ వీరికి ఒక ప్రత్యేక స్థానం ఉంది. భారతీయ సామాజిక, రాజకీయ, సాంస్కృతిక, ఆర్థిక, చారిత్రక పరిణామాల్ని బి.ఎస్.రాములు తన కథల్లో కాలనాళికలా సంక్షేపించారు. సంక్షిప్తీకరించారు. భారతీయ సామాజిక పరిణామాలు తెలంగాణ నిర్దిష్ట ప్రాంతంలోని కుటుంబ సంబంధాలు, మానవ సంబంధాలు, సంస్కృతి పరిణామాల రూపంలో విశ్వజనీన, మానవీయ విలువలతో ఉదాత్తంగా చిత్రించారు. తెలుగు సాహిత్యం వెంటదివెంట ఇంగ్లీషు, ఫ్రెంచ్, రష్యన్, చైనా తదితర భాషల్లోకి అనువాదం కాకపోవడం దురదృష్టం. అది తెలుగువాళ్లే చేసుకుంటున్న స్వయంకృత అపరాధం.

వీరి కథలు ప్రపంచ భాషల్లోకి అనువాదమైనప్పుడు ప్రేంచంద్, రాజారావు, ఆర్కె నారాయణ్, ముల్కరాజ్ ఆనంద్, అరుంధతీరాయ్, అమర్త్యసేన్, కంచ అయిలయ్య, నైపాల్, సల్మాన్‌రష్దీ మొదలైన వారి రచనల్లాగే భారతీయ జీవన వైవిధ్యాన్ని, విశిష్టతను ప్రపంచ సాహిత్యంలో నిలబెడతాయి. వారికన్న మరికాస్త ఉన్నతంగా కూడా భారతీయుల ఆత్మను, సంస్కృతిని జీవన విధానాన్ని, సామాజిక పరిణామాలను బి.ఎస్. రాములు - కథలు, సైద్ధాంతిక రచనలు మహోన్నతంగా ప్రపంచానికి తెలుపుతాయి. తత్వవేత్తగా, సామాజిక శాస్త్రవేత్తగా, నాయకులుగా ఎదిగిన సాహితీవేత్తలకే ఇలాంటి కథలు, రచనలు చేయడం సాధ్యమని నా అభిప్రాయం. వీరి రచనలు విదేశీ భాషల్లోకి అనువాదమైనప్పుడు నా అభిప్రాయం సరైనదే అని ప్రపంచం తప్పకుండా గుర్తిస్తుందని నా విశ్వాసం.

ఇలా వీరి కథల్లో, కథతో పాటు కథనం, శైలి, శిల్పంతో పాటు విశ్వజనీన తాత్వికత, మానవీయ విలువల సమాహారం, భవిష్యత్తు సుందరస్వప్నం పట్ల అచంచల విశ్వాసం, వ్యక్తిత్వం నిర్మాణం, పాత్రల రూపకల్పన అపూర్వంగా మన కళ్లముందు సాక్షాత్కరిస్తుంది. చూడగల్గినవారికి సమాజంలోని బహుముఖీన సామాజిక ప్రవాహాలను,

వైవిధ్యాన్ని, తాత్విక, సామాజిక భావధారలను కూడా అంతర్లీనంగా వీరి రచనలు అందిస్తాయి.

వీరి రచనలు ప్రపంచ సాహిత్యానికి అందించిన గుప్త నిధులు. ఎప్పటికైనా తీసి చూస్తే మెరిసే బంగారం నిక్షిప్తం చేసిన లంకె బిందెలు వీరి రచనలు. ఇవేవీ నా మాటలు కావు - సుప్రసిద్ధ సాహితీవేత్తలు చెప్పిన అభిప్రాయాల సారాంశం ఇది. వీరి రచనల గూర్చి సుప్రసిద్ధ సాహితీవేత్తలు చెప్పిన కొన్ని విశిష్టాంశాల్ని చూద్దాము.

"బి.ఎస్. రాములు కథల్లోని చరిత్ర శకలాలను ఏరి, ఒక క్రమంలో పెడితే తెలంగాణ ప్రాంత ప్రజలు గెల్చుకున్న జీవితాలు తెలుస్తాయి. హత్యలూ, ఆత్మహత్యలూ తెలుస్తాయి. తెలంగాణాది భౌతిక హింసా, ఆధ్యాత్మిక హింసా వర్ణాల ముక్కల బీభత్సమైన కొలాజ్... మనల్ని చుట్టుముట్టిన జీవితంలోకి తాత్వికాంశాల్ని కథల ఇతివృత్తాల్లో భాగం చేసిన అరుదైన కథకుని కథల్ని విశ్లేషించాలి. (డా॥ కేతు విశ్వనాథరెడ్డి కేంద్ర సాహిత్య అవార్డు గ్రహీత.)

స్వయంగా కథకుడు. మరో కథకున్ని ప్రశంసించడం అరుదైన ఉదాత్త విషయం. ప్రముఖ కథకుడు సదానంద శారద ఇలా అంటారు - "ప్రజల సాహిత్య సామాజిక, సాంస్కృతిక ప్రయోజనాలను నెరవేర్చగల కథలు గొప్ప కథలు. వాటితోపాటు మహోన్నత సమాజ నిర్మాణం కోసం ఉదాత్తీకరిస్తూ పాఠకుల్ని చైతన్యవంతం చేసే కథలు ఉత్తమ కథలు. వీరివి అనుభవం పండిన కథలు."

.... వీరి కథలు తెలుగు ప్రజల ముఖాల్లో, హృదయాల్లో ఒక చెప్పలేని కళాకాంతుల్ని, ఆత్మవిశ్వాసాన్ని నింపుతాయి. ఇవి చదివితే భాష వస్తుంది అనుకున్న భావాన్ని చెప్పడం వస్తుంది. ఉత్తమ కథల లక్షణం ఇది." (స్మృతి కథల సంపుటి పుట 12-19)

అలాగే సుప్రసిద్ధ శతాధిక కథా రచయిత డా॥ కాలువ మల్లయ్య ఇలా అంటారు- "కథల్ని చాలామందే రాస్తారు. అయితే జీవితం లోతుపాతులు చూసి రాసేవారు తక్కువ. జీవితానుభవాల్లోంచి వస్తువును తీసుకుని అనుభవించి, పలువరించి జీవితం లోతుపాతుల్ని విశ్లేషించి రాసే కథకుల్లో బి.ఎస్.రాములుగారు ముందు వరుసలో ఉంటారు. వీరి కథల్లో విప్లవ వాదం, దళిత వాదం, స్త్రీ వాదం లాంటి ఏ ఒక్క వాదమో కాకుండా అన్ని వాదాలూ ఒక సమగ్రతలో ఒదిగిపోయి మానవేతిహాసంగా రూపుదిద్దుకుంటాయి. వీరు అన్ని వాదాల లోతుపాతులపై పట్టు సాధించిన విషయం ఈ కథల ద్వారా సుస్పష్టమవుతుంది."

.... నడుస్తున్న భారతీయ సమాజ చరిత్ర, సంస్కృతి అందులో వస్తున్న మార్పులు, మారుతున్న విలువలు జరుగుతున్న సంఘర్షణను, సామాజిక తాత్విక పోరాటాలతో సహా ఉద్యమ జీవితాలు, ఉద్యమేతర జీవితాలు తెలుసుకోవాలంటే ఈ కథల్ని చదవడం అవసరం. ఇవి ఖచ్చితంగా సమకాలీన సమాజాన్ని నూటికి నూరుపాళ్లు నిజాయితీతో



చిత్రించిన ఉత్తమ కథలు." (స్మృతి కథల సంపుటి, పుట 155-158)

మరో సుప్రసిద్ధ కథకుడు డా॥ బోయ జంగయ్యగారు. "ఇవి కథలు కావు. మనిషి వెతలు, ఈ కథలు చదువుతుంటే దేశం తిరుగుతూ ఆ ప్రాంతాల్లోని వ్యక్తులతో ముచ్చటిస్తూ వివరాలు అడిగి తెలుసుకున్నట్టు ఉంది.... చుట్టూ వున్న మానవ సంబంధాల చిత్రణ కళ్లకు కట్టినట్టు ఉంటూ మనం కథ చదివినట్టు కాకుండా ఎక్కడో జరుగుతున్న వాస్తవంలో వాళ్లతోపాటు పాఠకులమైన మనం కూడా ప్రత్యక్షంగా పాల్గొన్నట్టూ అనుభూతి పొందుతాము" అంటారు.

బి.ఎస్. రాములుగారి కథల్లో అనేక నుడికారాలను కొత్తగా సృష్టించారు. కవిత్వాంశ గల వాక్యాలు కోకొల్లలుగా కనబడతాయి. శైలి, శిల్పం, ఒక ప్రవాహ జలపాతంలా వేగంగా సాగిపోతూ ఉంటుంది. 'పాలు' కథల సంపుటిలోని 'పాలు' కథ ఒక మహా కావ్యం చదివిన అనుభూతిని, అనుభవాన్ని ఇస్తుంది.

బి.ఎస్. రాములుగారి కథలు హిందీ, ఇంగ్లీష్, కన్నడ, మళయాళం భాషల్లోకి అనువదింపబడ్డాయి. 'రియల్ ఎస్టేట్" కథ కేంద్ర సాహిత్య అకాడమీ ప్రచురించే "ఇండియన్ లిటరేచర్" ఇంగ్లీషు ద్వైమాసిక పత్రికలో ప్రచురించారు. ఆ తర్వాత అనేక భాషల్లోకి అనువదించబడింది. 'బందీ' హిందీ తదితర భాషల్లోకి అనువదించబడినది.

వీరి కథలు పలు సంకలనాల్లో చేర్చబడ్డాయి. సుమారు 25 కథా సంకలనాలను వీరి కథలు అలంకరించాయి. నిజాం వెంకటేశం, అర్కే, అల్లం రాజయ్య, మొదలైన వారి సమిష్టి సంపాదకత్వంలో 1984లో కరీంనగర్ బుక్ ట్రస్ట్ ప్రచురించిన 'అడవిలో వెన్నెల' కథా సంకలనంలో అడవిలో వెన్నెల కథ, వాసిరెడ్డి నవీన్ సంపాదకత్వంలో హైదరాబాద్ బుక్ ట్రస్ట్ 1985లో ప్రచురించిన 'తెలుగు కథ - 1960 - 85'లో అడవిలో వెన్నెల, గోదావరి ఖని నుండి అబంపి ప్రచురణగా వెలువడిన భూమిక కథా సంకలనంలో 1980లో సృజనలో వచ్చిన 'తిరుగుబాటు' కథ ప్రచురించబడ్డాయి.

కాళీపట్నం రామారావు, వి.చెంచయ్య సంపాదకత్వంలో 1990లో విరసం ప్రచురించిన 'నేలతల్లి విముక్తి కోసం' జనజీవన పోరాట కథలు సంకలనంలో మాబడి, తేనెటీగలు, తునికిచెట్టు, మమకారం, మొదలైన అయిదు కథలు ప్రచురించబడ్డాయి. ఈ సంకలనం హిందీ, తదితర భాషల్లో కూడా అనువదించబడింది.

డా॥ కె.లక్ష్మీనారాయణ సంపాదకత్వంలో ఎనిమిది దళిత కథా సంకలనాలు వెలువడ్డాయి. ఆరవ సంకలనం బి.ఎస్. రాములుగారికి అంకితం ఇవ్వబడింది. ఈ ఎనిమిది సంకలనాల్లో 'పాలు', దక్షయజ్ఞం, మెరుగు, సహజతాలు, అయిదవవాడు, బందీ మొదలైన కథలు ప్రచురించబడ్డాయి.

బి.ఎస్. రాములు, వనమాల చంద్రశేఖర్ సంపాదకత్వంలో విశాలసాహిత్య అకాడమీ ప్రచురించిన ఆధునిక కథా సరిత్సాగరం - కరీంనగర్ జిల్లా కథలు సంకలనాల్లో

స్మృతి, వారసత్వం కథలు చేర్చారు. స్వయంగా తన సంపాదకత్వంలో తానే ఈ కథలు చేర్చడంవల్ల వీటికి ప్రత్యేక ప్రాధాన్యత ఉన్నదని రచయిత భావించారని స్పష్టం. వీరిద్దరి సంపాదకత్వంలో వెలువడిన 'భారతీయ సాహిత్యం - తెలుగు కథలు' సంకలనంలో 'నాగశాల' కథ చేర్చారు. తన స్వీయ సంపాదకత్వంలో వెలువడిన ఈ మూడు సంకలనాల్లో చేర్చిన కథలను పరిశీలిస్తే చారిత్రక, సామాజిక పరిణామాలను చిత్రించిన కథలకు సంకలనంలో ప్రాధాన్యత ఇచ్చారని తెలుస్తున్నది.

ఎం.ఏ.సుభాన్ సంపాదకత్వంలో ప్రచురించిన "కథా సాగర్' కథా సంకలనంలో 'సదువు', సింగమనేని నారాయణ, కాలువ మల్లయ్య సంపాదకత్వంలో విశాలాంధ్ర ప్రచురించిన 'తెలుగు కథ' సంకలనంలో 'దక్షయజ్ఞం' కథను, చంద్ర, సదానంద శారద, కాలువ మల్లయ్య సంపాదకత్వంలో విశాలాంధ్ర ప్రచురించిన 'తెలంగాణ కథ' సంకలనంలో 'వరుసలు' కథను, చీకోలు సుందరయ్య సంపాదకత్వంలో వెలువడిన 'మెచ్చిన కథ' సంకలనంలో 'పాలు' కథను, పోతుకూచి సాంబశివరావు సంపాదకత్వంలో ప్రచురించిన వేదప్రియ కథా సంకలనంలో 'ప్రశాంతం' కథను ప్రచురించారు.

వేదగిరి రాంబాబు సంపాదకత్వంలో తెలుగు విశ్వవిద్యాలయం ప్రచురించిన తెలుగు కథ - 1995-97 సంకలనాల్లో బందీ మొదలైన కథలు ప్రచురించారు. గొరుసు జగదీశ్వర్, శ్రీధర్ దేశ్‌పాండే సంపాదకత్వంలో ప్రచురించిన తెలుగు కథ 1998-2000 సంకలనాల్లో వారసత్వం మొదలైన కథలు చేర్చారు. ఉపాధ్యాయ మాసపత్రిక తరఫున ప్రచురించిన ఉపాధ్యాయ కథలు సంకలనాల్లో 'బడి' కథ చేర్చారు.

వీరి కథలు అనేక సంకనాల్లో మళ్లీ మళ్లీ చేర్చారు. వాటి ప్రాధాన్యత ఎలాంటిదో తద్వారా స్పష్టమవుతున్నది. పాలు, నాగశాల, వారసత్వం, అడవిలో వెన్నెల, స్మృతి, అయిదవవాడు, రియల్ ఎస్టేట్ , బందీ మొదలైన కథలు అయిదారు సంకలనాల్లో మళ్లీ మళ్లీ చేర్చబడ్డాయి. అనేక భాషల్లో అనువదించబడ్డాయి.

బి.ఎస్. రాములుగారు చరిత్ర మరుగునపడిన తెలంగాణ రచయితలను తెలుగులోకి తెచ్చారు. పలు కథా సంకలనాలకు, పాటల సంకలనాలకు సంపాదకులుగా వుండి వాటిని సేకరించి ప్రచురించారు.

1977లో సంఘమిత్ర పత్రికను - 1980లో మంటలు - చాటింపు పత్రికల సంపాదకత్వ భాగస్వామ్యం వహించారు. 1993లో గబ్బిలం పత్రికను వెలువరించినారు. 1100 కు పైగా పాటలను సేకరించి సంకలనాలుగా ప్రచురించిన సాహితి దీక్షా తపస్వి - వందేళ్ల తెలుగు సాహిత్య చరిత్రను, తెలంగాణ దృక్పథంతో పునర్నిర్మిస్తున్న సాహిత్య చరిత్రకారుడు. 'సాహిత్య చరిత్రను కొత్త చూపుతో తిరగరాయాలి' అని మార్గదర్శనం చేస్తున్నారు.

విప్లవ, దళిత, స్త్రీ వాద, మానవతా వాద, ముస్లిం వాద, తెలంగాణ వాద, సాహిత్య చరిత్రను పరిణామాలను విస్తృతంగా అధ్యయనం చేసిన వందలాది వ్యాసాలతో



రికార్డు చేసి అందించిన సాహిత్య సామాజిక శాస్త్రవేత్త. తెలుగు సాహిత్యాన్ని సైద్ధాంతిక, భావజాల, వస్తు శిల్పరంగాల్లో మలుపులు తిప్పిన సాహిత్య యుగకర్త అని దార్ల రామచంద్ర తులనాత్మకంగా అధ్యయనం చేసి నిర్ధారించారు.

చక్కని ముందు మాటలు రాయడంలో బి.ఎస్.రాములుగారినే ముందు చెప్పాలి అని సాహితీవేత్తల అభిప్రాయం. ప్రచురణకర్తగా వట్టికోట ఆళ్వారుస్వామిని ఆదర్శంగా తీసుకుని అనేక పుస్తకాలు ప్రచురించారు. సంపాదకత్వం వహించారు. యువ రచయితల రచనలను సరిచూసి పుస్తకాలు వెలువరించారు.

1982లో కరీంనగర్ బుక్ ట్రస్ట్ స్థాపించి బతుకుపోరు, అల్లం రాజయ్య భూమి కథలు, పలువురు రచయితలు రాసిన కథలతో సింగరేణి కార్మిక కథలు, అడవిలో వెన్నెల కథలు, సంకలనాలు ప్రచురించారు. ఇవి సమిష్టి కృషిలో వెలువడ్డాయి. సమిష్టి కృషిలో అందరినీ కలపడం, కలుపుకుపోవడంలో వీరు నిపుణులు. నాయకత్వ లక్షణాలు గురించి **"వ్యక్తిత్వ వికాసం - సామాజిక నాయకత్వం", "జీవితం అంటే ఏమిటి?"** గ్రంథాల్లో రాసిన అనుభవాలన్నీ వీరివే అని ఇలాంటివెన్నో సాక్ష్యం ఇస్తాయి.

1990లో విశాల సాహిత్య అకాడమీ ప్రారంభించారు. విశాల సాహితీ ప్రచురణలుగా తన రచనలతో పాటు కె.సీతారాములు, కె.వి.నరేందర్, ముదిగంటి సుజాతారెడ్డి, పెద్దింటి అశోక్‌కుమార్, దార్ల రామచంద్ర, నేరెళ్ల శ్రీనివాసగౌడ్, వొడ్నాల సూర్య, జాజుల గౌరి, నల్లాల లక్ష్మీరాజం, ఇ.వెంకటేశు, నిర్మల విద్యాసాగర్, పి.చంద్ మొదలైనవారి రచనలు కూడా ప్రచురించారు.

ఒక విశ్వవిద్యాలయం చేసినట్టుగానే విశాల సాహిత్య అకాడమీ తరఫున విశాల సాహితీ అవార్డులను ఇచ్చారు. భూపాల్, నవీన్, ఆడెపు లక్ష్మీపతి, కె.వి.నరేందర్, శాంతి నారాయణ, ముదిగంటి సుజాతారెడ్డి, కాలువ మల్లయ్య, గంటేడ గవర్నాయుడు, ఎ.అప్పలనాయుడు, ఎండ్లూరి సుధాకర్, వోల్గా, పెద్దింటి అశోక్‌కుమార్, పి.చంద్, సింగమనేని నారాయణ, కుప్పిలి పద్మ, అంబల్ల జనార్దన్, బోయ జంగయ్య, బిట్ల నారాయణ, బెజ్జారపు వినోద్‌కుమార్, నల్లాల లక్ష్మీరాజం, కె.వరలక్ష్మి, పులుగు శ్రీనివాస్, నంబూరి పరిపూర్ణ, కొలకలూరి ఇనాక్, దాశరథి రంగాచార్య గార్లకు ఈ అవార్డులు ప్రదానం చేయబడ్డాయి. తెలుగు సాహిత్యంలో వీరి స్థానమేమిటో సుప్రసిద్ధం. ఈ అవార్డులు యువ రచయితలు అందుకున్నాక కలిగిన ఉత్సాహంతో, ప్రోత్సాహంతో మరింత ఉన్నత శిఖరాలకు ఎదిగారు. ఇలా అవార్డుల లక్ష్యం పూర్తిగా నెరవేరిందని చెప్పవచ్చు.

సాహిత్య ఉద్యమ రంగంలో, సాహిత్య సంస్థల నిర్మాణంలో కూడా బి.ఎస్.రాములుగారు చరిత్ర సృష్టించారు. ఇలా అనేక రంగాల్లో బహుముఖీనంగా వీరి కృషి కొనసాగుతూ వచ్చింది. గత ఆరేళ్లుగా తన జీవితాన్ని సాహిత్యానికి, సమాజానికి పూర్తిగా అంకితం చేసి పనిచేస్తున్నారు.

## సామాజిక తత్వవేత్త బి.ఎస్.రాములు – ఒక జీవనది

తెలంగాణ తొలితరం కథకులు గూడూరి సీతారాంగారు అన్నట్లు – 'బి.ఎస్.రాములుగారు ప్రఖ్యాత సామాజిక తత్వవేత్త. తెలుగు కథకు తాత్విక స్పర్శ అద్దిన గొప్ప కథకులు. తెలంగాణ భూమికతో భారతీయ అంతరాత్మను సామాజిక ఆర్థిక చరిత్రను తమ రచనల్లో ఆవిష్కరిస్తున్నారు. భారత ఉపఖండంలో బహుజన చైతన్యాన్ని తెచ్చిన దార్శనికుల్లో ఒకరు. భారతీయ చారిత్రక భౌతిక వాదాన్ని సుసంపన్నం చేసిన కొద్దిమందిలో ఒకరు.

బి.ఎస్.రాములుగారు ఒక నిరంతర ఉద్యమ చైతన్యం. ప్రస్తుతం ఆధునిక తెలుగు సామాజిక చరిత్ర, సాహిత్య చరిత్ర పునర్మూల్యాంకనం గురించి విస్తృత పరిశోధన చేస్తున్నారు. పలువురి వ్యాసాలతో పునర్మూల్యాంకనం చేసి సాహిత్య చరిత్ర, సామాజిక చరిత్రలను తెలుగు సమాజానికి అందిస్తున్నారు. బి.ఎస్.రాములుగారు భారతీయ తాత్విక రంగంలో జీవనదిలా ప్రవహించే తెలుగు తాత్విక చైతన్యం. ఈ తరం రచయితలకు మార్గదర్శకులు. వారొక కథల బడి, జీవన తత్వనిధి."

ఇలాంటి జీవనదిని ఒక చిన్న పరిశోధనలో ఒడిసిపట్టడం అసాధ్యమైన పని. కొండ అద్దంలో చూపినట్టుగానైనా కాకుండా నా చిన్ని అనుభవం మేరకు ఇందులో కొంతే అందించాను.

**బి.యస్.రాములు కథల్లో గమనించిన ముఖ్యాంశాలు :**

బి.యస్.రాములు గారు గ్రామాలతో పాటు పట్టణ పేద ప్రజల జీవితాలను కేంద్రాలుగా చేసుకున్నారు. మానవజీవితమే ముడి సరుకుగా చేసుకుని కథలను రాస్తున్నారు. సామాజిక పరిణామాల చిత్రీకరణే వారి లక్ష్యం. అందులో భాగంగా పేదరికంలోని బాల్యజీవితం సమాజంలోని వ్యక్తుల ప్రవర్తన, మానవ సంబంధాలు – వివిధ ఉద్యమాలలో ప్రత్యక్ష అనుభవం వీరి కథల్లోకి నడిచివస్తుంది. తెలంగాణ సామాజిక జీవనానికి వీరి కథలు చారిత్రక పత్రాలు.

వీరి కథల్లో సమాజంలో కనుమరుగవుతున్న మానవ సంబంధాలు, మారుతున్న వరుసలు, ఆప్యాయతలు, ఆత్మీయతలు కనబడతాయి. అమ్మ, నాన్న, మామయ్య, అల్లుడు, మనమడు, లాంటి పదాల నిజమైన అర్థం విప్పి చెబుతాయి. మమతలు, ప్రేమ, ఆప్యాయతలు, అనుబంధాలు పట్టణాల్లో కనుమరుగవుతున్న తీరును చెబుతూ ఉదాత్తంగా ఎదుగుతున్న మరో పార్శ్వాన్ని కూడా జీవితం అంత సత్యంగా చిత్రిస్తారు.

ఈ కథల్లో గ్రామీణ భూస్వామ్య సమాజంలో ప్రజలు ఎదుర్కొన్న కష్టాలను కన్నీళ్ళను రికార్డ్ చేశారు. పంచవర్ష ప్రణాళికల ద్వారా నీటిపారుదల ప్రాజెక్టులు ప్రజల్లో తెచ్చిన మార్పులు, ఆధునిక విద్య ద్వారా దళితుల జీవితాలలో కలిగిన సామాజిక మార్పులు, ఎదుగుదల, ఎదగలేకపోయిన తీరు చిత్రించారు.



కులాతీత, మతాతీత వివాహాల అవసరం ఎంతో ఉందని తద్వారా సమాజంలో మానవ సంబంధాలు ప్రేమ మయం అవుతాయని అంటారు. తెలంగాణ విప్లవ పోరాటాలు, వాటి పరిణామాలు, విప్లవకారుల ఉద్యమ జీవితం వాటి పరిణామాలు తెలుపుతాడు.

సోషలిస్టు స్వప్నం భగ్నమై రష్యా సోషలిస్టు ప్రభుత్వం పడిపోయింది. దాంతో సూపర్ పవర్‌గా ఎదిగిన అమెరికా కన్స్యూమరిస్ట్ విష వస్తు సంస్కృతిని ప్రోత్సహిస్తున్నది. పర్యవసానంగా సోషలిస్టు దృక్పథం ముక్కలైన తీరు, గ్లోబలైజేషన్ మూలంగా మనుషులు వస్తువుల కన్న హీనంగా మారుతున్న తీరు, మార్చబడుతున్న తీరు వీరి కథల్లో అపూర్వంగా చిత్రించారు. నిప్పుల కొలిమిలో నిత్యం మండుతున్న తెలంగాణ హృదయ వేదనా చిత్రాలు బి.యస్.రాములు కథలు.

తెలంగాణలోని నక్సలైటు ఉద్యమంలో పురుషులు ప్రాణత్యాగం చేస్తుంటే, వారి భార్యలు సమాజంతోనూ, రాజ్యహింసతోనూ సతమతమవుతున్నారు. ఈ స్త్రీల త్యాగాలను ఏ చరిత్రకారుడు ఇంతవరకు గుర్తించని విషయాన్ని పట్టించుకొని వారి త్యాగాలను చరిత్రగా రికార్డ్ చేశారు.

ఆధునిక సమాజంలోని కొంతమంది కులవృత్తులు కాపాడుకోవాలని చెబుతుంటారు. కులవృత్తులు ఆధునిక జీవితం అందుకోవడానికి అడ్డుపడతాయని బి.ఎస్. రాములు స్పష్టం చేస్తారు. కులవృత్తులు వదిలి ఉన్నతవిద్య ద్వారా ఉద్యోగావకాశాలు అందిపుచ్చుకోవాలని ప్రబోధిస్తారు. గ్రామాలలో యంత్రాలు ప్రవేశించడం వల్ల వందమంది చేసే పని ఒక యంత్రం ఒక గంటలో పూర్తి చేయడం వల్ల పనిమీద ఆధారపడ్డ ప్రజలు పనులకోసం వలసలను ఆశ్రయించాల్సిన దుస్థితిని ఏర్పడిందని విశ్లేషించారు. చదువు ద్వారానే దళితులు ఎదగడం సాధ్యపడుతుందని నొక్కి చెబుతారు. ఆధునిక విద్య ఆధునిక సమాజంలో అట్టడుగు దళిత బహుజనుల జీవితాలలో కొత్త వెలుగు నింపిన విషయం వీరి కథల్లో స్పష్టంగా కనపడుతుంది. భారతీయ చారిత్రక భౌతిక వాదాన్ని నిర్దిష్ట సమాజంలో నిర్దిష్ట సామాజిక పరిణామాలతో సమన్వయించిన వీరి కథలు దశాబ్దాల తెలంగాణ చరిత్రకు అక్షర సత్యాలు. కాలనాళికలు.

"1982లోనే వీరిని గోర్కీ, లూసన్ అని ప్రశంసించారు. తాత్విక వ్యాసాలు, గ్రంథాలు వీరిని పోతులూరి వీరబ్రహ్మం, వేమన, హెగెల్, ఆచార్య నాగార్జున సరసన నిలబెట్టారు. ప్రపంచంలోని సామాజిక తత్వశాస్త్రాల్ని జీవశక్తిగా మార్చుకొని సమకాలీన సామాజిక తత్వశాస్త్రాల్ని రూపొందిస్తున్నారు. అరిస్టాటిల్, అనందవర్ధనునివలె సాహిత్య, అలంకార శాస్త్రాలు కూడా రాశారు. తెలంగాణ ప్రత్యేక రాష్ట్ర ఉద్యమాన్ని నడపడంలో తనవంతు చేర్పును అందిస్తున్నారు. బి.ఎస్.రాములు గారు ఒక సామాజిక, తాత్విక విశ్వవిద్యాలయం. ఇక అందులో అందరమూ విద్యార్థులమే. వీరి రచనలు ఆంగ్లీకరించబడి జాతీయ, అంతర్జాతీయ స్థాయిలో చర్చలోకి వెళితే ఒక ప్లేటోకి, ఒక హెగెల్‌కి తగ్గవని పెద్దలు పేర్కొన్నారు." (బి.ఎస్.రాములు స్వర్ణోత్సవ సంచిక నుండి)

# బి.యస్. రాములుగారితో ఇంటర్వ్యూ

1. **మీ రచనలకు స్ఫూర్తి ఎవరు?**

నా రచనలకు స్ఫూర్తి సాహిత్య పఠనం. మా అమ్మ, అమ్మమ్మ చిన్నప్పుడు చాలా కథలు చెప్పేవారు. జానపదశైలిలో చాలా కథలు విన్నాను. సంచార కళాకారుల బృందాలు ఎన్నో కళారూపాల ద్వారా నాలో సాహిత్య ప్రేరణ కలిగించాయి. ప్రాథమిక పాఠశాలలోని రకరకాల పోటీలలో పాల్గొని చిన్న చిన్న బహుమతులు పొందేవాణ్ణి. మా పెద్దనాన్న మిట్టపెల్లి రాజయ్య అచలతత్వంలో గురు సాంప్రదాయం. అలాగే ఆ కాలంలో అనగా 1960 లలో శుక్రవారం పూజల సందర్భంగా చాలా పాటలు పాడేవారు. అలా ఐదవ తరగతి నుంచి సాహిత్య రచనపై ఆసక్తి పెరిగింది. తెలుగు నేర్పిన తెలుగు పండిట్లు భాస్కర్‌రెడ్డి, కమలాకర్‌రావు గార్ల ప్రోత్సాహంతో తొమ్మిదవ తరగతిలో పద్యాలు రాయడం ప్రారంభించాను. గేయకథా కావ్యాలను రాసేవాణ్ణి. అవి పత్రికలకు పంపితే ప్రచురించకపోవడం వల్ల రాయడం ఆగిపోయింది. పదవ తరగతి నుండి పత్రికలలో లేఖలు, వచన కవితలు రాసేవాణ్ణి. వచన కవితలు 1967 నుండి రాయడం జరిగింది. 1970వరకు 'జగిత్యాల' గ్రంథాలయంలోని తెలుగు పుస్తకాలు దాదాపు అన్నీ చదివేశాను. మద్రాసునుండి వెలువడే డిటెక్టివ్ నవలా సాహిత్యం, కొన్ని వందల నవలలు చదవడం జరిగింది. 1970 నుండి ఎమెస్కో ప్రచురణలు, వారపత్రికలు, మాసపత్రికలు మొదలైనవి విరివిగా చదవడం, చదివించడం ఒక వ్యాపకంగా మారింది. ఆ తర్వాత రవీంద్రనాథ్ ఠాగూర్, శరత్‌బాబు, ప్రేమ్‌చంద్, గోర్కీ, షొలకోవ్, వట్టికోట అళ్వార్‌స్వామి మొదలైన వారిని సాహిత్యంలో ఆదర్శంగా తీసుకున్నాను. రచయితల సంఘాల నిర్మాణాన్ని చేపట్టడానికి గోర్కీ, ప్రేమ్‌చంద్, వట్టికోట అళ్వార్‌స్వామి నాకు స్ఫూర్తినిచ్చారు.

2. **మీ రచనలకు స్ఫూర్తినిచ్చిన అంశాలు?**

నాకు చిన్నప్పుడు పిల్లల సాహిత్యంలో ఉండే ప్రకృతి, అడవులు, ఊహల్లో విహరించడం రాజులు, పక్షులతో పాటు మనుషులు ఇతర ప్రదేశాలకు ఎగిరిపోవడం, అద్భుతరసంతో కొండగుహల్లో, అనుకోని పరిస్థితుల్లో మనిషికి



చిక్కుకుపోవడం, వాటితో పోరాటం చేసి మనిషి గెలవడం మొ॥ కథాంశాలు, పొడుపు కథలు, ఎంతో ఉత్సాహాన్ని, స్ఫూర్తిని కలిగించాయి. అలాగే ప్రపంచాన్ని తెలుసుకున్నాననే ఆనందం కలిగేది.

మనిషికి, ప్రకృతికి, మానవ సంబంధాల మధ్య ఆసక్తిని కలిగించే అంశాలు ఎంతో ఉత్తేజాన్నిచ్చాయి. అలా కాశీమజిలీ కథలు, పంచతంత్ర కథలు, భక్తధ్రువ, మార్కండేయ కథలు, మారుతల్లి పెట్టే కష్టాల కథలు, మర్యాదరామన్న కథలు, భట్టి విక్రమార్క కథలు, బేతాళ కథలు, భారత రామాయణాలు చదివాను. మా మేనమామ బేతి రాములు వద్ద ఉన్న పురాణాలు మొ॥ ఎన్నో చదివాను. నేను చిన్నతనంలోనే తండ్రిని ఆరోయేట కోల్పోవడం వల్ల ఏర్పడిన వెలితిని, కష్టాలను ఇలా సాహిత్య పఠనం ద్వారా, జానపద, పౌరాణిక సినిమాలను చూడ్డం ద్వారా ఊహించుకుంటూ ఒక గొప్ప ఊహాలోకంలో విహరించేవాణ్ణి అని యిప్పుడనిపిస్తున్నది. సురభి నాటకాలు, సర్కస్‌లు కూడా స్ఫూర్తినిచ్చేవి.

చిన్నతంలో సాంఘిక సినిమాలు పెద్దగా నచ్చేవి కావు. జానపద, పౌరాణిక సినిమాలు బాగా నచ్చేవి. ఇప్పుడు బాలసాహిత్యం మీద వర్గీకరించేవి. బాగా నచ్చాయి, స్ఫూర్తినిచ్చాయి. ఆత్మవిశ్వాసం కలిగించాయి. జీవితంపట్ల ఆశల్ని, ఊహల్ని పెంచాయి. అలా పేదరికం, కష్టాలతో కూడుకున్న జీవితాన్ని ఉత్సాహపూరిత జీవితంగా మలుచుకోవడం జరిగింది.

3. **మీరు ఎదిగిన నేపథ్యం?**

నేను రచయితగా 13వ యేట ప్రారంభమయ్యాను. ఇతర ప్రాంతాలలో అదే కాలంలో, అదే వయస్సులో 1960 నుండి కథ, నవల, వారపత్రికల ద్వారా ప్రచారం వేగం పుంజుకున్నాయి. గైడ్‌లైన్స్ ఇచ్చే వాళ్ళున్న ప్రాంతాల్లో, కులాల్లో చిన్నతనంలోనే రచయితలుగా ఎదిగారు. కాని మా ప్రాంతంలో అలాంటి వాతావరణం లేదు. పద్యాలతో, పాండిత్య ప్రకర్షతో, గ్రాంధిక భాష అభిమానంతో మిగతా ప్రక్రియలను కించపరిచే వాళ్ళు. మమ్మల్ని ఎదగడానికి మా ఉపాధ్యాయుల, మా మిత్రులకు పాఠాలు చెప్పిన లెక్చరర్ల శక్తిసామర్థ్యాలు చాలలేదు. ఆధునిక సాహిత్యంలో వారికి ప్రవేశంగాని, అభిరుచి గాని, పరిచయం గాని లేదు. కొన్ని ప్రాంతాల్లో, మాకన్న చిన్నవాళ్ళు రచనలు చేయడం సాగినట్టు ఆ తరువాత తెలిసింది. ఉ॥కు పైగంబర కవులు, తిరుగుబాటు కవులు, యువభారతి కవులు మొ॥ వారిలో మాకన్నా ఎంతో చిన్నవాళ్ళే రచయితలుగా కనపడతారు. మాకు ఆ సమాచార వంతెనగాని, గైడ్‌లైన్స్‌గాని లేవు. పైగా రాసి చూపిస్తే, సరిగ్గా రాయకపోతే బీజాక్షరాలు పద్యం రాసిన వారికి నష్టం చేస్తాయని బెదిరించారు. కథలు, గేయకవితలు రాస్తే ఇది కూడా సాహిత్యమేనా! అని కించపరిచారు. మాతోపాటు ఉన్న ఏడెనిమిదివంది రచయితలు కావాలి. వాళ్ళ తీగలు, ఆకులు, వేళ్ళు

ఎండిపోయాయి. నేను ఒక్కణ్ణి దక్కాముక్కీలు తిని ఆలస్యంగా రచనా రంగంలో నిలదొక్కుకోవడం జరిగింది.

**4. మీ వ్యక్తిగత జీవితం కథలపై ఏ విధంగా ప్రభావం చూపింది?**

నా వ్యక్తిగత జీవితాన్ని రాయడానికి మొదట్లో సంకోచంగా ఉండేది. ఎందుకంటే ఆనాటికి అందుబాటులో ఉన్న సాహిత్యంలో మాలాంటి వ్యక్తిగత జీవితాలు కనబడేవి కావు. బ్రాహ్మల జీవితాలు, అగ్రకులాల సంస్కృతి, కార్లున్నవారి కష్టాలు లేదా రాజకుమారుల కష్టాలు కనబడేవి. నా వ్యక్తిగత జీవితం, నా చుట్టూ ఉన్న జీవితం సాహిత్యానికి అర్హమైనది కాదేమో అన్పించేది. కళాశాలలో నేర్పిన తెలుగు ప్రాచీన సాహిత్యం, అలంకార శాస్త్రాలు కూడా రాజులు, బ్రాహ్మణులను కథానాయకులుగా చిత్రించాలని సిద్ధాంతాలు చేసి, మా సమాజం, సాహిత్య గౌరవానికి పనికిరాదని మాకు మేమే అనుకునే దుస్థితిని తెచ్చిపెట్టాయి. అనగా మా ఆశలను, ఆరాటాలను, జీవితాలను అవి జీవితాలే కావన్నట్టు, మేం అనుకునేట్టు చేశాయి. ఇలా దోపిడీ వర్గాలు, దోపిడీ కులాలు లక్షలాది విద్యార్థుల సృజనాత్మకతను చంపివేయడంలో విజయం సాధించాయి.

ఈ దశ నుండి బయటికి రావడానికి మా చుట్టూ ఉన్న జీవితాలను చిత్రించాలని ఆత్మవిశ్వాసం కలగడానికి నక్సలైట్ ఉద్యమాలు వాటి సాహిత్యం ఆ సాహిత్యకారుల సహచర్యం ఎంతగానో ఉపకరించాయి. అలా పదేళ్ళు ఆలస్యంగానైనా మా చుట్టూ ఉన్న జీవితాలను చిత్రించడానికి ఒక సందర్భం ఏర్పడింది.

అయితే ఉద్యమ సాహిత్యానికి జీవితంలో ఉండే విస్తృతిని, వస్తువైవిధ్యాన్ని ఉద్యమ సాహిత్యం తనలోభాగం చేసికోలేకపోయింది. దానివల్ల నేను రాసిన 'బతుకుపోరు' నవలను హృదయపూర్వకంగా స్వీకరించలేక పోయింది. జీవితాన్ని కాకుండా పోరాటాల్ని, ఉద్యమాల్ని చిత్రించాలనేది వారి ఉద్దేశ్యం.

అలా సాంప్రదాయక సాహిత్య వాతావరణం గోడదెబ్బైతే ఉద్యమ సాహిత్య వాతావరణం చెంపదెబ్బ అయింది. నా పరిస్థితి ముందు నుయ్యి వెనుక గొయ్యి అయింది. వచన సాహిత్యంలో ఒకవైపు అగ్రకులాల కోస్తా ప్రజల జీవితాలు ఊరేగుతున్నాయి. మా తెలంగాణ జీవితాలు చిత్రిద్దామంటే అవకాశాల్లేవు. తెలంగాణ జీవితాల్ని అచ్చువేసే వాళ్ళులేరు. ఉద్యమ సాహిత్యకారులకు ఉద్యమం గురించిన రచనలను తప్ప ప్రజల జీవితాలను సంబంధించిన రచనల మీద ఆసక్తి లేదు.

ఇలాంటి దశలో తెలంగాణ జీవితాల్ని రచనల్లో చిత్రించలేక పోయాను. అందువల్ల కథల్లో మా వ్యక్తిగత జీవిత ప్రభావం లేకుండా పోయింది. నేను జగిత్యాల పట్టణంలో పుట్టి పెరిగిన వాడినైప్పటికీ పట్టణ జీవితం కాకుండా పల్లెల జీవితాన్ని రాయడం జరిగింది. అందుకు మా బంధువుల పల్లెలను తిరిగిన



అనుభవాలు పునాదిగా చేసుకోవడం జరిగింది.

అటు తరువాత జగిత్యాల నుండి ధర్మపురి వెళ్ళిన తరువాత ధర్మపురి పరిసరాలని సుమారు 30 గ్రామాలను సందర్శించే అవకాశం కల్గింది. అలా వెలమలను, భూస్వాములను వారి ఇండ్లను వారి ప్రవర్తనను సమీపం నుండి వారి నిత్యజీవితంలో ఉండే స్వభావాలను గమనించడం జరిగింది. వీటిని గ్రామీణ కథలు రాసేప్పుడు గుర్తుంచుకొని రాయడానికి ఉపయోగించడం జరిగింది.

అయితే నాకు తెలిసిన జీవితాల గురించి, నాకు తెలిసిన సమాజం గురించి ఇప్పటి వరకు ఒక్క శాతం కూడా రాయలేకపోయాను. దానికి కారణం ఉద్యమాలు కొన్నింటినే కోరుకోవడం, అందులోనూ అనుభవాలు, దృక్పథాలు, పట్టించుకోకపోవడం ఈ సంఘర్షణ నుండి రాయాల్సినవి ఒక్క శాతం మేరకైనా రాయలేకపోయాను. వాటిని ఇక నుండి అరవయ్యేళ్ళ తెలంగాణ సామాజిక పరిణామాలను కరీంనగర్ జిల్లా నేపథ్యంలో చిత్రించాలని ఉంది.

**5. మీ రచనల్లో పల్లెల జీవితం సహజంగా కన్పిస్తుంది. వీటికి ప్రేరణ ఏమిటి?**

ఇందాక చెప్పినట్టు నేను రకరకాల అవసరాల్లో భాగంగా పల్లెలకు వెళ్ళాను. వృత్తిరీత్యా ధర్మపురి ప్రాంతంలో, ఉద్యోగరీత్యా కరీంనగరం నుండి కొదురుపాక, బోయినపల్లి, వేములవాడ, సిరిసిల్ల దాక ఉన్న 40 కిలోమీటర్ల ప్రాంతాన్ని అక్కడి ప్రజలను సందర్శించాను. ముఖ్యంగా దళితవాడలను, స్కూళ్ళను, సర్పంచ్‌లను, ఆవూరు పెద్దమనుషులను కలిసాను. ఆ అనుభవాలు విస్తారమైనవి. వాటిని ఇలా రాసేవాళ్ళుంటే కథలు కథలుగా ఎన్నైనా రికార్డు చేయవచ్చు. అలా వచ్చిన అనుభవాలు కథల్లో పల్లెల జీవితం సహజంగా చిత్రించడం సాధ్యపడింది. నిత్యం పేద విద్యార్థుల మధ్య ఉండడం వల్ల ఆశలు, కష్టాలు, కన్నీళ్ళు వారి తల్లిదండ్రుల దైన్యం నిరంతరం గుండెల్ని పిండివేసేది.

**6. మీ కథల ద్వారా మీరు ఆశించినది సాధించగలిగారా?**

సాధించాననే చెప్పాలి. ముఖ్యంగా కథలు వ్రాయడం ద్వారా నేను మారాను. నాకు తెలిసిన జీవితాలు చిత్రించాలని అనుకున్నాను. అలా ఒక ప్రాంతం సామాజిక చరిత్రను, పరిణామాలను, మానవ సంబంధాలను కథలు, నవలల రూపంలో అక్షరబద్ధం చేశాను. అట్టడుగు వర్గాల, అట్టడుగు కులాల జీవితాలు సాహిత్య గౌరవం పొందాలని.... నాలాగా గైడ్‌లైన్స్ లేని స్థితిలో తెలుగు సాహిత్యం, తెలంగాణ సాహిత్యం ఉండకూడదని అవసరమైన వారికి కథా శిక్షణ శిబిరాలు నిర్వహించాను. వందలాది ప్రసంగాలు, సంభాషణలు చేశాను. వేలాది లేఖలు రాశాను.

కథా సాహిత్య అలంకారశాస్త్రం - 50 యేళ్ళ తెలుగు కథ తీరుతెన్నులు,

గ్రంథాలు రాశాను. విశాల సాహితి కథా పురస్కారాలు, సాహిత్య సభలు మొదలైనవి అన్నీ నేను కథల ద్వారా సాధించాలనుకున్న లక్ష్యంలో భాగమే.

ఇవ్వాళ రాష్ట్రంలో తెలంగాణా జీవితాల గురించి, భాష సంస్కృతి గురించి, అణగారిన కులాల, వర్గాల గురించి నిర్భయంగా చిత్రించగలుగుతున్నారు. జీవితాలను మార్చుకోవాలని, మరింత మంచి జీవితం గెల్చుకోవాలని చేసే కృషిలో భాగంగా సాహిత్య వస్తువును ఎన్నుకున్నాను. అలా జీవితాల ఎదుగుదల కోసం చేసే కృషి ఉద్యమాల ద్వారా, సాహిత్యం ద్వారా ఏకకాలంలో సాహిత్యంలో జరిగాయి. అలా కొన్ని నూతన తరాలు ఇవ్వాళ ఎదిగివచ్చాయి. ఇంకా ఎదుగుతారు. ఇవ్వాళ సాధించిన దానికన్న మరింత ఎక్కువగా భవిష్యత్తులో ఈ కృషి తాలూకు స్ఫూర్తి ప్రేరణ ముందు తరాలకు కొనసాగుతుంది.

**7. మీరు రాసిన కథల్లో మీకు బాగా నచ్చిన కథలు ఏవి?**

నా కథలు కొంత మంది కథకుల్లాగా ఒకేచోట ప్రారంభించి విస్తరిస్తూ వచ్చిన కథలు కావు.

**నా కథా ప్రస్థానంలో అయిదు దశలున్నాయి.**

నేను రాసిన చాలా కథలు నాకు నచ్చినవే. నాకు నచ్చని కథలు అంటూ నేను రాయడం ఎలా సాధ్యం? ఏ కథనైనా నాకు నచ్చేదాకా కథను తిప్పి రాస్తూనే ఉంటాను. చిత్రకారులు ఇదేపని చేస్తుంటారు.

నాకు బాగా నచ్చిన కథలు అంటే ఒక అర్థంలో రచయిత ఆ కథలో చెప్పదలచుకున్నది, చిత్రించదలచుకున్నది, పూర్తి చేయగలగడం, దాన్ని పాఠకులు, సాహితీవేత్తలు, అదే స్థాయిలో స్వీకరించగలగడం. భారతీయ చారిత్రక భౌతికవాదం నా కథలకు ప్రధాన భూమికగా స్వీకరించాను. దీన్నే సమస్త వర్ణ, వర్గ, కుల, లింగ, జాతి, మత, భాష, ప్రాంత వివక్షతలకు, అసమానతలకు వ్యతిరేకంగా స్వేచ్ఛా, సమానత్వం, సౌభ్రాతృత్వం మా తాత్విక భూమిక అని దరకమే ఐక్య వేదిక దృక్పథంగా ప్రకటించుకున్నాయి. ఇలా భారతీయ చారిత్రక భౌతిక వాదాన్ని అనుసరించి చరిత్రను పునర్‌నిర్మించడానికి కథా నవల ప్రక్రియలను వాహికగా చేసుకున్నాను. చరిత్రను పునర్‌నిర్మించడానికి ఈ ప్రక్రియలు గొప్పగా ఉపకరిస్తాయి.

ఇలాంటి కథల్లో నాకు నచ్చినవి చాలానే ఉన్నాయి. 1980లలో వ్రాసిన 'పాలు', 'అడవిలో వెన్నెల', 'సహజాతాలు', 'దొంగ గొడ్డుకు లొటారం', 'తల్లి కొడుకులు' మొదలైనవి 1985 వరకు రాసిన కథల్లో బాగా నచ్చిన కథలు.

1995 నుండి రాసిన కథల్లో 'స్మృతి' లేదా ఎనుకట ఏముండె, 'బందీ', 'రియల్ ఎస్టేట్', 'సదువు', 'దక్షయజ్ఞం', 'మెరుగు', 'తెల్లబట్ట', 'చెలిమ' మొ॥ కథలు బాగా నచ్చాయి. ఇవన్నీ సామాజిక పరిణామాలను చిత్రించిన కథలు.

నా కథా ప్రస్థానం మూడవ దశలో రాసిన 'పాతచీర', 'వరుసలు', 'వరలక్ష్మి',



'మలుపులు', 'ప్రేమికులు', 'మమతలు', 'సహజీవనం', 'ఐదవవాడు', 'వారసత్వం', 'ప్రేమధార' మొదలైన కథలు నేను బాగా రాశాననుకుంటున్న కథలు.

నా కథా ప్రస్థానం నాలుగవ మలుపులో 'వేపచెట్టు', 'చేయూత', 'నాగశాల', 'కామన్‌వెల్త్' మొదలైన కథలు బాగా నచ్చిన కథలు. నా కథా ప్రస్థానంలో 'బతుకు పయనం' కథలు అయిదవ మలుపు. ఈ కథల్లో సంస్కృతిని విస్తృతంగా చిత్రించే ప్రయత్నం చేశారు.

తొలిదశలో వ్రాసిన కథలు అవి అచ్చులో మిగిలిలేవు. కనుక వాటిని వదిలేద్దాం. ఆ తరువాత రాసిన కథలు తొలికథలు అవుతాయి. అలా 1978 నుండి వరకు కథా వస్తువులో కథా ప్రస్థానంలో మొదటి దశ ఇది. ప్రధానంగా విప్లవకథల దశ.

రెండవ కథా ప్రస్థానంలో నేను సామాజిక తాత్విక ఉద్యమాల్లో రచయితల సంఘాల్లో విస్తారంగా చేసిన కృషి ప్రజలకు ఇవ్వవలసిన డైరెక్షన్ ఇవ్వడం కోసం రాసిన కథలు. తొలిదశ కథలు, విప్లవద్యోమాల తాత్వికత కోసం రాసినవి. మలిదశలో విప్లవంలోని పరిణామాలను, వైఫల్యాలను, విజయాలను ఒక దార్శనికుడిగా చిత్రించిన పద్ధతి. వైరుధ్యాలు, ఇల్లాలు, దక్షయజ్ఞం, తెల్లబట్ట, మెరుగు కథలు ఈ కోవలోనివి. ఇలా రెండవ దశ నుండి రాసిన కథలు స్వయంగా సామాజిక తాత్విక భూమికను అభివృద్ధిపరచిన కథలు. అందువల్ల ఈ కథల్లోని సిద్ధాంతాలకు, దృక్పథానికి, కథాశిల్పానికి, జీవితానికి పూర్తిగా నేనే బాధ్యుడను.

మూడవ దశగా 'మమతలు మానవ సంబంధాలు' కథల సంపుటిని చెప్పాలి. ఇందులో విప్లవ ప్రభావంలేని, ముఖ్యంగా విప్లవ పార్టీ ప్రమేయంలేని తెలంగాణా సామాజిక చరిత్రను, మానవ సంబంధాలను పరిణామాలను చిత్రించాను. ఈ మూడవ దశలో ప్రజల సంస్కృతి, కుటుంబ సంబంధాలు, ప్రజల చరిత్ర, మారుతున్న తీరును, ఆదర్శ సమాజ నిర్మాణానికి అవసరమైన అవగాహనను చిత్రించాను.

నాలుగోదశగా గ్లోబలైజేషన్ పరిణామాలను, అది ప్రజల జీవితాల్లో తెస్తున్న మార్పులను చిత్రించిన కథలను చెప్పవచ్చు. ఇలా తాత్విక, సిద్ధాంత భావజాలం, నూతన దృక్పథాన్ని నా కథల ద్వారా అందించే ప్రయత్నం చేశాను.

విచిత్రంగా ఈ నాలుగు దశలు తెలుగు సామాజిక ఉద్యమాల పరిణామాలు ప్రస్థానాలు కూడా. వీటితో మొత్తం సాహిత్యం మారిందని చెప్పలేనుగాని, ఫెమినిజం సాహిత్యంలో నిర్వహించిన పాత్రని, ప్రభావాన్ని మా దళిత రచయితల, కళాకారుల మేధావుల ఐక్యవేదిక స్ఫూర్తి, కార్యక్రమాలు అందులో భాగంగా మేము, మా కథలు, సిద్ధాంతాలు, తమదైన చారిత్రక ప్రాధాన్యతను నిర్వహించాయి.

**8. మీ కథల్లో కొన్ని పాత్రల గురించి..... వీరు కథల్లోకి నడిచి వచ్చిన జీవితాలని అన్నారు. వాస్తవ జీవితాల నుండి పాత్రలను సంఘటనలను కథల్లోకి ఎలా మలిచారు?**

నేను రాసిన కథల్లోని పాత్రలు, సంఘటనలు, సన్నివేశాలు, అన్ని వర్తమాన సామాజిక జీవితం నుండి తీసుకున్నవే. అయితే ఎవరో ఒక వ్యక్తిని కాకుండా ఆ వ్యక్తిని పోలిన ఇతర వ్యక్తుల స్వభావాలను, అనుభవాలను కూడా ఒకే పాత్రలో, ఒకే కథలో కల్పించడం జరుగుతుంది. దీన్ని సాహిత్యంలో నమూనా పాత్రల సృష్టి అని అంటారు. సామాజిక ప్రతినిధులు అంటారు. అలాంటి కథలను సామాజిక వాస్తవికత సామాన్యీకరణ అంటారు. చరిత్రగా చిత్రించిన కథలు అంటారు.

ఈ అర్థంలో నేను కథల్లో చిత్రించిన పాత్రలు, సన్నివేశాలు, సంఘటనలు, పాత్రల మధ్య సంఘర్షణ, సామాజిక పరిణామాలన్నీ సామాజిక సత్యాలే. ఈ అర్థంలో నా రచనల్లో కల్పిత పాత్రలు లేవని చెప్పాలి. ఉ॥ 'సహజాతాలు' కథ 1985 నాటి సామాజిక పరిణామాల చరిత్ర. అలాగే 'దక్షయజ్ఞం' అనేక మంది జీవితాల్లో వచ్చిన పరిణామాల చరిత్ర. 'చేయూత', 'రియల్ ఎస్టేట్', 'వేపచెట్టు', 'కామన్‌వెల్త్' కథలు కూడా వాస్తవికతను, జీవితాలను, సంఘటనలను కథలుగా కూర్చినవే. 'స్మృతి', 'వారసత్వం', 'ఐదవవాడు', 'బందీ', 'తెల్లబట్ట' కథలు మీరు ఫలాన వాళ్ళను గురించిన వ్రాసినయా అని అడిగారు. ఇలా ప్రతి కథను గురించి అడగడం అనుభవం.

**9. మీ కథల్లో స్త్రీల సమస్యలు ప్రధానంగా చర్చించారు కదా!**

ఔను. మా నాన్న ఆరవయేట చనిపోవడంతో నేను అనేకమంది తల్లుల మధ్య, స్త్రీల మధ్య పెరిగాను. దానికి తోడు ఫెమినిజం కూడా ప్రచారంలోకి వచ్చింది. అయితే ఫెమినిస్టు రచనలు తెలుగులోకి రాకముందే స్త్రీలను ప్రధానంగా చేస్తూ 1982లో 'బతుకుపోరు' నవలలో సామాజిక చిత్రణను చేశాను. స్త్రీలు జనాభాలో సగం. నాకు పరిచయం ఉన్నవారిలో బీడీ కార్మికులతో సహా సగానికన్న ఎక్కువమంది స్త్రీలే. అందువల్ల స్త్రీల పాత్రలు ప్రధానంగా ఉదాత్తంగా చిత్రించాను. స్త్రీల బాధను, ఆవేదనను, కన్నీళ్ళను చిత్రించాను.

స్త్రీల పట్ల సానుభూతి, వారి పక్షం వహించడం మానవతా దృక్పథంతో ఎవరైనా చేసే పనే. ప్రేమ్‌చంద్, శరత్‌బాబు కూడా తమ కాలంనాటి పాత్రలను ఉదాత్తీకరించిన వారే. ఇల్లాలు, దక్షయజ్ఞం, మెరుగు, తెల్లబట్ట వంటి కథలు రాయడానికి జీవిత సత్యాలు తెలియడం ఒక్కటే చాలదు. ఆయా ఉద్యమాల నాయకత్వం నుండి, అభిమానుల నుండి ఎదురయ్యే వ్యతిరేకతను తట్టుకొనే ధైర్యం కూడా కావాలి. ఇలా పీడితుల్లో పీడితులైన వారి గురించి రాయడం వల్ల ఆయా ఉద్యమ కారులు ఎన్నో కష్టాల పాలు చేశారు. వెలివేశారు. ఎన్నో అవరోధాలు



సృష్టించారు. ప్రభుత్వాల రాజ్యహింస కన్నా ఎన్నో రెట్లుగా ఉద్యమకారుల, ఉద్యమ సాహితీవేత్తల మానసిక హింస కొనసాగింది. అయినా వాళ్ళు ఓడిపోక తప్పలేదు. సత్యం మరింత స్పష్టమైంది.

**10. కొన్ని కథల్లో మీరు స్త్రీల సంభాషణ రూపంలో ఎక్కువ విషయాన్ని చెప్పించడానికి కారణం?**

స్త్రీ పాత్రలను ప్రధానంగా చేసినపుడు సహజంగానే స్త్రీల సంభాషణ కొనసాగుతుంది. స్త్రీల సంభాషణలో, స్త్రీల భాషలో ఒక ఆర్ధత, ఒక మానవీయ స్పర్శ ఉంటుంది. ఇది పురుష భాష కన్న ప్రత్యేకమైన భాషను, జీవితాన్ని దృష్టి కోణాన్ని తెలుపుతుంధి.

**11. కులాల వారి సాహిత్యంపై మీ అభిప్రాయమేమిటి?**

కులాల వారిగా సాహిత్యం, కళలు, సినిమాలు, టివి సీరియళ్ళు విస్తారంగా వచ్చినపుడే సమాజంలోని వస్తువైవిధ్యం, వృత్తి వైవిధ్యం, తాలూకు ప్రత్యేక పారిభాషిక పదాలు, సామెతలు, నుడికారాలు, సంస్కృతి, పండుగలు, కుటుంబ సంబంధాలు, పెళ్ళిళ్ళు, చావులు వాటి విధానాలు ఎన్నో తెలుస్తాయి. అలా మనలో భాగంగా జీవిస్తున్న తోటివారి జీవితం, సంస్కృతి, దృక్పథం తెలుస్తాయి. తద్వారా అటాచ్‌మెంట్, ఆత్మీయత, సాన్నిహిత్యం పెరుగుతాయి. అయితే ఆ కులానికి పరిమితమయ్యే సంకుచితత్వం, ఇతర కులాలను వ్యతిరేకించే ఈర్ష్యా, అసూయలను వదిలించుకున్నప్పుడే ఇది సాధ్యం.

రష్యా, చైనా సాహిత్యం చదవడం వల్ల వాళ్ళంతా భారతీయులకు సుపరిచితులైనారు. బెంగాలి సాహిత్యం చదవడం ద్వారా బెంగాలీలు, తెలుగువారికి సన్నిహితం అయ్యారు. అలాగే అన్ని కులాల, అన్ని మతాల, అన్ని ప్రాంతాల మతాలు సార్వజనీయ మానవీయ విలువలు సంబంధాలు పరిణామంలో భాగంగా చిత్రించినపుడు అవి ప్రపంచ సాహిత్యంలో చేరదగిన క్లాసిక్స్‌గా మారుతాయి.

చక్కని శిల్పంలో రాసిన 'ఎరుకలి పందుల కథ', 'అతడు అడవిని జయించాడు' నవలగా రాస్తే పందుల వెతుకులాటకు వెళ్ళిన ఆ మానవుడిలో పాఠకులు లీనమౌతారు. పంచతంత్ర కథలు, పక్షుల, జంతువుల రూపంలో చెప్పినప్పటికి వాటిని ఆత్మీయంగా స్వీకరించడంలో రహస్యం కూడా ఇదే.

**12. మీరింత వరకు రాసిన కథలెన్ని?**

చాలానే రాసాను. సుమారు 150 కథలు రాశాను. వీటిలో కొన్ని అచ్చు కాలేదు. అచ్చయిన కథలు కూడా కొన్ని పత్రికల్లోనే ఉండిపోయి దొరకడం లేదు. 100కు పైగా అచ్చయ్యాయి. 80 కథల దాకా కథా సంపుటాల్లోగానీ, కథా సంకలనాల్లోగాని చేరాయనుకుంటాను.

**13. మీ కథలకు శీర్షికలను ఎలా ఎన్నుకుంటారు?**

నేను మొదట ఫలాన జీవితాలను రికార్డు చేయాలనుకుని చేసిన తరువాత ఏ పేరు సరిపోతుందో వెతుకులాడుతుంటాను. కథకు పేరు పెట్టడం అంటే తత్త్వశాస్త్ర పరిభాషలో చెప్పాలంటే కథను నిర్వచించడం. సూత్రీకరించడం. కథను స్టేట్‌మెంట్‌గా మలచడం. అంటే ఒక శీర్షికను లేదా పేరును కథ రాసిన తరువాత పెట్టినప్పటికీ కథాశీర్షిక మొదట ఆ కథలోని అంతస్సారాన్ని లేదా మౌలికాంశాన్ని తెలియజేస్తుంది. ఆ తరువాత కథ ఆ పేరు యొక్క వివరణే అవుతుంది. అందువల్ల ఏం చెప్పామో అవన్ని పేరులోనే నిక్షిప్తమయి ఉండేంత సమగ్రమైన పేరుని వెతకడం జరుగుతుంది. ఉ|| 'వారసత్వం' అనే కథకు కథ పేరు గురించి ఎంతోమంది మిత్రులు ఎన్నో సూచనలు చేశారు. చివరకు 'వారసత్వం' అనేపేరు స్థిరపడింది. కాని మరోకథ 'దక్షయజ్ఞం' విషయంలో కథ రాయడం, పేరు పెట్టడం రెండు కొంచెం అటూఇటూగా ఒకేసారి జరిగాయి. కథలకు పేరు నిర్ణయించడంలో కథ యొక్క నిర్వచనం స్థాయిలో ఉండాలని ఆలోచించడం వల్ల కథలకు పేరు పెట్టడం ప్రతీసారి ఎంతో మథనం అవసరం అవుతున్నది.

**14. మీ కథల్లో కనిపించే శిల్పంలో ప్రధానాంశాలు ఏమిటి?**

ఏ కథా శిల్పమైనా చదివించేదిగా ఉండాలి. నా కథా ప్రస్థానం నాలుగు దశల్లో దశల్లో కూడా దీన్ని పాటిస్తూ వచ్చాను. నాలుగు దశల్లో రకరకాల వస్తువు ఇతివృత్తాలతో పాటు శిల్పం కూడా రకరకాలుగా మారుతూ వచ్చింది.

మొదటి దశలో సన్నివేశాల చిత్రణ, పాత్రచిత్రణ, ఉద్యమ చిత్రణ, ప్రధానంగా కనబడుతుంది. రెండవ దశలో వస్తువులోను, శిల్పంలోను అనేక మలుపులు వైవిధ్యపూరితంగా వచ్చిచేరాయి. అలా వస్తువుతోపాటు శిల్పవైవిధ్యం సాధించడానికి సుమారు రెండువేల కథల్ని మళ్ళీ చదివాను.

మూడవ దశలో శిల్పం మరో మలుపు తీసుకుంది. పూనా ఫిలిం ఇన్‌స్టిట్యూట్‌లో నెలరోజులపాటు అప్రిసియేషన్ కోర్సు పూర్తిచేశాక వస్తుశిల్ప వైవిధ్యాన్ని మరోవిధంగా మలిచాను. అరపేజి కథ రాసుకుని రెండు గంటలు సినిమా తీస్తే, పది పేజీల కథలో నాలుగు సినిమాలు తీసేంత లేదా యాభై టి.వి. ఎపిసోడ్‌లు తీసేంత కథ రాయగలిగినపుడు సైన్స్ టెక్నాలజీ సాధించిన వేగంతో పాటు, కాలంతో పాటు రచయిత పరుగెత్తడం సాధ్యపడుతుందనిపించింది.

అలా సైన్సు ప్రాధాన్యత శిల్పంలో గుర్తించకపోతే స్కూటర్ల కాలంలో, రైళ్ళకాలంలో, గుర్రాల బగ్గిలో, ఎడ్లబండిలో పోయినట్టు రచయితలు వస్తుశిల్పాల్లో వెనుకబడి పోతారు. అందుకని ప్రతి పేరాలో ఒక కథాంశాన్ని సంఘటనల్ని సృష్టించి చిత్రించాను. ఒక కథ తాలూకు సమగ్ర సామాజిక పరిణామాలను ఆ కథలో చిత్రించడం చేసినపుడే అది సామాజిక వాస్తవికతగా, సామాజిక చరిత్రగా



సమాజాన్ని రికార్డు చేసి పెట్టడం సాధ్యపడుతుంది. అందుకే ఈ దశలో కథా శిల్పం అభివృద్ధి పరుస్తూనే ఒక కథలో-ఒక నవలలో ఉండేంత కథను చెప్పడం జరిగింది. ఇవి వస్తువుకు, శిల్పానికి ఒక ప్రత్యేకతను తెచ్చిపెడుతుంది. నిజానికి ఇది కొత్త విషయమేమీ కాదు. చందమామ, బాలమిత్రలాంటి పిల్లల కథల్లో ఉండే శిల్పమే ఇది.

**15. మీరు తెలంగాణభాషలో కథలు రాస్తుంటే ఇతర ప్రాంతాలవాళ్ళు ఎలా స్వీకరిస్తున్నారు?**

బ్రిటీషాంధ్రుల ప్రాంత మాండలిక భాషను పత్రికా భాషగా అర్థం చేసుకోవడానికి మేం హిందీ భాష నేర్చుకోవడం కన్న ఎక్కువ కష్టపడ్డాం. మాకు హిందీ లిపి రాకపోవచ్చుగాని, హిందీ, ఉర్దూ మిశ్రమ భాష అయిన హిందుస్థాని భాష జనవ్యవహారంలో ఉండేది. హిందుస్థాని భాష జాతీయ స్థాయి భాషనే కాకుండా, అంతర్జాతీయ ప్రతిపత్తి కలిగిన భాష. ఆంధ్రప్రదేశ్ ఏర్పడడం వల్ల దాన్ని వదిలేసుకోవాల్సి వచ్చింది.

అలాగే తెలంగాణ మాతృభాషను వదిలేసుకోవాల్సి వచ్చింది. బ్రిటీషాంధ్రలోని కొన్ని జిల్లాల, ఒకటి రెండు కులాల స్థానిక మాండలిక భాషను పత్రికా భాష పేరుతో, వ్యవహారిక భాష పేరుతో నేర్చుకోవాల్సి వచ్చింది. అది నేర్చుకున్నా కూడా రెండవ శ్రేణి పౌరులుగా, సామంతుల భాషగా తెలంగాణ భాష కించపరచబడింది. ఆంధ్రప్రాంత మాండలికాన్ని తెలుగుభాషగా ప్రచారం చేశారు. ఇతరులపై రుద్దారు. అలా ఈ మూడు దశల్లో మేం జాతీయ, అంతర్జాతీయ భాషని వదులుకోవాల్సి వచ్చింది. తెలంగాణ మాతృభాషని వదిలేసుకోవాల్సి వచ్చింది.

ఇదంతా అయ్యాక తిరిగి ఉత్తరాంధ్ర మాండలికంలో రాస్తే దాన్ని అర్థం చేసుకోవడానికి కుస్తీ పట్టాల్సివచ్చింది. అటు తరువాత రాయలసీమ మాండలికాలు జిల్లాల వారీగా వెలువడుతుంటే, వాటిని చదివి అర్థం చేసుకోవాల్సి వచ్చింది. ఇన్ని దశలు, ఇన్ని దశాబ్దాలు గడిచిన తరువాత కూడా తెలంగాణ మాతృభాష ఇతర ప్రాంతాలకు అర్థంకావడంలేదంటే రెండు భాషలు వేరువేరనే అర్థం కదా!

భాషలు రెండు వేరువేరు కాదనే వాళ్ళు తెలంగాణ మాతృభాషలో పాఠ్యపుస్తకాలను, సినిమా, టివి, పత్రిక భాషలను తెలంగాణ వారిచే రాయించడం అవసరం. ఒక యాభై యేళ్ళు తెలంగాణ భాషలో రాయాలి. అప్పుడు తెలంగాణ భాష సులువుగా అర్థమవుతుంది. సామంతుల భాషపట్ల, సామంతుల పట్ల ఉండే చిన్న చూపుంటుంది. అందువల్ల తెలంగాణా భాష అర్థం కాలేదంటారు. వీళ్ళు ఇంగ్లీషు భాష అర్థంకాలేదని అన్నారా? ఉర్దూ, హిందీ అర్థంకాలేదని అన్నారా? అది పరిపాలకుల భాషగా ఉన్నందువల్ల నేర్చుకున్నారు. అర్థం కాలేదని ఎవరూ అనలేదు. అందువల్ల తెలంగాణ మాతృభాషను పరిపాలన భాషగా, సాహిత్య

భాషగా, పరిపాలక భాషగా మార్చడం అవసరం. అయితే నా కథలు అర్థం కాలేదని ఇతర ప్రాంతాలవాళ్ళు పెద్దగా చర్చలు చేయలేదు. ఆ కథల్లో ఉండే మానవీయ స్పర్శ వారిలోనూ కలిగించి సన్నిహితం చేయడం ప్రధాన కారణం దుఃఖం, స్పందనలు, సంవేదనలు ఏ భాషలోనైనా ఒక్కటే.

**16. వర్ధమాన కథకులపై మీ అభిప్రాయం? వారికి మీరిచ్చే సందేశం ఏమిటి?**

వర్ధమాన కథకులు చాలా మంది ఇప్పటిదాకా తెలుగు సాహిత్యం వదిలేసిన సామాజిక కోణాల్ని, జీవితాన్ని, సంస్కృతిని, అపూర్వంగా చిత్రిస్తున్నారు. గత 20 యేళ్లుగా వస్తున్నంత వస్తు వైవిధ్యం, శిల్ప వైవిధ్యం, సంస్కృతి వైవిధ్యం, జీవన వైవిధ్యం, 70 యేళ్ల కథ సాహిత్యంలోను లేదు. ఫెమినిస్టు రచయితలు, దళిత బహుజన రచయితలు, తెలంగాణ రచయితలు, ముస్లిం రచయితలు, తెలుగు సాహిత్యాన్ని సుసంపన్నం చేశారు. యువతం రచయితలు అద్భుతాలు సృష్టిస్తున్నారు. అయితే ఇంకా జీవిత అధ్యయనం, సిద్ధాంత అధ్యయనం పెరగాలి. రచనల్లో వేగం పెరగాలి. రచనలు విరివిగా చేయాలి. అపుడే చేయి తిరుగుతుంది.

వర్ధమాన రచయితలు ప్రపంచ సాహిత్యాన్ని విస్తృతంగా అధ్యయనం చేయాలి. శిల్పాన్ని పట్టుకోవాలి. అంతర్జాతీయ, చలన చిత్రోత్సవాల్లో ప్రశంసలు పొందుతున్న సినిమాలను చూడాలి. వాటిలోని చిత్రణను, ప్రెజెంటేషన్ తీరుతెన్నులను, వైవిధ్యాన్ని ఆకళింపు చేసుకోవాలి. సాహిత్య తత్వశాస్త్రాలను అనగా అలంకార శాస్త్రాలను అధ్యయనం చేయాలి. సామాజిక శాస్త్రంలో సామాజిక ఉద్యమాల్లో ఉన్న తాత్విక వైవిధ్యాలను, స్కూల్ ఆఫ్ థాట్స్‌ని పరిశీలించాలి. భారతీయ చారిత్రక భౌతిక వాద దృక్పథంతో చరిత్రను, మానవ సంబంధాలను, సంస్కృతిని, ప్రజల జీవితాన్ని విస్తృతంగా అధ్యయనం చేయాలి.

మనకు పైకి కనిపించే జీవితం తామరపువ్వు వంటిది. తామరపువ్వు వేళ్ళు, పుట్టుక ఎన్నో అడుగుల నీటిలోతున ఉంటుంది. అందువల్ల ఒక వ్యక్తిమాట, ప్రవర్తనపైపైకి చూస్తే తామరపువ్వులాగా మూలం తెలియకుండా చూసినట్టుగా ఉంటుంది. రచయిత ఒక దార్శనికుడుగా, సామాజిక మానసిక స్వభావాలను వాటి మూలాల్ని పట్టుకొని చిత్రించినపుడే గొప్ప రచయితలు అవుతారు. మిగతా కథలు కాలంతోపాటు కాలం తీరిపోతుంటాయి. 'మీకు తెలిసిందే జీవితం కాదు. మీరు తెలుసుకోవాల్సిన జీవితం ఎంతో ఉంది' దీన్ని తెలుసుకుని చిత్రించగలిగినవారే క్రాంతిదర్శి అవుతారు.

**ఇంటర్వ్యూ తేది:** 10-11-2005
**స్థలం** : "విశాల సాహిత్య అకాడమి"
విద్యానగర్, హైదరాబాద్-44.



# ఉపయుక్త గ్రంథ సూచి


1. **అప్పారావు గ్రంథం** : పరిశోధన పద్ధతులు, విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్, 4-1-435, విజ్ఞాన్ భవన్, బ్యాంక్ స్ట్రీట్, హైదరాబాదు - 500 001. లక్ష్మీ గణపతి ప్రింటింగ్ ప్రెస్, ఎఫ్.ఆర్.టి. 199, 1-1-379/50/1, జవహర్ నగర్, హైదరాబాద్-500 020.
2. **జయప్రకాశ్. ఎస్** : పరిశోధన విధానం విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్, 4-1-435, విజ్ఞాన్ భవన్, బ్యాంక్ స్ట్రీట్, హైదరాబాదు - 500 001. లక్ష్మీ గణపతి ప్రింటింగ్ ప్రెస్, ఎఫ్.ఆర్.టి. 199, 1-1-379/50/1, జవహర్ నగర్, హైదరాబాద్-500 020.
3. **విద్యాదేవి ఆకునూరి** : డా॥ పి.వి. రమణ కథలు-పరిశీలన, ఎం.ఫిల్ పట్టాకోసం సమర్పించిన సిద్ధాంత వ్యాసం - మే 2000.
4. **రాములు బి.యస్** : ఆధునిక భారతీయ సామాజిక తత్త్వవేత్త, బి.యస్. రాములు, 50వ జన్మదిన స్వర్ణోత్సవ సంచిక 1998, విశాల సాహిత్య అకాడమి, హైదరాబాద్ - 500 013.
5. **రాములు బి.యస్** : బహుజన తత్వం 1998, విశాల సాహితి అకాడమి, శివంరోడ్, హైదరాబాద్ - 500 013.
6. **సుందరయ్య పుచ్చలపల్లి** : వీర తెలంగాణ విప్లవ పోరాటం-గుణపాఠాలు, ప్రజాశక్తి బుక్ హౌస్, విజయవాడ.
7. **రాములు బి.యస్** : కథలబడి కథా సాహిత్య అలంకార శాస్త్రం 1998, విశాల సాహిత్య అకాడమి, జగిత్యాల, కరీంనగర్ - 505 327.
8. **సం॥ రాములు బి.యస్ చంద్రశేఖర్ వనమాల** : ఆధునిక కథ సరిత్సాగం కరీంనగర్ జిల్లా కథల రెండవ సంపుటి - 2002, విశాల సాహిత్య అకాడమి, హైదరాబాద్ - 500 013.

9. సం॥ కాత్యాయని విద్మహే : 20వ శతాబ్ది రాజకీయార్థిక పరిణామాలు తెలుగులో స్త్రీల సాహిత్యం, యూనివర్సిటీ ఆర్ట్స్ & సైన్స్ కళాశాల, కె.యు. వరంగల్.
నవోదయ బుక్ హౌస్, ఆర్యసమాజ్ ఎదురుగా, కాచిగూడ, హైదరాబాద్ - 500 027.

10. సం॥ డా॥సత్యనారాయణ ఎస్వీ : దళితవాద వివాదాలు, విశాలాంధ్ర బుక్ హౌస్, 4-1-435, విజ్ఞాన్ భవన్, బ్యాంక్ స్ట్రీట్, హైదరాబాద్ - 500 001.

11. సం॥ సీతారాం గూడూరి
ప్రభాకర్‌రావు సి.హెచ్.వి: తెలంగాణతల్లి ఎరుక
తెలంగాణ చరిత్ర సంస్కృతి, సామాజిక పరిణామాలు, సామాజిక తాత్విక విశ్వవిద్యాలయం, విశాల సాహిత్య అకాడమి, 2-2-186/53/5, రామక్రిష్ణ నగర్, బాగ్ అంబర్‌పేట, హైదరాబాద్ - 500 013.

12. రాములు బి.యస్ : జ్ఞానం పుట్టుక - జ్ఞానాభివృద్ధిలో తర్కం పరిమితి - బి.యస్. రాములు తాత్విక వ్యాసాలు, విశాల సాహిత్య అకాడమి, ఇం.నెం. 6-2-157, మిషన్ కాంపౌండ్, జగిత్యాల, కరీంనగర్ జిల్లా - 505 327.

13. హనుమంతరావు మాడపాటి : తెలంగాణ ఆంధ్రోద్యమము 1-2 భాగాలు, ఆంధ్ర చంద్రికా గ్రంథమాల, హైదరాబాద్ (1949)

14. రాములు బి.యస్
సం॥ సీతారాం గూడూరి
వెంకటేశం నిజాం
ప్రతాపరెడ్డి కాసుల : సమగ్ర సామాజిక కథ-తాత్విక భూమిక 50 ఏళ్ళ తెలుగు కథ తీరుతెన్నులు, విశాల సాహిత్య అకాడమి ప్రచురణ, 2-2-186/53/5, బాగ్ అంబర్‌పేట, హైదరాబాద్ - 500 013.



15. విద్యాసాగర్ యస్
సం॥ రాములు బి.యస్
ప్రతాపరెడ్డి కాసుల
అను॥ వెంకటేశం నిజాం : సామాజిక అర్థశాస్త్రం, విశాల సాహిత్య అకాడమి, 2-2-186/53/5, రామక్రిష్ణ నగర్, బాగ్ అంబర్‌పేట, హైదరాబాద్ - 500 013.

16. రాములు బి.యస్ : భారతీయ సమాజం - నేటి రాజకీయ సామాజిక పరిణామాలు సామాజిక విశ్వవిద్యాలయం, విశాల సాహిత్య అకాడమి, 2-2-186/53/5, రామక్రిష్ణ నగర్, బాగ్ అంబర్‌పేట, హైదరాబాద్ - 500 013.

17. రాములు బి.యస్
సం॥ సీతారాం గూడూరి
వెంకటేశం నిజాం : సాహిత్య చరిత్రను కొత్త చూపుతో తిరగరాయాలి. (తెలంగాణ దృక్పథం)

18. రంగారావు మాదిరాజు : సమాలోచనం, రసధుని - సాహితీ పరిషత్తు విద్యారణ్య పురి, వరంగల్ - 506 009.

19. వెంకటసుబ్బయ్య వల్లంపాటి : కథా శిల్పం; విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్, 4-1-435, విజ్ఞాన్ భవన్, బ్యాంక్ స్ట్రీట్, హైదరాబాదు - 500 001.
ట్విన్ సిటీస్ ఆఫ్‌సెట్ ప్రింటర్స్, హిమాయత్ నగర్, హైదరాబాద్ - 500 029.

20. శారద కేతరాజు : శ్రీ మధురాంతకం రాజారాంగారి కథల పరిశీలన, పి.హెచ్.డి.పట్టాకోసం సమర్పించిన సిద్ధాంత వ్యాసం.

## సెమినార్ పత్రము

1. ప్రభాకరరావు సి.హెచ్.వి : తెలంగాణ ప్రజల సామాజిక జీవితం చరిత్ర బి.యస్. రాములు కథలు - ఒక పరిశీలన, కాకతీయ యూనివర్శిటీ, లిటరేచర్ మరియు సోషల్ హిస్టరీ, సెమినార్ పత్రం 28, 29 - 2005, వరంగల్.

# కృతజ్ఞతలు

బి.ఎస్.రాములుగారి కథలపై పరిశోధన చేయవచ్చునని సూచించి, పరిశోధన సమయంలో తగు సలహాలిచ్చి ప్రోత్సహించిన నా పరిశోధనా పర్యవేక్షకులు, సహృదయులు డాక్టర్ బన్న అయిలయ్య గారికి...

అప్పటి బోర్డ్ ఆఫ్ స్టడీస్ ఛైర్మన్, ప్రస్తుత తెలుగు శాఖాధిపతులు ప్రొఫెసర్ అనుమాండ్ల భూమయ్య గారికి, డీన్, ఫాకల్టీ ఆఫ్ ఆర్ట్స్ ప్రొఫెసర్ బి.రుక్మిణి గారికి, బోర్డ్ ఆఫ్ స్టడీస్ చైర్‌పర్సన్ ప్రొఫెసర్ పి.జ్యోతి గారికి, ప్రొఫెసర్ కె.కాత్యాయని విద్మహే గారికి, అప్పటి తెలుగు శాఖాధిపతులు ప్రొఫెసర్ కె.యాదగిరి గారికి డా॥ పంతంగి వెంకటేశ్వర్లు గారికి, ఆచార్య ఎస్.ఎల్.ఎన్.ఆచార్యులు గారికి...

'మీ కథలపై పరిశోధన చేస్తున్నాను' అనగానే స్పందించి తన కథా సాహిత్యంతో పాటు సంపూర్ణ సహకారాన్ని అందించిన ప్రముఖ కథా రచయిత, సామాజిక తత్వవేత్త బి.ఎస్.రాములు గారికి, వారి శ్రీమతి బేతి శ్యామల గారికి...

ఎల్.బి. కళాశాల తెలుగు శాఖాధ్యక్షులు డా॥ జి.యాదగిరి గారికి...

సాహితీ మిత్రులు పెద్ది వెంకటయ్య, అన్నవరం దేవేందర్, 'సహృదయ' జి.గిరిజా మనోహర్‌బాబు, 'శ్రీలేఖ సాహితీ' టి.రంగస్వామి గార్లకు...

జ్ఞానపీఠ్ అవార్డు గ్రహీత డా॥ సి.నారాయణరెడ్డి గారు అడిగిన తోడనే ఆశీస్సులు అందించారు. వారికి... అయిలయ్య శిష్యుడని గుర్తించుకొని అడిగిన వెంటనే 'రామకథ'గా ముందుమాట రాసిన ఆచార్య పేర్వారం జగన్నాథం గారికి...

అ, ఆలు నేర్పిన గురువులు శ్రీమతి దుర్గాబాయి దేశ్‌ముఖ్ గారికి, ప్రైమరీ స్కూల్ నుండే తెలుగుపై ఆసక్తిని పెంచిన గురువులు శ్రీ ప్రతాప చంటయ్య గారికి...

అమ్మమ్మ - తాతయ్య, శ్రీమతి శ్రీ పిట్ట లింగమ్మ - రాజయ్య గారికి నన్ను కన్నతల్లిదండ్రులు శ్రీమతి, శ్రీ కర్రె లక్ష్మీ-రాజయ్య గారికి, నా పరిశోధనలో అడుగడుగునా ప్రోత్సాహమందించిన అత్తమ్మ, మామయ్య శ్రీమతి, శ్రీ బండి శకుంతల-సదానందం గారికి, ఆత్మీయులు శ్రీ గరిడె ఆగయ్య గారికి, బండి సతీష్ చంద్రకు, తమ్ముడు తిరుపతికి, నా పరిశోధనకు కావలసిన వివిధ పుస్తకాలు అందించిన మిత్రులకు... అచ్చులోకి తెచ్చేటప్పుడు చేయాల్సిన మార్పులు సూచించిన పెద్దలకు...

అడగగానే ఎంతో సౌజన్యంతో ఈ పుస్తకం వెలువడడానికి సహకరించిన బి.శ్రీకాంత్, శైలజ (యు.ఎస్.ఎ.) దంపతులకు...

అందరికీ పేరు పేరున కృతజ్ఞతలు.

నాలో సగం ప్రవాహ ప్రణయవాహిని గౌతమికి... చిన్నారి సౌపర్ణికకు ఆశీస్సులు.

సహచర ఉపన్యాసకులు, కుటుంబ సభ్యులు, మిత్రులు, శ్రేయోభిలాషులకు...

అందంగా డి.టి.పి. చేసిన ఎవిఎమ్ గ్రాఫిక్స్, హైదరాబాద్, కర్షక్ ఆర్ట్ ప్రింటర్స్ వారికి కృతజ్ఞతలు.

**- కర్రె సదాశివ్**